[illegible]

# శ్రీగురుదత్త



# సరస్వతీయము.

[illegible]

[illegible]

సచ్చిదానందమయ పరబ్రహ్మ సాక్షాత్కారముఁగలిగింపఁ జాలుదురు. కావుననే "శ్లో. ఆరాధితం దైవతమిష్టమర్థం। దదాతి తత్స్యాద్గమోగురోస్స్యాత్। నో చేత్కథం వేదితుమీశ్వరోయం। అతీంద్రియం దైవతమిష్టదం నః॥" అని శ్రీ జగద్గురువులు వలికియున్నారు.

ఈ 'గురు' శబ్దము శ్రీదత్తమూర్తులయం దన్వర్థము. ఆ త్రిమూర్తి స్వరూపు లత్రిపుత్రులై ధాత్రి నవతరించి యలర్కాదులకు యోగమార్గోపదేశం బొనరించి లోకోద్ధరణముఁ గావించినట్లు శ్రీ స్కాందబ్రహ్మాండ భవిష్యన్నారదీయ మార్కండేయాది పురాణంబులవల్లను శ్రీమద్భాగవతాదులవల్లను బ్రకటంబయ్యెను. ఈ కలియుగమున నల దత్తాత్రేయు లిప్పటికి నుమారుగను 500 సంవత్సరములకుఁ బూర్వ మాంధ్రదేశమునందలి గోదావరీ మండలాంతర్గతమగు పీఠికాపురమున శ్రీపాద శ్రీవల్లభ నామమున నవతరించి కొంతకాలము కర్ణాటదేశమందలి రాయచూరునకు సమీపమునఁ గృష్ణానదీస్థితంబగు 'కురుగడ్డ' యను దీవియందొప్పి భక్తులఁదరింపఁజేసిరి. వారియనంతరావతారమే 'శ్రీగురు' ప్రఖ్యాతి వహించిన [illegible] నరసింహ సరస్వతులని. వీరు మహారాష్ట్రదేశమునఁ గారంజానగరమున జన్మించి యేడవయేటనే వేదవేదాంగ పారంగతులై సన్న్యాసమునందు శంకర సాంప్రదాయంబునఁ దురీయ గ్రహణం బొనరించి నర్సోబావాడి, ఔదుంబరము, గాణగాపురము మున్నగు క్షేత్రములందు వసించి యందందత్యద్భుతలీలలఁ బ్రదర్శించి భక్తానీకంబుల నుద్ధరించిన మహానుభావులు. 'శ్లో. అజోపిసన్నవ్యయాత్మా। భూతానామీశ్వరోపిసన్। ప్రకృతిం స్వామధిష్ఠాయ। సంభవామ్యాత్మమాయయా॥' యను గీతోక్తికి లక్ష్యభూతులు.

అట్టి శ్రీగురుమూర్తుల చరిత్రము సుమారు 400 సంవత్సరముల క్రిందట గంగాధరపుత్రు లభినవసరస్వతీ [illegible] సరస్వతులు మహారాష్ట్రభాషయందు 'శ్రీ నరసింహ సరస్వత్యుపాఖ్యాన' మను పేరఁ దొలుత రచించిరి. అందు మనోహరములగు పెక్కులు పురాణ



వలెనన్ను నీసంయమీంద్రుల సచ్చరిత్రంబే శరణ్యంబనఁదగినది. అట్లగుట నది సంగ్రహించి యిందు 'శ్రీవాసుదేవానంద సరస్వతీయ' మనుపేరఁ బ్రత్యేకముగాఁ జేర్పఁబడినది. ఈయోగి జటిలుని కవిత యొక్కెడ 'శ్లో. విష్ఠామయే వపుషికుష్ఠాదిరోగచయ కోష్ఠాయితే భిర మసే। నిష్ఠాయుతేపికిము నిష్ఠాతిలాలస వసిష్ఠాదియోగివినుతం। ప్రేష్ఠాయితోద్ధనిధి తిష్ఠాసమేహిచ వరిష్ఠాదికూర్మమధునా। సృష్టాధిరోపిత గరిష్ఠాద్రిరాజ మృభుగోష్ఠీనుతం హృదయభో॥' యనునట్లు పద జాటిల్య విశిష్టంబైనను నీ 'గురుసంహిత' యందట్టినడక లేొప్పక యియ్యది రసోద్దీపక మృదుమధుర పదసంవిధానంబుగల సమశ్లోకిగా విరాజిల్లుచున్నది. కావున నిది యుత్తరదేశంబున బహుళవ్యాప్తినందఁ గలిగినది. ఇఁక నాంధ్రదేశమునమాత్ర మీఁద త్తిమాహాత్మ్యము వెల్లడికాకయున్నది.

అందులకయి ప్రస్తుతము శ్రీకాశీవాసులయియున్న శ్రీ శ్రీ బ్రహ్మానంద సరస్వతీ స్వాములవా రద్దానినాంధ్రీకరింపఁ జేయ సంక ల్పించియుండిరి. వీరాసేతు హిమాచలము పెక్కుతావుల శ్రీశంకర మఠముల స్థాపించి యయ్యెప్రదేశములందెల్ల శ్రీదత్తాత్రేయ విగ్రహ ప్రతిష్ఠలఁగావింపఁజేసిన లోకతారక మార్గదర్శకులు. వీరిపూనికవలన నిర్వహింపఁబడు సత్కార్యములకు లెక్కలేదు. అందులకుఁ గొలఁది దినాలక్రిందటనే యల వారణాసిలోనే నెఱపఁబడిన శ్రీయాజ్ఞవల్క్య మూర్తి ప్రతిష్ఠయు నిపుడచొప్పఁగావింపఁ బడుచున్న శ్రీగాయత్రీ కోటి కుంకుమార్చనంబుం దార్కాణములు. వీరొక్కెడ శ్రీమజ్జగ ద్గురు శంకరాచార్య చరిత్రమును 'శంకరవిజయధ్వజ' మనుపేర రచింపఁజేసి యందాదిశంకరులకోటియని యొక్కటి చేర్పించియుండిరి.

ఇట్లుండ నాకనుజన్ముఁడనఁదగిన చిరంజీవి భమిడిపాటి వేంకట సుబ్రహ్మణ్యశర్మ మాధవీయమా 'శంకరవిజయము' నాంధ్రీక రింపఁగా నేనయ్యది మూలముకంటె భిన్నముకాకుండునట్లు యథా మతిఁ బరిష్కరించి యూతనికోర్కి ననుసరించి యుద్ధాని. కుపోద్ఘాత

మయ్యెను. మఱియు నేతద్గ్రంథ సారరూపమైన మత్పితృకర్తృక 'గురుభక్తిప్రభావ' కథయు యందుఁ దొలుదొల్తఁ గానవచ్చెను. ఇంకఁ బరికించినకొలఁది హిందీభాషను మద్గురుప్రోక్తములయిన మిత్రసహోపాఖ్యానము సీమంతినీచరిత్రము భద్రాయుషోపాఖ్యానము మున్నగున వందందుఁ గానవచ్చినకొలఁది నది యత్యంతప్రీతిద మయ్యెను. తుదకుఁ బారంపర్యముగా నేమర్చించు ననంతునికథఁగుం గలచోట యతివరుల యాన శిరమునవహించితి. కాని,

'శా. ఆబాల్యమ్ముఁ గవిత్వమల్లఁగలనేర్పా కల్గియుండిర్పు వి।
ద్యాబుద్ధుల్గురుబోధితమ్ములయి ప్రాస్తంబున్న యంతబ్బియుఁ ।
డాబుంగోరమి బద్ధకమ్మదియుఁ దోడంబుట్టి వర్ధిల్లుట ।
న్నే బాసంచన వ్రాయనైతిఁ గదయుస్నీ! యొక్కయుగ్రంథమున్ ॥'

అని యొక్కెడఁ బల్కియున్న నేనిది నిర్వహింపఁ గలుగుదునా యను శంకపొడమె. ఏమైన నొఁగాతమని గురువులకు సమస్కరించి గురుదత్తమైనసరస్వతితోడుగాఁ బరివర్తనమునకుం గడంగితిని.

కథ శ్రీగురుదత్తావతారమూర్తులదయ్యె. వారు సరస్వతీకు లయిరి. తద్గురువులో వృద్ధకృష్ణసరస్వతులు. శిష్యుం డీక్కథకుండా సిద్ధుం డొకసరస్వతి. మహారాష్ట్ర గ్రంథరచయితలు సరస్వతులు. సంస్కృత సంహితా నిర్వాహకులన్ననో వాసుదేవానంద సరస్వతులే కదా. తుదకు నన్నిట్లిది యాంధ్రీకరింపఁ బ్రేరేపించినవారును సరస్వతీ సాంప్రదాయమునకే చేరినవారయిరి. తత్తత్సూచకముగ నా యీ కృతిని 'శ్రీ గురుదత్త సరస్వతీయ' మంటిని.

ఇఁక రచనమునఁ బ్రేరకాభిప్రాయానుసారముగా గద్యరూపమునకే ప్రారంభించినను బాఠకులకు విసువుతోఁపకుండుటకై మనోహరభావములును నీతులును వర్ణనాంశములుం బ్రార్థనాదికములును పద్యరూపమున నుండఁదగునని యెంచి యటనటఁ జేర్చుచువచ్చితిని. గ్రంథసారాత్మకమా దీపకోపాఖ్యానమున మాత్రము విలక్షణత్వము పాటించు నిచ్ఛతోఁ బ్రశ్నోత్తరపు మరియాదననుసరించితి. ప్రారంభమున భాషలో దేశ్యతద్భవములఁ దఱచుగా వాడినందునఁ గాఠిన్య

ఇందలి జ్ఞానకాండమున 2 వ దళమందు 'గురుభక్తి'యె సర్వసిద్ధిదమనుటకు వేదధర్ములను దీపకుఁ జేదినవిధమును 16 ట గురుద్రోహమువలని నష్టములఁ దెలుపుటకు ధౌమ్యులకడ నుపమన్యుని శుశ్రూషయు వివరింపఁబడియెను. 3, 4 లందు శ్రీదత్తావతార సందర్భ మభివర్ణింపఁబడియెను. అంత 5—10 ఆంధ్రదేశమున గోదావరీ మండలాంతర్గతమౌ పిఠాపురమున నాదత్తాత్రేయులే శ్రీపాద శ్రీవల్లభులన నేర్పడినవిధమును దన్మనుమహిమంబుం దెలుపఁబడియెను. ఇఁక 11 దళమునఁ బ్రధాన కథానాయకులౌ నభినవదత్తమూర్తులు నరసింహసరస్వతులు మహారాష్ట్రదేశమందలికరంజనగరంబున జన్మించిన ప్రకరణంబు నంతగ్రంథాంతమువఱకును దత్లీలావివరణంబు నొప్పెడిని. చూచినదెల్ల బంగారమౌటతోను వాచించినదెల్ల వేదమాటతోను బ్రారంభము. బహురూపధారులై యేకకాలమునఁ బలువురయిండ్లకుభిక్షకేగుట యొకప్రసాదలీల. ఇందొక రోలరోగికి రుజాక్లేశంబు నొకదరిద్రుని దారిద్ర్యంబు నొకధీమంతుని బుద్ధిమాంద్యంబు నుడిపిన విధములు ముదమొదవించెడిని. వంధ్యామహిళని సదుగ్ధనుజేసిన దాశ్చర్యప్రదము. ఇఁక ముహూర్తమాత్రంబునన గంగానుజునిఁ దీర్థాటనముఁ గావింపఁజేయుటయు గతప్రాణుండైన గంగాధరాత్మజుని బ్రతికించుటయు బ్రహ్మరాక్షసునికిఁ బిశాచత్వవిముక్తియుం ద్రివిక్రమభారతికి విశ్వరూపసందర్శనము నమానుషచర్య లనదగినవి. రెండియు నిందు 6 వదళమందు గోకర్ణక్షేత్రమాహాత్మ్యదోబోధకమౌగాథయు, 7న మిత్రసహోపాఖ్యానంబును మనోహరములు. 8 ట యశోదకు శ్రీకృష్ణుడు బిడ్డఁడయినది ప్రదోషపూజవల్లనని తేలిన దొకవిశేషము. 19 ట నౌదుంబర మాహాత్మ్యము సద్భక్తజ్ఞేయము. ఇఁక 12, 21 దళములందుఁ దేటమాటలతో నొప్పెడి జ్ఞానవైరాగ్య ప్రబోధంబువల్లనే 'జ్ఞానకాండ' మన్నందులకు సార్థక్యము.

పైనఁ గర్మకాండము విజ్ఞానామృతభాండము. ఏలన 'గర్గాదిభ్యోయఞ్' అనుపాణినీయ సూత్రసందర్భమందుఁ బతంజలి మహా

పోలెకుబియ్యముతోఁడి భూరిసమారాధన మొక యద్భుతలీల. 2వ మున్నుడిగిన ముదుసలికి సంతానప్రాప్తి యొదవించుటయు 8వ మోడుఁ జిగిరింపించుటయుఁ దొలుతటి గొడ్డుగేదెపాడి కెనయైనవి. 7 నందలి తంతుకుని శ్రీశైలయాత్ర గంగానుజ తీర్థాటన సదృశము. 10 లోని బహురూప ధారిత్వము తొలుతనే కరంజనగరమున నగపఱుపఁ బడిన సిద్ధపద్ధతి.

ఇవ్విధంబున సజ్జనంబుల హృదయంబులందు భక్తిబీజంబులు నాటఁ బౌనఃపున్యంబుగాఁ దత్తల్లీలాప్రదర్శనంబుఁ గావించిన దత్తమూర్తుల సర్వసమత్వంబు జ్ఞాతవ్యంబు. "శ్లో. ఖాతియస్యతు జగద్పృథబుద్ధే। స్సర్వమప్యనిశమాత్మతయైవ। సద్విజోస్తు భవతు శ్వపచోవా। వందనీయ ఇతిమే దృఢనిష్ఠా॥" యనిపల్కిన శ్రీమజ్జగద్గురువుల యట్లీ శ్రీగురుమూర్తులును దమ్మాశ్రయించిన పెక్కురు చతుర్థుల నంత్యజుల నుద్ధరించిరని యిందుఁ దెలియఁగలము. మఱియు పిమతస్థులౌ మ్లేచ్ఛుల నాలంకారికులు "సకృత్ప్రివానురాగశ్చ। త్తిర్యక్ష్లేచ్ఛగతోపివా" యని తిర్యగ్జంతు సాహచర్యం బొదవించుచుండ వ్యాకరణాచార్యులు 'మ్లేచ్ఛోహవా ఏషయదపశబ్దః' అని నిరసించుచుండ నీవేదాంతవేద్యులు లోకోక్తులఁ బాటింపక తమ భక్తులైనయెడ వారికిని నేడుగడ యైరనుట కొక్కనిదర్శనము చాలదా? శ్రీపాదావతారమున నిజభక్తునకై వరంబుఁబడసిన రజకుఁడు తద్వరప్రభావమున మ్లేచ్ఛనరపతికాఁగా నీనరహరి యాతని కపుడేర్పడిన స్ఫోటార్తిఁబాపి యిష్టపూర్తిఁగావించెఁగాదే. భేదభావములు నరమాత్రులకుఁగాని 'బింబతేజం బరమణోసురసద్మా। మంతరం కిమపినాస్తిసురాయా' మనునట్లనవద్యము నద్వయము నసంగము నఖండమునౌ సచ్చిదానందమయ స్వరూపమే తానయై యిట్లవతరించిన గురుమూర్తికి సమతగాక మఱేమి?

ఇట్టి మహోత్తమ గురుచరిత్రంబు కంటె నిహపర తారకంబు వేఱొండు గానరాదు. ఇందు విశ్వాసముతోఁ బఠించువారి కిందలి ఫలశ్రుతి యనుభవమునకు రానోను. లేదేని 'లోచనాభ్యాం విహీ

మొదటిదనసూయాపరీక్ష. ఇందాత్రిమూర్తులుకామాదిదూషితులై మానవమాత్రులయట్లు ప్రవర్తించిరనుకోనౌనాయని తోఁపవచ్చును. కాని వారట్టి క్లిష్టపరీక్షకే కడంగి యుండనియెడల మన యీ దత్తాత్రేయుఁడే యవతరించి యుండఁడు. అట్టియెడ నీ యీ గ్రంథాలెల్ల నేర్పడఁదగిన యవకాశమే లేకపోయెడిది. కావున స్త్రీలోకమునకుఁ బాతివ్రత్యమాహాత్మ్యం బుద్ఘాటింపను దామిట్టుల నవతరించి యోగమార్గ ప్రతిష్ఠాపనముఁ గావింపను నందులకుఁ దలపడిరే కాని వేఱుకాదనుకొనఁ దగినది. ఇంక రావణుఁడు శివుని మెప్పించి ప్రాణలింగంబుం గొనిపోవుతఱి వెన్నుండాతని వంచింపఁ బన్నిన పన్నుగడయు నక్కఱఁణి నొక్కఁకొమ్మవేల్పు గావించిన టక్కరితనము నధునాతన విమర్శనార్హములు గావచ్చును. కాని యట్లభివర్ణించుట యందలి రుచి పురాతన కథాశ్రోతల కెఱుక. మఱియు వింధ్యాద్రి యగస్త్యులకు సాష్టాంగ ప్రణామంబుఁజేసి యుండెనా యని శంకించుకంటె నదియు 'గురుభక్తి' ప్రబోధకముగానే గ్రహించుటమేలు.

ఇట్లు పాఠకులిందలి ధర్మమర్మములను దెలిసికొని యథానుకూలముగాఁ బ్రవర్తింపఁదగుదురు. ఏది యెట్లున్నను గ్రంథసారరూపమగా 'గురుభక్తి' మాత్రము సర్వమత సమ్మతమగుట నఖిల ప్రజానుష్ఠేయంబయి యిహపర సాధకంబయ్యెడు. ఇఁక, గుణాలంకార శ్రీకృత పరికరంబగు భావవిభవంబిందులేకున్నను 'తంసంత శ్రోతుమర్హంతి। సదసద్వ్యక్తి హేతవః॥' అను శ్రీకాళిదాసోక్త్యనుసారముగా సహృదయు లిద్దానిం బరామర్శించి యిందలి గుణలేశంబుం బరిగ్రహించెదరుగాత.

శా. ఈనావందన మందు నేతఁ డిదివారి • యింపం దరింపించుచుం।
దానే శిష్యుల శ్రీనివాసులనొ ప్రో • త్సాహంబుఁగావించుచు।
న్నే నేనాఁడుఁదలంపకున్నఁ బొసఁగిం • చె నమ్మదిణంబట్టి బ్రీ।
హ్మానందాఖ్యునకు న్యతీంద్రున కన • న్యప్రాప్త సత్కీర్తికిన్॥

నాదెళ్ల మేధాదక్షిణామూర్తిశాస్త్రి.

బున సాక్షాత్కరించి కొల్హాపురీప్రాంతమందలి నరసోబావాడిలోనున్న శ్రీగోవిందస్వాములవారి ద్వారమున నిజమంత్రోపదేశంబుఁ బడయు నాజ్ఞయిడినట్లు తన్మనంబునకుఁ బొడకట్టెను. వెనువెంటనె వాసుదేవధీమణి యట్లొనరించి దీక్షనూని పురశ్చరణంబును గావించి మంత్రసిద్ధి నొందఁగలిగెను.

ఈవాసుదేవశాస్త్రి బాల్యవివాహంబొల్లక వింశతివర్షపూర్తి యైనవెనుక గార్హస్థ్యంబునం జొచ్చెను. తత్సతియైన యన్నపూర్ణాబాయి 'పతిరేకోగురుస్త్రీణా' మను నార్యోక్తిననుసరించి శుద్ధాంతఃకరణంబుగలిగి మెలంగిన మహాపతివ్రత. తద్భర్త తాఁబారాయణమొనర్చు గురుచరిత్రంబునందలి కర్మకాండము తుది నుదాహరింపఁబడిన బ్రాహ్మణధర్మములనెల్ల సక్రమముగా ననుష్ఠించుచు శాంతముగాఁ గాలముఁ బుచ్చుచుండిన నైష్ఠికుఁడు.

ఒక్కెడ నాతండు నరసోబావాడినుండి స్వగ్రామమునకు మగలుచు శ్రీదత్తప్రతిష్ఠఁ గావింప సంకల్పించినంతనె 'కాగలుగాం' అను నూర నొకశిల్పి తారచించిన దత్తవిగ్రహమును దెచ్చి సమర్పించెను. అంత నయాచితముగాఁ జేకుఱిన ద్రవ్యము నాతనికి సమ్మానరూపమున నొసంగి యద్దానిని 'మాణగాం'కుఁ గొనివచ్చి యచ్చో స్వభానువత్సర వైశాఖ బ ౫ నాఁడు భక్తిశ్రద్ధలతోఁ బ్రతిష్ఠించిరి. నాఁటినుండి నేఁటివఱకు నట నిత్యధూపదీపనైవేద్యములు సక్రమముగా జరుపఁబడుచున్నవి.

ఇట్లు శ్రీదత్తానుగ్రహపాత్రుఁడైన వాసుదేవ సుధీమణికి "యాలోకద్వయసాధనీ తనుభృతాం సాచాతురీచాతురీ" యనఁదగిన బుద్ధివికాసమేర్పడియుండెను. అయినను 'హీనసేవానకర్తవ్యా, కర్తవ్యో మహదాశ్రయః' అని యాతఁడు తారణప్రభృతిగా నరసోబావాడిలో శ్రీగుర్వారాధనంబుఁ గావించువాఁడై 'పరోపకారార్థమిదం శరీర'మ్మను నది సార్థక పఱచుచు నేనేండ్లు కడపెను. ఆర్తులయి తనను జేరినవారికి భవితవ్యం బెఱింగించి పీడా నివారణోపాయంబులం దెల్పుచుండెను. ఆధిబాధితులను మంత్ర యంత్ర సాధనంబుల వల్లఁ

గడతేర్చుచుండెను. న్యాయపీఠికలను సుతర్కభవ్య పథంబులం ద్రొక్కించి గట్టెక్కించుచుండెను. కర్మానుష్ఠులచే వైశ్వదేవాది కర్మంబు లనుష్ఠింపఁ జేయుచుండెను. ఉపాసనాభిలాషులకు సుసిద్ధ మంత్రరాజంబుల నుపదేశించి పురశ్చరణం బొనర్పించుచుండెను. యోగ మార్గాపేక్షకులకు సమాధినిష్ఠగలుగ షట్క్రియా సహిత ప్రాణాయామ పురస్సర ఖేచరీ లంబికాది సాధనంబులం గఱపుచుండెను. ముముక్షువులకుఁ బ్రస్థానత్రయము భాష్యము గూడ బ్రహ్మానందీయము మున్నగు సద్గ్రంథములందలి గూఢార్థంబుల గరతామలకంబుఁ గావించుచుండెను.

శ్లో॥ తస్మాదసక్త స్సతతం । కార్యంకర్మ సమాచర। అసక్తో హ్యాచరన్కర్మ। పరమాప్నోతి పూరుషః॥ అనుసత్కర్మప్రవర్తనానుసారిగ శ్రీ యోగికి హృదిని వైరాగ్యబీజావాపం బొనర్పనో యన నయ్యోగి నొక శిశువుదయించి కొలఁదిదినాలు పెరిఁగి మరణమునొందెను. శుభా శుభ పరిత్యాగియగు నాకర్మయోగి కేమి హృది చెదరుగాదు? కాని పాపమాతని సతీమణి పుత్త్రశోకార్తనొందఁ జొచ్చెను. భర్తయా యమకు హితంబు నలుపుచుమతిమఱలింపఁ దీర్థయాత్రలకుంగొంపో యెను. వారు పండరీపురమార్గంబున గోదావరీతీరస్థితంబగు గంగాఖేడమునఁ జేరిరి. అచ్చోనుండ విశ్వపతి సన్నపూర్ణాంబ గారిలోకగాముని యయ్యెను. అందులకు వాసుదేవపండితుఁ డింతయుఁ జింతింపలేదు. తదౌర్ధ్వదైహికవిధులు సక్రమముగా నెఱపినంతనే, సాధనచతుష్టయసంపత్తియుమరి 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' యనుదగిన యుక్తి కారుతోడఁ దురీయగ్రహణంబుఁ గావింప సంకల్పించిరి.

అందులకై యుజ్జయినికిఁ బోయి యట నారాయణానంద సరస్వతీస్వాములవారినద్దఁ గ్రమసన్న్యాసము గ్రహించి దండకమండలములను బ్రణవ మహావాక్యోపదేశంబునంది, 'శ్రీవాసుదేవానంద సరస్వతీస్వామి' యని యోగపట్టము నందఁగలిగిరి. బ్రహ్మచర్య గార్హస్థ్యంబులందలి వీరియాచరణము లోకమున కెట్లాదర్శప్రాయ మయ్యెనో యట్లె తద్యతిత్వము నారులకు మార్గదర్శక మగుఁదగ్గది.

పెక్కేల? తురీయాశ్రమధర్మ నిర్వహణంబు సక్రమంబుగాఁ బచ రించిన సుచరిత్రుల పరిగణనమున నీపరివ్రాజకోత్తములు 'కనిష్ఠికాధిష్ఠితులు' కాఁగా, 'ననామికాసార్థవతీ బభూవ' యనవలసినదే. ఎట్లనఁ దురీయంబునఁ దాముమెట్టినది మొదలుగా దేహత్యాగం బొనరించు దనుక శిష్టాచార సంపన్నులౌ ముప్పూరు బ్రాహ్మణోత్తముల యిండ్ల భృంగన్యాయమున మాధుకరంబు సేకరించు చుండిరేకాని యేనాఁడు నేకాన్న భిక్షఁ గావించి యెఱుఁగరు. సర్వదా నదీతీరస్థితములౌ పల్లెలయందుఁ బర్యటనం బొనరించుచు దురాచార దూషితము లయిన పట్టణాల నడుగిడనొల్లకుండిరి. మఱియు గురుదత్తములయిన దండకమండలముల నేనాఁడును విసర్జింపకుండిరి. బహువిధసౌక ర్యము లేర్పడియున్న యీ 20 వ శతాబ్దమున నెందఱో భక్తులు పూవులలోనుంచి యూరేగింప సంసిద్ధులయియున్నను దానేవాహ నము నొల్లక తుదకొక్క శకటమునఁగాని ధూమశకటమునఁగాని యధిష్ఠింపకయ పాదచారియై యాసేతుబ్రహ్మావర్తము నఖిలతీర్థ క్షేత్రంబులన్మెట్టిన సత్సన్యాసిని వేఱొక్కనిం జెప్పఁగనఁ జాలుదుమే? ఇంక నీసంయమీంద్రుని నియతప్రణవానుష్ఠానంబును నిత్యగీతాపా రాయణంబును నిరంతరశ్రవణంబును బ్రశంసార్హములు.

వీరగపఱచిన యద్భుత మహిమంబులు నెన్నో కలవందురు. అయ్యోమహత్త్వంబులం దెలిసిన పెక్కురార్తులును జిజ్ఞాసువులును వీరినాశ్రయించు చుండెడివారు. తమయనుష్ఠానమునకు భంగకరమగు నీజనసంఘము నొల్లకయు శ్రీదత్తాజ్ఞానుసారము సహసభావంబునఁ గాదనక లోకోపకారముఁ గావించి యుద్ధరించు చుండెడివారు. వీరు చాతుర్మాస్యలఁ గడపిన యాయాప్రదేశంబులం దెన్నెన్నియో యుద్గ్రంథముల నిర్వహింపఁజాలిరి. ఏవి రచించిన, శ్లో. కృష్ణే కృష్ణతనో మనోహరకథే నాథేశ్వరి ప్రార్థయే। దత్తం దత్తవరం ప్రసన్నయు పరం నాతోవరం త్వర్థయే। అన్యం యోటతి తేత టేనట ఇవానేకాంగనారీహరి। స్సంసారారి గరిందమశ్శమ పరస్సాక్షాద్య ఆత్మాపరః॥" అన్నట్లు శ్రీదత్తభక్తి ప్రతిపాదకములే పెక్కులనుటకిట దిఙ్మాత్రం

పూర్వోక్త బ్రహ్మానంద సరస్వతీ స్వాములు నటఁజేరి తత్సన్నిధిని సత్కాలక్షేపములతోఁ జాతుర్మాస్యమునుగడపిరి.

ఆనందవత్సరమున జన్మించిన యీ యానందనిలయులు తుద కానందాబ్దంబుననే దేహత్యాగంబుఁ గావింపనెంచుతఱి హరిద్వారంబునుండి శ్రీ బ్రహ్మానందస్వాముల రావించిగరుడేశ్వరముననెల్లూరి మఠమునందట్లు శారదా శంకర దత్తాత్రేయ విగ్రహప్రతిష్ఠలఁగావింప నాజ్ఞయిడి సంపూర్ణప్రాజ్ఞతతో ది 8-7-1914 ఆషాఢబహుళ ప్రతిపత్తున సౌమ్యవాసరమున బ్రహ్మీభూతులయిరి. శ్రీ శ్రీ బ్రహ్మానంద సరస్వతులును తదాజ్ఞానుసారముగా 1916 లో నటఁ దత్ప్రతిష్ఠలఁ గావింపఁజేసి యచ్చో నిత్యపూజలు నెఱపుచు నిరతాన్నప్రదాన మొనరించుచుండునట్లేర్పాటుచేసి కృతకృత్యులైరి. బ్రహ్మీభూతస్వాముల శిష్యవరేణ్యులు తచ్చరిత్రంబుఁ బ్రచురించి లోకోపకారముఁగావించిరి. అందీ వాసుదేవయోగీంద్రుల యత్యద్భుతలీలా విశేషాదికము లనేకములు గానన య్యెడు.

ఉ. ఏతఁడు బ్రహ్మచర్యమున • నే నిగమాగమవేత్త యౌచు గే ।
స్త్రైతనరం దితిత్తు వనఁ • ద్వ్యక్తఫలాప్తి గురూక్తకర్మియై ।
పూతచరిత్రము న్యతితఁ • బొందెనొ యాకవి 'వాసుదేవ' వి ।
ఖ్యాతుని యోగమార్గము జ • గమ్మున దీనఁ దిరమ్ము గావుతన్ ॥

బందరు
శ్రీముఖ వైశాఖ బ౫
భానువాసరము.

సుధీవిధేయుఁడు,
నాదెళ్ల మేధాదక్షిణామూర్తిశాస్త్రి.



శ్రీగురు సంహితా రచయితలు
శ్రీ వాసుదేవానంద సరస్వతులు.



గ్రంథప్రకటణ ప్రేరకులు
శ్రీ బ్రహ్మానంద సరస్వతులు.

# శ్రీ గురుదత్తసరస్వతీయము.

## కథాప్రారంభము.

జ్ఞానకాండము — ౧ దళము.

గంధర్వనగరమున శ్రీ నృసింహసరస్వతు లనుమహాత్ములు గలరు. తన్మహిమము లోకప్రసిద్ధము. వారియందు శ్రీదత్తమాహాత్మ్యము కలదని విని ప్రజలు దూరదేశములనుండి వచ్చి సేవించుచుందురు. అందువలనఁ దద్భక్తులకు వెనువెంటనె పుత్రకళత్రలాభమును ధనధాన్యాది సమృద్ధియుం గలుగుచుండును. తత్పాదుకా దర్శనమునను సంకల్పమాత్రమునను బహుసార్థసిద్ధి యగుటయుం గలదు.

నామధారకుఁ డనునొకవిప్రుఁడు తత్పాదాబ్జ సందర్శనోత్సాహియై యిలువెడలెను. అతఁడు చింతాకులితమానసుఁడై "యెట్లయినఁ బూనినకార్యము నిర్వహింపవలెను. లేదా తనువు విడువవలెను. శ్రీగురుప్రసాదము నొందనిది జడమగు నీదేహము వలనఁ బ్రయోజనము లేదనికొని నిర్వేదముతో నాఁకలిదప్పులు మఱచి గురుచరణసరసిజస్మరణంబొనరించుచు నిట్లని వితర్కించెను. "దేనివలన దైన్యమడఁగునో యట్టి నీనామచింతనమున నామంత్రమునఁ గలచింత లేల యుండుగదా? నాయెడ దైవము ప్రతికూలమనిన నీభక్తకింగలలాభమేమి? నేను హీనుఁడనన్న నినుము కనకము గాఁగలదని వినమా? అట్లు పరుసమంటిన పరుసునఁ గావలదా? పాపాత్ముఁడనన్న నీనామమే పాపతాపనోదకముగదా. ఇట్లని నమ్మి భజించు నాకింక భయమేల? ఓగురుమూర్తీ! సర్వభూతదయామయా! నా మొఱాలించి సాక్షాత్కరింపవే" యని డగ్గుత్తి

కతో శ్రీగురుస్తవమొనరింపఁ గడంగి తత్కృపాప్తికై పాండురంగ గణనాథులకును శ్రీశారదాదేవికిని మ్రొక్కులిడెను. మెండియుఁ గలఁగిన తలఁపున నిట్లు స్తుతిగావింపఁ దొడఁగె; "శ్రుతిస్మృతులు కలియుగమున శ్రీగురుమూర్తిని నిన్నే త్రిమూర్తినిగాను సద్యఃఫల దాయకునిఁగాను జెప్పుచున్నవి. ఓకృపానిధీ! శ్రీ నృసింహసరస్వతీ ప్రథితాహ్వయా! భక్తులకుఁ ద్రోవఁజూపెద వనికదా నిన్నభ్యర్థించుట? దీనబాంధవా! త్రిగుణాత్మకుఁడ వగునీవొక్కఁడవే నాశములేని మూలకారణమవు. కాన సంకటమువాపి భక్తులఁ బాలించెదవు. ఓయి దయాసాగరా! యతిశేఖరా! చంచలమగు నామనము సాత్త్వికమగు భక్తియందు నిలుకడఁగనుటలేదు. సత్వరముగవచ్చి నాయందు శాంతిఁగొలుప వలయు. రోదనమొనర్చు పసికూనను దరిఁజేర్చి బుజ్జగించు జనయిత్రిమాదిరి నాదరింపవే. తల్లివైనను దండ్రివైనను నేస్తమవైనను నీవేకదా. ఓయి సంయమీంద్రా! నీవేమాకులదైవతమ వనునిరూఢితో నిన్నే దిక్కుగా నమ్మి కొలుచువాఁడను. సరస్వతియను నీనామముచే నీకధీనుఁడనైతిని. నీయాశ్రితునికింక దైన్యమేడ? హైన్యమేడ? దయాబ్ధీ! భక్తవత్సలుఁడ వని పేర్మిఁగన్న నీవుదయదప్పకుము. త్రిమూర్తీ! విశ్వపాలకుఁడవు నీవే సురలకును దాతవుగదా. గురూత్తమా! నినువీడి నేనింకెవ్వరి వేఁడుదు? నాకుఁబరదైవతమవగు నీవుగాకదాత వేఱొకఁడగునా? ఆమ్నాయములు నిన్నేరక్షకునిఁగాను సర్వజ్ఞునిఁగాను జెప్పుచున్నవికదా. సర్వసాక్షిత్వ లక్షణుఁడవగునీవు నన్నుపేక్షింపఁదగదు. కాకున్న నాలోచన మేమిటికి? క్షుధితుఁడనని యెఱుఁగవా? నాయనా! నాస్థితి యెఱిఁగియు నెట్లోపమి? ఆఁకొని రోదనముసేయుచున్న తనబిడ్డను దల్లిచూచి యూరకుండఁగలదా? నేనేమియు నీకీయనైతి ననియా?

తే. బలికి స్వారాజ్యమొసఁగితి ♦ పడసిపుడమి ।
సనిన లంక విభీషణు ♦ నడిగియిడితె ?

మొత్తందనము వ్యక్తమయ్యెనాయె. నీవాఁడొక వేళఁ దప్పుచేసి
నను సైరింపవలసి యుండఁగాఁ గఠినతవహింపు నెట్టులుండెడిని?
అపరాధి ననికొని మనమునఁ గినిసితివో యనికొనిన బాలుఁడను.
పొల్లులాడినను బాటింపరాదు. బిడ్డ తొడపైఁగూర్చుండి దుర్భాష
లాడినను దెబ్బవేసినను గూడ సాధారణముగాఁ దల్లి లాలించునే
కాని కోపించునా? పరమాత్మవు నీమాట యింకఁ జెప్పనేల?
అయిన నేనేమితప్పు చేసితినని పలుకవో చెప్పవైతివే! కానిమ్ము
నేనో బిడ్డఁడను. నీవో నాజనకుఁడవు. ఎప్పుడైన బిడ్డనిపైఁ దండ్రి
కోపించినఁ దల్లి గారవించును. తల్లి కోపించినని వెతనొందఁ దండ్రి
యాదరించును. తల్లియుం దండ్రియు నీవయైతివి. ఇపుడు నీవే
యలుకఁజెందిన నేనెవ్వరితోఁ జెప్పికొందును? దీనవత్సలుఁడ వగు
నీవే నన్ను దయఁజూడవలయు. ఓయనాథనాథా! నీపాదముల
పయింబడిన దిక్కులేని యీదీనబాలకుని రక్షించితీరవలెను.
కృపాళూ! దీనులఁ గాచెదవని శ్రుతులందు విశ్రుతమగుఁగదా.
అట్టినీవు నేనెంత విలపించినను జెవినిడవేమి? నాయీదీనాలాప
ములు రాలనుగూడఁగరఁగింపఁజాలునే! నీకారుణ్యమెల్ల మాయమై
యింతవిమనసత్వ మేర్పడనేలకో! నిన్నుఁ గరుణాకరునిఁగా లోకు
లెంచునది నిజమే నిప్పటికైనను నాయెడ దయఁజూడవే!" యని
యాతెరువరి ధ్యానించుచు నొకతరువుదరిం బడిమూర్ఛిల్లెను.

అంత వెనువెంటనే కృపాంభోధియగు నగ్గురునాథుండు
గోవు నిజవత్సముం బ్రేమమీఱఁ జేరుపగిది నాతనికి స్వప్నమున
సాక్షాత్కరించెను. నామధారకుండును వచ్చినగురువరుం జూచి
చెచ్చెర సాష్టాంగదండప్రణామం బాచరించి యాతని కాలు
దోయికి మ్రొక్కి తత్పదరజము నిజశిరంబునఁ దాల్చి యానంద
బాష్పములొలుక గంధపుష్పాక్షతాదులతోఁ బూజించి నిజహృద
యాబ్జపీఠమున నయ్యోగీశాను నుపవిష్టుం గావించికొని పరమా
మోద భరితుండయ్యెను.

జ్ఞానకాండము — ౧ దళము.

నామధారకుండు మెలఁకువఁగని దిక్కులు పరికించి విస్మితాంతరంగుఁడై తననొసట భస్మమలఁది శాంతిగొలుపు హస్తమస్తకసంయోగము గావించినట్లు గాఁగలఁగనినరూపు మదికిం దెచ్చుకొని యాపులితోలుగప్పి బూదిఁబూసికొన్న జడదారిని మఱిమఱి ధ్యానించుచుం బోయిపోయి యట్టిరూపమే తాల్చి యున్న యొకయోగిసత్తముం జూడఁగనెను. అతనికిఁ బ్రణమిల్లి 'ఓయి కృపాంభోధీ! నాకుఁ దల్లివియుం దండ్రివి నీవసుమ్ము. అజ్ఞానాంధకారాబ్జబాంధవుఁడవు నాత్మజ్యోతి ప్రకాశరూపుఁడవు సిద్ధయోగివి నిన్ను దర్శించినమాత్రముననే విగతపాపుండనైతి. వేదన నొంది యున్న నాకు నీవే దరిఁజేర్పనాదరువు. స్వామీ! మీరెటనుండి రాక? తమనామమెయ్యది? నెలవేయెడ? తెలుపుమావేఁడెదనను. అందులకాతండిట్లు బదులువలికె. 'నేను సిద్ధుఁడను. యోగిని. భూమిపై నయ్యయి తీర్థముల సేవింప నిచ్చగలవాఁడను. పేర్మిఁ గన్న శ్రీనృసింహసరస్వతులు మాకు గురువులు. వారుండునది భీమామరజాసంగమ ప్రాంతమందలి గంధర్వనగరము. వారు జగమునఁగల నిజభక్తుల నుద్ధరింపనవతరించిన త్రిమూర్త్యవతారపురుషులు. యోగులు సంసారార్ణవనౌకయని యాతని నెపుడు ధ్యానించుచుందురు. అగ్గురుండును గృపాసింధువును భక్తబంధువునై యి నిజాశ్రితులకు సకలాభీష్టములొసంగి ముదమునఁ గాచును. తద్భక్తులు దైన్యమొందరు. వారి యిండ్లు ఎల్లపుడు గోధనధాన్యాది సంపదలతో నిండియుండెడి' నని వక్కాణించెను.

నామధారకుం డాతని పలుకులు విని యిట్లనియె. "అయ్యా! నేనును శ్రీగురుధ్యానైకపరుఁడనే. వారి బిరుదములను యశస్సు నిట్లు వినియుంటిని. కాని వంశపరంపరాగతమగు భక్తి నొత్తుకొన్నను గన్నార్తి గానఁడయ్యెనే. శోధింతు. మీతోడి సాంగత్యము నన్నుఁ గడతేర్పనేర్పడెను. గురుప్రసాద మెదవ మికిం గతం బేమొకో నానందియము వాయ తెలపియఁ గోరెద;' నన

వుడు సిద్ధుండిట్లు బదులువలికె. "బాపఁడా! సావధానమనస్కుఁడ
వయి యాలకింపుము. భక్తవత్సలుండగు సద్గురుండెల్లెడ దయను
గురిపించుచుండెను. తత్కృపాప్తిని దైన్యమొదవదు. దాన దేవ
తలె వశపడుదురు. అది కలికలుషాపహము గాదె. అట్టి గురు
భజనమున నింక దైన్యమందు టేమిటికి? నీ చేతంబు సంశయాక్రాం
తంబు గావలయు. కావుననే సంకటోపేతంబగుచున్నది. శ్రీగురు
మూర్తినే త్రిమూర్తి స్వరూపునిఁగా దృఢమతి నెంచి తదేకభావ
మున భజించిన నఖిలేష్టము లొడఁగూడెడిని. హరిహరులలిగినను
గురుని యండను వెఱపుండదు. కాని యెటనే సద్గురుండే కనలెనేని
మాధవుఁడు కాదు మహాదేవుఁడు నుద్ధరించుట బద్ధము సుమ్మీ" యను
సిద్ధుపలుకు లాలించి యతని యడుగులంబడి యడఁకువతో నిట్లు
విన్నవింపఁదొడఁగె. "అయ్యా! యీమీమాటలు వినఁగా నాకు
సందియము పొడముచున్నది. గురుండెట్లు విధిహరిహరరూపుం
డయ్యెడు? దేవతల యాగ్రహము నాతండెట్లు నిగ్రహింపఁగలఁడు?
ఆతని దట్లూరులకుం గాదందురేల? భేదం బొదవించు నాయాదం
గల ఖేదం బాదటం బాపి నిలుకడఁ గలిగింపవే" యనినంత,
నయ్యోగిపుంగవుం డందులకు మెచ్చి బదులిడఁజొచ్చె: "నామధా
రకా! నీవడిగినది మేలైనది. నీకు మొదటినుండి చెప్పెదను వినుము.

శ్రీమన్మహావిష్ణువువల్ల నబ్జసూతి వొడమె. ఆతని నలుమొగ
ముల వేదములుప్పతిల్లె. అంతఁ బదునెనిమిది పురాణము లేర్ప
డెను. వానిలో బ్రహ్మవైవర్తము సుప్రసిద్ధము. తన్నారాయ
ణుండే ద్వాపరాంతమునఁ దానిలలో వ్యాసరూపముం దాల్చి
నిజశ్రీవ ద్వారమున నట్లుగ్గడించెను. అందొక కథ వింటిని. నీ
కది నానేర్చిన తెలుంగున నెఱింగించెద. అది గురుమహిమముం
దెల్పునది. కలి తొలువేలుపు నడుగ నాతఁడద్దాని నుద్బోధించె"
ననవుడు నబ్బాపండు ప్రాంజలియై యట్లది సంఘటిల్ల నేటికి
కనిన నక్కథకుండు పలికె: "అనల్పకల్పుండగు భుజగతల్పుండు
కల్పసాగరమున వటపత్రశాయి యయ్యె. ఆయవ్యక్తమూర్తి

వరాహకల్పమునఁ దనయందిమిడి యుండిన జీవకోట్లను దత్కర్మ విమోచనముకై మరల సృజింపఁగోరి ప్రపంచ సృష్టి గావింపఁ దొడఁగెను. అందుల కద్యాదిపూరుషుండు యోగనిద్ర యుడిగి యుల్లంబును దొల్లింటి చేతనె నెమ్మి నాభిపద్మంబు వికసింపఁ జేసినంతనే,

క. మొలకెత్తుచు దెసలం బొ।
క్కిలిపావఁడు పాటిఁజూడ ♦ గబ్బుబ్బ స్రా॥
వలరింతగ నీయబ్బను।
వలమురితాలుప నన నెద♦వడి కెల్మిడిఁ చేసె.
(అన్నపెఱుఁగు)

ఆజన్నిగట్టు కొంతవడి స్తుతిసేయ నలరిన పెన్నుండబ్రహ్మ నింగని తన యాన శిరమునఁ దాల్చి సృష్టిగావింపుమనియె. బమ్మ యెమ్మెయిననియడిగిన నాతెమ్మికంటి యనాదియగు వేదమ్మను దర్పణ దృష్టమ్మగుభాతిఁ గనఁదగు సృష్టిరచనా విధానమ్మెఱింగి యథాపూర్వమ్ముగా ననుసరింపుమనియె. అంత నక్కలనాతమ్మి పుట్టుచెట్టులం గట్టుల నండజ స్వేదజ జరాయుజంబులఁ జరాచరాత్మక ప్రజాలోకంబెల్ల సృజించె. వేదవ్యాసుఁ డష్టాదశ పురాణంబు లందది స్పష్టముగావించె. అందీ బ్రహ్మాండపురాణమున రోమహర్షణి శౌనకాది మహర్షుల కెఱుకపఱచిన గురుకథాక్రమంబిది వినుము: పరమేష్ఠి సృష్టివర్ధకులగు బ్రహ్మర్షులను మఱియాదులను దేవపూర్వదేవులను నిల్పి వర్ణాశ్రమధర్మసహితులగు బ్రాహ్మక్షత్రియ వైశ్య శూద్రులం గల్పించె. అంతఁ గృతత్రేతాద్వాపరకలిసంజ్ఞక యుగచతుష్కమేర్పఱచి యెఱుకదాసనుక నొక్కటిగాఁ బుడమికిన్నడపె.

పితామహుని యాన ఋతేతరం బెఱుంగని కృతాఖ్యంబు వైరాగ్యజ్ఞాన సంయుతంబై యజ్ఞతపఃపితామహులాలంకృతంబై యిలలో వెలయ వెడలుచు నలువకు మ్రొక్కి "ధరలో నరులు తలచుగాఁ గొఱులాడువారును దూఱువల్కువారునైయుండ కట్టి

కుత్సితులకు వెలితు'' ననియె. విధి యది విని కృతమునుద్దేశించి "నీవవని 1728000 వత్సరములే యుండుము. నిన్ను సంకట మొందింపను. అంత త్రేతాయుగము నంపుదు లెమ్ము. సావధానతఁ గను" మనెను. కృతము కడచిన వెనుక ధాత యనుమతి స్వీకృత తనువగు త్రేత యాజ్ఞికోపకరణ సముపేతమై యేతెంచి 1296000 ఏండ్లు ధర్మకర్మ ప్రవర్తకంబయ్యె. పిదప ద్వాపరంబు సాయుధ పాణియై డిగ్గి పుణ్యపాప మిశ్రవ్యాపారంబుల 864000 వర్షంబులు కడపె.

క. కలివచ్చెం గాలియున్మైఁ।
దలక్రిందై నడ తడఁబడఁ ♦ దన డాకేల్పి।
ల్లలఁ గలిగించెడి వేదను।
వలపలకయి నాలుపుఁగోని ♦ వగ నగవుఁదగన్.(అ.శ)

ఆకలహ ద్వేషసంయుతుండగు కలుషాత్మునిఁ గోఁతిరీతిం గని యడిగిన ధాతకతం డిట్లనియె; "స్వామీ నా యీ యంగంబులతో నేను లోకంబెల్ల జయింపఁగలను. ఇఁక నాగొనములఁ జెప్పెద. వినుము. నేను సిగ్గెగ్గులెఱుంగ. లగ్గులు నుగ్గుసేయుటయె నాపగ్గ. నిద్రాకలుష శోకాదులే నా యంతుకములు. జారచోర వారంబు నాకుఁదోడు. బక జపమొనర్చు కైతవ యతులు నాయంత. ఇంతకన్న నాకుఁ బ్రాణ మిత్రులు లేరు. పుణ్య కర్మాచరణైక పరులెల్లరు నాశత్రువులే'' యనెను. అది విని వేల్పుఁబెద్ద యాతనికనియె: "ఏమయినను యుగాంతరములందట్లు ముందు నరులు దీర్ఘాయువులు కానేరరు. వారికిఁక నూతేండ్లే పరమాయుర్దాయము. అట్టియెడఁ గష్టసాధ్యంబగు తపోనుష్ఠానాదికంబునం గాక యీశ్వర భజన మాత్రమునఁ గైవల్యం బచిరలభ్యంబు గావలయు. కాన బ్రహ్మజ్ఞానులకును భక్త్యధీనులకును ఖన్నముఁ గలిగింపకు'' మనియె.

అందులకు నగచి కలి యిట్లను: "వారెల్లరు నాకు వైరులేరి. వారిం బేర్కొన్న మాత్రనే నాకు దడ పొడము చున్నది.

భూమండలమ్మునందును భరతఖండంబునఁగల సుకృతులు నన్ను విశ్రుతినొందింతురు. అచ్చోటికిఁ బోవుదు"నని కొంకుచున్న కలి కంభోజాసనుండు పల్కినదేమన, "ఓయీ! నీవు కాలాత్మానుసారి వైన ధాత్రీజనంబులెల్ల స్వభావసిద్ధముగా ధర్మదూరగులగుదురు. పుణ్యాత్ములకును పాపచింత కలుగుచుండును" అన్నపుడు నాతనికిట్లు యుగరూపుండు పలికె: "హిరణ్యగర్భా! యేమైనను నాకయ్యెడ కతిబహుళంబ కాఁగలదు. ఏలనఁ బవిత్రులగు తీర్థవాసులును శైవాగ్రణులును వైష్ణవోత్తములును ధార్మికాగ్రేసరులును నాకుపద్రవముఁ గల్గింపక మానరు. మఱియు గంగాతీరస్థులును దత్తతీర్థసేవా పరాయణులును పురాణశ్రవణ ప్రవణులును ధ్యాననిష్ఠాగరిష్ఠులును నాకు వైరులు. శాంతులను నిష్కపటులను గనిన నే వణఁకుదును. నాసాగ్రదృష్టి నొప్పు తపస్వులం గాంచిన నా ప్రాణములె పోవును. ఇఁక మాయావరణంబునం జిక్కి యీషణత్రయంబునకు లోనై యుండువారును నిగమాగమ నిందాపరులై భేదదృష్టిని హరిహర దూషణముఁ గావించువారలును నాకుఁ బరమాప్తులు. కావున రాగద్వేష పరహితులై యింద్రియాతీతులై హరిహర భక్తులగువారి పేరెత్తి నన్నుఁ దత్తఱపెట్టకు' మనెను.

అందులకుఁ జతుర్ముఖుం డిట్లను: 'ఓయీ! యిహలోకమున నీవు చేరఁగానే నరులు పెక్కుర నిన్ననుసరింతురు. అందు నూటికిం గోటికి నొక్కరుండో పుణ్యపురుషుం డుండెనేనియు. అట్టివారికి నామాత్రము విఘ్నకారివి గాకుండ సంచరింపు'మన, సంచరింపుదునని కేల్మోడించి వినయావనత వదనుండైన చతుర్థ యుగరూపుం డిట్లు పలికెను: 'తాతా! యధర్మమే నేనుగా మూర్తీభవింపఁ జేసి ధర్మముతో సన్నానుకూల్యముఁ గనుమందు వెట్లు పొసంగునని కొందు వయ్యా?' యన్నంతనే యాజగములఁ బుట్టించువాఁడు పక్కున నవ్వి యక్కలియుగాత్మకుం జూచి 'నీకట వసింపనేగ నుపాయముం జెప్పెద వినుము. నీవు జంకక

యధర్మమే యూఁతగాఁ జనును. విమలులౌటచే నీకు రిపులైన వారిలో నూటికిఁ దొంబది తొమ్మండ్రు మలదూషితులయి తమయంత నీతోడి ద్వేషముఁ బాపికొంద్రు తెమ్ము. తుదకే రొక్కఁడో సుకృతియై నీకు లొంగకపోయినఁ బోవుఁగాక. అంత మాత్రమున భయములే దన్నను గొంకు వీడకు నిశ్శంకము గావింతుఁ బితామహుం డేమనుచున్నాఁడో, నామధారకా! సావధాన మనస్కుండవై యాకర్ణింపుమోయీ: (అత్యాశ లేనిధీరులగు శుద్ధబుద్ధులును హరిహరగురువరులం దభేదదృష్టి నారాధించువారును గాశీవాసులును దలిదండ్రుల సేవవీడని బ్రాహ్మణభక్తులును ధేనువు లన్వరిష్ఠ యగు కపిల నర్చించువారును శైవ వైష్ణవ తులసీపూజకులును గలుషితులు కానేరరు. గురుభక్తియుక్తులగు పురాణశ్రవణాదరులను స్వధర్మనిరతులను నీ వెప్పుడుఁ బీడింపకుము. శ్రుతిస్మృతిపురాణధర్మజ్ఞులగు వివేకులజోలికి నందును గురుసేవాధురంధరుల తెరువునకుఁ బోఁగూడదు."

ఇట్లు గురుభక్తి ప్రభావముం బోరొంకన్న వాక్పతిం గల యివ్విధంబునఁ బృచ్ఛసేసెఁ: 'గురుఁడు గురుఁడందు రాతం డెవ్వండు? తత్స్వరూపం బెఱింగింపవే' యనవృషు దుగినుఁ డను గ్రహించిన తెలంగెలుంగుము: " 'గ'కారము సిద్ధిదము. 'రేఫము' కలుష దాహకము, 'ఉ'కారము విష్ణుత్వ బోధకము. కాన, 'గురు' వనఁ ద్రిమూర్త్యాత్మక స్వరూపము. ఇట్టి ద్వివర్ణాత్మక మంత్రము గణేశాగ్నివిష్ణుప్రయుక్తమై చతుర్వర్గ ప్రదాయక మగుచున్నది. ఎట్లనిన 'గ'కారము వలన గణేశుని 'ర' వర్ణమున నగ్నిని 'ఉ' కారమున వెన్నుని గ్రహింపవలెను. అట్టి గురుఁడే తండ్రియుం దల్లియు సాక్షాత్పరశివుండుఁ జువ్వే.

ఆ. జీవభావ ముడిపి ♦ చెప్పు బ్రహ్మము బ్రహ్మ।
మాయఁ గావ్య తతిని ♦ మాపి హరియు।
భవము వాపి శివుఁడు ♦ బ్రహ్మవిష్ణుమహేశ।
పరమమూర్తిగమైన ♦ గురు నెఱుఁగుము.

ఆ. హరిప్రసన్నుఁడైన ♦ గురుభక్తి నొసఁగుఁ బ్రీతి ।
గురుకృపనగుఁగాదె ♦ హరికృపయును ।
హరునకైనఁగాదు ♦ గురునకు సంతుష్టి ।
గురునిదయను బొంద ♦ హరుపదంబు.

క. హరుఁడలిగిన గురువఁడుఁడే ।
పరిరక్షణసేయు, వరుఁడు ♦ పదరిన నప్పుడే ।
నొరులాఁగ నేరితరముగుఁ? ।
గురుహరుఁడును నష్టవోవఁ ♦ బొలివోవుసుమీ.

కావుననే శాస్త్రోక్తరీతిని గురుభజనము గావించువాఁడు దానజపతీర్థాటన ఫలంబును వ్రతాచరణ గరిమంబును యోగాభ్యాస మహిమంబును దశస్వర్గాసక్తియుం బడసి జ్యోతిస్స్వరూపముం గనెడిని. గురునివలన వర్ణాశ్రమ ధర్మాచార క్రియావివేకంబును భక్తివైరాగ్య ముక్తిపదార్థ ధనంబును గలుగు ననును.

అంతనింతటి సర్వదేవసమానుం డట సర్వజ్ఞ సముచ్ఛ్రిత వివరము సజుఁడు దెలుపఁదొడఁగె. గురునియాదగుప్రకాంవడిన గతి దొరకదు. గురుఁడుండమి సచ్ఛాస్త్ర శ్రవణంబు గలుగదు. కాన భయముదుగదు. గురుని యండ లేకుండనే శాస్త్రము లొకతెల సులభసాధ్యములు కావు. యందలి తత్త్వ మవగత మగుటను నన్ను సంసారమునుండి తరయింప వీసుట మార్గము దుర్లభము. కావున ముముక్షు గురుకడుండినఁ గాని బ్రహ్మసాక్షాత్కార ముల్ల నేరదని తెలిసికొనుము. శ్రీగురు సంసేవనమునఁ గాని దేదియును లేదు. ఇందులకు "గురుశిష్యకథ" యొకండు నుడివెద నాలకింపుము.

మున్ను గోదావరీ తీరస్థమగు నంగిరసాశ్రమం బొకఁడుండె. అది నానా తరులతాకీర్ణంబై పుణ్యారణ్య మృగ విహార భూమియై విరాజిల్లుచుండె. అచ్చోట బ్రహ్మర్షిప్రవరులు తపోనిష్ఠాగరిష్ఠులై యొప్పారుచుండిరి. అందుఁ బైలపుత్త్రుండు వేదధర్మాఖ్యుండు విఖ్యాతముం బొందుచుండె. అతనితోడ వేదశాస్త్ర పాఠంబుఁ

గావించు శిష్యులు కొందఱుండిరి. వారిలో దీపకాభిధానుం డొక ఛాత్రవర్యుం డొప్పె. ఒకనాఁ డగ్గురుండు నిజాశ్రితు లందఱఁ జేరఁ బిలిచి తచ్చిత్త స్థైర్యంబు పరికింప, "నాయనలారా ! నాయందు మీకందఱ కాదరము కలదేని నాపలుకు లాలింపుఁ' డనిరి. అందులకు వారెల్లరుఁ గేల్గోడించి 'అయ్యా ! మమ్ము దరిఁజేర్ప మీ కేకదా దిక్కు? మీయాన శిరములఁ దాల్ప సంసిద్ధులము. గురువుల యాజ్ఞకడుగు దాఁటువానికి నరకప్రాప్తి యగును. వారి పనుపుల నెఱపని మహాయాసముద్రమున మునిఁగి పోవును. దాన నధోగతి యగు. కావుననే కదా ప్రాఁజదువుల గురువులే తారకులని కల' దనిరి.

వేదధర్మ వారి పలుకుల కలరి దీపకప్రముఖుల కిట్లనియె: 'బిడ్డలారా! వేలకొలఁది తొంటిపుట్టువుల నేఁజేసిన మహాఘం బెల్లఁ దపస్సుచే నెంతతొలఁగించి కొంద మన్నను బ్రారబ్ధశేషము వెంట నంటియే యున్నది. తత్ఫల మనుభవించినఁగాని తీఱునది కాదు. అదిగాక ఫలాపేక్షతో నొనర్చుజపము మోక్షప్రాప్తి కంతరాయ మొనరించున దగును. కావున ఘోరపాపము నుపేక్షింపఁదగదు. తన తనువుననే యనుభూతము కానిది దానికి నాశము గలుగదు. కావునఁ బాప నివారణము కొఱకు వారాణసికిం బోయి తత్ఫలానుభూతిం గందును. అచ్చోటఁ బాటుపడి నన్నే దవలయు. పురాణంబుల వారాణసీపురం బఖిలాఘ విధ్వంసకం బని చెప్పఁబడి యున్నది. వైళంబ నన్నటకుఁ గొనిపోవలయు. మీలోనను సాఁకఁ జేకొను వారెవరో వాకొనుఁ' డని నంతనే పావనగురు సంసేవన ప్రాపకుండగు దీపకుండనువాఁడు దేశికుల కంజలి ఘటించి యిట్లు పల్కె.

దీప:— స్వామీ! పాపమొక్కింతయేని శేషింపనీయరాదు. ఒడలికి బెడఁదఁ గలిగించు నద్దానికి వెంటనే ప్రతీకారంబుఁ గావింపఁదగినది.

వేద:- ఔను. కిల్బిషము విషతుల్యము. దేహదార్ఢ్య మున్నప్పుడే నరుఁడు పాపక్షయము కావించికొనవలయును. అది తీర్థసేవనమునను ప్రాయశ్చిత్తమునను వ్యాధిరూప బాధానుభవమునను నశింపఁ జేసికొనవలయునే కాని వేఱు కాదు. దేవర్షులకును జ్ఞానులకుంగూడ దుష్కృత నిష్కృతి కావించికొనక తీఱదు సుమీ.

దీ:- అయ్యా! మీరన్నది యథార్థమే. ముదల యిడినఁ బదిలముగా సేవింప సంసిద్ధుఁడను.

వే:- నాయనా! నేనిఁక నిరువదియేండ్లు కుష్ఠవ్యాధి బాధితుఁడనై కన్నుఁ గాలుఁ బోయియుందు. ఇట్టి నన్నేడ నీకలవి యైననే తలపడుమా.

దీ:- బాబూ! మీరంతకాలము దుర్భర వేదన నొందుచుండ నేనెట్లు చూచి సహించుచుండఁగలను? దయచేసి నామనవి వినుండు. ఏలినవారి పాపముఁబాప మీకొఱకే నొప్పి తద్బాధ నొంద సంసిద్ధుఁడను. మీరందుల కనుగ్రహించినంగాని యీమీ పాదముల వీడను.

వే:- బిడ్డా! దొడ్డదగు నీయొడ్డము నీకడ్డ వలనుపడదోయీ. ఎవ్వరి పాపఫలము వారే యనుభవించి తీఱవలయుం గాని నిజాశ్రిత పరిభృతుల నందులకు నియోగింపఁగాదు. కాన నేనే పొందుదును. నీవు ప్రేమమై నింతకాలము నాకుపచరింప నిచ్ఛగింతువే నదియే చాఁదగ్గమేలు. ఏలన, రోగికంటెఁ దత్సేవకుఁ డొందు నిడుమపాటు కడునధికమౌను. దీపకా! నీవందుల కోపిక ప్రాపింపఁ గందేని ముందు ననుఁ గాశికిం గొనిపోయి నాకటనూడిగముఁ గావింపుము. నీయండనుండి నేను దోసఁగు వాపికొని ముక్తిఁ గందును.

దీ:- చిత్తము. నేనట్ల కొంపోయి మిమ్ము సాక్షాత్కాశీ విశ్వనాథునిపై సేవించువాఁడ.

అని స్థిరచిత్తుండగు నాఛాత్త్రవర్యుండు నిజగురువర స్వైర పరుం డగుచుఁ గతిపయ ప్రయాణంబుల వేదధర్మును వారణాసికిం జేర్చి యందు మణికర్ణికాఖ్య ఘట్టమునఁ గంబళాశ్వతర పరిసరోప విష్టుం గావించె. ఆతండు నట గంగాస్నాన పరిపూతుండయి విశ్వనాథార్చన మొనరించి ప్రారబ్ధానుభవమునకుఁ గడంగె.

కుష్ఠ రోగ మాతని నావహించె. కనులు వోయె. పురుగులు వడి యొడలెల్లఁ జీమును రక్తమును స్రవింపఁజొచ్చె. మఱి వోయి యతఁ డెడలేక యడలుచుండె. దీపకుండు నాతనినే విశ్వనాథునిఁగా భావించి యేహ్యము లేక సకలోపచారంబుల నొనరించుచు భిక్షాన్నముం గొనితెచ్చి మెసవించుచుండెడివాఁడు. కాని సాధువు లయ్యు వ్యాధి బాధితులైనంతనె వ్రీడ వీడి యొరులఁ బీడించుచుంట కలదుగదా. అటులనే యీరోగియుఁ బాప మూపాపని వేపఁ దొడఁగె. ఆదీపకార్భకుండతి శ్రద్ధాభక్తులతో నిజగురుండు నోపకుండఁ గావవలయు నని శక్తి వంచనలేకుండఁ బాటు వడుచున్నను మాట దక్కనీఁడు. ఒకనాఁడు తెచ్చిన యన్నము చాలదని కినిసి తినక పాఱవైచును. మఱుదిన మాతఁ డూటనేఁ దిరిపెమెత్తి యెచ్చుగాఁ దెచ్చి ముందటఁ బెడిన సైఁపదని విసుచును. వేఱొకనాఁడు రుచ్యచిత్రాన్నములఁ దెమ్మనును. ఇంకొకనాఁ డీకూర లాకూర లేవనును. తుదకా శిష్యుం డేపాటులో పడి యా కోరిన వెల్ల నమర్ప నాతనిఁ బడఁ దిట్టి కొట్టుచుండును. ఒకవేళ మెచ్చుకొన్న నంతలోనే వంతమూని విడువక తన గబ్బు నీరు కడుగవేమిరా యనుచు నడుమనును. ఈగలఁ దోలు మని యట్లొనర్చుచుండ మాధుకరమున కేగవేమని యదలించును. ఇట్లు పాపిష్ఠ కుష్ఠవ్యాధి పీడితుఁ డాడు పరస్పర విరుద్ధ భాషణముల కంతు లేకయుండె. పాతకము మెండైన కొలఁది దీనత్వము నీచత్వము మచ్చరము నెచ్చియు మంచిచెడుగుల విచారింప నీయవయ్యె.

ఇదెల్లఁ బాపస్వరూపముగా నెఱింగియు నాతనిఁ గొల్చువాని మాదిరిగా నెంచవలెను. అందీ వేదధర్మ నిపుడావహించిన దష్టాదశకుష్ఠం

ననుభవింపక తప్పించుకొనఁ జూచిన జన్మాంతర మందైన నెంట నంటక మానునా? కలకర్మశేష మీయెడనే తీర్చికొనకున్న నది మోక్షప్రాప్తి కాటంకముకాదా?' యను వేదధర్మప్రబోధిత ధర్మమ్మును వేదధర్మమ్ముగా నమ్మిన గురుభక్తి దీపకుండగు దీపకుండు విశ్వేశ్వరుదెసకుఁ దిరిగి 'జింకతాలుపా! నీవింకఁబాలుపో. అయగారి మయికోలు లేదయ్యె. మీతో నాకిపుడు పనిలే' దనుడు నీశానుఁ డచ్చెరువడి మరలి, హరిముఖానేక సురమండల మండితంబగు నిర్వాణ మండపంబున నిండు పేరోలగం బుండి యాదండి శుశ్రూషంగూర్చి పెండుగాఁ గొనియాడె. అది విని మాధవుం 'డాశిష్యుండెవ్వండు? తద్గురుఁ డెవ్వఁడు? వారుండున దేడ?' ననెను. అందుల కీశ్వరుం డిట్లను: 'ఎక్కడనో కాదు. ఇక్కడనే. గురుండు గౌతమీ తీరవాసి, వేదధర్మాఖ్యతాపసుండు తద్గోపకుండో గురుభక్తిదీపకుం డొకదీపకుండు. తాదృశ గురుసేవాపరాయణుం డీధాత్రి నింకొక్కండు గానరాఁడు. ఆబాలకుం జూచినంతనే నాకమిత ప్రీతికలిగి నే వరమిత్తునంటి. గోవిందా! యేమందు? 'నీ వరము గిరముతోఁ బనిలేదు పదుపు'మనెను. 'అయ్యో! చిరకాల మహోరాత్రములు నాకొఱకుఁ దపస్సుఁ గావించినను రానివాఁడనురా. నాయంత నీపూర్వపుణ్యమునఁ బ్రసన్నుఁడనైన వరముఁ గొనవేమిరా?' యని బలాత్కరించినను దుదకు నన్నుఁ బరాభవించి యంపివైచెను. ఆహా! అతని గురుభక్తి యేమని చెప్పుదు! ఆవేదధర్మునే త్రిమూర్త్యాత్మక స్వరూపునిఁగా భావించి మనోవాక్కాయ కర్మంబుల శర్మంబున నాతం డనవరతము తదేక దీక్షతో సేవించుచున్నాఁడుసుమీ. తనకేకఁ దల్లియైనను దండ్రియైనను దైవతమైన నాతండే యని నమ్మియున్నాఁడు. అతని గుణగణంబు లెంతని వర్ణింతు? ధర్మము జ్ఞానము యశము సర్వము గురువే యను దృఢమతి ప్రాపించిన యాదీపకుండే కులదీపకుండు నవిద్యాధ్వాంత దీపకుండు నౌఁగాకే.' యని క్రిక్కలపై నొక్క

మ్మడి నగ్గికంటి యగ్గింప సద్గురు శిష్యుల దగ్గతిఁ జూడఁ గోరూపాలి నైన గరుడగమనుండు వెనువెంటనె మణికర్ణికకు వచ్చివాఁడిలె.

అట్లు వచ్చిన లచ్చిమగఁడు చిచ్చుఁగంటి మెచ్చినదానికంటె నెచ్చగు లచ్చనములు గల యాబుచ్చిగానిఁగని యచ్చెరువొంది యాతని మచ్చికం జేరఁబిల్చి 'చిన్నవాఁడా! వెన్నుండఁ బ్రసన్నుండ నైతి. వరమిత్తు. కోను' మనుడు దీపకుం డిట్లు బదులుపలుకుః 'నారాయణా! నీవు రానేమిటికో నాకు వరమీయ నేమిటికో నాకు బోధ పడకున్నది. ఘోరారణ్యంబుల బహుకాలము నీకొఱకై మహాతపంబొనర్చు మౌనిశేఖరుల నుపేక్షించి తపమే యెఱుంగని నా తెరువునకు రానేటికయ్యా? నిన్నేను దలఁప లేదయ్యెఁ బిలువ లేదాయె. నాయోగ్యత యేమి విచారించి వరమీయ వచ్చితి రయ్యా.' యనుడుఁ దద్భక్తి సమ్మోహన మోహితాంతరంగుండైన భక్తవత్సలుం డిట్లనుః 'నానా! ఏతపము లందులకోయీ. నీవు గురునెడ నెఱపునదెల్ల నాకే చేరుట లేదా? గురుభక్తుండన మద్భక్తుండే సుమ్ము. నేనో భక్తపరాధీనుండ నైతి. తద్భక్తభీష్టము లం దీర్పకుండఁ గలనా?

తే. తల్లిదండ్రులఁ బూజించు ♦ తనయు లనినఁ
బతికి సహధర్మచారిణు ♦ ల్పడఁతు లనిన
విబుధ తాపస యోగీశ ♦ విహితు లనిన
హరిమహాప్తులు గురుభక్తి ♦ పరులు నట్లు

యను పురుషోత్తమోక్తులు విన్నంతనే యాసచ్ఛాత్రుం డాతనికిఁ బ్రణమిల్లి మెల్లగ నిట్లు విన్నవించె; 'స్వామీ! నానిశ్చయ మేమన, సకల నిగమాగమార్థంబులం గఱపి జ్ఞాననేత్రంబుఁ దెఱపించినది గురుండే కదా. దానఁ గదా మూర్తిత్రయంబు గోఁగుట. అట్టి విజ్ఞానదాత యగు సద్గురుండే నాకు దేవుండు. ఇతర దైవతము లతో నాకింకఁ బనియేమి? నాకంతయు దేవతలు సన్నితీర్థములు నాతండ. అంతకన్నఁ బరమార్థము వేఱొండు మారాన నారయ

వలయునా? మాగురువులకంటె సిద్ధులు యోగులు జ్ఞానులు నింకెవ్వరు లేరు. గురుకృప యబ్బినవెనుక నీశ్వరుఁ డింకెక్కడనో కలఁడనికోనానా? దామోదరా! నీవిచ్చుమాత్రపు వరము మాగురువు లీయలేకపోరు. కొండ తలక్రిందఁ బెట్టుకొని గులకరాలకై వెదకనేల?' యను నాతని మనోనిరూఢిం దెలిసి యమందానంద కందళిత హృదయారవిందుండగు నరవిందాక్షుం డిట్లను గ్రహించె: 'తండ్రీ! ధన్యుండవోయీ! నీకంటె నాకిఁకఁ బ్రాణమిత్రుండు లేఁడురా, నాయనా! నీభక్తిచే బద్ధులమైతిమి. ముందు విశ్వేశ్వరుఁడనుగను బిడవనేనయ్యు వరమీయ వచ్చితిమి. పేరులు వేఱైననేమి? మే మొక్కరూప. నీకధీనులమైతిమి. తుదకు మాసంతుష్టి కొఱకైన నీకుఁ దోఁచినదేదే నడుగరాదా' యను సాదర వాక్యములకు మోమోడిన యాశిష్యశిఖామణి సవినయంబుగా నిట్లర్థించె; 'భక్తకల్పద్రుమా! మీరంత యవ్యాజానురాగమున నాయెడ ననుగ్రహింప నున్నారగుట నాకోర్కెయిట్లు మనవి చేసికొనుచున్నాను: 'మా గురువులయెడ నాభక్తి దినదిన ప్రవర్ధమాన మానట్లాశీస్సు లొసంగుఁడు. గురుస్వరూప విజ్ఞానమును బ్రేమలక్షణముం గటాక్షింపుఁడు. ఇంతకంటె నితరము నేను గోరను. మీరీయ నక్కఱలేదని సాష్టాంగ దండప్రణామంబు లాచరించెను.

అంత నాశ్చర్యానందంబులు పెనంగొన గోవిందుండిట్లను: 'దీపకా! కులదీపకుండ వన్న నీవేకదా. ఏ గురుభక్తి నుపచరించితివో దాననే తరించితివి. ఇందే బ్రహ్మానందము నందఁగలవు. ధర్మము ననుసరించియు లౌకికబుద్ధిని బరదృష్టిని గూడ సర్వదా మనమున నాగురువునే నిల్పి కొల్చుచుందుము. దాన గురునికి సంతృప్తి యొదవెనేని నాకు నయ్యెడిని. ఏవేద వేదాంగపారంగతులైనను దుదకుపనిషత్సారవేత్తలును సద్గురుమహత్వమే యెంచునది. గురుతే సాక్షాత్పరబ్రహ్మస్వరూపమను సిద్ధాంతము గలవారే నాకత్యంతాప్తులు. కాన, గురునే భజింపుము. దేవత

టును నీకు సేవకులయ్యెదరు. 'గురు' పదాక్షర ద్వంద్వ సుధాసాగర వీచికావగాహం బొనరించిన దేహంబున కింకఁ దాపత్రయాభీల దావానల జ్వాలాదాహ భయంబు లేదు. తద్వర్ణద్వయామృత పానంబున నమరత్వసిద్ధియు నిక్కంబుగా నగును. ఇంతకు దైవానుగ్రహము లేకున్న సద్గురులాభం బొదవదు. మఱియు మామూర్తిత్రితయమున నెవఁడిచ్చువరముగాని యాతఁడీయలేకపోఁడు. కావుననే గురువన్నఁ ద్రిమూర్త్యాత్మక స్వరూపముగా నెఱుంగునది. నీవిఁక యథానిరూఢిని బుధారాధ్యపదంబందెదు గావుత' మని మెచ్చరించుచు నాపచ్చవలువదారి వియచ్చరారూఢుం డయి వచ్చినత్రోవం బట్టె.

ఇట్లాత్తహారివరుండగు దీప్తగురుమహిముండు ప్రాప్తగురుచరణుండై నంత నాతండు 'హరి నేమడిగితి? అతఁడు నీకేమియిచ్చె?' నని పృచ్ఛచేసె. అందులకు శిష్యుండు తన కయాచితముగా నైన లబ్ధిమగఁ డిచ్చినది మఱేమి లేదనియు గురుపాదభక్తియే నిశ్చలమగునట్లుల బ్రసాదించె ననియు మనవిచేసె. అదివిని ప్రసన్నుండై యాతండిట్లు దీవించె; 'దృఢభక్తిభావా! చిరంజీవ! నీవింక నీకాశీపురంబున సుఖంబుండుము. సిద్ధులెల్లరు నీయాజ్ఞాబద్ధులయ్యెదరు గావుత. నిధులెల్ల నీకొంగుబంగారమగుఁగాత. నాకు నీవింతసంతుష్టిఁ గొల్పితివి గాన విశ్వనాథుండు నీకరిగాఁపు గానయ్యెడు. నీనామస్మరణ మాత్రమునఁ గష్టములెల్ల నడఁగి కుష్ఠము లుడిగి పుత్త్రకళత్రాది సంపదలెల్ల సంఘటిల్లెడు.'

ఇట్లాశీస్సు లిడుచు సర్వేదధర్మ మునిశేఖరుండు త్రిగుణాత్మమ్మున దివ్యదేహమ్ము ధరించెసుమ్మ. కలీ! తెలిసికొంటివా? మాని నిజశిష్య భావపరీక్షార్థంబ కుష్ఠవ్యాధి బాధితునట్లు నటించనేకాని యంతటి మహాజ్ఞానికిఁ బాపశంకకూడనా? ఇఁకఁ గాశీయాత్ర యన్ననో లోకసంగ్రహార్థంబ. దీన ననేకజన్మానుసారకంబగు కాశీ మహిమంబును దెల్లం బయినదికదా.

ఇట్లీ హరిహర గురువరాచార్య యుక్తంబగు కథను గలికిఁ జదువుల ముదుకం డెఱింగించిన తెఱంగెల్ల సూతుండు శౌనకాది మహర్షులకుం జెప్పె. కలియు నిది విని వనజాసనుని కేఁగి తదాజ్ఞానుసారియై పుడమిం జొచ్చి యాతఁడన్నట్లై నడపఁ దొడఁగె.

ఓయీ నామధారకా! గురుభక్త్యనుభవుండు తరితవ్యాభవార్ణవుండవుట కింక నబ్బురమా? ఎక్కడెక్కడ మిక్కిలిబత్తి జొత్తిల్లు నక్కడక్కడ మిక్కిలి కంటివేలుపు తక్కక దిక్కగాఁ గలఁడు. ఎవఁడెవ్వండు నిజగురునందే మూర్తిత్రయంబు నాగోపించికొని త్రికరణశుద్ధిగా సంసేవన మొనర్చునో వాని కచిరంబ దీపకునట్ల తత్తన్మూర్తు లధీను లయ్యెదరనుట నిస్సంశయము.

## జ్ఞానకాండము — ౩ దళము.

సిద్ధుండు బోధించిన దెల్ల శ్రద్ధాభక్తులతో మనమున నాటించికొని బద్ధాంజలియగు నామధారకుండాతని కిట్టులనియె; 'మహానుభావా! పుట్టువులు మాపి గట్టెక్కింపఁ జాలిన దిట్టలు మీరు నా పూర్వపుణ్యమునఁ దారసిల్లితిరి. మీవల్ల నా కొందలమును సందియములు డిందువడియె. భవదీయ వాగ్ధారామృతంబుం గ్రోలుట నాకిడియది లభించినదని యేమి? మహానందాంభోనిధి నోలలాడుచున్నాఁడ. పరతత్త్వ మిపు డద్దమునందట్లు చూడఁ గలుగుచున్నాఁడ. ఇంకేమి కావలయు? మీ ప్రస్థానముం బోనముం దెల్పిన బానసీకుండ నయ్యెద.' నని తచ్చరణంబులపై వ్రాలినంత సంతుష్టివై నా సిద్ధపూరుషుం డాతని సాశీర్వాదంబుగా దరిం జేర్చి తననుగూర్చి యిట్లు తెల్పె: 'భూసురా! నా మునికి వినుము. గురుఁడెట నెట నుండునో నేనట నట నుండు. తన్నామస్మరణంబును దన్మహిమామృత పానంబును నాకు విందు. ఎందైన నీగ్రంథంబు నేమముం దుంచుకొని భక్తితోఁ గనుచుండు. ఏలన నీగురుచరిత్ర పఠనశ్రవణాదుల వలననే భుక్తియు ముక్తియు నఖిలాభీష్టములు వెనువెంట నొనగూడెడిని. ఇది సప్తాహదీక్షతో సభక్తి

కంబుగా నెఱపిన గోధనధాన్యాది సంపదలును సత్సంతానముం జేకూరు. తచ్ఛ్రోతలకు బ్రహ్మహత్యాది మహాపాతకములును గ్రహరోగాదిపీడలు నుడిగి సంపూర్ణాయుర్దాయమును జ్ఞానసంపదయు నొదవి తుదకు బంధమోక్షంబగును.

ఇవ్విధంబున గురుచరిత్ర మహామహిమాభివర్ణనంబుఁ గావింప వినిన నామధారకుం డమ్మహితుని కిట్లనియె; 'దయాసాగరా! జ్యోతిర్మయస్వరూపులరు నాకు సాక్షాద్గురుమూర్తులరు లభించితిరని యెంచి భజించుచున్నాను. తద్గురు కథాశ్రవణైకపరుండనై యున్నాను. దప్పిగొని యున్న పాంథుని కమృతంబు ద్రావనిచ్చినట్లది యనుగ్రహింపుము. భానూదయంబైనంతనే యంధకార మంతర్ధాన మొందుపగిది గురుచరిత్ర శ్రవణంబున నాయజ్ఞానంబు బాపు' మనియె. అంత నాదుఃఖహారకుండు నామధారకు సమాశ్వాసించి యట్ల కావింతునని యభయదానం బొసంగి యాతని సద్గురుమూర్తి సేవితంబగు నశ్వత్థనామక జ్ఞానవృద్ధ కల్పవృక్షంబు దరిం జేర్చి కూర్చుండఁ జేసి యిట్లుపదేశింపఁదొడఁగె: "ఓయీ శిష్యా! గురునందు నీకు దృఢభక్తి లేదు. సంశయావిష్టచేతసుండ వౌటనే నీకు మనఃక్లేశంబు గలుగుచున్నది. ఎవ్వఁడు సదాచారుఁడై గురునందు నిశ్చలభక్తి గలిగి మెలఁగునో వాఁడు గురుస్వరూపమెఱిఁగి యిష్టార్థములఁ బడయు' నవవుడు శిష్యుఁడు గురునకు వినతుండయి కేల్మోడ్చి యిట్లనియె: "స్వామీ! యీనేఁ డజ్ఞాన ప్రవాహంబునం బడి సంసారాంభోనిధిం జేరియున్నవాఁడు. కామాదిగ్రహ పీడితుఁడై తాపత్రయ బడబానల జ్వాలలచే నొడలెల్లఁ గ్రాఁగియున్నవాఁడు. వీని నెట్లయినను జ్ఞాననౌకపై నుద్ధరించి మీరు నావికులరై భవదీయావిచ్ఛిన్నానుకూల దయావాయు ప్రసారంబున నవ్వలిగట్టున మెట్టింపవలయు' నని విన్నవించెను.

అంత నాసంయమిప్రవరుండు నిజకరం బాతనిశిరంబున నిడి యిట్లుపదేశించెను. 'శిష్యాగ్రణీ! యిఁక భయక్లేశంబుల వీడుము.

నీకు భద్రింబయ్యెడు మెలఁకువఁగనుము. నీకిదె సందియములెల్లఁ బాపుదు. ఎవనికి నిశ్చలమగు లక్ష్యము కుదురదో వానికిఁ జింత లుడుగవు. అట్టియెడ గురునివలని ప్రయోజన మంద లేఁడు. నీవు సంశయిత వౌటనే దుఃఖభాగివైతివి. అందుచే నింకనైన సందియము నాపికొని నిలుకడగలిగి జ్ఞానివగుము. సంశయ లేశమైనను లేక గురునిభజించిననే యిష్టార్థసిద్ధి యయ్యెడిని. గురుండనఁ గృపాసాగరుం డనునది నిగమాగమ విశ్రుతము. భూమిపై నాతని చరణంబులే శరణంబుగా నమ్మి భజించువానికి దుర్లభ మెక్కడఁ దుండునా? ఆతండఖిలాభీష్ట ప్రదాత.

తే॥ గురుఁడు చెట్టుల సమదృష్టి ♦ నరయుఁగాక
తత్కృపాసార మబ్బుటం ♦ దలుకుఁగాదు
గుటికలిమిఁగల్గుఁ గలుగదు ♦ కొలువడనది
వరఁత మెరకలఁ గురిసిన ♦ వానపగిది ॥

కావున మనోవాక్కాయ ధర్మంబుల నిర్మలభక్తి ననుసంధించి భజించెదవుగాక. ఏగురునికరము శిష్యశిరమునఁ జేరిన మాత్రినే యాతనికీ మాయామయ ప్రపంచమెల్లఁ బరబ్రహ్మ స్వరూపముగా నగపడునో యట్టియాతఁడు నిరుపముఁడు. అట్టి గురునిఁ గల్పవృక్షమన్నను జాలదు. ఏలన నయ్యది కోరిన వానినే యిచ్చును. గురుండో తాన యెఱింగి కోరనిదానిని గూడ సంఘటించును. కాఁబట్టి నీవు సంకోచములేక కామధేను ప్రాయుండగు జగద్గురుండే శరణ్యుండుగా భజింపు" మను తపసి బోధయెల్ల నాయిరుఁబుట్టువు గురుప్రసాదితముగా నిజమనంబున నిరవార నించుక ధ్యానించి నమఃపూర్వకంబుగాఁ దనవిజ్ఞప్తిం దెలిపె: "యోగీశ్వరా! నాకగు వేల్పుగిడ్డవినీవే. నేనో, నీపాద సేవకుండ. బాము లుడిపి నేమమారయ మిమ్మే నమ్మియున్నాఁడ. మక్కువకొలఁదిఁ జక్కని మీవాక్కులెల్ల విన్నంత నామనంబు త్వత్పదాంబుజంబులందే నక్కనియున్నది.

మఱియు గురుచరితము విన( కుతూహలము మెండగుచున్నది. ఏలన శ్రీగురువరుండే త్రిమూర్తి స్వరూపుండైన నరుండై ధరలో జన్మింప నేమిటికో తెలియఁగోరెద" ననిన సిద్ధుండు మెచ్చి యాతని కిట్లనియె: 'ఛాత్రచూడామణీ! నీప్రశ్నము మేలైనది. దీన నస్మదీయ బోధాబ్ధి వీచికాపరంపరల కవకాశ మొదవె. గురుసేవారంభమున నందఁదగిన మహానందసమయ మేర్పడినది. వెంటనే బ్రహ్మానుభవము సంప్రాప్తము కానున్నది. ఏలన దేశదేశంబులం దిరిగివచ్చితి. కాని నన్నిట్టిప్రశ్న చేసినవాని వేఱొక్కనిఁ జూడనైతిని. గురులీలామృతపానైకరతుఁడ వగు నీ వద్వితీయుఁడవు. ఐహికాముష్మికాపేక్ష కలవారికే యీకథ విన నింపౌను. ఆదరనిమతితో వినదగుఁగాక. గురునందు నీకు గురి కలిమి నట్లయగును. ధర్మార్థ కామమోక్షంబులం బడయుదు. గురుఁడు నిర్గుణుండైయు లీలావిహారార్థము సగుణ నరరూపముం దాల్చును. తచ్చరితము వేల్పుటావనుట వేదశాస్త్రవిహితము. దేవర్షులు నద్దాని నాదరింతురు. అతఁడు భూభారము తొలఁగించి భక్తుల నుద్ధరింప ధాత్రినవతరించి ధర్మసంస్థాపనము గావించెడి" నన్నంత నయ్యనంతాఖ్యుండు "నవతారంబులకగు నాదికారణంబు సవిస్తరంబుగా ననుగ్రహింపఁ గోరెద" ననెను. అంత నా బోధకుం డిట్లు సాదరంబుగా వివరింపఁ దొడఁగె.

"అనాదియు నవ్యయమునగు నిర్గుణబ్రహ్మ మేదికలదో యదియే తాను గారణరహితమయ్యు బహుత్వావస్థ నందుదును గావుత మనికొని యీాత్మింపనైన మాయతోడి కూడికయే జగత్కారణమయ్యె. ఈ శబలంబు 'న సత్త్వరజస్తమోగుణాత్మకంబులై యుత్పత్తిస్థితిలయంబు లొందింప బ్రహ్మవిష్ణురుద్రాకృతు లేర్పడెను. ఇట్లు రజోగుణోద్రేకమున సృష్టికర్తయగు విధాతయనియు, సత్త్వోద్రేకమునఁ బోషకుండగు జనార్దనుండనియుఁ దమఃప్రాబల్యమున సంహారకుండగు హరుండనియుఁ దత్తత్కార్యానుసార నామధారణ మొనర్చినట్లు వ్యవహారము

కలదు. ఇవెల్ల స్వతంత్రమును మూలకారణమునగు నాబ్రహ్మ వస్తువువల్లనైన తత్తల్లీలలేకాని వేఱుకాదు. మున్నొకప్పుడు సూర్యవంశమున నంబరీషుండను నొకరాజు తేజరిల్లె. అతండు నారాయణైక సేవాపరాయణుండై సంతతైకాదశీవ్రతంబు నెఱపుచుండె. ఆయేడీరేడు జగంబు లేలువాని నిలలో నయ్యె యవతారములెత్త నిమిత్తము కావయ్యె. అది యెట్లనిన నానరవరుండు దీక్షగొని యేకాదశినాఁడెల్ల నిరశనుండై యనవరత హరిభజనం బొనరించుచుండె. ఇట్లుండ నొకనాఁడాతనికి వ్రతభంగము గలిగింప నేర్పడిన దుర్దైవతమో యనఁ దన్నివాసమునకు దుర్వాసాఖ్యక తాపసలోక భీకరుం డొకరుం డేగుదెంచెను. అలనాఁడు ద్వాదశి యొకగడియలోఁ బొడమనైయుండె. అతిథి ప్రవేశ సమయమునకు నిజాతిథియై యేతెంచు నాతిగ్మర్శింగన భూతలేశునకుఁ జేతంబున భీతివొడమె. తానెదురేగి స్వాగతంబిడి యర్ఘ్య పాద్యాది విధులునడపి కేల్మోడ్చి కుశలంబడిగె. అంత నమస్థితిం దడయక దయసేయవలయు ననియు నెడపక తాఁజేయు పారణం బెడపక నడపవలెననియు నిటలతట ఘటితాంజలిపుటిమై విన్నవించె. ఆజటివల్లభుండును వల్లెయని పరిసరతటినీ తటంబునకుం జనియె. అటనాతండు కృతస్నానుండై జపాద్యనుష్ఠానాచరణంబున కుపక్రమించె. ఘటికాతీతంబయ్యె. వ్రతియగు క్షితిపతి మతి కలఁతనొందె. అతిథినివిడిచి కుడువఁజెల్లకయు వ్రత ముడుగనెడఁద నొల్లకయుఁ గొంతవడి చింతించి తుద కుదకపానంబుఁ గావించు నుభయ భంగములు వాయఁగలవని తలంచి యట్లు కావించుచుండె.

ఆక్షణంబున మరలిన యాభిక్షు పతిలిత్సువై యాతని నందుల కాక్షేపించి శిక్షించెదనని తీక్ష్ణంబుగా వీక్షించె. విన్నవోయిన యన్నరేంద్రుండు తెన్నుఁగానక వెన్నుని నిజమనంబున నెన్న నాపన్నుండగు నామన్నీని విన్నపంబును విన్నంత నాపన్నగ

## జ్ఞానకాండము — రదశము.

ఇహపరసాధనంబును సకలాఘవిచ్ఛేదనంబును మోక్షమార్గోద్బోధనంబునగు శిష్యసంప్రశ్నంబు గురులీలాప్రారంభస్మారణంబగుట నెంతయు సమీచీనంబయని సృష్ట్యారంభకథనంబుగా నత్రిజననంబుంగూర్చి యిట్లు వినిపించె: మున్ను కల్పాబ్ధియందు సృష్టిలీనంబైయుండ నాది నారాయణుండు వారిశయానుండయ్యెనని శ్రుతికలదు. ఆతండిచ్ఛామాత్రంబునఁ బూర్వకల్పమునందలి యయ్యై జీవవాసనాలేశంబులు లీనంబైనవాని నవ్యక్తంబుగ నండరూపంబునొందించె. అట్టి బ్రహ్మాండంబు హిరణ్యగర్భాఖ్యంబై దేవవత్సర పరిమితకాలంబట్లుండి తనయంత భేదిల్లె. దాన నీ జగంబుద్భవిల్లెనని తెలియనైనది. అదియె స్వర్గమర్త్య పాతాళములైనది. అందు భూమికడుగున నేడు లోకాలును పైన నేడునైనవి. శ్రీమన్మహావిష్ణు నాభికమల సంజాతుండౌ ప్రజాపతి చతుర్దశ భువనంబుల నష్టదిక్కులఁ గాలత్రయాదులఁ బ్రాదుర్భూతంబులఁ గావించె. భూతాత్ముఁడు భూజానియానఁగాని సృష్టి పెంపొందింప మున్ముందుగఁ దపఃపూతుండై సనకాది బ్రహ్మనిష్ఠులను మరీచ్యాదుల మానసోద్భవులం గల్పించె. అందీ మహర్షులు సప్తసంఖ్యాకులు. వారిని మరీచియు నత్రియు నంగిరసుండును బులస్త్యుండుఁ బులహుండుఁ గ్రతువు వసిష్ఠుండునని లోకంబున వాకొందురు. మఱియు వనజోద్భవునివల్ల శతరూపంబుల మనువులన నేర్పడిరి. అందు స్వాయంభువ మనువుకూఁతు దేవహూతి యన నేర్పడె. ఆమె బ్రహ్మేచ్ఛా యోత్పన్నుండగు కర్దమప్రజాపతికిఁ బరిణీతయయ్యె. వారు మరీచ్యాదుల కత్తమామలైరి. అందు ధాతృనేత్రోద్భవుండగు నత్రివరించిన పుత్రి యనసూయాభిధాన. నిజభర్తృపదాబ్జరోలంబమగు నాయమ పాతూజ్జగదంబయని నిగదింపఁ బడియున్నది. అక్షీణ సౌందర్యరాశియగు నతత్రేశునిఁ గన్న తల్లి సల్లక్షణ లక్షితాంగియని వేఱె చెప్పవలయునా? ఇంద్రాదులాచంద్రాంబ సాంద్ర పతిభక్తి

దుము. మీయింటికన్నాతురులై వచ్చినవారికి మీరు "నాస్తి" శబ్దము చెప్పరని విని వచ్చినారము. తరువాత మీ యిష్టము, మీరు యథేచ్ఛముగా భోజనము పెట్టువారని మీకీర్తి దశదిశల వ్యాపించినది. అదివిని మృష్టాన్నమున కాసించి కాళులీడ్చుకొనుచు వచ్చి యిటఁ జేరితి"మనిరి. ఆ సాధ్వీమణియు సాభివందనముగా వారికిఁ బాద్యంబులొసఁగి యుచితాసనాసీనులంగావించి యర్ఘ్యాదికంబిడి గంధపుష్పాక్షతాదులతోఁ బూజించి చేతులు జోడించి యిట్లు విన్నవించె: "అయ్యలారా! మీ యాహ్నికకృత్యంబులం దీర్చికొంటిరేని వంటయైనది కాన వడ్డించెదను. కాని మాయింటివారనుష్ఠానమయి యింటికింక రారైరే"యనెను.

అది విని మువ్వురేక కంఠ్యముగా నాతండెప్పటికిరాఁగలఁడోయని తమకు ముందిడుమనిరి. ఆపె "సరే" యని లోనికిఁ గొంపోయి పీటలువేసి దయసేయుండని వియ్యాపు బంతికివరు ముందు ముగ్గులుదిద్ది విస్తళ్ళు వేసి పాత్రాభిఘారమొనర్చి వడ్డన ప్రారంభించెను. అపుడు వారాపెను సంబోధించి "నీవు వివస్త్రవై వడ్డింపఁగోరెదము. మాకోర్కి తీర్పుము. లేదేని మేము లేచిపోవుదు"మనిరి. అది శ్రుతంబైనంతనే వితాకుపడిన యాపతివ్రతామణి కొంతవడికిఁ దెప్పిఱి యిట్లు యోజించె: "ఏమో కాని వీరింబరికింపఁగా మహాపురుష లక్షణము లగపడుచున్నవి. వీరియందో కారుణికత్వము పొడకట్టుచున్నది. ఇట్టి వీరలిగి యరిగిన నీభవనము నిర్జన వనమై తీఱునాయె. నామనమో నిష్కళంకము గదా కాముఁడుకాదు వాని యబ్బమాత్రము నన్నేమి సేయఁగలఁడు? ఇంతకు నాపతి తపోబలము లేదా? ఇంక వెఱపేల?" యని కృతనిశ్చయయై 'యిదిగో యటులనే వడ్డింపఁబోవుచున్నాను. యథేష్టంబుగా భుజించెదరుగావుత' మని మహానసంబుం జొచ్చి యచ్చోటనిట్లు ధ్యానించె:

'తే. పతియెదైవమటను పతి ♦ వ్రతనయేని।
మదికిఁ గుదిరికయొదవఁద ♦ త్పదములాన।

నీయతిథులందు శిశుభావ ♦ మే యొసఁగుత।
నత్రిమునిసతి కగుత గా♦యత్రిసాక్షి!'

యని భర్తృపదాంభోజంబుల నిజహృన్నీరజంబున ననుసంధించుకొనుచుఁ దాఁగట్టుకొన్న పుట్టంబటఁ బెట్టి తదేకధ్యానంబుతో నాసతీతిలకంబు వడ్డింపరాఁగా నేమి చెప్పుదు? అహా! యాజగదంబ యొల్లించె నట్లయ్యె. ఆదివ్యులేతెంచిన మువ్వురును బువ్వానెసవని మవ్వంపు పవ్వాలై యుండిరి. ఆయవ్వయు వారింగని నంత నివ్వెఱపడి చేతనున్న పాత్ర జారవిడిచెను. కొంతవడికిఁ దెలివిఁగని పొరాడి కనికరముగల్గఁ గనికరించు నాకసుఁగందులఁ బ్రిసువట్టుల దరిం జేర్చి మురిపెంబుచూపఁ మఱిమఱి ముద్దులాడెను. అకొమ్మచేకొని వారాఁ కొనిరనికొనునంతలో నాయమ కదురుగదుర స్తన్య స్రావమొందవె. అపుడాకూనల నొకనివెనుక నొక్కనిఁగాఁగొని చనుగుడిపె.

తే. బమ్మకనయము సృజియించు ♦ బడలి కడఁగ।
భువనము ల్కుక్షిఁ గలహారి ♦ పొందెఁ దృప్తి।
నగ్గికెన పంచముఖరుద్రుఁ ♦ డందె శాంతి।
పాలుత్రావించె నాసాధ్వి ♦ భాగ్యమేమొ!॥

తే. ఏముగురుమూర్తులందన్న ♦ నే మఖములో।
యామువ్వురె యత్రిసతిదుగ్ధ ♦ మానితనియఁ।
దెలివలకుఁ బోవ ననసూయ ♦ తెలిచెఁ ద్రోవ।
పతిని కొలిచెడి సతికి నే ♦ వ్రతములేల?

అహో! యిట్టి మూర్తిత్రియ మాతృతాగరిమంబు నందిన గరిత మఱొక్కరిత నీభువనత్రయంబునఁ గాలత్రయంబునం గానముగదా. ఇదెల్లనయ్యనఘులగు ననసూయాత్రిమహాశయుల ప్రభావంబయ్యె. అంతనాబింబాధరయయ్యంభోజసంభవాదులగు శిశులీలలారఁగ జోలపాడుచు సప్తస్వరంబుల మేళవించుచు గానలోలుర బాలుర డోలలూఁచుచుండె. ఇట్టుండఁ గృతాహ్నికులగు నత్రిమహర్షులు పొలమునుండి మెలమెల్లఁగ నిలుసేరిరి.

తే. శ్రుతిహితంబయ్యె గాన సం ♦ గతుల గతుల।
శ్రుతిహితంబయ్యెఁగాన సం ♦ గతుల గతుల।
నతుల కుతుకముగాఁగందు ♦ రతివముందు।
నతులిఁ కధికముగాఁగందు ♦ లతిథు లందు॥

ఈయపూర్వపత్రిజంగని యక్కజపడి సాదరమతినడిగి నిజ దారనివేదితార్థంబు లెఱింగిన యాద్విజోత్తముండు వారజాలని తెలిసి భజింపఁదొడఁగె.

ఆదంపతుల భక్తిభావంబులకలరిన యామహానుభావులు శిశుభావంబువీడి యథారూపప్రాదుర్భావం బొదవించుకొని నిమీలితాత్ములగు నవ్వారిని సంభావించి దీవించెదమేమికావలెననిరి. అంతసతీపేరితుఁడగుసత్రి యాత్రితయంబ నిజపుత్త్రిలయి ప్రాప్తిం పనర్థించె. వారుమువ్వురు నొక్కమాఱుగా నట్లయాఁగావుతమని పురోహితంబువల్కి తిరోహితులైరి. కాలక్రమంబున ననసూయా గర్భంబునఁ దత్తదంశములొందిన మూగురుదయించిరి. వారికిఁ జంద్రశ్రీదత్తదుర్వాసాంకములిడి పొంకముగా నయ్యన్నులమిన్న పెనుచుచుండె. వా రుపనీతులై విద్యాబుద్ధులంగఱచి పెద్దలైన వెనుక సందాచంద్ర దుర్వాసులెటకేనేగ నిజమాత్రనుజ్ఞ వడయఁ బోయిరి. దుర్వాసుండు తన పర్యటనాభిలాషం దెలిపినంత సుధాకరుండిట్లను: "అమ్మా! నేనిఁక నిజమండలంబుం జేరఁగోరుదు. అనుదినము భవత్పాద సందర్శనంబుంగూర్చి మోదంబుఁగలిగింప వలయు. త్రిమూర్తి స్వరూపుండగు మన శ్రీదత్తుఁడు తప్పక నీవద్దనుండఁగలఁడు. ఆతఁడే సర్వవ్యాపి. నీయిచ్ఛవచ్చినయట్లు మెలఁగువాఁడు. ఆతఁడు నీవద్దనుండ నీకిఁక మా యెడబాపువలని క్లేశమక్కఱలే" దనవుడు నాజననయిత్రి యనుమతింప వారిద్దరు పనివినిరి. త్రిగుణాత్మకుండగు దత్తుండొక్కండ గృహము వీడక యుండెను. పరమమగు గురుపరంపరామాలం బీతనిఁగా నెఱుంగుమని సిద్ధుండు సాధకునకు బోధింప నాతండిట్లడిగె: "యోగి

రాజా! దత్తాత్రేయావతార వివరము సెలవిచ్చితిరి. మఱి యాతనికి వేఱొక జని యెట్లు కలిగెనో నాయెడఁ గృపతోడ వినిపించి త్రిమూర్త్యవతార లీలావిశేషములం దెలుపవలయు" ననియె. ఇట్లర్థింప నట్లకావింతునని యాశుద్ధబుద్ధి శిష్యోద్ధరణోద్దేశంబున సావధానుండవగుమని యక్కథావిధానంబు బోధింపనయ్యె.

జ్ఞానకాండము — ౫ దళము.

సిద్ధుం డిట్లుపక్రమించె: నామధారకా! చెప్పెదవినుము. శ్రీమన్నారాయణుండు భక్తవత్సలుండౌట సంబరీష సంరక్షణార్థమయి నానా వేషధరుండు కావలసెనని మున్ను చెప్పియుంటిని గదా. అవియె మత్స్యాది దశావతారములు. అందందయ్యధోక్షజుండు సాధుసంరక్షణమును దుష్టశిక్షణమునొనర్చి ధర్మసంస్థాపన మొనర్చియుండె. ద్వాపరాంతమునఁ గలిదోష సమాక్రాంతులగు బ్రాహ్మణులు జ్ఞానసంపదతొలఁగి దురాచారాదుల మెలఁగుచుందురని యెంచి ధర్మసంరక్షణోద్యోగులైన యమ్మహాభాగులు శ్రీగురునాథులు మున్నుభగీరథ ప్రేరణమున జాహ్నవి యట్లు భూమిపైనవతరించిరి. అల దత్తాత్రేయుండు భక్తియోగాన్వితయగు నొక బ్రాహ్మణికి స్తనపాయియయ్యె. అదెట్లనిన మున్నొకప్పుడు పూర్వదేశమునఁగల పీఠికాపురాఖ్యనగరమున నద్వంశసంజాతుఁడొక విప్రుఁడుండె. అతని దాపస్తంబసూత్రము. పేరు రాజశర్మ. అతఁడు విధ్యుక్త కర్మాచరణ తత్పరుఁడు. సుమతియను తద్దార సదాచారయు నిజభర్తృపాదసేవక విచారయు గణనీయగుణగణప్రచారయుఁ బరోపకారాగ్రసంచారయునయి భక్తిను నతిథి సత్కారాదులు నెఱపుచుండె.

ఒకనాఁడు వారియింటఁ బైతృకము జరుగవలసి యుండె. అట్టియెడనచ్చోటికిఁ దానతిథియై దత్తాత్రేయుండరుగుదెంచె. ఆ యిల్లాలు శ్రాద్ధనిర్వాహణముకంటె ముందుగానె యాతనికి భిక్ష మిడెను. దాన నత్తలిరుఁబోఁడిబత్తినిగుర్తించినదత్తుండుమూర్తిత్రయాత్మక నిజస్వరూపంబు నాతమ్మికంటికి దర్శనమొసఁగెను.

ఆభాగ్యశాలినియు వారిపాదంబుల కెఱఁగెను. అమ్మహాతుఁడిమ్మహిళామణి నభీష్టమేమని యడిగెను. ఆయమ వినయావనతవదనయయి యిట్లువిన్నవించెః ‘జగన్నాయకా! విశ్వకారకుండవు సర్వకారకుండవు నీవకాదే? ఓహో పురాణపురుషా! భక్తవత్సలా!

ఆ. మునువిభీషణుండు ♦ నినుఁజేరరాజ్యంబు ।
నట్లధ్రువునకిడితి ♦ వచలపదము ।
భువనవిదితకీర్తి ♦ వవనిభక్తులఁబ్రోవఁ ।
గాదె యవతరింతు ♦ వాదయాబ్ధి ॥

ఈదీనురాలియెడ మీరుఁ గృపకలదేని మన్మనంబునంగల యడియాస లుడిగింపుమయ్యా, ఓయనాథనాథా! జగజ్జీవనా! మీరట్లనుగ్రహించితంగాని యీమీపాద జీవనజంబులవీడ’ నని సాష్టాంగప్రణామంబుఁగావించెను. అంతనయ్యత్రిపుత్త్రిం డామెను బ్రేమమైనుద్ధరించి, ‘తల్లీ! నీవేదికోరిన నది తీరుపసంసిద్ధుఁడనై యుండ నడియాసలనికోనేమిటికి? సందేహింపక నీమనోవాంఛితమేమియో చెప్పుము. తప్పక సమకూర్తు’ ననియె. అందులకాసువ్రత యిట్లను: ‘బాబూ! ‘తల్లీ’ యనుమీసంబోధనము నాయెడ సార్థకము గావింపవలయునని నాకోర్కె. నాకింతలో పుట్టిగిట్టిరి. కనులుఁ గాళులు లేనివారై యేయిద్దఱో దక్కిరి. సౌభాగ్యుఁడగు సుతుం డొక్కఁడైన లేఁడయ్యె. దురపిల్లఁజేయు మొఱకుపిల్ల లుండి యేమి? లేకేమి? సత్సూనుండు లేనిమనుగడవ్యర్థము. దీర్ఘాయువు శ్రీమంతుఁడు జ్ఞానవంతుఁడు జగద్వంద్యుండునగు భవాదృశ పుత్త్రరత్నమొక్కఁడు కలిగినఁగదా జన్మము సఫలముగాఁ గల్గును. అట్టిభాగ్యమునకై యపేక్షించుదాన’ ననెను. శ్రీదత్తుండు నాపైదలికిఁ దాదృశుండగు గాదిలిసుతునిచ్చి మోదంబుఁగూర్చిన దాన సజ్జనానేక ఖేదాపనోదంబు గాఁదగ్గదేశకాయుని నిజానుమోదంబుఁదెలుప నిట్లనియె: ‘పాఱుతా! నీకోరినట్లొప్పారుత. నీకిఁకఁ గల్గుకుమారకుండు కులోద్ధారకుండును దైన్యపాపతాపాప

వించికొనఁ గల్గునని యు భావిఫలంబులం దెలిపిరి. అదివిని తలిదండ్రులలరి యీసుతుఁడు శ్రీగురుప్రసాద జనితుండయని నిశ్చయించుకొనిరి. ఆబాలకుని పాదంబులంగల గుఱుతులంబట్టి శ్రీపాదుండనిరి. ఆపట్టియు గుణశాలియు బుద్ధిమంతుండుననఁ బెంపొందుచుండె. ఎనిమిదవయేఁట నుపనయనము జరిగె. అంతనావటువు బ్రహ్మచర్యము యథావిధిగా నడపుచు స్వాధ్యాయాధ్యయనంబును శాస్త్రాభ్యసనంబును గావించుచుండెను. ఆతనిపాఠశక్తియు ధారణాపటిమంబును దెలిసినవారబ్బురపడి యాతని నవతారపురుషునిఁగా నెంచుచుండిరి.

ఆతండు పిన్నటనే ధర్మశాస్త్రవేత్తృతయందును వేదాంత భాష్య పరిచయంబునను దుదకఖిలాగమార్థ జ్ఞానంబునను నద్వితీయుండని ప్రఖ్యాతివడసె. అట్లు సర్వకలాపరిపూర్ణుండౌతఁడు నయ్యౌవనుని నాతని తలిదండ్రులు పరిణీతుంగావింపఁ జూచుచుండ నాతండు వారిని వారింప నిట్లనియె: 'జననీ జనకులారా! సాభివందనముగా నేనొనరించు మనవి వినుండు. నాకొక ప్రాయాలిం గట్ట నాలోచించి నన్నుఁదంటాలఁ బెట్టకుఁడు. విరతివనితాసంగ ముదితుండనే కాని యొకమానిసినొల్లువాఁడంగాను. ఎల్లనారుల నాతల్లి తీరుగ భావింతు. ప్రవృత్తి పరాఙ్ముఖుండనై బ్రహ్మచర్యనిష్ఠతోఁ దపంబొనరించి యోగిని గావలయునని తక్క వేఱొక్కఁడేదియుం గోరనివాఁడను. ఈమీశ్రీపాదునిఁ గృతార్థుఁ గని యుత్తరమార్గానుయాయిం గాఁజెల్లు శ్రీవల్లభునిఁగా నెఱుంగుఁడ' డనెను. అదివిన్నంతనే యందామెలనాఁగ కలనాఁటి దత్తునినుడులు జ్ఞప్తికిరాఁగా నిజపుత్త్రుఁడా దత్తుండయనియు నాతండన్నదానికి భిన్నంబుగాఁ బల్కిన బన్నంబుగాఁ గలదనియు నెంచి మెల్లఁగ ననుసరించి తనయార్తిం దెలిపి చూచి యాపైనాతని యభీష్టమెట్లో యట్లు పోనీయవలెనని నిశ్చయించుకొనియె. అందులకయి యచ్చెలువయు మచ్చికమయి నిజసుతుదగ్గఱకువచ్చినదయి జాలిగొలుపఁ 'దండ్రీ! నీవేకదా మాకుసంరక్షకుఁడవని నమ్మియున్న మాకు

నాశాభంగము కలిగింపకుమోయీ' యని కన్నీటిని గార్చుచు గాలి తాఁకున గూలిగిన యరఁటికరణి ధరణిఁ బవ్వాలెను. అట్లు పడి యున్న తల్లిని మెల్లఁగ లేవనెత్తి బాష్పంబులందుడిచి కౌఁగిలించి యిట్లనుఁ: 'అమ్మా! దుఃఖింపకుము. ఏమికోరిన నదినమకూర్తును. మదికి నెమ్మది చిక్కించుకొని చక్కఁగాఁ గూర్చుండు' మని వేఁడెను. సుమతియుఁ దనతనయు ననునయవాక్యంబులచే మదికుదిరి గద్గద మృదుపుగా నిట్లు బలికెను: 'నాయనా! నిన్నుఁ గన్నా దాఁగఁ గన్నంత నాకుముందున్న తుందుడుకెల్ల నడఁగెనోయీ, కన్నతండ్రీ! నీవు మా పేదఱికము డిపి పెద్దతనమున మమ్మాదుకొందువని కదా మాయాస? కాటికిఁ గాళ్ళసాఁచుకొని యున్న ముదుసళ్ళము మాకిఁక నున్న పిన్నవాండ్రలో నొకఁడు కుంటి వేఱొకఁడు గ్రుడ్డియునాయె. పిన్నఁగనున్న కన్నాకవగు పిన్నాతఁడు దిక్కుండడు కదా. ఇట్టి నీవు సన్యాసులలోఁ జేరిన మాకిఁక దిక్కెవ్వ'రని యడిగెను. ఆమాటలు మనమున నాటుకొన్నంతనే యాలీలాపూరుషుండు దయార్ద్రహృదయుండై నిజాగ్రజన్ములదెస సాధు దృష్టిని గృపావృష్టింగురిపించెను.

తే. క్షణములోనఁ బంగ్వంధు లీ • క్షణమువలన |
సుపదనేత్రిత విఖ్యాత • శుద్ధతఁగని |
రినుము సొన్నగఁ బరుసము • టిన పరుసునఁ |
గృపణతయుఁబోవు శ్రీదత్త • కృపనుగన్న.

అట్లఖిలార్థ సంపన్నతంగన్న యాపిన్నవాండ్రు వయసునఁ బిన్నయయ్యు గుణంబుల మిన్నయైన కవిత్వాది యోగవిద్యాగరిష్ఠులై సంఘటితాగ్రజాపూర్వైశ్వర్య సహితులై సాష్టాంగప్రణాములగాఁ దెలిసి వినతులైరి. శ్రీపాదుండు నయ్యన్నలయెడఁ బ్రసన్నుండయి వారలఁ గవుఁగలించుకొని సంతత జననీజనకానంద దాయకులుగా నైహికాముష్మిక సుఖంబులెల్ల ననుభవించి తుదకుఁ గైవల్యం బందునట్లనుగ్రహించె. అంత నాతఁడు తనతల్లిదెసకుఁ దిరిగి

యిట్లను: 'అమ్మా! యీయిర్వురు కొమరులవల్ల నీకానందంబ గనుము. వీరు వేదోక్తపరిపూర్ణాయుస్సంపదతోఁ జెంపొం దురు. మీరో పెక్కండ్రుమనుమలఁ గందురు. ఇంకనీవంగడము ధనధాన్యసంపదలు కొఱవడవు. యశస్సంపదయుఁ దిరమైయు డెడిని. ఏతద్వంశజులెల్లరు వేదశాస్త్రపారగులయ్యెదరు. కావు నీవిఁక వెతనంద నక్కఱలేదుగదా. ఇఁక నాకు సెలవీయవలయు కాదనవలదు. సాధువులకు దీక్షప్రసాదింప నుత్తరమార్గంబున బోవుదు' నని యాయమకు సాష్టాంగదండప్రణామం బాచరిం భక్తిభావనుండై తదనుజ్ఞవడసి తత్క్షణంబ వెడలి లీలావిహార బుగా ముందల్ల యోగిసద్మంబగు జగత్పద్మంబుం దొట్టి బద కాదులన్నెట్టి నరనారాయణ ప్రముఖుల నందర్శించి యచ్చట్యమె లంగల యాత్మీయభక్తులఁ బరామర్శించి దీక్షాదానంబొనర మనోగమనంబునంజనుచుఁ దుదకు గోకర్ణంబునన్నిలిచె' నని సిద్ధవచస్సుధారసం బల్ల నామధారకున కెంతయుఁ గర్ణపేయం బగుచుండె.

## జ్ఞానకాండము — ఓదశము.

అపుడు నామధారకుండు శ్రీపాద శ్రీవల్లభులు భూమండలం బెల్లఁ దిరుగనేలయనియుఁ బెక్కుమహాక్షేత్రంబులుండ నవెల్ల వీడి గోకర్ణంబుననే వసింపనేమిటికనియుఁ బ్రశ్నించె. అందులకు సిద్ధుండు సహర్షంబుగా రమ్యగురు లీలావివరణం బగునట్లు బోధిం పందొడంగె: 'దత్తాత్రేయుండు తాను త్రిమూర్త్యాత్మకుండగు తీర్థస్వరూపుండయ్యుఁ దీర్థాటన మిషంబున భక్తుల దరిఁ జేర్పఁ దిరుగుచుండును. శంకరరూపుండగు తన నెలవు గోకర్ణంబయని ప్రథితంబుగావింప నటనిలిచెనుమ్మా. నిరుపమమగు తత్క్షేత్రమహా త్మ్యంబు నీకుఁ జెప్పెదనాకర్ణింపుము. అచ్చోటఁ బెక్కురిష్టార్థము లంబడసిరి. అచ్చోట శ్రీవిఘ్ననాజ్ఞనుగాని గణేశుండు మహాబలేశ్వ రాఖ్య శివలింగప్రతిష్ఠ కావించియుండె' ననవిని శిష్యుం డిట్లుల

త్తి నిజోరు ద్వయి నూఁది పండ్లు బిగియం ♦ దీంద్రంబుగా నూఁపి కొ
మ్మసి కుప్పించుచు లేవనెత్తె దిశల ♦ న్హాహారవం బారఁగన్.

మ. ప్రళయంబో యనఁ దల్లడిల్లె నిఖిల ♦ స్వర్లోక పాతాళము
ల్చలనంబందె సశైలకాననముగా ♦ సర్వంసహాచక్రము
ల్లలనాడెన్ గనకాచలం బమరులె ♦ ల్లన్ గూర్మభోగీశ్వరు
ల్తలఁకుం జెందగణంబు లుల్కనుము భీతంజేసె దైత్యోద్ధతిన్.

అట్టియెడ నా సర్వమంగళ నిజేశు నీశు నుద్దేశించి, 'యీయమంగళం బేమి? కైలాసము కూలనున్నదా? సభాగారము లూఁగులాడుచున్నవే అఖిల దిక్పాలరగు మీకెనిబ్బర మేల? అయ్యో! యింతఁ జూచెదరేమి? ప్రతిక్రియకై యోజింపరే! దయఁ జూడరే! కృపాభావా! మహాదేవా!' యని మొఱవెట్టుకొన్న నయ్యాశానుండదరక ముదితకు బదులిడెను: 'హైమవతీ! యింత భృతిపీడదేమే? మన భక్తుఁడు పౌలస్త్యుఁ డాడుకొనుచున్నాఁడు. అంతకంటె మఱేమి యుపద్రవము లేదులే. భయపడకు' మనెను. అందులకా శర్వాణి యిట్లనె: 'పాపమా గీర్వాణుల దెసఁ జూడుండి. వాని చెర్లాట మాడుటలో నెంతకీడు మూడనున్నదో! వెక్కసపాటున దిక్కుకాన కొక్కుమ్మడిం గ్రిక్కిఱిల్లుచున్నారే!' యని ప్రక్కనున్న యింతి యాచక్కటిం జూచి నక్కఱకంఠుండు చక్కన నవ్వుచు నొక్కక్షణంబునఁ దన డాకేల నొక వ్రేలిని కైలాసంబునం గీలించినంత.

కం. డొంకిన గిరిక్రింద నసురుఁ
డంకిలిఁ గొని జంకుచు శర ♦ ణాగతరక్షా!
కంకువకుం గంకుఁ డవగు
శంకర! కింకరుఁడఁ బ్రోవు ♦ చచ్చితి ననుచున్.

మున్ను మిన్ను మన్నుఁ గనకున్నను దానాఁడున్నఁ దా ప్రపన్నుండైన తన్నక్తంచరాధీశు నెడఁ గిన్నరేశాప్తుండు దయఁ గొన్నవాఁడై కన్నత్తఱి వానిం దిన్నఁగాఁ బోనిచ్చెను. అట్టుకుతి

శేఖరుచే విడువంబడినయాతఁడు గయ్యాడ నడతడఁబడ నీవలికివచ్చి తలలు తడవికొనియె. అంతఁ దన మనుగడ కేడుగడయైన మృదునెడఁ గృతజ్ఞుఁడయి ముఖరనిజముఖ దశకంబు వీణానుగంబుగా స్వరసప్తక మిళితంబుగ షట్త్రింశద్రాగిణీ రాగషట్క సహితంబగు హృదయంగమ గానాలాపంబులతో నన్నటరాజశేఖరుం దనిపె. గిరితత్తడిరౌతుఁ డాదైత్యేశ్వరు భక్తికిం జిత్తంబలరఁ గృపాయత్తుండై సాక్షాత్కరించి వరమడుగు మనుటయు నపుడా పూర్వదేవుం డిట్లుపలికెడి: "శర్వా! కలుములబోటి నాకు బోనకత్తె. నవనిధులు నాయాజ్ఞ కడుగుదాఁటకయుండు. చతుర్ముఖుండు నావద్దఁ బంచాంగము చదువు బాపనయ్య. ముప్పదిమూడుకోట్ల దేవతలును నాయానతికి బద్ధులుసుమ్మి. శుచియే మాకగు చాఁకలి. జముఁడైనను నాసెలవందకుండ నెరిని ద్రుంచంపఁడు. నాయనుంగు సోదరుఁడు కుంభకర్ణుఁడు. కొమరుఁడింద్రజిత్తు. దివౌకసులకు రాకాసులకు మెట్టరాని వారాశిమధ్యస్థిత మొకదీవిమాకావు. వేలుపుగిడ్డి నే మా దొడ్డిలోఁ గట్టించి యుంచినాఁడ. నాకాయుఃపరిమితి వేయికోట్లయేండ్లవఱకున్నది. కంచుకాగడాలుపెట్టి వెదకినను నాకీడు దీటువ్వరుం గానరారు. నాయోగ్యతలు నీవెఱుంగనివికావు. ఇఁక నాయిఁరాకడయున్నదో మాతల్లిగారికొఱకు కైలాసముం గొంపోవుదమనియే కాని మఱేమి లేదు. నేనట్లు తీసికొనిపోయిన నావె మిమ్ముఁ బూజించునాఁడు. మీరిప్పటికైనఁ గృపాలోకంబున నాయీకోర్కె తీర్పుఁ' డని హస్తవింశతికంబున నమోవాకంబుగాఁ బల్కె. ఆ లంకాధిపు శంకరుండిట్లు సంతృప్తిపఱచు: "మంచిది. నీగానంబున కానందించితి. కాన నెవ్వరికివందరాని యాత్మలింగంబే నీకుఁ బ్రసాదించువాఁడను. నీకిఁకఁ గైలాసంబుతోఁ బని యేమి? అస్మత్ప్రీతి లింగార్చనంబుననే సకలార్థంబులుం జేకూరు. త్రిసంధ్యములనను రుద్రాభిషేక పూర్వకముగాఁ బూజించుచు షష్ట్యుత్తరశత షడక్షర మహామంత్ర జపంబుఁ గావించు

చుండుము. మూడేండ్లు విడువక యీదీక్ష నడపినయెడ నెఱవే అని కోర్కెయుండదు. ఇది యది యని యేమి? తుదకునీవే నా రూపమైయుండెదవు. ఈయాత్మలింగమున్నదిఁ గాలుండు గీలుండు మూలకుంబాఱు. తత్సందర్శనమాత్రమునఁ బాపంబులెల్లరూపు మాయు. నీవుగమనింపవలసినదొక్కటి. ఇదిమాత్రము నీవులంక కుంజేరుదనుకఁ ద్రోవలో నెక్కడను గ్రింద నుంపఁ గూడదు. వర్షత్రయ సంపూజనమున నీవే మహేశ్వరుండ వౌటయుం నీలం కయే కైలాసంబు కాఁగల్గు"నని యది ప్రసాదించినంత నయ్యం దారి వీరుండు సాంద్రభక్తి యుక్తుండయి చంద్రశేఖరు చరణ యుగళంబునకు సాష్టాంగ దండ ప్రణామంబులర్పి తిరిగి లంక త్రోవఁబట్టె.

రావణుండు మళ్ళినంత మునముల్లయతి యదివిని యింద్రు పాలికిం బరుగునం బోయి యిట్లు మందలించెః "ఏమోయీ! నీకొంపమోవుచుండఁ గాలిమీఁదఁ గాలూని కూరుచుందువే. ఇంక నీయైశ్వర్యమెల్ల రావణాధీనమౌచున్నదితెమ్ము. వాఁడు శివునివల్లఁ బ్రాణలింగముంగొని చిరాయువగుచున్నాఁడు. మూడేండ్లది పూజించినఁ దనరూపే కలుగుననియు వానికింకఁ జావుండదనియు లంకయే కైలాసమగుననియు వానికి శంభుండు చెప్పినాఁడు. ఇట్టి వరంబులొందిన యావిశుద్ధద్వేషుండు పట్టఁ బగ్గాలు లేకుండ నెగురు చుఁ బోవుచున్నాఁడు. వాఁడు జయించిన త్రిదశుల కింక మోక్ష మెక్కడిది? ఇంక నారందలు తత్కృపంగన రంభోర్వశ్యాదులం గానకలుగాఁ గొనిపోయి లంకలో నాతనికరిగాఁబ్రత్తుల పడియుండ వలసినదేసుమ్మను నారదోక్తుల కదరిన పురుహూతుం డమరసహి తుండై యమ్మునివర చరణంబులకెఱఁగి తమగతి యింక నేమని యడిగె. అందుల కా జడదారి త్వరగాఁబోయి యాసురజ్యేష్ఠుని పాదములమీఁదఁ బడినన్నైనఁ దెగువున్న వత్తెడఁ గూడవలయు ననియెను. అంతటఁ దన్మౌనిపురస్సరుండై పురందరుండు సత్య లోకంబునకరిగి జరిగినదెల్ల నయ్యరవిందోదరున కెఱింగించి కర్త

వ్యంబుఁ దెల్పుమనిరి. అదివిని యాపెదవేలు పసురాంతకు దెసకుం బోవుఁడు వెరవ్రాహింతమనెను. అంతవారు మువ్వురు వైకుంఠంబున కేగి యాశంబాపున కీకరించి దెల్పిరి: "శౌరీ! శివ ప్రాణలింగంబుం గొని సింగారులంకాధిపు భంగంబొందించినం గాని మనంగలవారము కాము. ముందుంగ వాఁడే లింగంబు గొనున్నాఁడు. అపుడు వానినడంగం జేయ నెవ్వరికిం గాకుండును. ఇప్పటికే వాని చెఱసాలలెల్ల సురవారములతో నిండియున్నవి. ముప్పై ముందింకేమి వాటిల్లనున్నదో! హరీ! యాయుపాయంబొరిఁ గొనఁ ద్వరపడవలయును. నీవు ధరణి నవతరించినం గాని వీలులే దనన్నడు నీయనర్ఘంబు సంఘటిల్ల నేమిటికని కినిసిన వనమాలి డిగ్గన లేచి రజతాద్రిపై డిగ్గ యయ్యగ్గి కంటికిట్లను: "కృత్తివాసా! మత్తాసుర మస్తభంజను బుత్రిసేసిన మాత్రన ప్రాణలింగం బిత్తువే? కౄరరాక్షసున కియ్య. నాఁడాగడంబునఁ దాగడించిన బాన వాలులు గాసినొందు టెఱుంగవా? దుష్టుల కిష్టంబులం గూర్చుటెల్ల గాలిమేకలకుం బాలువోసిన లీలనే గదా. చూడు. వానికిపు డమరత్వంబు ప్రాప్తింపనున్నదాయు. స్వర్గంబు వానికేనము కానున్నే' యని వగచుచున్న వైకుంఠపతికి శ్రీకంఠుం డిట్లను 'అరవిందలోచనా! నీ పల్కినమాట నిజమే. వాఁడు నిజ శిరంబుల ప్రీతిచ్చి యందు ప్రీతియగా సమర్చి స్వరయుక్తంబుగా సామగానంబొనర్చె. తద్భక్తిచేఁ బరవశుండ నైతి. నేనేమియు? మాఁగారియు నారీతిని సమ్మోహితాంతరంగ్ర లింగంబొసంగ నంగీకరించె. అపుడాతని చేతఁ జిక్కితి' ననెను. శ్రీధరుం డందులకు: "భూధరేశ! యెద్దనను నీవు బాధకంబులగు వరము లిచ్చి నన్ను వేధింపక మానవుగదా. దుష్టులు మదోన్మత్తులు నయి దేవ బ్రాహ్మణ పీడాకరులైన భయంకరాసుర సైనికు ప్రబలినంతనే వారిఁ బరిమార్ప నేనేదో రూపున నాపుడమిపైఁ బుట్టవలసి వచ్చుచుండును. అంటు నదయినది. ఇంతవఱకు నీవా లింగమిచ్చి యుంతనేపై యుండును? వాఁడెప్పటికింక లంకకుఁ జేర

యుండఁడుగదా." యని యడిగెను. సాంబుఁడైదు గడియల కంటె మించ లేదనెను.

వెంటనే వెన్నుండు ప్రొద్దుఁజూడవచ్చినట్టీవలికి వచ్చి కను సైగసేసి నారదుంబిల్చి చెవిలో నిట్లనెను: "చూచితివా? వాఁడదె కొంపోవుచున్నాఁడు. నీవిప్పుడె చయ్యన వానిని త్రోవలోనే కలిసికొని యేవో మాటలతోఁ గొంత కాలయాపనము సేయవలయు. వాఁడిప్పటికింక నింటికిఁ జేరి యుండఁడులే. ఎట్టు యిన సూర్యాస్తమయ మగునంతవఱకుఁ గడపఁగలుగుదువేని వాఁడయ్యెడ సంధ్యావందనమునకయి కూరుచుండక మానఁడు. అప్పుడైన నేదో భంగపాటు సంభవింపక పోదు. చూతము. త్వరగాఁ బొ"మ్మనెను. అది విన్నంతనె యామునియు గృహాభిముఖుండై నడచుచున్న యారాక్షసేశ్వరుని మార్గమధ్యంబునం గలియ మనోవేగంబునం బోయెను. అంత నామాయలమారి శౌరి విఘ్నకారియగు హేరంబునిఁ బురికొల్పనెంచి యాతనిం జేరఁబిలిచి యిట్లను: "ఓయీ! రావణుఁడు నిన్ను లెక్కసేయ కున్నాఁడు. ఇప్పుడే మీనాయనను మెప్పించి ప్రాణలింగ మపహరించికొని పోవుచున్నాఁడు. కాఁబట్టి నీవిప్పుడే విప్రా ర్భకరూపమున వానిం గలిసికొని యేదేనొక విధముగా వానిని వంచింపవలెను. సాయంసంధ్యాకాలమున వాఁడర్ఘ్య ప్రదాన మొనర్చును. అది మార్గమధ్యమునఁ గావింపఁజేయ వలయును మన నారదుండు నడచినాఁడు. ఎట్లయినను వాఁడు శివాజ్ఞ మీఱి యాలింగము క్రిందను బెట్టఁడు. మూత్రోత్సర్గాది కాల ములందు దానిని దనచేతను ధరింపఁడు. అట్టియెడ నీవు వానికి ముందు నమ్మకము గలుగఁజేసి వాని చేతిలోనుండి యెట్టయిన సద్దానిని సేకరించి పరాకునఁబెట్టి నట్టాలింగమును భూమిపై నిడుము. ఇఁక నది కదలదు. ఈపని నీవల్లఁగావలె" నన్నం తనే "సరే" యని యాబొజ్జవేలుపు తనకు "దారిబత్తెమిత్తు" వని యడిగెను. మాధవుండు నాతఁడు కోరినట్టిఁ బంచఖాద్య

మోదక లడ్డుకాదిక భక్ష్యానేకంబులను నారికేళేక్షు ఖాదిమాంద్రి
ఫలవారంబులం గట్టి యిచ్చినంత వటువేషధారిగాను వెనఁగ[illegible]
వెడలె. ముందరిగిన దేవర్షి రావణునిఁ ద్రోవలోనే కలిసికొని
'యెక్కడినుండి రాక' యనవుడు నాఁడాతండు నడచినదెల్ల వాని
కి నివేదించెను. నారదుండది విని వానితో నిట్లనియె: "ఆహా!
యిప్పుడు గదా నీయదృష్టము పండినది. ఏది? కొంచెము
కూర్చుండి నాకాలింగ మొక్కమాఱు చూపవా?" యని యడి
గెను. ఆనిశాచరుండట్లయిన సందేహముతోనే కొంతమెదాక
నుత్తరీయము క్రిందనుండి యద్దాని నగపఱచె. అదిచూచి దైత్యే
శుం గూర్చుండఁజేసి యామౌనియు నిట్లభివర్ణింపఁ దొడఁగె:
"దీని పూర్వోత్తర వివరము నే నెఱుఁగుదులే. ఇదియెట్టిదో నీకుఁ
జెప్పెద సావధానుండవై వినుము. మున్నొకప్పుడొక మూఁడు
కొమ్ముల మొకము గాలాగ్ని సదృశాకారముతో నడవియందు
సంచరించుచుండెను. దానికి మహిషాది వన్యమృగములెల్ల
నాహారములగుచుండెను. ఒకనాఁడు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు
వేటకయ్యటవి కేగిరి. వారద్దానిం బరిమార్చి దాని మెదడు చీల్చి
కొని తినిరి. పిదప దాని కొమ్ములక్రిందనున్న మూఁడు లింగాలు
తలకొక్కటిగాఁ దీసికొనిరి. వానిని వారు ప్రాణతుల్యముగా
సంరక్షించుకొనుచుందురు. అందు శివుఁడందినది యిది. దీని
మహాత్మ్య చెప్పెద. శ్రద్ధగా వినుము. మూఁడేండ్లదనుక యి[illegible]
నెవ్వఁడు పూజించినను దద్భక్తుండు యీశానుండగు. ఇది
యెచ్చోటనున్న నచ్చోటె కైలాసంబయ్యెడిని. లింగధారణము
నను మూర్తిత్రయ మాహాత్మ్య మొదవెడిని. ఇందింకొక్క-
మహాత్మ్యము గూడఁ గలదు. చెప్పెద విను" మనుచు నింకేమియో
ప్రసంగింపఁబోవ దశకంధరుం "డిఁకవిన నవకాశము లేదు. నేను
త్వరగా లంకకుఁబోవలయు. పోని" మ్మనియెను. అపుడా తపసి
"మీఁదాగు నట్టులే" దనికొని "నైనను సంధ్యాకాలమైనదా యె.
నీవో బహుళ వేదాధ్యయన పరుఁడవయితివి. విధివిహిత సత్కాల

సంధ్యావందన ముడిగి యెట్లు నడతువయ్యా! ఏమో నా కెందులకు? నా సంధ్యాకృత్యములను నేను నిర్వర్తించుకొనఁదగదా" మని కూర్చుండెను.

ఇంతలో వర్ణివేషధరుండగు వర్ణాత్మజుండు వానిదృష్టిపథంబున సమిత్తులం ద్రుంచుకొనుచున్నట్లు గనఁబడెను. ఆతనిం జూచినంత రావణుండు తనలో నిట్లనుకొనును: 'సంధ్యావందనము మానిన వ్రతభంగమగునాయె. త్రిసంధ్యాకాలంబున నీలింగంబు నేను బట్టుకొని యుండనుగూడదు. క్రిందను బెట్టనుగూడదాయె. ఈ సింధుతీరంబునం దిరుగాడుచున్న వటువుచేతి కిది యొకింత సేపుంచి నిత్యకర్మంబు నెఱవేర్చికొనదంగాక. ఈ బ్రహ్మచారి విశ్వాసఘాతుకుఁడు కాఁగూడదని నిశ్చయించుకొని వానిని సమీపించెను. వాఁడీపదితలల వానినిజూచి బెదరినోయనునట్లు పాఱఁ దొడఁగె. రావణుఁడు వానికభయ దానమొసఁగి మృదువుగా 'నాయనా! నీవెవ్వఁడవో నీతలిదండ్రులెవరో చెప్పుమా' యని యడిగె. అందుల కాగోఁచిబాఁతఁ డిట్లను: 'ఏమయ్యా! మా తలిదండ్రులెవరని యడుగుదురే. వారెవ్వరైన మీకేమి? మీవద్ద నేనేమైన నప్పుఁగొన వచ్చితినా?' యనుచు రావణుఁడు వాని చేతులు పట్టుకొని 'కాదోయీ' మిత్రభావమునఁ బృచ్ఛసేసితి' ననియె. అపుడావటుఁ డిట్లు చెప్పె: 'మా నాయన పేరు శంకరయ్య. ఆయన తలవెండ్రుకలు జడలుకట్టి యుండును. ఒంటిబూడిద పూసికొని రుద్రాక్షమాలికలు వేసికొని యింటింటి కుపాదానమునకుఁ బోవుచుండును. మాయమ్మగారిపేరో 'ఉమ'. సరిగాని యెందులకో యీపుట్టు పూర్వోత్తరములెల్ల నడుగుచున్నారు. నేనో చిన్నవాఁడను. మిమ్ముఁజూడ నాకు భయమగుచున్నది. వదలుఁడు. నా చేయి వదలుఁడు. నేనింటికిఁ బోవలెనను. పాప మా రావణుఁడదివిని వీఁడెవఁడో బీదబాఁపని కొడుకనికొని వాని కిట్లాసఁగొలిపె: 'అబ్బాయీ! మీ నాయన యడిగినాని తినువాఁడాయె. పాపము. నీకుఁ గడుపునిండ నన్నమైన నుండదుగాఁబోలు.

దనచేతఁ గలలింగమును నేలమీఁదనుంచెను. పుష్పవృష్టి కురిసె. రావణుండు నర్ఘ్యప్రదానానంతరమున వెనుకకుఁ దిరిగివచ్చి లింగము క్రింద నుండుటఁజూచి యాకొంటెపిల్లగాఁడు బుద్ధిపూర్వకముగ నట్లొనర్చెనని వానితుంటరితనమునకు వగచి పదినోళ్లతోఁ బడదిట్టుచువానిఁగొట్టఁబోఁగా వాఁడేడ్చుచు 'నిరపరాధిని నన్నుఁ బట్టుకొని కొట్టవచ్చుచున్నావా? మానాన్నతోఁ జెప్పెదనుండు' మని పాఱిపోయెను. అంత రావణుండు వంగి లింగముం గైకొనఁ బోయెను. ముందొకచేతఁ బిదప రెండుచేతుల నిట్లు తుదకాదోర్బలుండు తనయిరువది కరములతో నూఁపి పెకలింతమన్న నాతని తరము కాదయ్యె.

విసిగి యసురుండు వసుంధర కంపింపఁ దనశిరస్సునేఁ బడ బాదికొనియె. అలనాఁటినుండి యాలింగమును మహాబలేశ్వర మనియుఁ దన్నిపీడనంబున గోకర్ణాకృతి నొందిన యాప్రదేశమును గోకర్ణమనియు ననఁజొచ్చిరి. రావణుండటఁ దపం బాచరించి వరములందెను. అప్పటినుండి దేవతలు కూడ నటవసించుచుండిరి. ఇట్లాక్షేత్ర మాహాత్మ్యము స్కాందంబునఁ జెప్పంబడి యున్న' దని సిద్ధుండు వివరించె.

## జ్ఞానకాండము — ౭ దళము.

నామధారకుండు 'గోకర్ణంబున నెవరెవరు వరములఁ బడసిరో యార్యావర్తమునఁగల యితరతీర్థములెల్ల విడిచి శ్రీపాదులు గోకర్ణంబుననే నిలువనేమిటికో సాకల్యంబుగనాకర్ణింపఁ జేయుఁడు. సద్గురు భక్తులకెల్లఁ దత్తీర్థమాహాత్మ్యంబు శ్రోతవ్యంబకాదె' యనవుడు సిద్ధుండిట్లు చెప్పందొడంగె: "మున్నిక్ష్వాకువంశమునఁ బరాక్రమసంపన్నుఁడును ధార్మికాగ్రేసరుండును దయాశాలియు నగు మిత్రసహుండను భూజాని తేజరిల్లె. అతఁడొకనాఁడు క్రూరమృగానేక శరణ్యంబగు నరణ్యంబున వేఁటాడఁబోయి పెక్కులు వ్యాఘ్రాదికంబుల నుక్కడంచె. అయ్యెడ భీకరాకారు నొక్కరక్కసుం బొడగని యాగ్రహమ్మునఁ బెక్కమ్ముల

నొక్కమృగిం గురిపించి చక్కాడె. వాఁడసువుల విడుచుఁ దన గతికి వగచు నిజానుజాని నెలుగెత్తి తనను బాధించిన వాని నెట్లైన మడియింపఁ గోరెద' ననుచు మృతినొందెను. పిదపఁ దదనుజన్ముండగు మాయావి నరరూపము ధరించి భూపుని ననుసరించి యాతని కొలువునఁ జేరి యానుకూల్యముఁ బడయునడఁగి మడఁగి చరింపఁజొచ్చెను. నాఁటి మృగయావిహారంబు ముగిసిన వెనుక సపరివారుండయి రాజేంద్రుండు తిరిగి నిజపురంబునం జేరెను. ఆకైతవ వేషధారియుం జేరి యూడిగంబులు సలుపుచుండె. ఇట్లుండ నొకట మిత్రసహుండు పైతృకంబు నిర్వర్తింప వలసె. అందులకై వసిష్ఠాదులు నిమంత్రితులైరి. అట్టియెడ నాతఁడు పాచకపనువుల నెఱప నీకపటసేవకు నియోగించెను. వాఁడును వల్లెయని యేరెఱుఁగకుండ మోసపుచ్చి నరమాంసము వండించెను. వడ్డింపఁబోఁగా శ్రేష్ఠుండగు వసిష్ఠుండది నరమాంసంబని తెలిసికొని కోపించి నృపతిం గని యట్టి యస్పృశ్యపదార్థ మిడి నందున బ్రహ్మరాక్షసుండ వయ్యెదవుగావుత మని శపించెను. ఏపాపమెఱుంగండగుట నరేంద్రుండు నందులకలిగి యకారణముగాఁ దనను శపించినందునఁ దాను బ్రతిశాపంబిడెదనని జలాంజలి వట్టెను. ఆసమయమున దమయంతి యను తన రాజ్ఞీమణి వారింప నూఁడిల్లి పుడిసిటఁగల నీరము జారవిడిచెను. అట్టి కలుషితజలము చింది నిజపాదంబులం బడియె. దాన నాతండు కల్మాషపాదాభిధానుండగు బ్రహ్మరక్కసుండు గానయ్యె. అంత నాదమయంతిమతల్లి యామునితల్లజు పాదంబులంబడి "స్వామీ ! మీబిడ్డను గదా. కరుణించి నన్నుద్ధరింపఁ బతిభిక్ష పెట్టుగే" యని దీనంబుగా నడుగ మునివరుండు శాంతుండై దివ్యదృష్టివల్ల యథార్థం బెఱింగి తానన్న దమోఘంబుగానఁ బండ్రెండేండ్లు మాత్ర మట్లుండి పిదప యథాస్థితిం గనుఁగావుతమని యనుగ్రహించి నిజాశ్రమంబునకుం బోయెను. అట్లు రాజును రాక్షసుఁడై కర్మవశమున మహాటవిం జేరి పసుల మానిసుల మెక్కఁదొడఁగెను.

ఇట్లుండ నొకనాఁడవ్వన మార్గంబునఁ బోవుచున్న విప్రదంపతులం గని క్షిప్రంబుగాఁ దాఁ బోయి వ్యాఘ్రంబు వృషంబునట్లుదా మగవాని బిగియఁగొనియె. అపుడు విభీత చేతసయగు నాపుణ్యాంగన యశ్రులు రాల్చుచు నిట్లు మొఱవెట్టెను. "బాబూ! నాకుంకుమ నిల్పుము. నా పెనిమిటిని విడువుము. నా ప్రాణేశ్వరు నందుకంటె నా ప్రాణమునందు నాకెక్కుడు తీపిలేదు. వారిని రక్షించి నాదుఃఖంబు వారింపుము. లేదా ముందు నన్నుఁ గబళింపుము. సతులకుఁ బతిలేని బ్రతుకు వితకాదే! కటాక్షించి పతిభిక్ష వెట్టుమా. అయ్యో! నన్నుఁ గని దిక్కుమాలిన దాసిం జేయకుమా. ఇక్కొమరుఁ బ్రాయంపువానిఁ జక్కని నాయెకిమీని మిక్కిలిగాఁ జదివినవాని నీయొక్కని భక్షింపక నాకు దక్కించి తేని జగమెల్ల రక్షించినంత పుణ్యంబు నీకు దక్కెడిని. ఓయి శెట్టీ! నన్ను నీపట్టినిగా భావించి దీవింపుమా. మాకడుపునఁ బుట్టినవారికి నీనామంబుఁ బెట్టికొందుము, తండ్రీ!" యని పగి పరి విధములఁ బరివేదనంబొనర్చినను బాపమాతెఱఁగెఱుఁగమి నామె పలుకులం జెవులం జొరనీయక యామె యేలికం జీలిచి నాలికసాచి వక్షంబు చీలిచివైచె. తన కట్టెదుట నాఁడట్టె తనపెనిమిటిని పొట్టఁ బెట్టుటంగనిన యాబోటికి బిట్టేడ్చుచు నాహంతకు శాపోపహతుం గావించునదయి యిట్లనియె: "ఓయీ! అర్కవంశజుఁడవైన యవనీపతివైయు శాపవశంబున దిక్కుమాలిన రక్కసివైతివి. పండ్రెండేండ్లిట్లు పడియుండిన పిదపఁ బునస్సంప్రాప్త రాజ్యుండవు కానేర్పడియుండె. ఇఁక నట్టియెడ నాకుందు నీవంద నీసుందరిపొందుఁ గోరెదేని నీవప్పుడ మ్రిందెదు గాఁవుత. అట్లే బ్రహ్మహత్యాపాతకఫలం బనుభవించి తీరెద' వని యాపతివ్రతామణి శపించుచుఁ గ్రిందఁ జిందఱవందఱగాఁ బడియున్న యాయస్థులఁ బ్రోవుసేసి చితిఁ బేర్చి యందగ్నిచేర్చి కేల్మోడ్చి యమ్మాలికన్ముమ్మాఱు చుట్టుఁదిరిగి యందుఱికెను.

మారునకు నీకిట్టి వనవాసశ్రమం బేల? ఇంత చింతాకులిత చేత సుండవు కానేమిటికో తెల్పు'మనిరి. క్షితిపతి యతిపతికిట్లనియె: 'విధివశంబున ముందు విప్రశాపంబు వంత బ్రహ్మహత్యా మహాపాపంబును నాకు దాపరించె. అందులకెంతయుఁ జిత్తంబునం గుంది ప్రాయశ్చిత్తంబునొంది యందందు ముక్కలిడి సంతత మహాదానాచరణంబునం దవిలినను గ్రిందుకొనియున్న దురితంబింకని వార్యంబుగా ననుసరించుచున్నది. కాని నేఁటికి నాజన్మంబు సఫలతనంద నైనదని యెంచుచున్నాను. మహానుభావులరగు దేవరవారి పాదాంభోజ ద్వితయంబు దృష్టంబుగాని నదృష్టంబు కల్మి నింకఁ గష్టంబులెల్లఁ బాయుట స్పష్టంబకాదే?' యని సాష్టాంగ దండప్రణామంబొనర్చె. కృపాసింధువగు ఋషిసింధురండున్నై నిట్లనియె: 'ఓయీ! నీకింక జంకువాయుఁగాత. శంకరుండ నిశ్శంకంబుగా నీయంకిలిఁ బాపుఁగాత. బ్రహ్మహత్యాఘ వినాశకంబగు నొక తీర్థరాజంబుఁ దాసృజించుట మృత్యుంజయుండు స్తుత్యుండు కానయ్యె. అది పావనగోకర్ణాఖ్యంబు. స్మరణమాత్రంబున నిట్టి మహాఘంబులెల్ల దగ్ధంబులు కానయ్యెడి. సదాశివుండటనుంట ముదావహంబు. ఆపట్టున స్నాటినఁ గ్రలానసానంబునను మందర కందరంబునం గందుమే ఫలం బదిపొందనౌను. అది కహ్లార గౌరీశవసతి స్థలంబు. తత్తీర్థంబు తేజంబునఁ దృణీకృత ఘుస్రికరసహస్రికంబు. నిశీధినులం దగ్గిరివెల్లు లంధకారబంధురత డిండఁజేయు నరవిందబంధుని కిరణసందోహంబునందలి యోజస్సు బీజంబగునోజ నయ్యైతీర్థంబులు పాపలేశాకనోదన క్షమంబులో పెల్ల స్తోత్రపాత్రంబగు క్షేత్రోత్తమంబు గోకర్ణం బొక్కటి యాధాత్రీస్థలంబున వెలయుటనుమ్ము. తత్స్మరణమాత్రం బఖిలాఘను విస్రంసకంబన నిఁకఁ దద్దర్శనంబు బ్రహ్మహత్యాసహస్ర ధ్వంసకంబౌట కబ్బురంబె? ఇంద్రోపేంద్ర విరించ్యాదులటఁ దపంబొనరించి యిష్టార్థంబులందిరి. ఏలనఁ దత్ప్రదేశ ప్రభావంబున నచ్చోటఁ గావించిన జపదానాదులవలని ఫలంబు లక్షగుణంబై

యేర్పడుచుండు. బ్రహ్మవిష్ణు పురందరాదులే యుటువసించి సిద్ధిఁ గనిరన నింకనచ్చోటి మహత్త్వంబెచ్చని పిచ్చలింపఁ బెచ్చుగ నుచ్చరింపవలయునా? అది హరిహరాదులకుఁ గరివదనునిచే నిరవారం జేయనైన సాక్షాత్కైలాసంబనుమ్ము. మహాబలేశుండన సాక్షాన్మహేశుండుగా నెఱుంగుము. ఆపవిత్ర క్షేత్రంబు విధిమధుసూదనాద్యఖిల బుధానీకావసథంబు. సూర్యచంద్ర వసుప్రభృతులటఁ బూర్వద్వారంబు నివాసంబుగా నమ్మహాబలేశు నుపాసించుచుందురు. యమాగ్ని చిత్రగుప్తులును రుద్రపితృగణంబులును దక్షిణ ద్వారంబునను సురలున్వరుణముఖ్యులుం బశ్చిమద్వారంబునను గుబేరుండును భద్రకాళియు నుత్తరద్వారంబునను వసించి భసితాంగ నిషేవణంబుఁ గావించుచుంద్రు. అట్లైనపైన నంతటఁ దిరుగుచు విశ్వావసు చిత్రసేనాది గంధర్వవారంబు మనోహరగీతాదికంబులతోడను గశ్యపాత్రి వసిష్ఠాది మునిప్రవరానీకంబు తపోనుష్ఠానంబునను నూర్వశీమేనకాఘృతాచీతిలోత్తమాద్యప్సరస్సమూహంబు చిత్రవిచిత్ర నర్తనంబులతోడను జంద్రకళాధరుఁ దన్పుచుండ్రు. జాబాలిశైలుని విశ్వామిత్రాదులు సిద్ధినందిన తావదియని సుప్రసిద్ధము. సనకాదులు నారదాదులు మరీచ్యాదులు సిద్ధులు సాధ్యులు మానులు యతులు బ్రహ్మచారులు వీరు వారననేల యెల్లరు నటఁగొలుచుచుంద్రు. అస్థిచర్మావశిష్టులుం దాపసులై యా జగదాధారు నర్చింపక మానరు. గంధర్వులుం బితరులు వసువులు విద్యాధరులును గిన్నరులు మున్నగువారెల్లరు మహాబలేశ్వర సందర్శనార్థులయి కలుమఱటఁ జేరుదురు. గుహ్యక కింపురుషులు శేషనాగాదులును భూతపిశాచ భేతాళాదులుఁ గూడ నట్లేచూడవచ్చుచుండ్రు. దివ్యభూషణ భూషితాంగులై దేవీదేవతావితానంబులుసూర్యసంకాశ విమానారూఢులై చేరుచుంద్రు. అందుఁ గొందఱు బ్రహ్మస్తోత్రంబు లొనర్చుచుందురు. మఱికొందఱు పాడుచుందురు. ఇంకఁగొందఱు నృత్యమ్ములు సల్పుచుందురు. ఇతరులీశానుఁ బూజించుచుందురు. ఎవ్వరెవ్వరి

డెందంబులందేయే వాంఛలున్న నవ్వెల్లఁ దత్సందర్శన మాత్రం
బున సిద్ధించుచుండెడి. అగస్త్యాదులగు మహర్షులును గామాదు
లగు దేవతలును బ్రియవ్రతాదులు రాజేంద్రులు నట నభీష్ట వర
ప్రదానంబులం బడసిరి. శిశుమారుండును భద్రకాళియుఁ ద్రిసంధ్య
మట నీశానుఁ బూజించుచుందురు. నైసర్గిక పరస్పర విరుద్ధభావం
బుల నొప్పు గరుడపన్నగాదు లచ్చోట నొండొంటి హింసింపఁ
బోవు. ఇంతయే కాదు. అప్రదేశమున లబ్ధాభీష్టులౌట రావణాది
క్రూరరాక్షసులును విభీషణుండును ననవరత శివార్చనంబులందగిలి
యొరులకు సేగిఁదలఁపరు. ఇవ్విధంబున వీరువారన నెల్లరు దేవ
దానవానీకంబు లయ్యీశానారాధనంబున నిష్టార్థంబు లందు
చున్నారు. అందఱు నట వారివారి పేరులతో లింగంబులను బ్రతి
ష్ఠించిరి. పెక్కురు పురుషార్థంబులందిరి. గణేశకార్తికేయాదులు
నజాండు నట నట్లు నూతనప్రతిష్ఠలఁ గావించిరి. ధర్మక్షేత్రపాలురు
దుర్గాశక్త్యాదులు వారివారి ననుసరించిరి. అందుచే నట నడుగడు
గున నొకలింగంబుం గనుచుందుము పెక్కులేల? అచ్చోటి
పాషాణంబులెల్ల నీశానులును నీటిపట్టులెల్లఁ దీర్థంబులుంగా నెంచం
గునది. శ్రీమహాబలేశలింగంబు కృతంబున సితంబును త్రేతను
రక్తంబును ద్వాపరంబునఁ బీతంబును గలింగృష్ణ వర్ణాత్మకంబు
నయ్యెడిని. సప్తపాతాళవ్యాప్త మహోన్నత స్థాణుస్వరూపం
బెల్లఁ గలికాలంబున మృదు సూక్ష్మాకారంబునం గానుపించు.
ఇట్టి మహాత్తరక్షేత్రం బీభరతఖండమునఁ బశ్చిమాంబుధి తీరం
బున విలసిల్లుచున్నది. నరున కట దురాచారభవంబులును బర
దారగమనాత్తంబులు బ్రహ్మహత్యాదితంబులునగు కిల్బిషంబు
లెల్ల డిల్లపోవ మోక్షంబనపేక్షితంబుగాఁ జేకూరు. ఎవ్వరైన
నేపుణ్యదివసంబుననైన నటనుండి భక్తితో నీశ్వరాభ్యర్చనం
బొనర్చినఁ దప్పక రుద్రలోకంబు నందుదురు. ఎప్పుడైన నెవఁడైన
గోకర్ణక్షేత్రంబునఁ దల్లింగంబున భక్తితో నొక బిల్వదళంబుం
చిన మాత్రన బ్రహ్మలోకావాప్తిఁగనును. ఇఁక నేపుణ్యాపురు

మం డైన రవీందు సౌమ్యవాసరంబులఁ బూర్ణిమాది పర్వదినంబు లం దట సింధుస్నానంబుఁ గావించి యీశునారాధించి పితృహోమ జపదాన బ్రాహ్మణభోజనాదులు సలుపునేని వానికగు ఫలంబింత యని నుడువ వశముఁ గా దను. పిత్రోక్త సంక్రాంతివ్యతీపాతంబులో నెడలను శివరాత్రులందును దదీశ్వర సంపూజనంబున ననంత పుణ్యంబు చేకూడెడి. మహాశివరాత్రినాఁ డచ్చోట బిల్వపత్రి పూజ సల్పిన ననల్పంబును త్రైలోక్య దుర్లభంబునగు మహా ఫలంబబ్బు. ఇట్టి మహాస్థలంబున మెట్టనివాఁడు గట్టేఁడియునఁ జెల్లు. తన్మాహాత్మ్యంబుఁ జెవినిడనివాఁడు కడుబధిరుఁడనుమ్ము. తత్సన్నిధి నుపవసించి జాగరంబొనర్చినవారి కపవర్గంబునకు మెట్టులు కన్నులఁ గట్టినట్టుండు. అట్టి గోకర్ణంబునకుం దూర్గంబుగాఁ బోయి యటఁ గల తీర్థసాంఖ్యంబులఁ గ్రమావగాహనాత సుచితఁబడసి మహా బలేశు నుపాసించేస నీవు చతుర్విధపురుషార్థంబు లచిరంబ పడయు దువు సు' మ్మని గౌతమర్షి పార్థివుం నుద్బోధించె.

అంత మిత్రసహుం డిట్లనియె: 'స్వామీ! నాయెడఁ దయ కొడవిన పేరిమిఁ గొలఁది గోకర్ణమాహాత్మ్యంబుఁ బ్రకటించి పలికితిరి. సరికాని యెంచరానంతటి మించిన పాపంబు నాయట్లు కావించిన వారెవ్వరైన మున్నిందు గోకర్ణేశ్వరు సేవించి తరించిరే? యది యుం చుక తెల్పి నన్నుద్ధరింపఁదగు' నా నృపతిమని విన్నవింప నాఁడేగన జేనికి మౌనియొసఁగె: 'అట్లయినఁ దన్మాహాత్మ్యంబింకఁ జెప్పెద వినుము. అక్కడ మహాపాతకంబులు రూపుమాయు ననుటకు నేన సాక్షిని. ఒకమాఘంబున మహాశివరాత్రినాఁడు నేనా క్షేత్రం బునకుం బోయితి. పెక్కండ్రు యాత్రికు లక్కడికి వచ్చిరి. మఱు నటి మధ్యాహ్నమున నేనొక చెట్టునీడను గూర్చుండియుంటి. అయ్యెడఁ గడుపుమాడి మోమువాడి వ్యాధిపీడితయగు నొకబడుగు డొక్కు కనుగానక తడవికొనుచు నడవలేక పడుచు లేచుచుఁ గాలు లీడుచుకొని మెట్టులో నెక్కుకొని వచ్చి యాచెట్టునీడం బడిపోయె. ఆచండాలి గండమాలోదర రోగవ్యధితయాట నెండకోర్వక

రొంపలెల్లఁ జీముగాఱఁ బాడుకంపు గొట్టుచున్నదై యుండె. కఫము కుత్తుకకడ్డుపడి నోటమాటరాక యటుఁబడియుండి కొంతవడికిఁ బ్రాణమువిడిచె. అప్పుడె యొకవిభావసు ప్రభాకరంబగు విమానం బచ్చోట నాకస్మికంబుగ డిగ్గె. అందు శూలఖట్వాంగధారులుం గిరీట కుండలాలంకారులునయి చంద్రునింబురుడించు నందంబు పొందువడు నిందుశేఖరదూతలందఱు నల్వురు వైమానికులు కానవైరి. అది గాంచినంత విస్మితాంతరంగుండనై వారటు రానేమిటికని యడుగఁ దామీశవముఁ గైలాసమునకుఁ గొంపోవ నేగుదెంచితిమనిరి. అది వినినంత నాకు మిక్కిలి విస్మితవాడనై. అంత వారి కేనిట్లంటిని: "శివదూతలారా! యేమిది? యీగవులు గొట్టుచున్న దిక్కుమాలిన మూటకిగనుండ చచ్చుపీనుంగేడ? విచిత్రంబుసువిరాజితంబు నవ్యతేజోమయంబు నగు నాదివ్యవిమానంబేడ? పవిత్రులరగు మీరిది స్పృశించి యందుంచుటేడ? ఎవఁడేని శునకము నందలమునెక్కించునా? ఇది పాపంపుఁ బుట్టువాఁడు. పశుమాంసాహారంబు మెక్కి పెరిఁగినాఁడు. దయాసత్యశౌచంబులు నల్లనివో తెల్లనివో యెఱుంగదయ్యె. సంతత జీవహింసాపరత్వమునఁ దపస్సాధనంబులకెల్ల దూరగురాలయ్యె. పంచాక్షరియా విని యెఱుఁగదు. శివలింగమా కని యెఱుఁగదు. తుదకుఁ దన్నామమ్మునైన స్మరించినది కాదయ్యె. శివరాత్ర్యుపోషణాదికము విశేషముగఁ జెప్పనేల? ఒకరికి దానమా తనకేమున్నదని చేయును? పర్వంబులఁ దీర్థస్నానంబులు వ్రతాచరణంబు లేనాఁడైన నెఱపియుండునా యనునది కలలోనివార్త. ఎన్ని జన్మముల మహాపాతకమో యిపుడిట్లయి మూర్తీభవించెననఁ బూయోద్గత దుర్గంధ దూషితాంగి యాయి నోటఁ బురువులు వడియున్న యీపాపిష్ఠకుష్ఠినిం గొనిపోయి కైలాసశైలంబు నెక్కించుటయా?" యని నేనడుగ వారు నవ్వు యిట్లు తత్పూర్వచరిత్రంబెల్ల వివరించిరి: "తొంటిపుట్టువున నీమె సౌమినీనామక విప్రకుమారియై యుండె. తజ్జనకుఁడు చక్కని

సక్కన్నియ కనురూపుండగు వరుండొక్కండు నేదిక్కున్ గాన రామిఁ గను చెక్కనపడెను. తుదకతండు వేసారి వివాహయోగ్య వయస్సు మీరుచున్నోయును వెంటనే నవడోగుమకు సాధారణ విప్ర కుమారునికిం దత్తునిచ్చి గృహసౌఖ్య కవిష్టుని భాగ్యాగ్రహాలంబు ప్రవర్తిల్లఁ జేసె. ఆ నవోఢ తన భర్తతో సౌ గాఁపురము సేయునేగ. దైవయోగంబున నా చిన్నదాని పెనిమిటి కొలంది దినాలలో నె స్వర్గతినందె. అట్టి దౌర్భాగ్యంబు ప్రాపించిన తమ గారాపుఁ బట్టిని పితరులు దుర్భర వేదనంబుతో నిజాగారంబునకుం గొంపోయిరి. యౌవనంబున నీమన నా కాముని కామంబడంచిలోలెసి దయ్యె. చాటున న్మాటున జారత్వంబుఁ బ్రారంభించె. పాపంబు గోపనీయంబు కామి నాన్యైవరికి దుశ్చారిత్రంబు బాగ్యవ్యాపించె. విషయానక్తయుం జలచిత్తయునగు తత్తాగుణి సింటనుంచి సహించు తన్మాతాపితల సబంధుమిత్రంబుగాఁ గూలు వెలివెట్టిరి. అంత దుశ్శీలతా కారింత నాకాంతం దలిదండ్రులు బలవంతముగా వెడలించి తాము విషపానంబు ప్రాయశ్చిత్తానంతరమున నాంతఃకలోఁ గించికొనఁగలిగిరి. ఇంక జంతువాసిన అంగరూటా లాపురంబున నేనొక చక్కని వైశ్య యువకునిఁ గని మోహించి వానితోఁ గాఁపురంబు సేయఁజొచ్చె.

తే॥ నారులాసెడరారయ ♦ జారిణులయి ।
బ్రాహ్మణులు హీనసేవను ♦ బాడగుదురు ।
నరపులునశింతు బ్రహ్మద ♦ ధనహతులన ।
యాతులు పతితులుగారె భో ♦ గతిలఁదగిరి ?

ఏమి చెప్పుదు నా కోమలికి మున్న సంతానంబుం గలిగె. క్రమముగా మధుమాసంబున మరగి ముగ్ధమున యాలోచించి తింబున కగునట్టుల్ల సంచరించుచుండె. అది యొక నాఁడు సైమలించిన దద్ద యూపుదూడం గని మేకయని భ్రాంతిఁ గొని దానిని ఖండించె. అంత దాని శిరము నోకయుట్టు నుంచి తన్మాంసమును వండికొనిలి నెను. మధుపానమత్త యగు

నమ్మత్తకాశిని యూరేయని గాఢనిద్రఁ జెంది మఱునటి వఱువాత
లేచి దూడను విడువఁబోయి చూడ నావుదూడ యుండుతావునఁ
జెల్లమేక యుండుటయు బ్రేలాడుచుట్టిప్ప నాదూడతల గానుపిం
చుటయు నైనంత లో నూహించి తానొడఁబెఱుఁగక కావించిన
మహాపాపకార్యంబున కెంతయుఁ జింతాక్రాంతస్వాంతయై శివ
శివ, పాపాత్మురాల నెంతటి పాతకంబునకు గొడిగట్టిన దాననైతి.
ఆహా! యజమానుఁడు కోపించునే! యేమి చేయుదు'నని ససంభ్ర
మంబుగా నాధేనువత్సపు శిరంబును దచ్చర్మాదికంబుం బూడిచి
పెట్టి తాఁబోరుగింటికరిగి మఱునాఁ డంతలోఁ బులిదానిని మ్రింగి
వైచెనని యెలుఁగెత్తి విటునెదుట నేడ్వఁదొడఁగె. ఇట్లా దురా
త్మురాలొనర్చిన పాతకంబులకు మితిలేదయ్యె. కొంతకాలమున
కాదుశ్చరితయుం దత్పితరులు గతించిరి. యమదూత లవ్వారిని
రౌరవాది నారకంబులకుం దారిచిరి' చిరంబట్టి దుస్తర యాత
నానుభవంబులైన పిమ్మట నావనిత గోవధమున కగుఫలముగా
మాదిగదై యీధరిత్రిపైఁ జనియించె. అన్నతంబులాడుట నంధు
రాలయ్యె. జారకర్మంబునం జేసి గళత్కుష్ఠ కానయ్యె. పసితన
మునఁ గన్నవారు విధులలోని యెంగిలియాకులందలి మెతుకుల
నేరి మెసవించిరి. ఇది యెదిగిన కొలఁది దీని యొడలెల్లఁ బుండ్లతో
నిండియుండె. బాల్యముననే తలిదండ్రులు తీఱిరి. అన్న లేవగించి
పాఱఁదోలుట దిక్కుగానక ల్లాడుచు మెల్లఁగఁ బురవీధులఁ దిరిపె
మెత్తి యెటులెట్టులో దినములు కడపుచుండెనే కాని కడుపునిండ
కుండె. ఆఁకొని పూర్వకర్మవశమునఁ గుష్ఠవ్యాకులితయై యిట్లు
బీదతికము వ్యాధిభరము నొండొంటి నతిక్రమింప గర్భాకృతి
నేండ్లతరబడిగ నురువేదన నొంది తుదకు ముదుగు కానయ్యె.
ఊరూర బాటసారికిఁ బడియుండి తీర్థంబోవువారి నెల్ల నొక
ముద్దయిడుండని కడుంగడు నడిగికొనుచుఁ బురాకృతాఘవిశేషం
బునఁ బిడిచెడైన దొరకమి బెడిదంపు వెడఁద యుడుగకుండె.
ఈశివరాత్రి కన్నిదెసలనుండి యాత్రికులు గోకర్ణక్షేత్రంబుం జేరి

వను జాగరణంబునను నుపాత్తంబగు పుణ్యంబే శతజన్మార్జిత పాప
ఫలంబుకన్న మిన్నయై శివానుగ్రహపాత్రంబు గానయ్యె. కాన
నాతండ దీనింగాని తేనాశతిచ్చె' నని వారు నాకుం జెప్పి యా
శవంబు నమృతసేకంబున దివ్యాకృతి నందించి నాకంటియెదుట
మింటికిం గొంపోయిరి. గోకర్ణ మాహాత్మ్యంబిట్టిది. రాజా!
నామాటవినుము. నీవట కేగిన మాత్రనే పూతుండవయి
మోక్షంబుఁగందు' వని గౌతమ బోధితుండయిన మిత్రసహుండా
క్షేత్రంబున కేగి వీతపాపుండు గానయ్యె. అంతటి పవిత్ర మహా
స్థలంబగుట శ్రీపాదుండట సుస్థిరుండయ్యె సుమ్మ.

జ్ఞానకాండము — ఏకాదశము.

నామధారకుండు సిద్ధున కిట్లను: "స్వామీ! గోకర్ణ మహి
మంబుఁ గర్ణపేయంబు గావించితిరి. సరియే. ఇఁక శ్రీపాదు
లచ్చోట నెంతకాలంబుండిరో యంతట నేమేమి గావించిరో వారి
చారిత్రంబు సాకల్యంబుగా నూఁకొనఁ జేయుదురు గావుత మని
మీకిదె మనవి" యనవుడు, సిద్ధుండును "చెప్పెద సావధానుం
డవై కూరుచుండు" మని యిట్లు ప్రారంభించె: శ్రీపాద శ్రీవల్లభు
లచ్చోట మూఁడేండ్లుండి యంత లోకానుగ్రహదృష్టితో శ్రీపర్వ
తంబునకుం జనిరి. "చరణం పవిత్రం వితత" మ్మని శ్రుతి
వల్కినట్లులే పాదంబులం జూచినమాత్రన జనులకు సర్వతీర్థ
దర్శనోదిత మహాఫలం బబ్బునట్టి శ్రీపాదుల దేశాటనంబున వారు
జంగమతీర్థ సదృశులైరనుట కబ్బురమా? వారాకొండపై నాల్గు
నెలలుండి నివృత్తి సంగమంబునఁ గృతస్నానులై యంత నాకురు
పురంబుం జేరిరి. అటఁగల శ్రీకృష్ణవేణీ తటినీవతంస మహి
మంబు నెన్న ముల్లోకంబుల నెనలేనిది. అది యిందిప్పుడు
పొందుపఱుపఁ బూనిన గ్రంథవిస్తరంబు గానోనని యించిన్మాత్ర
మిట సూచించివిడుతు. శ్రీపాదులట మెట్టిననాఁటినుండి తత్స్థల
మహత్త్వంబు రెట్టింపై యిపుడది 'కురుగండి' యను విఖ్యాత
నామంబు వడసి యున్నది. అచ్చట భక్తితో సేవించువారికిఁ

పుత్త్ర పౌత్త్ర సంపదయు ధనధాన్యాది సమృద్ధియుం గలుగుట నిస్సంశయంబనుటకంటె నిటవివరింతును. ముందించుక శ్రీపాద చారిత్రంబు వక్కాణెద. వేఱొక్కరూపుఁ దాల్చియు వారక్కడనే నెక్కొన మక్కువఁ గనిరి. అవతారాంతరగ్రహణ ప్రయోజనంబుం గూర్చి వివరించెద నిదివినుము: ఆయూర వేదశాస్త్ర పారగుండగు పాలుంజొక్కరుండుండె. అతని సతి పతిసేవానిరత. సుశీల. ఆమె సంబిక యని పిలుతురు. ప్రారబ్ధవశమున నా దంపతుల కొందఱు పుట్టిచచ్చిరి. అంతఁ బెక్కుతీర్థంబుల సేవించి మొక్కఁగా మొక్కఁగాఁ దుదకొక్కండు దక్కె. వాఁడు మందమతియయ్యె. అవైదికుఁ డిందఱు దైవతములకు మ్రొక్కినందుల కీమందుండా నాకుందనయుండౌటని తనమంద భాగ్యతకుం గుందుచు నెన్నోరీతుల శిక్షింపఁజూచి దానఁబ్రయోజనముఁగనక వేసరి నిజకులగౌరవం బడుగంటనున్నదే యని తన నెత్తిని బాదుకొని కొడుకని నోర్మొదఁదొడఁగె. అపుడాయిల్లాలు తనపిల్లవాని కడ్డుపోయి కనులనీరు పెట్టుకొని పెనిమిటితో నిట్టులను చుండె: 'ఎందఱో నష్టముకాఁగాఁ గష్టాన నీయొక్కఁడే దక్కెనాయె. వీనినైన నాలుగు కాలాలపాటు బ్రదుకనిండు. కాఁకపింటఁ బుట్టియు మనపాపంబున నీపాపం డిట్లయ్యెననికోపలనేకాని కొట్టినందువల్ల లాభ మేమి? అసలర్భకుండాయె. అట్టికొట్టినఁ బ్రాణాలు కడవట్టునేమో' యనుచు నిజాంగన తనచేతులు పట్టుకోఁగా పతి తమ ప్రారబ్ధ ఫలంబయని యాతఁ డూరకుండెడివాఁడు. కొంత కాలమున కావిప్రుండును వ్యాధిగ్రస్తుండై తుదకస్తమించెను. పాపమాబ్రాహ్మణి పతి గతప్రాణుండైనందుల కొంత వెతకంటె దారిద్ర్యదోషంబును మతిహీన సుతత్రాణంబును జతపడినందునఁ బట్టినగతి దుర్భరంబు కానయ్యె. తలచెడి యొకమూలఁబడి యుండనైన వీలుపడదయ్యె. వీరిని వారిని బిచ్చమడిగి జీవింప వలసె. నిరుపాధికుఁడగు నామొఱకునికిఁ బిల్లనిచ్చినవారులేరైరి. లోకులు వానింగని యిట్లనుచువచ్చిరి: 'ఓయీ! మొద్దబ్బాయీ!

సోమరివై కూర్చుండక యింటింట నీళ్లయినఁ బోసి బ్రదుక నేర్చితో రాదటరా? ఇంకెన్నాళ్లు మీయమ్మ తెచ్చిపెట్టునురా! మీయమ్మ చచ్చినవెనుక నీకు బిచ్చమెవ్వరు పెట్టుదురురా? నీమొగమెవ్వరు చూతురురా? ఓరీ! వట్టి కులపాంసనుఁడవై పోయితివిగదరా! కాకున్న నంతటి సదాచారసంపన్నుండగు వేదవేదాంగ పారంగతునికి సుతుండవైయు నింత బండవైపోయితివే. తండ్రికడుపు చెడఁ బుట్టిన దౌర్భాగ్యుండవై పితరుల నెల్ల నధోగతిపాలుసేయ నీవీవ్యర్థ జన్మమెత్తి భూమికి భారమగుటకంటెఁ బోయి యేగంగలోనైన మునుంగరాదటరా' యని జనులనంగా ననంగా విని దుఃఖితుండైన యామూర్ఖుఁడు తల్లితో నొకనాఁడిట్లనియె: 'అమ్మా! అందఱు నన్నుఁ దిట్టుచున్నారు. నీవో నన్నుఁ బోషింపలేక బాధనొందుచున్నావు. నేనిఁక బ్రదుకుటకంటెఁ జచ్చిన మేలని కోరుచున్నాను. నేనడవికిఁ బోవుదు'నని కొడుకన్నంతనే యాతల్లి కడుపుపగుల గొల్లున నేడ్చెను. అంత వంతతో ముందుకొడుకు వెనుకఁ దల్లియు నడచినడచి కృష్ణాతటినీ తటంబుం జేరిరి. అచ్చోట మునిశ్రీపాదులఁ గని వారిర్వురుం దత్పాదద్వయంబునం బడి విలపించి తుదకిట్లనిరి: 'స్వామీ! ప్రాణములు తీసికోఁగూడదని దైవము లోకులకు భారమగు మనుగడకన్న నిన్నదీమధ్యంబునం బడిపోవుట మేలని యిటకువచ్చితిమి. మాకు సద్గతిగలుగునట్లు మీరనుగ్రహించి యాజ్ఞయిచ్చినఁ గృతార్థతఁ గందుమని విని మిమ్మందులకై కోరుచున్నార'మనిరి. దయామయుండగు నామహామహుండు వారికప్పుడాత్మహత్య కావించుకోవలసినంతటి సంకట మేమికలిగెనో తెలుపుమనియె. ఆబ్రాహ్మణి యిట్లు బదులుపలికె: 'ఓభక్తవత్సలా! నావిన్నపమాలించి మమ్ముఁ బాలింపుఁడు. ఎన్నోతీర్థములసేవించి యెన్నో వ్రతాలాచరించి యెందఱో దేవతలంగొలిచిన మీఁదట నాకు నిలిచినవాఁడీబిడ్డఁడు. ఈయొక్కఁడు దుర్మతియై లోకనిందపాలయినాఁడు. మహానుభావా! మావారో వేదశాస్త్రములందుఁ బేరొందినవారు సుండి. అట్టి ప్రాజ్ఞవరుని కడుపునఁ బుట్టియు

వీఁడిట్లయినాఁడు. మహాత్మా! భవదీయ దయాపరిభావంబున ముందు భవంబునన్నైన సత్సంతానంబు గల్గఁగోరద. ఎన్ని జన్మాలకైన నిట్టి మొక్కుమాత్రము నాకీఁగవద్దు. బాబూ! ఏసుకృతలేశముననో దైన్యహార్తలరగు మీచరణంబులు మాకిపుడుదొరకె. ఇందనుకఁ గల నాయనుభవమున సంసారమెల్లఁ గష్టభూయిష్ఠము యని స్పష్టమయ్యె. సుఖమన్నదే యదృష్టమయ్యె. సత్సంతతి యెల్ల నష్టమయ్యె. నా సౌభాగ్యంబుకూడ భ్రష్టమయ్యె. అజాగళస్తన కల్పుండైనకష్టదుం డీనికృష్టుండు శేషించె. ఇంక నాయభీష్టార్థ ఫలదులరగు మీ శ్రీస్తాంఘ్రికంజ ద్వితయము నా యదృష్టలేశంబున నేటికి దృష్టంబు కానైనందులకు భావిజన్మంబుననేని సత్పుత్త్రోదయంబు బొడమంగావలె. మహాప్రభూ! అందఱు వందనముల నందికొనఁదగినవారిం దనయునొందు నుపాయం బీవందారు భక్తురాలికిం దెలుపందగు. నాకుంగల వాసనాశేషం బియ్యదియ.

తే॥ కులము చెడఁబుట్టు దుర్మతు ♦ లొక్కఁడుకు లేల?
భవ్యచరితుండు మహితభ ♦ వాదృశుండు
చాలునొక్కండ యిహపర ♦ సాధకుండు
ముందుముందట్టి కందు నేఁ ♦ గందుననుఁడి.

యనుచు శ్రీపాదు పాదంబులం బడిసంత మేసరంబగు నాదరంబున నాదయామయుం డిట్లనుగ్రహించె: "తల్లీ! గోప్యంబగు నొక వ్రతంబుగలదు. తదాచరణంబున శిశ్వగారాధనంబుఁ గావింతువేని మాన్య నందానియింట నరవింగాక్షుండు నందనుండై యానంద సంధాయకుండైనట్లి భావిభవంబున భవప్రసాదంబున నీకు సత్పుత్త్రుండు ప్రభవించెడి" ననియె. అది విని యావిప్రాంగన యామహాత్ము నిట్లు ప్రశ్నచేసె. "ఆర్యా! గోప్యంబని తాము సెలవిచ్చిన యాశివపూజావిధానం బెట్లు తెలియునయ్యె? ఎవరెందెట్లిప్పు డా వ్రతము నలిపిరి? సదయులరై

విదితంబుఁ గావించిన నేను నయ్యది విధివిహితంబుగా ముదము తోడఁ జేయుదు" ననుచుఁ దత్పాదాబ్జంబులంబడి వేడుకొండె.

అపుడు శ్రీపాదులు, "అమ్మా! అగోచాంగన శనిప్రదోషంబున శివారాధన విధానంబుఁ దెలిసి సలిపెనని స్కాందమునఁ గలదనిరి. అంబికయు "నిదేదో విచిత్రంబు నశ్రుతంబుననికొని ప్రదోషేశార్చనంబుననా కృష్ణజననము? అట్లయిన నేను నది యనుసరించిన మాత్ర నంతటి భాగ్యంబు గల్గునా? ఇంతకుఁ దదర్చావిధానం బెయ్యది?" యని తిరిగి ప్రశ్నింపఁ దత్పురాణోక్తగాథ యిట్లుద్బోధితంబు కానయ్యె: "ఒకానొకప్పుడు పవిత్రంబగు నుజ్జయినీ నగరంబున నొక విచిత్రకథ జరిగె. అదేశన నటఁ జంద్రసేనాభిధానుండగు ధార్మికోత్తముండు రాజై యుండె. అతనికి మణిభద్రాఖ్యుం డొకమిత్రుఁడుండె. అతండు శివభక్తుండయి సంతత మహాలింగార్చనైక దీక్షం బరఁగి పరమేశ్వరుఁ బ్రసన్నుం గావించుకొని కోటిసూర్య ప్రకాశంబున నొప్పు చింతామణిం బడసె. ఆమణి నాతండు నిజకంఠాభరణంబుగా ధరించుచుండె. తన్మణి ప్రభావంబు వాచాతీతంబుగా నొప్పె. తత్తేజః ప్రసారమాత్రంబుననే లోహంబు సువర్ణంబుగాఁ జొచ్చె. దానిని ధరించినవారు నిజమనంబుల నెద్దానిం దలంచిన నద్దియగా చుండె. తన్మహిమంబుం గూర్చి వినఁగల్గిన పెక్కురు భూపాలురు కొందఱు స్నేహమిషంబునను మఱికొందఱు కౌతుకంబునను నింకఁగొందఱు బలాత్కారంబునను నితరులు మూల్యంబునకుం గైకొనఁ జూచిరి. కాని యెవ్విధంబున నాతండది వీడమిని వారు పోరియైనఁ జూఱకొందుమని బెదరువెట్టిరి. ఆతం డేదియు సరకుసేయమిఁ గొందఱా రాజ్యమును ముట్టడింప ససైన్యముగా వెడలుచుండిరి.

అట్టియెడ నొకనాఁడు శనిత్రయోదశి కానయ్యె. నాఁటి ప్రదోషకాలమునఁ జంద్రసేనుండు మణిభద్ర సహితుండై విధివిహితముగా మహాకాళేశ లింగారాధనముఁ గావించె. అపు

నచ్చోటి గోపాలబాలకు లాపూజావిధానముం గనిరి. అది చూడఁ దామునట్లు పూజసలుప మనసైనందునఁ బఱుగిడి వారి యిండ్లముంగిట రాలతో నొక బొమ్మదేవళము నర్పాడ యమర్చి కొనిరి. అందు నడుమ నొక పొత్తరముం బాతిరి. అంతఁ బత్తిరిం బూవులం గొనితెచ్చి దానిన త్తినిబెట్టి యున్నిసిస్లు నైవేద్యము వెట్టుచుండిరి. కౌతుకంబున వారుండఁ దన్మాతలా ప్రేత లాతఱింజేరి వారి వారి బిడ్డలఁ దిండ్లకై యిండ్లకుం గొంపోయిరి. అందొక్క గోపబాలకుండు మాత్రము బత్తిం దదేకాయత్త చిత్తుండై యచ్చోటఁ బాయకుండె. వానిం బిలువ వరలవచ్చిన యాపిల్లవాని తల్లియా గొల్లత చెల్లక వాని వీపుపై బాది, "యేమిరా తిండివేళ మించఁగా నీయపరరాత్రి యందీ చీఁకటిలోఁబడి యేమి చేయుచున్నావురా? ఇఁకనైన లేరా" య్మ న్నను వాఁడు లేవకున్నందున మిక్కిలి కోపించినదయి వాఁడు ముందుంచుకొని పూజించు నారాతిని జేతంగొని గిరగిరఁద్రిప్పి యావలఁ బాఱవైచి వెడలిపోయెను. పాప మాపిన్నవాఁడు తన పూజయెల్ల భంగియయ్యెనే యని బిగ్గరగా నేడ్చి శివలింగ స్వరూపంబునే ధ్యానించుచు సమూర్ఛనొందె. అట్లు తనకై ప్రాణంబులు వీడనున్న వాని నాగొల్లపిల్లవానిం దెలిసి యుల్లవిరా పాత్యుండు సాక్షాత్కరించెను. క్షణమాత్రంబున నయ్యంగణంబున నింగినంటెడి గోపురంబుం గల్గి నాలయంబు నందుఁ గోటి సూర్య ప్రభంగ్రాలు శివలింగంబు నేర్పడె. మూర్ఛఁదేరిన బాలుండది కని నివ్వెఱపడె. అంత నితాంతసంతోషాక్రాంత స్వాంతుండా సుమాకాంతుండు తనమేనితోఁ బటఁ బ్రాదుర్భవించి యాబుడుతనిఁ దనతొడపై నిడికొని బుగ్గలుపుడుకుచుఁ బుడుకుఁ దొడుకునై సెడఁధం గలకోర్కి లడుగు మిత్తుననియె. అది విని యావృథుకం డంజలి ఘటించి కొనిటు వచించె: "స్వామీ! ముందు మాయమ్మ మీరెంతఁ గోపిత యపచారమునకుఁ గోపింపక కృపఁజూడుం డనవృథు దయాంబుధియగు సాంబుండు శ్రీ

మీఱి నిట్లను: "బిడ్డా! నీతల్లి చెడ్డదైనను దొడ్డదగు ప్రదోష పూజం జూచెఁగాన నాపె ముందు జన్మమందు వెన్నునికిం గన్న తల్లి కానైయున్నది సుమ్ము. ఇఁక నీవో తత్పూజ సల్పినవాఁడ వౌట నీమనంబున నేదెప్పుడు తలంచిన నది యప్పుడె తీఱెడిని. నీవిఁక సుఖంబుండుము. నీవల్ల నీకులమెల్లఁ బవిత్రింబయ్యె" ననుచు సదాశివుండు మదాకరుండుగ వరప్రదానంబు గావించి నిజ పదారవిందంబుల కాసుదారకుండు ప్రొక్కుచుండఁ దిరోహితుండు కానయ్యె.

లోకులెల్ల రాకాంతి తిరస్కృతార్కబింబంబగు శంభులింగంబుయొక్క దీప్తి కచ్చెరువడిరి. పెక్కేల? ఆరతినంబుకై పోరవచ్చిన భూరమణులు జంకువొడమ నాపావన పురవరంబున మిత్రుండు రాత్రులందుంగాచుచుండుం గావలయునని కొని దోషంబులేనిచోట ద్వేషంబు వాసి మెలఁగుటయు శ్రేయంబుగా నెంచి యింద్రసేను సాంద్రానురాగంబున సందర్శించి పోవుదుమని దౌత్యంబు నడపిరి. ఆరాజేంద్రుండు నంపుల కియ్యకొని నెయ్యంబుమీఱ వారిం గొనిపోయి గౌరవించె. అట్టయెడ జరిగిన సుహృత్సల్లాపంబులలో వారాతని "రాత్రివేళ భాస్కరుం డిటఁ బ్రకాశింప నెట్లుసంఘటిల్లె?" నని ప్రశ్నించిరి. అపుడా కౌతుకాన్వితులగు భూతలేశులంగొని చంద్రసేనుఁ డభినవ నవరత్న ఖచితాలయంబు సందర్శింపంబోయి యందలి శివలింగంబుం గనఁగలిగె. వారాగోపాలబాలువలనఁ గలవృత్తంబెల్ల నెఱింగి హర్ష పూరితులయి వానిని బహూకరించి యెవరితోవను వారేఁగిరి. అంతఁ జంద్రసేనునకును శాత్రవులవలని భయంబుడిగె. ఇదెల్లఁ బ్రదోషపూజాఫలంబ సుమ్ము.

ఇఁక శైవాగ్రేసరుండై యమహాత్తవరుండైన యాగోపార్భకుం డవుడింటికిఁబోయి తనతల్లి కిట్లను: "అమ్మా! ముందు జన్మమున నీకడుపున విష్ణుమూర్తిని గందువమ్మా. ఈశ్వరుండు ప్రసన్నుండయి యట్లు వరంబిచ్చెసుమ్ము. నీవాసర్పిన యప:

రాధము క్షమింపఁగోరితిని. అతఁడట్లయని నాకింక వరంబులిచ్చె"
నని యాపె యచ్చెరువడఁ జెచ్చెర నివేదించెనమ్ము. పరమేశ్వ
రుండె సాక్షాత్కరింప నింకఁగొఱయేమి? పాఠకా! ప్రదోష
పూజాదర్శన మాత్రంబుననే యెంతటి ఫలోదయంబో సమా
చితే! ఇఁకనైన సత్సంతానంబు నపేక్షింతేని శివుం బ్రదోషకాల
మునఁ బూజింపుము. తప్పక మహాద్భుతుండగు సూనుండు నీకు
దయించు" నని యాగురూత్తముఁడు బోధించి భావి సుఖోద
యంబు సూచించినను సంప్రాప్తదుఃఖంబు వారించుకొనఁ జాలకున్న
యాయన్నుమిన్న యెడఁ బ్రసన్నుండై తత్సూనుం జేరఁబిలిచి నిజ
హస్తం బాతని మస్తకంబున న్నిలిపె. ఆహా! మహామహుల
కృపగల్గినఁగానిదేమి? ఇందనుక మొద్దై యుండిన వాఁడప్పుడె
యెరుకువాసి యఖిల నిగమాగమవేదియు మహాజ్ఞానియునై ప్ర[illegible]
శించె. అంతలోఁ గల్గిన యావింతమార్పున కింతయు సంతోషా
శ్చర్యంబులు పెనఁగొన నాయింతి విభ్రాంతిఁగాని కొంత సేపటికిఁ
దెప్పిఱి యానద్యోహృద్య విద్యాప్రదాత యశోఽంచితుండగు
నవిద్యాతీతుండయని వేద్యంబుగా నంతనత్యంతభక్తిప్రపత్తుల
యిట్లనియెఁ: 'దేవా! దేవరవారీభూవలయంబునఁ గేవల భ[illegible]
లోకంబునకుం దావలంబుగా నవతరించితిరేకాని వేఱుగాదు. మీ
కంటె నీశ్వరుం డూరకుఁడు కానరాఁడు. మీవాక్యంబు లమోఘంబు
లని నేఁ డెఱింగికొంటి. ప్రదోషకాలంబున నభీష్టప్రదాతల మిమ్మే
సేవింపుదాన. మీవంటి పుత్త్రరత్నంబు నాకుదయింపకుండెడి నే?'
యని మఱల సాష్టాంగదండప్రణామం బాచరించి తత్పద జలజం
బుల నిజహృన్నికేతనంబున న్నిల్పికొని స్వగ్రామంబునకు న్నరిగి
తదేకదీక్షతోఁ బ్రదోషకాలంబున శివారాధనంబుఁ గావించు
చుండె. ఆయూరివారెల్లరు మున్ను తా వెఱింగిన మొద్దబ్బాయి
కొడ్డ వింతలో నింతటి దబ్బఱకాని పాండితి నార్జింపఁగల్గుటెడ నని
యెంతయు నబ్బురపడిరి. ఆఁడుపిల్లలఁ గన్నవారెల్లరు మేము
మేమని తమ తమ దుహితలం గొనివచ్చి పరిగ్రహింపుమనియాతని

కాళ్లపైఁ బడవైచిరి. అందాతం డొక సుందరాంగిఁ 'బాణిగ్రహణంబు కావించికొనియె. వారు క్రమంబుగాఁ బుత్త్రపౌత్త్రాది సంపదలతోఁ బెంపొందనైరి. నామధారకా! గురుకృపయున్న నెట్టిదో యిప్పుడైనఁ దెలిసెనా? ఆతండు కృపాసింధుండు భక్త బంధుండునై తనను నమ్మినవారియెడ సానందంబుగా నన్నిసంపదలు పెంపుసేయు'నని సిద్ధుండిద్ధంబుగాఁ బల్కె.

జ్ఞానకాండము — ౯ దళము.

శ్రీపాదులంగూర్చిన పైగాథ తెలియ నాభక్తుండడుగఁ గృపాయత్తుండగు సిద్ధుండువల్కె: ఆకురుపురవరంబున నొక చాఁకలి తత్సేవకుండయ్యె. అదెట్లనిన, గురుండు తాన జంగమతీర్థ సదృశుండకానయ్యు లోకసంగ్రహార్థంబుగా ననుదినంబుం దానుమ కాలంబునఁ గృష్ణాతటంబునకుంబోయి యథావిధిగా స్నానజపాదికంబు సలుపుచుండె. అట్టియెడ వస్త్రప్రక్షాళనంబునకై యచ్చోటఁ జేరుచుండిన యా రజకునకు నెమ్మది న్మన యీ గురునెడ భక్తిలతాంకురంబు లొదవ నొకనాఁ డీతని డాయవచ్చి దండప్రణామం బొనర్చె. అంత నిశ్చలభక్తితోఁ బ్రత్యహము నట్లుకావింపఁ బొచ్చె. ఇట్లు కొంతకాలంబు గడవ నొకప్పుడు శ్రీవల్లభుండు వానియెడఁ బ్రసన్నుండై వాఁడు బట్టలారవేసికొనుచుండ వానిని సంబోధించి యిట్లువల్కె: 'ఓరీ! నీకీకష్టమేల? నేను నీభక్తిచేత సంతుష్టుండ నైతి. నీకు రాజ్యంబుఁగూర్తు. నీయిష్టము. నీకగుసత్ఫలికొను' మనియె. వాఁడును జేతనున్న గుడ్డ ముడివేసి కేల్జోడించి యిట్లు పలికె. 'బాబూ! ఏలినవారేదనుకొన్నఁగాదు? మీరీసరులు నేనో మీదాసుఁడ' ననుచు నంతటినుండి సంసారచింతమాని శ్రీపాదసేవకుండై త్రోవంబోవుతఱింగూడ దూరాననుండియే భక్తితో నిత్యంబు దండప్రణామంబు లిడుచుండె. ఇంకఁ బ్రతి దినమును గురుమఠాంగణంబున నూడ్చి కలాఁపిఁగొట్టుచుండె.

ఇట్లు చాలకాలము కడచె. అంత నొక వసంతర్తువునఁ గృష్ణాస్రవంతి నొకమ్లేచ్ఛభూజాని వినోదార్థము బహుభూషణ

భూషితాంగుల నిజాంగనాత్రితయంబుంగొని వాహారూఢుండై
పోవుచుండె. వారివెనుక యేటినడుమ సాగుచుండ నిరుఁగెలం
కుల ద్విపఘోటకాది జంతుపటలంబును ఢక్కామృదంగ పట
హంబులతోఁ బటు నినదంబులతోడి పదాతి భటనివహంబులుం
బోవుచుండె. భూమ్యంతరిక్షంబుల నిండి నిబిడీకృతంబగు నాసమ్య
క్కోలాహలంబు గ్రామ్యజనానీకంబుల నాకర్షింప రమ్యావనీశ
వైభవ దిదృక్షువులగు ప్రేక్షకులతోడ నాక్షణంబున మనరజకుం
డుం దాఁజేయు గురుసేవాకృత్యంబుడిగి వెడలనయ్యె. వాఁడటకేగి
యయ్యవనావనీనాథ విభవంబున కద్భుతపడి భువిపై భవముంగని
నందుల కిట్టి యనుభవము కలుగవలెఁగాని లేదేని మానుషత్వం
బునం గలవిశేషం బేమి ?

కం॥ తోషాకరమోహాన్విత ।
భూషామయవేష నవ్య ♦ పూషుఁడ శేష ।
ప్రైమణికర్ణాభ్యంతర ।
దోషాకరుఁడీనరేశు ♦ తులఁగనమహహా ॥

జన్మంబన్న నీతనిదే జన్మంబ కాదే ? ఈతం డీశ్వరాను
గ్రహంబుఁ బడసియుండు. లేదా యింతటి పున్నెంబెట్లబ్బు ?
కాదా, యే గురూత్తము పదంబులైన నొత్తియుండు. కాకున్న
నింతటి మహాభోగం బొదవెడినే ?' యని తనలో ననుకొనుచు
మఠంబునకు మరలి గురులపాదంబులకు మ్రొక్కె. శ్రీపాదులు
భక్తవత్సలులౌట నిజసేవక చిత్తవృత్తిం దెలిసి తన్మనోగతంబడిగిరి.
అందుల కాచాఁకి కేల్మోడిచి యిట్లు బదులువలికె: 'కృపాసారా!
దానశూరా ! నేనిపుడొక తేని వైభవంబుఁ గన్నులారఁ జూచి
వచ్చితి. అతండు శ్రీ గురుదాసుండై యుండునేమోయని యెంచు
చున్నాను. పూర్వజన్మమం దొనర్చిన దైవారాధన మింతటి
మహాదశకు మూలకందంబు గావలయు నని కొంటి. దీనికేమి ?
అవిద్యాప్రాబల్యంబున నపుడక్కు డిట్టివాసనా లేశమ్ము లేవేనియ

యించుఁగాక. ఈవిషయంబు లెట్లయినతుచ్ఛంబులు. వీనితోఁ
బనియేమి? నాకింక భవచ్చరణ సేవాచరణంబే సుఖదంబుకాదే?'
యని విన్నవించెను.

అది విని ముదితాంతరంగుండగు నావల్లభుండు సల్లలితం
బుగ నిట్లనియె: 'పాపము! పుట్టినదిమొదలు కష్టభాగివౌట నెట్టు
లైన రాజ్యభోగేచ్ఛ యొకింతనీకున్నదన్నఁ దప్పులేదు. ఇంద్రి
యములఁ దృప్తినందింపకుందుమేని మనస్సు నిర్మలముకానేరదు.
వాసనల శేషింపనిచ్చిన మరలమరల ధరపై జన్మింపవలసినకష్టంబు
తప్పకుండును. కావున రాజ్యసుఖంబులు ముందనుభవించెదవు
గాక' యని యా మహానుభావుండు దీవించె. అదివిని యా సేవ
కుండు కేలొగ్గి 'దయాసాగరా! యేమైన మీదాసుని మీరుపే
క్షింపవల'దని మనవియొనర్చె. గురుఁడపుడు 'నీకు రాచరికపు
మనసుతీఱ మ్లేచ్ఛకులంబునం బుట్టుదు' వన్నంతనే రజకుండు
'ముందు మీ చరణ వియోగంబుఁ గందునేయని నామనంబు
డిందుచున్నది. పునర్దర్శనం బెట్లనుగ్రహింతురో కదా!' యని
చింతింప శ్రీగురుండిట్లు సెలవిచ్చె: 'ఓయీ నీవింక వైదూర్య
పురంబున నుదయించి యయ్యైరాజ్యసుఖంబులెల్ల ననుభవించిన
వెనుక నంత్యకాలమున నాసందర్శనము నీకయ్యెడిని. నన్నుఁజూచిన
మాత్రన పూర్వజ్ఞానంబునీకుఁ గలుగును. కావునఁ జింతవాయుము.
కార్యవశమున నాకపు డేర్పడు నవతారము 'నరసింహసరస్వతి'
యను సంజ్ఞ కలదగు' నని చెప్పి దిగులుడిపి వానిని దగ్గఱకుఁబిల్చి
'యింతకు నీవావైభవ మిప్పుడె పొందఁ గుతూహలం బందుదేమో
చెప్పవైతివే' యనెను. అందుల కానిర్ణిజకుఁడిట్లను: 'అయ్య
గారూ! పెద్దవాఁడనైపోయితిని. దేహపాటవంబుతప్పె. ఇప్పుడు
రోగించిన నేను భోగించునదేమియుండు? జన్మాంతరంబుననై
ననేమేలు. జవ్వనంబున ననుభూతంబౌనదే ప్రీతిదంబుకాదే?'
యన్నంతనే గురుపాదులు 'జన్మాంతరంబుననే రాజ్యభోగంబునందె
దవుగాక' యని దీవించె.

అంత ననతికాలంబున కావృద్ధరజకుం డంతరించి తృణజలూకన్యాయంబున వైడూర్యనగరంబున నొక మ్లేచ్ఛాంగనాగర్భంబునం జొచ్చె. విచిత్రంబగు తత్కథాదికంబు ప్రాస్తావికంబుగా ముందు రాఁగలదు. ఇఁక శ్రీపాదులఁగూర్చిన తదనంతరవృత్తాంతం బొకింత వినుము. వా రేతాదృశమహాత్మ్య ప్రతిపాదక వరప్రదానంబులతో మఱికొంతకాలం బటఁగడపి విఖ్యాతివడసిరి. అవెల్ల వివరింప మొదలిడిన గ్రంథవిస్తరం బౌనుగాన సంక్షేపంబుగాఁ బల్కెదు. తన్మహిమమంతయుం జెప్ప నే నెంతటివాఁడను? తుదకు వారు మెట్టిన తావున కబ్బిన ప్రభావంబైన నే వాకొననా నే? వారటఁ గొంతకాలంబున్న మాత్రనే యాభూమి సర్వాభీష్టదంబు కానయ్యె. అట్లు భగవానులిచ్చవచ్చిన ట్లచ్చోటఁ గొన్నియేండ్లు కడపి తుదకొక హస్తాప్రయుక్తాశ్వయుజ కృష్ణద్వాదశినాఁడు తత్ప్రాంత కృష్ణాతరంగిణిం గాయంబు వీడిరి. సాధారణ దృష్టికి గోచరింపకున్నను భక్తుల కిప్పటికి వరదులుగ నటనుంద్రు. జ్ఞానుల దృష్టిపథంబునం గానవత్తురు. వారటఁ జిరస్థాయియుంటకుం దార్కాణ కలదది తెలుపుదు. ఆక్షేత్రం బిపుడు కురుపురంబని ప్రఖ్యాతంబై విలసిల్లు.

### జ్ఞానకాండము — ౧౦ దళము.

నామధారకుండు శ్రీపాదుల యక్కడి వసనంబుం దదవతారాంతర గ్రహణంబు నెట్లుపొసంగెనో వివరముగాఁ బల్కు మనపుడు సిద్ధుండవ్వలికథఁ జెప్పెడి: శ్రీపాదుల మాహాత్మ్యం బేమని చెప్పుదు? అతఁడు విశ్వవ్యాపియై పెక్కు రూపుల దీపించు నా పరాత్పరుండసుమ్ము. భక్తవరదుం డాతండు కార్యార్థ మవతరించనే కాని గుప్తరూపంబున నెప్పుడా కురుక్షేత్రంబున నుండువాఁడె చూవె. పరశురాముండు చిరజీవియై యిపుడున్నవాఁ డేకదా. అతని వెనుక వైష్ణవావతారము లెన్ని యేర్పడనయ్యెనో చూచితివా? సృష్టిస్థితిలయంబులకై మూర్తిత్రయంబైన వ్యాపకేశుండ నిజ భక్తరక్షణైకపరుండై దుర్వాసులశాపం బంగీకరించి పలుమారు

లిలలో నవతరించి దేవభూదేవతాదుల సాధులం బ్రోదిసేయుట లెటుం గమా ? ఇందుల కంతుకలదా? అట్టి త్రిమూర్తి వసతి స్థలంబగు కురుపురంబ నిధానంబకాదే? ఎవరెవ్వరికేయే కోర్కులున్న నవెల్ల నచ్చోట పెట్టినమాత్రన నెట్టనఁగల్గుచుండు. పెక్కేల ? అతావు వేల్పుటావు. ధరణిని దానిగరిమనెన్న నాతరముకాదు. సరికద. మఱెవ్వరికౌను ? నీకు గురుభక్తి మెండుకాన భక్తమార్గప్రతిష్ఠ కుండౌనాతండునిజభక్తుల నుపేక్షింపఁడనుటకుమాత్రమొకనిదర్శ నము చూపఁగలను. ఆతనియెడ బత్తి యతిశయించినకొలఁది నిహపరసుఖంబులు కలిగి మోక్షంబు చేకూరు. ఎట్లన్న నిందుల కొక పూర్వవృత్తాంతం బొక్కింత వక్కాణింతు. వినుము.

మున్ను కాశ్యపగోత్రజుఁడు వల్లభేశుండనువాఁడు శీలా చార సంపన్నుండగు విప్రుండుండె. ఆతండు కుటుంబ భరణంబుఁ గావించుకొనఁ గ్రియవిక్రయ వ్యాపృతిస్నెలంగె. ఆపాటుండు వ్యాపారమిషంబునం దిరుగుచు నేటేట శ్రీపాద దర్శనార్థ మేగు చుండె. ఒకానొకప్పు డాతఁడు తనకిష్టార్థంబు చేకూరిననాల్గువేలు భూసురులకు భూరి సమారాధనముఁ గావింతునని నిజమనంబున గురుపాదుల ధ్యానించుచుననుకొనియె. అంత నాతనికిఁ బోయిన చోటనెల్ల నినుమిక్కిలిగాఁ గలిసిరాఁగాఁ దనిసి యింటికింజేరె. పెండియు నురుభక్తిం గురుపురంబున గురుసన్నిధి భూసురుల కన్న దానంబుఁ గావింపధనముం జేకొనివెడలె. అది తెలిసిన కొందఱు చోరులు కైతవ స్నేహంబగపఱచుచుఁ దాముసు గురుపాద దర్శ నార్థంబ వెడలితిమనుచునాతని ననుగమించిరి.పాపమా యమాయి కుండు నిజమేయనినమ్మి మంచి సావాసము దొరకెఁగదాయని యుబ్బి డబ్బున్నదనుతెలుపులేక నిబ్బరంబునఁ బోవుచుండె. మార్గ మధ్యమున నొక నిర్జనారణ్యంబుదాఁటవలసె. తన్మధ్యమున నొక యద్దమరేయి వావద్దులాడిన బుద్ధిమాలిన దొద్దకాండ్రతనిం దద్దయుం దలబ్రద్దలుసేసి యాతనివద్దనున్న ధనమెల్లం గొల్లవెట్టిరి. అవస్నుండగు నా బాఁపనుండు శ్రీపాదుందలపోసినంతనే యా

భక్తవత్సలుండగు భస్మలిప్తజటివేషధరుం డాశూలపాణి యట
ప్రాలి చోరాళి దద్దరిల్లఁగ గర్జించుచు నద్దిరపాటున ప్రేటు వేటున
గీటడంచె. ఆతస్కరులం జేరిన రొక్కరుండుమాత్ర మాతని
జగన్నాథునిఁగా నెఱింగి తనయెడఁ గరుణింపుండని శరణాగతుండై
యిట్లనియె: 'స్వామీ! నేనూరక వీరలం జేరియున్నవాఁడనే కాని
యింకే యపరాధం బెఱుంగ. వీరు దొంగలేయని మున్నెఱింగిన వీరి
సంగతిం గోరకుందు. విశ్వాత్మవు. సర్వసాక్షివి. నీ వెఱుంగనిదేమి?
నన్ను రక్షింపవలయు' నని శ్రీపాదులపాదంబులం బడినంత నా మొఱ
విని దయఁ గని వాని కభయం బిడి యిట్లాజ్ఞాపించె: 'ఈభస్మము
నావిస్మృత విప్రశిరంబున రక్తస్రావంబగు తావున నిడి తత్తను
వునం గూడ నొత్తుగాఁ బూయుమని వాఁ డట్లు గావించుచుండ నిజా
మృతదృష్టి పరిసారంబునఁ బ్రాణప్రతిష్ఠఁ గావించె. సూర్యోదయం
బపుడు కానుండ నయ్యార్యోత్తముం డంతర్హితుండయ్యె. అంతఁ
బునరుజ్జీవిత ద్విజుండు నిదురనుండి మేల్కాంచినట్లు లేచి తన
కుపచరించుచున్న యా సహచరుం గని 'యిదేమి? అయ్యో! వీ
రెల్లరు హతులైరే. ఇదెట్లు పొసఁగె' ననియడుగ వాఁ డిట్లుత్తర
మిచ్చె: 'బ్రాహ్మణోత్తమా! యీరాత్రి యిట జరిగిన విచిత్రం
బేమని చెప్పుదు? ఎవరో మహామహులగు మస్కరు లీముష్కర
తస్కర మస్తిష్కములం జీల్చివైచిరి. విభిన్నశిరస్కుల మిమ్ము
భస్మమాత్రలేపనంబులం బునరుపాత్తజీవనులం గావించి యుప
చారార్థము నన్ను నియోగించి యిటనున్నట్లుండి యిప్పుడే
యదృశ్యులైరి. వారెవరో యే నెఱుంగను గాని వారే మీకుఁ
బ్రాణదాతలైరి. బూదిఁ బూసికొని జడలు ధరించియుంట వా
మృత్యుంజయుండ కాఁబోలు ననుకొందు. మీ రాపురారి భక్తులరని
యెంచుచున్నాను. కావున నే మీ బాంధవుండఁ గాఁ బాడి మీ
పాలిశాఖాలి రానోపు' ననియె. అది విన్నంతనె నిజ రక్షకులు
శ్రీపాదులేయని యెఱింగి వారానన్నులైరనందాఁ గానరైతినే
యని ఖిన్నుండై త న్నేదినవానిం బాఁ దెచ్చిన దానింగొని [illegible]

పురంబుం జేరి గురుపాదుకారాధనంబుం జతుస్సహస్రావనీసుర సమారాధనంబుం గావింపఁగలిగె. ఇట్లు తత్కృపాసార ప్రసారంబునఁ గృతార్థులైన వారెందఱో కలరు. వారాయూరనుండుట నది పేరుగాంచె. సర్వవ్యాపకులగు శ్రీమన్నారాయణులే యట్లవతరించినవారై యట నదృశ్యరూపంబున సదావసింతురు. వారే సుమీ పిదప నరసింహ సరస్వతులై యవతరించినది.

## జ్ఞానకాండము — ౧౧ దళము.

నామధారకుండు శ్రీపాదుల తదనంతరావతారమెట్లనయ్యె నాతం డేమి చేసె నది సెలవిండన సిద్ధుం డది ప్రారంభించె: “అట్లయిన వినుము. మున్ను విప్రస్త్రీకై వారు కావించిన యొక వరప్రదాన విషయముం గూర్చి చెప్పియుండలేదా? అల్లయంబిక గురూపదేశానుసారముగా సర్వేశ్వరు శని ప్రదోష వేళం బూజించి కడతేఱె. మఱుజన్మమున నాయమ యుత్తరదేశమునఁగల కరంజపురంబున వాజసనేయ శాఖలోని యొక బ్రాహ్మణునికిం గుమార్త యయ్యె. ఆముద్దారు బిడ్డం బెద్దఁజేసి యీడు రాఁగనే కన్నారఁ జూచుకొనుచుండ నాయూరనే మాధవాభిధుండగు నొక యనురూపవరుంజూచి మహావిభవంబుతోఁ బరిణయముఁ గావించిరి. మాధవదార పురాకృత సంస్కారగరిమన శుభాకారయు నమోదారయనంగాఁ [illegible]హించె. ఆ నూతన దంపతులీశానుఁ బ్రదోషంబునం దనుదినంబును శ్రద్ధాభక్తులతోఁ బూజింపఁ దొడఁగిరి. శనిప్రదోషంబున నింకవిశేషముంచి కావించుచుండిరి. పదియాఱవయేట నంబ గర్భము ధరించె. మూఁడవ నెలలోఁ బుంసవనము జరిపిరి. లోని పిండమునకు జ్ఞానోదయంబైనంత గర్భిణికిం దత్త్వజ్ఞానం బలవడెను. మాసపూర్తియయ్యె. అపుడు సీమంతము యథావిధిగా నెఱపిరి. పిదప నొక శుభముహూర్తమున నాబింబాధర చంద్రబింబంబుం బోనివానిఁ బుత్త్రుం బ్రసవించె. తండ్రి సంబరపడె.

కం. ఓంకార నాదమొదవెను।
శంకరులిల జననమందు ♦ సమయమునాటం।
గింకరులుంకిఁగ పంకము।
శంకాతంకముల సం ♦ కసాధుల కింకన్॥

పిత సుతుఁగాంచి స్నాతుండై జాతకర్మంబు నెఱపి వేద విప్రులకు భూరిదక్షిణ లొసఁగె. అంత జ్యోతిషికుల రావించ వారు జాతకంబు గుణించి ప్రీతిమైనిట్లనిరి: "ఈ జాతకుఁడు కారణికుండై పరమ గురుండు కానోపు. ఈతని యనుగ్రహంబుఁ బడసిన వారు లోకవంద్యులు కాఁగలరు. పలికిన దెల్ల వేదవాక్యమగును. పాద మంటినఁ జింతామణిగా ఫలించు. ఈతండున్న తావున సిద్ధులరిగాపు అపుదురు. నిధులకది కాఁపురంబగును. ఈ జాతకమున వివాహ సంతానయోగములు కానరావు. జాతకుఁడు మాత్రము లోకత్రయపూజ్య పవిత్ర చరిత్రుండగుట నిస్సంశయంబు. తాఁగను వారినెల్లఁ బావనులం జేయఁజాలెడిని. పెక్కేల? పరమేశ్వరుండ యిట్లవతరించి యుండనోపు. ఈ మహాత్ముండు కలికల్మషహారి. మీకు దైన్యహర్త. మీకోరిక లేవేని వానియంత సఫలము. ఈ సుధి మీయింట నుదయించిన బుధగణ్యంబగు పెన్నిధియని తోఁచుచున్నది. జాగరూకతతోఁ బెంచి పెద్దసేయుం"డని వారు మంగళాశీస్సులొసంగి వసనభూషణాది సత్కారంబులంది సెలవందిరి. బిడ్డకు దృష్టిదోషంబువాయ రక్షాబంధంబుఁగట్టిరి. పుట్టుకతో నోంకార నాదంబు సేసెనని విన్న యచ్చెరువు పొందువారు బంధుమిత్రాదులు నాశిశువుం జూడరాఁగ వానిం జూపనొల్లరయ్యె. తలిదండ్రుల మోహపాటి సేమంబ కాని పరాత్పరునికా దృష్టిదోషము? అయినను బూదిఁబూసి జడత్రాడు ముడివేయుచే వేసిరారు. పండ్రెండవనాఁడు బారసాల జరిగినది. వరహరియని పేరుపెట్టిరి. తల్లి పిల్లనిఁ దనపాలుచాలుటలేదనికొని పెదయింటిలో దానినో యొకమేఁకనో వెదకి తెండనెను. తల్లిమాట లాలించిన యా యష్టపాళ తన చిట్టిచేతితో మాతృస్తనంబు స్పృశించె. అంతలో

వింతదోఁపఁ బొంగారి యమృతోపమ దుగ్ధంబు ముప్పదిరెండు రెట్లధికమై అవిక తడిసి స్రవింపఁజొచ్చెను. మొదట విస్మితయై యుఁ బిదప సస్మితగాఁ దన ముద్దుబిడ్డని నాడించుచుంగొనిపోయి మంచముపైఁ బరుండఁబెట్టిన నందు నిలువక నేలకుం బ్రాఁకులాడి యటఁ గ్రీడించుచుండె. నెలలుకడచి పలుకఁదొడఁగినఁ బ్రణ వంబుదక్క నన్యంబుపలుకఁబోఁడు. కొడుకు మూఁగవాఁడోనో యని పితరులు ఖిన్నులైరి. దైవజ్ఞులరావించి యందులకుం గారణం బారసి తత్పరిహార మార్గంబుం దెలియఁగోరిరి. వారు కులదేవతా రాధనంబుఁ గావించుకొమ్మనియు నాదిత్యవారంబులందు రావి యాకుల విస్తళ్లలో భోజనము సలుపుమనియుం జెప్పిపోయిరి. ఇం టికి వచ్చినవారెల్ల నెవరికిఁదోఁచినట్లు వారనఁజొచ్చిరి. ఎవరే మన్న నాబిడ్డఁ డోంకారము విడువఁడయ్యె. ఇట్లేండ్లుగడచె. తుద కేడేండ్లునిండె. తండ్రి పురోహితునితో యోజింపఁ బిలిపించి కొడుకనిం జూపెను. భార్యాభర్తలాతనితో నిట్లు వాపోవఁజొచ్చిరి: 'మావానికింతవఱకు మాటలే రావాయె. ఇపుడష్టమ వర్షము ప్రవేశించె. ఉపనయనము జరుగవలెఁగదా. మంత్రోపదేశ మొనర్చి వీనిచే నుచ్చరింపఁజేయుటెట్లు? అయ్యో! యేమి యీ దుర్భాగ్యము! సోమేశ్వర వరప్రసాదమున సల్లక్షణ లక్షితాంగుం డుదయించెం గదాయనికొన్న మాటలు రావయ్యెనే! ఏమి చేయు దుము? మాటఁగల్గినవాఁడా వీఁడొక్కఁడే యాయెను. చూడఁగా వీఁడిట్టివాఁడాయె. ముందువీఁడు మాకాధరువెట్లౌను? ఈ చింత వెంటనంటుట మా కోరిక తీరనిదయ్యెనే. శనిప్రదోషకాల సం పుటి ఫలంబిదియా?' యని కన్నీరుగార్చు నిజమాతను దరినున్న బాలకుఁడు చేసైగనూరార్చి లోనికింబోయి యొక యినుప తును కను నిజకర స్పర్శమాత్రమున స్వర్ణమయుం బొనరించి తెచ్చి యా యమకు సమర్పించె. అంబ యదికని విస్మయంబంది నిజపతికిం బ్రదర్శించె. వారది యొరులకు మఱుఁగుపఱచి యాబుడుతని గృహాభ్యంతరంబునకుం గొంపోయి వేఱొక లోహపు ముక్కను

వానిచేత నిడినంత నదియు నప్పుడ సువర్ణంబుగా నాయెను. ఇంతలో నాతండు నలుదెసలం దేఱిచూచినంత నాయింటంగల లోహమయ సామగ్రియెల్ల రంగారు బంగారమయంగా నొప్పారె. వారిదం బొంగి నిజాంగజు నాలింగనంబుం గావించుకొని యిట్లనిరి: 'నాయనా! నీమహత్త్వము తెలియక యేమేమో యనుకొంటిమి. తండ్రీ! మాకీవ నీవే తారకుఁడవు. కులదీపకుఁడవు. నీవల్లనే మాయిల్లునిండ మాకెల్ల సౌఖ్యములు కలుగుచున్నవి. నీవిట్టి మహానుభావుండవౌట నేమిటికో మాయలోఁజిక్కియున్న మా తెలియరాక నేమేమో యంటిమి. బిడ్డా! నీవవి పాటింపక నీవచస్సుధాబిందువుల మ్మాకుఁ గర్ణపేయంబు గావించి మా కామితంబుం దీర్పుమీ'యని బతిమాలిన లేనవ్వుతో నానరహరి చేసైగసేసి మౌంజీబంధన యజ్ఞోపవీతధారణంబులై నంతం బల్కుదునని సూచించె.

అంత సంతోషముతో నుపనయనమహూర్త నిశ్చయంబు సేయించిరి. వేగవేగంబుగా సోత్సాహంబుగాఁ దన్మహోత్సవమ్మునకుఁ గావలసిన సంభారమ్ములెల్ల సమకూర్చుకొనిరి. జ్ఞాతి బంధుమిత్రాదుల నెల్లరఁ బిలువనంపిరి. కనకమయంబు గావింపఁ బడిన తమయింటఁ గుడ్యముల సుధామయంబుఁ గావించుకొని ముందు పందిళ్లువేసి యంగణంబున రంగవల్లుల శృంగారించి మంటపంబు నమర్చిరి. ఆమండలంబునంగల పండితమండనులఁ జతుర్వేద పారగుల రావించిరి. గ్రామాంతరాగత బంధుసమూహములు వారియభినవవిభవమునకు నచ్చెరువంది మెచ్చుచుండిరి. ఎప్పుగా ధనము వెచ్చింపఁబడుచుండె. సుగంధతాంబూలాది పరిమళంబులు వెలఁగె. ఊరివారెవరికిఁ దోఁచినట్లు వారనుకొనిరి. 'ఈభోగమెల్ల నామూఁగవాని వడుగునకా?' యని యడుగువాఁడొకఁడును, 'బాపమీ కాఁపునికిఁ బిచ్చి యెత్తినాయేమి? తాఁగూడఁబెట్టుకొన్న నాలుగుడబ్బులును బాడుచేసికొనుచున్నాఁడే' యన్నవాఁడు మఱొక్కఁడును, 'బోనిండు. మాటలెన్నివదలిన మాటపొదలలేని వానిచే మంత్రములెట్లు పలికించునయ్యా' యనువాఁడు వేఱొక్కఁడు

నైరి. ఇతరులు గొందఱెవ్వరి సొమ్మెట్లుపోయినఁ దమకేమనుకొని నాల్గుదినములు మృష్టాన్నము దొరకునుగదా యనిసంతసించిరి. ఎవరేమనికొన్నను బితరులుమాత్రము తమసుతుఁ డీశ్వరాంశసంభవుండయని గుర్తెఱిఁగినవారౌట దృఢభక్తివిశ్వాసములతోఁ బనులు నడపుచుండిరి. దైవజ్ఞనిర్ణీత ముహూర్తమునకుం బూర్వదినముననే బాలకు నభ్యంగనస్నానము సేయించి పెండ్లికొడుకునుజేసి యథావిధిగాఁ జౌలకర్మము నెఱపిరి. మఱునట గృహ్యోక్తవిధ్యనుసార పూర్వాంగ కృత్యంబును నిర్వర్తించిరి. వటువును నిజమాతతోడ భుజింపనంపిరి. సుముహూర్తముననాతఁడు మౌంజీబంధనయజ్ఞోపవీత ధారణములకై మాతృనుజ్ఞవడసి పితృసన్నిధిం జేరె. ఆగురుండు నాతని యజ్ఞానముడిపి ప్రజ్ఞానిధిం జేయు యజ్ఞోపవీతంబు ధరింపఁజేసె.

కం॥ ఏయది పరమ పవిత్రము।
పాయక జపియింప సర్వ ♦ పాప లవిత్రం।
బాయది జ్ఞానపునేత్రము।
గాయత్రిని బోధసేసెఁ గా ♦ త్రయి మొగగాఁ॥

వటువు లోలోన జపించె. కటిస్థలంబున మౌంజీబంధనంబుం గావింపఁబడియె. అపుడా బ్రహ్మచారి మాతృభిక్షకై తాయరాఁగాఁ బృథుకుని సుధామృదూక్తుల విని బధిరంబువాపికో నంబ సంబరంబుననెద న్నాభవించి దీవించి ముద్దుమొఱ్ఱలు పెట్టుచుండె.

తే॥ చదివె 'నగ్నిమీళే' యని ♦ ప్రథమమునను।
బలికెను ద్వితీయమున 'నిషే ♦ త్వా' యటంచు।
నంతమున 'నగ్న ఆయాహి' ♦ యనియె వటువు।
జనులు వెఱఁగొంద ఋగ్యజు ♦ స్సామములను॥

'ఆఁ! ఆఁ! ఏమిది?' యని సదస్యులెల్లరు ముక్కుపైవ్రేలిడి కన్నవ్రేల్పుతియక నిశ్చేష్టులై చూచుచుండిరి. 'పూర్వజన్మము

వటులు మూఁగరై యింతలో నింత వేగవేగముగా నాగమంబుల నెల్ల నుదాత్తానుదాత్త స్వరితములతో నెట్లుచ్చరింపఁగలిగెఁ? ఆహా! ఈతండు నరమాత్రుండు గాఁడెవ్వండో దేవాంశ సంభవుండగు పరమపురుషుండు జగద్గురుండు కావలయు'నని సభాసదులెల్ల రా వేదపాఠియగు వటువు దెసఁ గేల్మోడ్చి చూచుచుండఁగా నా తలిదండ్రులకుఁ గలిగిన సంతోషమునకు మేరయే లేదయ్యెను. అంత ద్విగుణీకృతోత్సాహముతో సమాగతు లందఱకు బహువిధ భక్ష్యచిత్రాన్నాదులతో భూరిసమారాధనంబుఁ గావించి యందలి వేదవిప్రులకు సువర్ణ దానంబులును బంధుమిత్రాదులకు వస్త్ర సత్కారాదులుం గావించి సబహుమానంబుగా వీడ్కొల్పిరి.

అట్లుపనీతుండైనంత నా బ్రహ్మచారి యొక్కసారి మాత్రంతికంబునం జేరి హస్తద్వయంబుం గూర్చి యిట్లుకోరె: 'అమ్మా! భిక్షార్థము సెలవిచ్చితివిగదా. నీనోటిమాట వ్యర్థము కాదు. తీర్థయాత్రల సేవింప ననుజ్ఞ యొసంగుదే నిప్పుడ వెడలువాఁడ. బ్రహ్మచర్యదీక్షతో వేదాంతనిరతి న్మెలఁగి యింటింట భిక్షాన్నగ్రహణము గావించుచు లోకానుగ్రహకారిం గావలయునని నాకోర్కి' యను సుతుని పల్కులు ముల్కులై యుంబ చెవులం బడినంత నాయమ కన్నుల నీరుగాఱ సద్యఃపాతిత పాదపంబు భాతి భూతలంబున వ్రాల బాలుండు మెల్లఁగ లేవఁదీసె. అప్పుడామె నిజార్భకుం జూచి డగ్గుత్తికతో నిట్లుపలికె: 'నాయనా! నీవు మమ్ములనుద్ధరింతువని గంపెడాస పెట్టుకొని యుంటిమే. అదెల్ల నడుగంటి పోవలయునా? నీవు పుట్టినదాదిగా నీముద్దుముచ్చట లాలకింప నోఁచనైతిమామె. నేఁటికిఁగదా నీనోట సూక్తులాసక్తులెల్లు వినఁగల్గినది? చేసిన యీశ్వరారాధన మీనాఁటికి ఫలించె నిఁక నీవల్ల సుఖంబందుదు మనుకొనుచుంటిమే. కన్నతండ్రీ! మాగతి నుంత యోచింపక యింతలో నీమంతనంబున నిట్లెంతువే నిలమాచింత కింకఱతుండునా?' యని యాపురుమనె. అపుడతఁడామెను గాఁగిలించుకొని

యోరార్చి మరలనిటుల నుడువఁదొడఁగె: 'అమ్మా! నామాట వినుము. బ్రహ్మజ్ఞాన మలవడిన దుఃఖింపఁదగినదికాదు. నేనో కేవల ధర్మసంరక్షణైక దృష్టితో నీధారుణిస్థలి నవతరించినవాఁడ సుమ్ము. నీకో ముందిఁక నలుగురు తనయులు కలుగనున్నారు. వారు మీకుపచరింపఁగలరు. ఇది నిస్సంశయముగా నమ్ముము. పూర్వజన్మమందు నీవు భక్తితో శివారాధన మొనర్చితివి చూడు' మనుచు నాతఁడాపెకుఁ బూర్వస్మృతి యుబ్బునట్లుద్దేశించియుం బాశిరంబందుం గరంబుంచె. అంతనాదినుండి యంతయుం దెలిసి తన తనయుండు శ్రీపాదుండయని ప్రబోధితయై యానంద బాష్పంబులతో నాబుడుతని యడుగులందడిపె. నరహరి తల్లినల్లంత లేవనెత్తి తనకుహత్తికొని యిట్లని చెవిలోఁజెప్పె: 'అమ్మా! యిది రహస్యమెవ్వరికిం దెలుపకుమీ. సరికాని నాకనుజ్ఞ యిమ్ము. సంసారంబునంజొరక సన్యాసము నాశ్రయింతు. అయ్యయి తీర్థంబుల సేవింతు'నన్నంత నాపిన్నవాని కాయున్నమిన్న వాకొన్న దేమన్న: 'బిడ్డా! నీవు నన్నిట్లు విడిచిపోయిన నాబ్రతుకెఁక నబద్ధము. నన్నిట్లు దిక్కులేకుండఁ జేసిపోవుట యిదెక్కడిధర్మము? చిన్నప్పుడే సన్యసింపవలెనని యెక్కడనున్నది? ముందు పండ్రెండేండ్లవఱకు గురుకులవాసముసేసి స్వాధ్యాయాధ్యయనాదికము పూర్తిచేసికొవలెను. అంతఁ బుణ్యోపార్జనమునకు ముఖ్యసాధనముగార్హస్థ్యము. శాంతియు దాంతియు నలవడిన వెనుక సన్యాసము గ్రాహ్యము. బ్రహ్మచర్యమున వేదాధ్యయనమువల్ల ఋషులఋణముఁ దీర్చికొవలయు. గేస్తయి కర్మాచరణంబున దేవఋణంబును సత్సంతానంబుంగనుటఁ బితౄణముం బాపికొవలెను. అప్పుడైన సన్యాసమువల్ల మోక్షమబ్బునుగాని ముందు కనుగందవు. నీవు తొందరపడఁగూడదు. తపశ్చరణాది ద్వారంబున నీవింద్రియములను క్రమక్రమముగా లోఁబఱచుకొని కోరికలెల్ల నడంచికొని యథావిధిగా నపుడు యతిత్వంబునంద నౌనుతా' మ్మన బుడుతండు నవ్వుచు నాయమ్మకుఁ దత్త్వంబు సెప్పఁబూనె.

జ్ఞానకాండము — ౧౨ దశము.

శ్రీ గురుండు జనయిత్రికిట్లనియె: "అమ్మా నీవట్లనవలదు. క్షణభంగురమగు నీభౌతికదేహము నెడ నింతప్రేమమేమిటికి? మన యీశరీరములెల్ల ననిత్యములే కదా. ఈవిభవములు, శాశ్వతములు కావాయె. ఎప్పటికప్పుడు మృత్యువు సిద్ధముగ నున్నదని ధర్మాచరణంబు నకుం గడంగవలయు. నీవనునదా, యెవండైనను జిరజీవి యగువానియెడం జెప్పినం జెల్లుంగాక. ఈతనువును ధనము ననిత్యములని తెలిసినప్పుడు నూడకి నిబ్బరపెట్టుకొనవచ్చునా? పుట్టిన వారిలో గిట్టనివారు లేరు. చావులేనినాఁడే భూవలయంబునం గావ రాదు. దేహపాటవంబున్నప్పుడే పుణ్యంబు సమకూర్చికో వల యును. మృత్యువును జయింపఁగలవాఁడు నీబోధ ననుసరించి క్రమముగా ధర్మంబు నెఱుఁగఁగలుగును. కాని యనుక్షణంబున నాయువు క్షీణించుచుండఁ జిన్నతనమున నే వేవేగ ధర్మసంగ్రహ ణంబుఁ గావింపవలదా?

ఆ. కాలఁదిసీటఁ జేవ ♦ వలె నరుఁడల్పాయు
వౌనొ నర్వ ధర్మ ♦ మలవడలదు
నినుని తేరు నిముస ♦ మిర్వదిరెండు వే
ల్గ్రామము లేటులాయు ♦ వామయుఁజను.

ఆ. వినవమా వాన నీరు ♦ పిచ్చులకగ్రాగ్రి
పతితమైన నపుడ ♦ పడదె పృథకు ?
నటుల యీను దేహ ♦ మసిరంబకరయఁ
బుట్టినారలేరు ♦ గిట్టకుండ్రు?

ఈగెముడలు మూఁకకొన్ని దినాలు పెరిఁగిపోవు? పెరుఁగవేవు? కొంపయము ముందో వెనుకనో ప్రమందనున్న దాని నింక నమ్మం దగునా?

ఆ. పండుటాకుమాడిరీఁ ♦ జడునిష్టయుని చెప్పు
ధర్మమాచరింపఁ ♦ దగునరుండు

వృద్ధికొఱకు నెట్టు ♦ ఋణదాత లెక్కించు।
నటులె దివసములెంచు ♦ యముఁడడంప.

ఆ. జలముఁ గొంచు నదులు ♦ సాగరంబునఁ జేరి।
మరల నెట్టులవ్వి ♦ మఱలఁ గనవొ
యటులె కడచిపోవు ♦ నాయువు రాదింకఁ।
బవలు రేయుఁ గొంచుఁ ♦ బరువులిడెడి.

ఇట్టిదని యెఱింగియుఁ బుణ్యంబార్జించుకొననివాఁడు పశుప్రాయుండు కాఁడే? నరుఁడే నాఁడు పుణ్యకార్యం బేయొక్కటియుం బొనర్పం డా నాఁడు వ్యర్థముగాఁ గడచిన ట్లెంచవలయు. యముఁడు మన యెడల దయఁదలఁపఁడు. కాన నున్నంతలోఁ బుణ్యంబు నార్జించుకొన్న మేలుగదవే. గృహధన దారపుత్త్రాది సంపదలును రక్తమాంసాస్థి చర్మమయంబగు నీబొందియు సుస్థిరంబు లనఁగూడదు. దుస్తరసంసారాంబుధిలోని మొసలివలె ముదుసలితనము మనుజునిఁ గబళింపఁ గనిపెట్టుకొని యుండునామె. కానఁ బూర్వవయస్సుననే పుణ్యసమార్జనంబు కర్తవ్యంబుగాఁ దలంచు నన్నిట్లు వారించెదేల ?

తే. సారరహితంబుగాదె సం ♦ సారమరయ।
మాలతియుఁ బోలె నసుక్షణ ♦ భంగురంబు।
దేహ మొనరించునదె కాని ♦ తిరము కాదు।
మెఱపుఁ దీవియ వలె నెంత్రు ♦ మేదిని నిది ॥'

యని నిర్బంధంబుగాఁ దనతనూభవుం డుపన్యసించుటం గల యపూర్వానుభవంబునకు విస్మితిసందిగ్ధ నందనుఁడుగాఁడని వందనములర్పించి యిట్లువచించెః (పుత్రి)! జ్ఞానామృతంబు వర్షించి యభినవాంకురోదయం బొదవించి నన్నుద్ధరించిన మాతుల దైవతమవోయీ. నాయనా! నాకింకఁ దనయులందఱుంతు రంటె వందు నాకింతయు విశ్వాసంబు గొలుపకున్నది. కావున మహాత్ముఁ బిద్దఁ

డైనఁ బ్రభవించుదనుక నిటనుండుము. పిదప నీవు యథేచ్ఛం
జరింప సమ్మతింతు. ఇఁక నాయనుమతి వడయకయ చనదేని నేను
బ్రాణత్యాగం బొనర్చుకొందుసుమ్ము. నీవు నాపుత్త్రుండవు
సంరక్షకుండవుం గులదీపకుండవు నాదేని నీవన్నమాట నెగ్గించుకో
వలయు' ననుజననీవాక్యంబులు శ్రీగురుం డాలించి నవ్వుచు నిట్లు
బదులువలికె: 'అమ్మా! నాయది సత్యవాక్యం. ఇది సుస్థిరము.
కాని నీవన్నది ముందునిల్పుకోఁజూడుము. ఒకఁడుగా దిర్వురు
పుట్టినవెనుకనైన నట్టన నాకాజ్ఞయిడుగావుత. పిదప నేనైన
నేనాగనుసుమీ. నీమాటమాత్రము దబ్బరకానీకుము. ఇంకొక్క
సంవత్సరకాల మీయింటనుందు. నీకోర్కి తీరిన వెంటనే నాకు
సెలవొసంగు' మని యాతండట నిలిచె.

అయ్యెడ నాతండు సచ్ఛాత్త్రులతోడ సాంగవేదాధ్యాప
నంబుఁ బ్రారంభించెను. ఈతండు చతుర్వేదములును షడంగము
లును బోధసేయఁగలఁడని విని కౌతుకమున వేదవిదులుం దత్త్రి
చ్ఛాత్త్రప్రాజ్ఞులుం జేరి తచ్ఛిష్యులైరి. ఇట్లఖిలార్థనిధియై యుదయిం
చిన యాబుధలోక గణ్యుండగు బాలగురుండు శుద్ధాంతఃకరణుం
డన గుణవృద్ధుండై శ్రద్ధాభక్తులతో బద్ధాంజలులైన వృద్ధాంత
ర్వాణు లంతేవాసులుగా నిద్ధంబగు బోధసల్పుచుఁ దత్త్వధర్మ
సిద్ధాంతంబులం దెల్పుచుం దాఁబ్రసిద్ధిఁబడసె. తన్మాతయు నాతని
దేవభావంబునం జూచుచుండె. అంతనాయమ గర్భముధరించి పది
యవ నెలలో సుతులనిర్వురఁగనియె. తలిదండ్రుల కమితానంద
మొదవె.

తే. ఉత్తమగురూక్తులెన్నఁడు ♦ రిత్తవోవు।
కాన నందెప్డు విశ్వాస ♦ మూనవలయు।
మదిని బెదరమిఁగుదిరెడిఁ ♦ బెదరఁగుదుర।
దేవఁడు భావించునెట్లు ఫ ♦ లించునట్ల॥

శ్రీగురుండును నిజానుజన్మయుగ్మంబునకు మూడవనెలలోఁ
దానేర్పఱచికొన్న పరిమితకాలం బగుహాయనంబు పూర్తియగుడు

నొకనాఁడు తనజనయిత్రిని డాయవచ్చె. ఆయమ పెనిమిటిసూచుచుండ నాకవలవారిని ముద్దాడుచుండె. అట్టియెడ జ్యేష్ఠసుతుండు మాతకిట్లనుః 'అమ్మా! నీమనోభీష్టము నెఱవేఱినదిగదా. ఇఁక సుఖంబుండుము. మున్ను నీవన్నదిపుడైనఁ జెల్లించెదవుగాక. సంతోషముతో నాకింతట సెలవీయవేఁడెద. మీకా మఱి యిర్వురు పుత్త్రులు పుట్టిరామె. ఇంకనిర్వురు కొమరులుం గొమిరెలుం గలిగెదరులెం' డనవుడుఁ దత్పితరులు సంతసించి యాతనితో సవినయముగా నిట్లువల్కిరిః 'బాబూ! నీవే మాకులదైవతమ వనుటకెంతె మేమింకేమనఁ జాలము. మాయామోహితుల మగు మాకు నీనిజస్వరూపం బెఱుంగుటకుఁగాని నీమహత్త్వంబుగుర్తించుటకుఁగాని వలనుగాక యున్న'దనిరి. అంతనాయంబ దోసిలి యొగ్గి మఱిమఱి వాపోవఁజొచ్చెః 'స్వామీ! నీవు నాకడుపునఁ బుట్టుటచే బిడ్డఁడవనుకొని నిష్ఠురంబులఁబల్కియు నిలువెడలకుండ నిల్పియు నిద్రాహారాదులకై బాధించియు వేధించితిని. తుదకు సరిగా నిన్నెత్తికొననైన లేదేమో! నావల్లఁగలిగిన యెల్లలోపములు సైరింపఁగోరెద. నాయనా! మావంశతారకుఁడవై యిట్లవతరించిన మహానుభావుండవుకాని వేఱుకాదు. నాప్రదోషపూజాఫలంబు నీజననంబనుట నిస్సంశయంబ. అహా! దయాసాగరా! ఇఁకముందు మాగతియేమి? దయచేసి భవరాహిత్యంబగునట్లనుగ్రహింపుము. సగరులు గంగాంబుస్పర్శ పరిపూతులైనట్లు నాగర్భంబున నీవావిర్భవించుట నాయొడలు మావంగడముం గూడఁ బావనంబులయ్యె. తండ్రీ! యీదుస్తర సంసారార్ణవంబున నింకెంతకాలము మునింగియుండుమందువు? నిన్నుఁగన్నారఁ జూడకుండ జీవితంబింకేల?' యను జననీవాక్కు లాలించినంత శ్రీగురుండు కృపారసంబొలుక నిట్లువలికెః 'అమ్మా! నీమనమున నన్ను దర్శింప నిచ్ఛపొడమినంత స్మరణమాత్రంబున నీయెదుట నిల్చుచుందులెమ్ము. ఇఁకఁ జింతవీడుము. ఇదిగో చేతఁజేయివైచుచున్నాను. మీకింకఁ బుత్త్రపుత్త్రికు లుదయింతురు. ఈయింట

దైన్యంబు శూన్యంబగు. ఈవంశం బింక సిరులతోఁ దులఁదూఁగు చుండును. ఇదెల్లఁ బురాకృతశివారాధన ఫలంబనుమ్ము. దాన నైహిక సౌఖ్యంబును పారత్రిక మోక్షావాప్తియుం జేకూరు. కాన మీకింక జన్మంబు గలుగఁబోదు. భక్తిమీఱ శంకరస్వాం కర్యంబు నెఱపుటన నాజననంబున నింపారి మీకోర్కులు నెఱ వేఱె. అజ్ఞయిడుము. ఇదె బదరికకేగువాఁడను? అనిసాభివంద నముగా వీడ్కోలుకైకొని ఛాత్రసహితుండై బయలువెడలెను. ఎదురాడనోడిన తల్లితండ్రులుం దోడఁ గొంతదవ్వుగ వచ్చిరి. ఊరి వారెల్ల రాజాడ తెలిసి సాగనంపవచ్చిరి.

సీ. ఏడేండ్లునిండని ♦ వాఁడిల్లువీడఁగాఁ
దలిదండ్రు లోర్చిరె ♦ ట్టులనటండ్రు
పసిహూనయేమి త ♦ పసి కాఁజనుటిదేమి
వీడ్కోల్పవచ్చిరే ♦ పితరులండ్రు
కసుగందునోహో ము ♦ కసుఁగందునడపింప
నిబ్బరంబెట్లబ్బె ♦ నబ్బయండ్రు
కన్నబిడ్డండేగఁ ♦ గన్నీరువెట్టరే
గుండెలాయవి? కావు ♦ బండలండ్రు ॥

తే. కొండఅది కాదవాఁ బుధ ♦ బృందములకు ।
నిఖిల నిగమాగమంబుల ♦ నేర్పవతేఁడు ।
బ్రహ్మనిష్ఠుండు కానేగు ♦ బ్రహ్మచారి ।
మునివినుతకీర్తి దక్షిణా ♦ మూర్తియండ్రు ॥

ఇట్లు పరిపరివిధముల భాషించు నాగరులనెల్ల సాదరవాక్కులతో మఱలించియుఁ బ్రణతచ్ఛాత్రి పటలంబును సాశీర్వాదంబుగా వీడ్కొల్పియు మఱికొంతదవ్వు తన్ననుసరించిన జననీజనకులకు శ్రీపాదస్వరూప సందర్శనంబనుగ్రహించె. వారలు వారి మూర్త్యాత్మక కర్పూరగౌరాకృతిం దాల్చిన పృహరికి జోహారు లర్పించి యిట్లువిన్నవించిరి: ఓయాత్రిమూర్తీ! జగద్గురుమూర్తీ!

శ్రీపాదపాదదర్శనంబున మాకగణ్యపుణ్యంబు చేకుఱె. విశ్వావతార
కుండ వీవిట్లు మమ్ముద్ధరించుట నెంతయు ధన్యులమైతిమి. మఱల
మఱల దర్శనమనుగ్రహించు చుండఁగోరువార' మనవుడు నాతం
డట్లయని యింక నిలువుండన వారుభయులు తచ్చరణారవిందంబు
లం దమశిరంబులుంచి కన్నీటఁ బాద్యంబిడినంత శ్రీగురుం డవ్వా
రిం బ్రేమమీఱ లేవఁదీసి కౌఁగిలించుకొని సాదరవచనములతో
నూఱడించి యెంతో బలవంతాన నాతలిదండ్రులఁ బనివినిచె.
వారలుం దామిఁక నిలిచెదమని యింటితోవఁబట్టి యడుగడుగు
నం దిరిగి చూచుచుం బోయిరి.

నరహరియుం బదరీవనమార్గంబున నానందవనంబునంగల
వారాణసీక్షేత్రంబున కపుడిచ్ఛామాత్రంబునం బోయె. ఆతండు
లోకత్రయంబున నిరుపమంబగు నాయవిముక్తపురంబున విశ్వే
శుండతానమైయుం ద్రికాల గంగాంబుస్నాన పరిపూతుండయి
యాత్మారామ సందర్శనానుష్ఠానంబున నష్టాంగయోగ నిష్ఠాగరి
ష్ఠుండుకానయ్యె. అచ్చటి తాపసులును యతులు నవధూతలుంగని
'ఓహో! యీతండెవ్వఁడో యోగాభ్యాస పారీణుండు. బ్రహ్మ
చారియై దుశ్చర తపం బాచరించుచున్నాఁడు. విషయాసక్తియున్న
మత్వంబును బాసిన విరాగి యీతం' డనుకొనుచుండిరి. అందొక
బ్రహ్మజ్ఞుండు కృష్ణ సరస్వతి యను యతికుల వృద్ధుండు గుఱుం
డెలిసి యీతని భక్త్యనురాగంబులతోఁ జూచుచుఁ దోడియతు
లతో నొకనాఁడిట్లనియె: 'ఈమహామహునిం జూచుచున్నారు
గదా. వయసునఁ జిన్నయయ్యు మహిమంబున మిన్నయౌట
నెంతయు వంద్యుండు. ఈతండు భువనత్రయ మాన్యుండు.
త్రిమూర్త్యవతార పూరుషుండు. తురీయంబునఁ జాతుర్వాసన్య
లెచ్చయిన వారికంటె నితరులులొచ్చని కొలితనియెడఁగాదు.
లోకానుగ్రహ సమర్థుండగుట సన్న్యాస మార్గసంస్థాపనము గావించి
పరోపకారం బొనరింప మనమందఱము సాభివందనముగా నర్థింప
వలయు. దేహధారులకెల్లఁ దానుగురుండై పతితులను నిజదర్శన

మాంత్రింబునం బవిత్రులఁగావింపఁజాలు. ఇట్టి యీతని నాశ్రి
యింజేసి కృతార్థతఁ గందమనియె. అంత నటఁగల మునివరులెల్లరు
నా బాలతపస్విం జేరి యైకకంఠ్యంబుగా నమోవాకంబుతోఁ బల్కిరి:
'ఓయీ తాపస శ్రేష్ఠా! మా ప్రార్థనం బంగీకరింపుఁడు.
లోకానుగ్రహార్థము సన్యాసముఁ గొనుఁడు. మమ్ముద్ధరింపుఁడు.
కలిలో సన్యాసము నింద్యమనుచున్నారు. తన్మార్గ సంస్థాపనం
బొనర్ప దక్షుండు వేఱొండు కానరాఁడు. అగ్నిహోత్రము గవా
లంబము సన్యాసము పలపైతృకము దేవరకృతసుతోత్పత్తియు
ననునైదును గలివర్జ్యములుగా నొక్కెడఁ జెప్పంబడియుంటఁ గొం
దఱిపుడు సన్యాసము నిషిద్ధముగా నెంచుచున్నారు. కాని యది
వేదసమ్మతమని విశ్రుతమాటను వర్ణవ్యవస్థ పాటించునంతకాలము
వేదము ప్రవర్తకమగువఱకు నగ్నిహోత్రము సన్యాసమును
గలిలోఁగూడ నంగీకార్యములే యని శ్రీమచ్ఛంకర భగవత్పాదుల
వారు సిద్ధాంతీకరించుట నిట్లనుష్ఠింపఁ బడుచున్నది. ఏమైనం
బామరులు గొందఱింక నద్దాని నిందింపమానకున్నారు. కృపా
సాగరా! మౌనిశేఖరా! సంసారతారకుండవై తురీయాశ్రమోద్ధా
రంబున లోకోపకారంబుఁ గావించి సైరింపవే' యని యొక్కపెట్టున
మ్రొక్కినంత ననుమోదంబుఁ దెల్పి గురుండవ్వాడ వృద్ధకృష్ణ
సరస్వతులు గురువులుగా విధివిహిత విధానంబునఁ గ్రమ సన్యాస
గ్రహణంబుఁ గావించె'నని సిద్ధులన్నంతనే విన్నయన్నామధార
కుండు జగద్గురుండగు త్రిమూర్త్యవతారమూర్తికి నొక గురుండు
కావలసెనే' యని ప్రశ్నించె. సిద్ధుండాతనికిట్లుత్తరంబిడె: 'నామ
ధారకా! యిందాశ్చర్యమేమున్నది? మున్ను శ్రీరామచంద్రులకు
గురువులు వసిష్ఠమహర్షులు కాలేదా? అందఱితోఁ బాటుగా శ్రీ
కృష్ణభగవానులు సాందీపునితోడం జదివెనని యెఱుంగవా? అట్లే
మన యీ శ్రీగురుండును విజ్ఞాన వయోవృద్ధుండగు శ్రీకృష్ణ సర
స్వతీ ప్రవరుల గురులం జేసికొనెనని యెఱుంగుమ' దని బోధిం
చెను. శిష్యుండపుడిట్లు మరలఁబ్రచ్ఛసెసె: 'స్వామీ! సరిగాని

యుండఁగ యతులుండఁగా నాకృష్ణ సరస్వతులే పరమగురువులు కానేల? వారల మూలపీఠంబెయ్యది?' యన సిద్ధులిట్లుద్బోధించిరి:

శ్రీశాంకరులే గురుపారంపర్యంబునకు మూలకారకులు. పిమ్మటఁ గ్రమముగా విష్ణువు బ్రహ్మ వసిష్ఠుఁడు శక్తి పరాశరుండు నారాయణుఁడే తానా వ్యాసుండు శుకుండు గౌడపాదుండు గోవిందాచార్యులు నపరశివు లాదిశంకరులు విశ్వరూపులు బోధజ్ఞానగిరులు సింహగిరులు నీశ్వరతీర్థులు నృసింహతీర్థులు విద్యారణ్యఖ్యాతిఁగాంచిన విద్యాతీర్థులు మలయానందులు దేవతీర్థులు యాదవేంద్రసరస్వతులు తుదకీ వృద్ధకృష్ణసరస్వతులుం గురువులుకానైరి. భగవానులిప్పుడు సన్యాసమార్గ సంస్థాపనార్థమై వారికి శిష్యులైరి. వీరే తుర్యాశ్రమసంగతులు మన నృసింహసరస్వతులు. వీరలు వారణాసియం దుపాగతులకు వేదార్థబోధఁ గావించి యందఱి మన్ననలంగొనిరి. అచ్చటియతు లందఱిలో నగ్రగణ్యులని విఖ్యాతిఁగన్న శ్రీగురుప్రవరు లఖిలయతి విబుధ సేవితులు కానైరి. అంతట వారు లోకోపకారార్థము బహుశిష్య సహితులయి తత్తీర్థంబుల దర్శించుచుఁ దుదకు బదరికాశ్రమముం జేరిరి. అట మేరువునకు సవ్యముగాఁ దిరిగి యంత నవఖండావనీతల తీర్థంబులం జూచుచు భూప్రదక్షిణ మొనరించి త్రివేణీ సంగమంబునకుం బ్రయాగ కేగిరి. వారటనటఁ గావించిన లోకోద్ధారక మహాకార్యంబు లన్నియు నభివర్ణింప నేరితరము? అనేక లీలావివరణంబున గ్రంథవిస్తరహాను గాన శక్తికొలఁది నొక్కింత వక్కాణింతు.

శ్రీగురులు ప్రయాగం జేరినట్లువిని తద్దర్శనలాలసమానసుండగు మాధవాఖ్యుండొక ద్విజశ్రేష్ఠుండు సమాగతుండయ్యె. అతండర్థింప గురుండు కృపతోడఁ దుర్యాశ్రమంబొసంగి తత్త్వబోధఁగావించె. గురుపాదుల కాశ్రయులైన వారనేకులు కలరు.

కాని యీమాధవ సరస్వతియెడ వారి కత్యధికప్రీతి యేర్పడ నయ్యె. అంత నిజాశ్రితులనుసరింప వారన్యతీర్థంబులకుం బోయిరి.

## జ్ఞానకాండము — ౧౩ దశము.

నామధారకుండు కేల్మోడించి సిద్ధున కిట్లను: "భవతారకా! చెవులారంగా నిది విన్నకొలందిఁ దనివితీఱకున్నది. ఆఁకొన్న గిడ్డికిఁ గావలసినంతగడ్డివాము యెగఁబడిన నెట్లది వీడిపోనొల్లదో నామదికిపు డట్లున్నది. ఏనాఁడునిన్ని మజ్జిగనీళ్లయిన నెఱుంగనివానిం బాలకడలివద్దఁ జేర్చిన వాఁడదివిడుచునా? అల్లే యల్పజ్ఞుఁడను నవిద్యావేష్టితుఁడనై కష్టస్థితి నున్ననాకుఁ దమంబుఁ బాపజ్యోతిస్స్వరూపులరై గురుసందర్శనం బొదవించువారైతిరి. ఇంతటిమేలు నాకొడఁగూర్చిన మీ కేనేమి ప్రత్యుపకృతి గావింపఁగల్గుదునో బోధపడకున్నది. దేనికేని ప్రతి సేయవచ్చుఁ గాని కల్పవృక్షమును చింతామణిని బ్రసాదించువారి ఋణము తీర్చుకో నలవియౌనా? నేనొకఁడనుగాను మావంశపారంపర్యముగాఁ దరతరంబులుగఁ దీర్చినం దీఱునదా? భవార్తిహారా! మీ బోధవల్ల నిరంతర సంతోషంబును వరగురుభక్తియుం జేకుఱె. ఇఁక శ్రీగురుపాదులు మాధవసరస్వతులకు దీక్షాదానం బొసంగిన వెనుకఁ బ్రయాగవీడి యెటకేగిరో సెలవీయరైతిరే' యను శిష్యుని వచోరచన కలరి ప్రసాదదృష్టిని దన్మస్తకంబున నిజహస్తకమలంబుంచి ముదముతోఁ బైకథవినిపింప నిట్లు మొదలిడెను.

"ఓయి గుణమణీ! శిష్యాగ్రణీ! గురుపాదంబులు నీకిఁక దొరకినవి. ధన్యుఁడవోయీ! సంసారపంకంబు నీకింకనంటదు. గురుభక్తి కుదిరెఁగావుననే యిట్లడుగుచున్నాఁడవు. నీసంప్రశ్నంబు నాకత్యంతానంద జనకంబుసుమ్ము. చెప్పెద నిఁక వినుము: శ్రీగురుస్వాములు కొంత కాలము ప్రయాగలోనుండి మాధవసరస్వతులకు దీక్షాదానంబుఁ జేసిరి. పిదప నెందఱో

వారి శిష్యులైరి. అందు ముఖ్యుల నేడ్వురం జేర్కొందు. వారెవ్వరనిన బాలసరస్వతి కృష్ణసరస్వతి ఉపేంద్ర సరస్వతి మాధవసరస్వతి సదానందసరస్వతి జ్ఞానజ్యోతి స్సరస్వతియుం గడపటివాఁడనేన. ఇందుత్తరోత్త రాధిక్యముం దెలియఁ దగినది. శ్రీగురుస్వాములు తత్తచ్ఛిష్యానీక సహితంబుగాఁ బెక్కుక్షేత్రంబు లన్నిట్టి తుదకు మాతృవందన మొనర్చి నిజజన్మ పురంబగు కరంజనగరమ్మున కేగిరి. అచ్చోటఁ గన్నవారిం దోడి వారి నూరివారిం బ్రేమమీఱ గౌరవించి వారివారి సపర్యలందు చుండె. ఏకకాలంబుననే పెక్కుఅచే నిమంత్రితులయ్యుం గాదనక బహురూపధారులై యింటింట భిక్షాన్నగ్రహణంబు గావించు చుండిరి. లోకులదికని విస్మితులై యీతండు యతివేషంబున భూమికిం డిగ్గినవెన్నుండె. ఈతఁడు నరమాత్రుం డనుకొన్న నారకంబు ప్రాప్తించు'ననికొనిరి. ఆతండు కార్యార్థ మవతరించిన శ్రీమూర్త్యవతార పూరుషుండని యెఱింగిన తలిదండ్రులుం బూజలసల్పిరి. అయ్యెడ స్వాములు ప్రసూపూర్వస్మృతి ప్రసాదార్థము శ్రీపాదాకృతి నగపడిరి. అపుడాయమ తత్పాదంబుల కెఱఁగితత్సత్యసంకల్పంబును బ్రదోష పూజాఫలంబును గుర్తించి భర్తతోఁ దాను బ్రాగ్జన్మంబున విశ్వవంద్య పుత్రప్రాప్తింగోరినం దుల కిట్లనుగ్రహించి శ్రీపాదులు ప్రసన్నులై తన్ను ధన్యం జేసిరని తెల్పుచు భవార్ణవంబునుండి తరింపఁజేయుమని గురుస్వాములకు శరణుఁజొచ్చె.

స్వాములంబ కిట్లు తెల్పిరి: 'కులమున నొక్కండు తుర్యాంబున బుట్టఁగలిగిన నాతనికి ముందిరువది యొక్కటియు వెనుక నిరువదియొక్కటియుం దరముల వారందఱ నుద్ధరింపఁ జాలెడిని. మఱియుం దత్కులసంజాతుల కిహమున భయదుఃఖాదులు లేక శాశ్వతబ్రహ్మపదంబు ప్రాప్తించెడిని. మున్ను నారకం బనుభవించువారు నూర్ధ్వగతికి మఱలుదురు. ఇంకేమి చెప్పుదు? ఇంక నేను మీకడుపునఁబుట్టి యిట్లాశ్రమినౌట మీకు యమునివల్ల

భయమే లేదు. బ్రహ్మపదంబు మీకబ్బుట నిస్సంశయంబు. తక్కిన మీసంతతి యష్టైశ్వర్యములతో వేదోక్త పరిపూర్ణాయు స్సంపద నందఁగలిగెడి. మీరు తత్పుత్రపౌత్ర సుఖానుభూతింగని చరమమునఁ గాశికిఁ జేరఁగలరు. అయ్యది మోక్షస్థానంబు కాదే! ఇంకఁ జింతయేమిటి'కని యిట్లుపన్యసించుచుండ నంబాగర్భ ముక్తాఫలంబ యగు రత్నాంబ నిజాగ్రజస్వాముల పదాబ్జములంటి సవినయంబుగా నిట్లనె:

'భక్తకల్పద్రుమా! భవాంబుధిన్మునింగి మోహంపువలను జిక్కియున్న యబలను. తాపత్రయ బడబానలంబున వగచుచున్న దానను. నాయెడ ననుగ్రహించి నిర్లిప్తతఁ బ్రసాదింతురే నట్లే నేగి తపమాచరింపఁ గోరుదాన'ననినంత స్వాములు చిఱునవ్వుతో నిట్లు బదులువల్కిరి: 'సౌభాగ్యవతీ! సతులకుఁ బతిసేవకంటె గతి వేఱుండెడినే? నీకేమి? తపస్సేమి? తగదు. తగదు. పాతివ్రత్యంబున కలరి పశుపతి సద్గతిఁగూర్చు. దాన నిస్సంశయముగా నిష్టాప్తి యగు. కావునఁ బతిసేవయే భవతారకమను మనోనిశ్చయంబున నిజపతియే పశుపతియని కొలిచి శ్రుతివిహిత సద్గతింగనుము. చింత వాయు'మనవుడు నారత్నాఖ్యయువతి కేలొగ్గి యిట్లడిగెను: 'స్వామీ! మీరలు సర్వజ్ఞులరౌట నస్మత్ప్రారబ్ధ భవితవ్యాదికంబులం దెలుపఁ గోరెదననను. అందుల కాయతికులతిలకులు పలికిరి: "అమ్మాయీ! నీవు తామసవాసనాకలితవు. నీవనుభవింప వలసిన పాపసంచితం బింకఁగలదు. తొల్లిటి పుట్టువున నీవుకొట్టిన దెబ్బవల్ల నొకగోవు మృతినందె. పొరుగింటి భార్యాభర్తలం గలహంబు కల్పించిన దానవైతివి. తత్కర్మవిపాకం బిఁకఁ జెప్పెద వినుము. ధేనుప్రహార దోషఫలంబై నీదేహంబునఁ గుష్ఠవ్యాధి యేర్పడు. మున్నుకూడియున్న కాఁపురముఁ గూలఁ ద్రోసినందులకగు ఫలితంబై నీపతి యతియై నిన్నుఁ ద్యజించెడి' నని నుడివిరి. అది విన్నంత నతిఖిన్నయగు నాయన్ను తన్నుద్ధరింప వలయునని యతిపాదంబులంబడి విలపించెను. అపుడు

గురుస్వామి యిట్లనుగ్రహించెః "బాలా! కొంతకాలము సుఖం
బుండుము. ముదిమిని బతి యతి కానౌనులెమ్ము. అపుడే నీదే
హంబునఁ గుష్ఠంబుగల్గు. ఇట్లు పాపఫలం బనుభవించిన వెనుక
నంతమున సద్గతియే యబ్బునులెమ్ము. ఇఁక నీయొడలియందుఁ
గుష్ఠం బంకురించినప్పుడు నాదర్శనంబు నీకయ్యెడిని. భారత
వర్షంబున దక్షిణదిక్కున భీమామరజాసంగమ స్థలంబున గంధర్వ
నగర విఖ్యాత పాపనాశతీర్థంబుం జేరుము. నన్నటఁజూడఁగల'
వని చెప్పి స్వామి యచ్చటువాసి గౌతమీనది యుదితంబైన నాశి
కాఖ్య త్ర్యంబకక్షేత్రంబునకు ఛాత్రసహితుండయి నడచె.
అక్కడ నడచిన వృత్తాంతంబెల్ల వివరింప మొదలిడిన గ్రంథ విస్తర
మౌను. సంక్షిప్తంబుగాఁ బల్కెదను.

గోదావరీ మాహాత్మ్యం బనన్యదుర్లభంబు. తదుభయ
గంగాతటంబుల నిటునటు నొందుగాఁ దీర్థంబులు విరాజిల్లు
చున్నవి. ఈసరిద్వరంబు సర్వేశ్వర జటాజూటంబునుండి భూ
మండలంబునకు మహర్షి ప్రేరణంబునం దేఁబడినది. మున్ను
మునిసత్తములు మంత్రబలంబున నిష్టార్థంబు లందెడివారు. ఒక
ప్పుడు గౌతమమహర్షి శాల్యాహారభక్షణ దీక్షం గొని తపం బాచ
రించుచుండెను. కొంతకాలమున కటఁజేరిన మానులు కొందఱు
తమలోఁదామి ట్లనుకొనఁదొడఁగిరిః "ఈగౌతముఁ డీశ్వరభక్తుండు
నుపాత్తమహిముండు. ఈతండు తలపెట్టిన నెట్టిన నెట్టి [illegible]
బైన నెట్టఁగలఁడు. గంగావాహిని నవనికిం జేఁగల్గనేని మనకుఁ
ద్రికాలస్నానసుఖాలంబుగా నుండెడిఁగదా. గౌతమీతీరంబు
నందున్న క్షేత్రంబునఁ గోటివర్ష తపఃఫలంబు చేకురు. అట్టి
మనకు లభించుటకు గౌతములప్రా[illegible] యావశ్యకము. వారో
పోదేని సంకట మొదవినఁగాని [illegible]. కా[illegible]
మనము యోజించి యాతని కొక [illegible]నికొనుచు
దూర్వామయంబుగా నవత్సగోరూపము నేర్పఱచి ప్రాణప్రతిష్ఠఁ
గావించి గౌతమర్షి[illegible]ని ధాన్యము నమలి వేయ విడిచిరి.

జపానుష్ఠానమున నున్న యావుం గని యొక దర్భపోఁచ నభి మంత్రించి యద్దాని పావలికిఁ బోఁగొట్ట విడిచె. అదియు వజ్రా స్త్రమై యామాయాధేనువును బరిమార్చెను. దాన గౌత ములకు గోహత్యామహాపాతకంబు సంప్రాప్తమయ్యె. అప్పు డయ్యెడఁగల యామునులందఱేకముఖంబునఁ బ్రాయశ్చిత్త నిరూపణం బొనర్చిరి. అతనితో గంగం దెచ్చి యందు మునింగినఁ గిల్బిషం బడంగుననిరి. గౌతముండును వల్లెయని తదాచరణో ద్యోగియై దీక్షనూని మహాతపంబుం బ్రారంభించెను. అట్లొక్కవే యేండ్లాతండు ఘోరతపంబు సల్ప గంగాధరుం డప్పటికిఁ బ్రసన్నుండై వరమడుగు మిత్తుననియె. గౌతమమహర్షి లోకోద్ధరణార్థము గంగం బ్రసాదింపుమని యభ్యర్థించె. వ్యోమకేశుం డందుల కలరి మానవపాపహారిగా నద్దానిం బుడమికి విడిచె. గౌతమీ నది భాగీరథీసమ ప్రభావాంచిత యయ్యె. కావున శ్రీగురుండు లోకానుగ్రహార్థమై తత్తటస్థితానేకతీర్థపర్యటనంబుఁ గావించుచు మంజరీకంబున మాధవారణ్యుండను నొక మౌనిం బొడఁగనెను. అతండు నృసింహభక్తుండు. తాను మానసపూజావేళల ధ్యానించు వల శ్రీగురుస్వరూప సాక్షాత్కార మాతనికిఁ గలిగె. అపుడా రూపమునఁ దేజరిల్లు నీ మహామహుం గనినంత విస్మితుండై సాష్టాంగ ప్రణామపూర్వకంబుగా బహుప్రకారంబుల సంస్తు తింప సంతుష్టాంతరంగుండైన గురుస్వామి యాతని సన్నుతికి మెచ్చి తా నా మౌనికి ధ్యానగమ్యుండై తన్మనఃఫలకమున ననవరతము నిలుతునని యనుగ్రహించె. ఇట్లనుగ్రహించి దివ్యాకృతి నగపఱచె. అట్టి శ్రీగురుమూర్తిని నుత్తమ కర్పూర గౌరాకార సాక్షాత్కారంబైనంతనే యాగణ్యపుణ్యుండగు మాధవారణ్యుండు వినయావనత వదనుండై కేల్మోడ్చి యిట్లనియె: 'ఓ హరీ! జగ ద్గురూ! సామాన్య దృష్టిని మీరలు నరులరుగా నగపడినను సాక్షాత్పరంజ్యోతి స్వరూపులగు త్రిమూర్త్యవతార పూరుషులరు. లోకులఁ దరింపఁజేయనేర్పడితిరని యెఱింగితి. భవచ్చరణాంభోజ

సందర్శనంబునఁ గృతార్థత చేకుఱె' ననుచు నానందబాష్ప పూరి తాత్ముం డయ్యె. అంత శ్రీ గురుస్వాము లిట్లనుగ్రహించిరి: 'మాధవా! నీకు మంత్రసిద్ధియైనది. సద్గతి దొరకినది. శాశ్వత బ్రహ్మలోకావాప్తియు నిస్సంశయంబు. నీవనుదినమును నీమానస పూజలో నృసింహాకారునన్ను ధ్యానించితివి. ఇపుడు ప్రత్యక్షముగాఁ గనఁగలిగితివి. నీ వేడికోరెద వది యందెదవు గాత' మని ప్రసాదించి యచ్చటువాసె.

అంత సద్గురుండు సాశ్రువుండై తత్తీరంబుననే తగు వాసర బ్రహ్మేశ్వర క్షేత్రంబునకు స్నానార్థమరిగి యచ్చోట శూలరోగ పీడ సహింపలేక యసువులు వీడవచ్చిన యొక్కవిప్రుని జూచె. పాపమా బాఁపనికి భోజనము సేయుచున్నం బరిణామ శూలవల్ల మరణ మాసన్నమయిన ట్లుండెడిది. కాన నాతఁడు కడుపార భుజింప నెఱుంగఁ డయ్యెను. నెలకో పదేను దినాలకో పిడికె డన్నముఁ దినినంతఁ గడుపునొప్పిచే గిలగిలమని తన్నుకొనుచుండె. అట్టి యాద్విజుండు తత్పూర్వదినముననే నాల్గుమెతుకు లెక్కువ మెక్కుట వెక్కసమగు నక్కడుపునొప్పి కోర్వలేక గంగలోఁబడి ప్రాణత్యాగంబొనర్పఁ గృతనిశ్చయుండై యొటులో యటఁ జేరి పెద్ద పెట్టున నిట్లని విలపింపఁ దొడఁగె: 'అయ్యో! యీ పాపపుబ్రతు కెందులకు? ప్రాణాధారమగు నన్నము తినలేని మనికి కంటె మరణమే మేలు. ఛీ! యీజన్మమేల?' యనుచు మెడకొక రాతిని వ్రేలాడఁగట్టుకొని యీశునుద్దేశించి యిట్లు ధ్యానించె: 'స్వామీ! భూమికి భారమైతిని. ఒరులకింత యన్నము పెట్టనైతిని. జన్మాంత రంబున నేపుణ్యంబుం జేయనైతిని. బ్రాహ్మణ ద్రవ్యమునే హరించితినో గోవులముందున్న గ్రాసమే తీసివేసితినో విశ్వాస ఘాతుకుండనైతినోకాని యింతటి కష్టంబు సంప్రాప్తమయ్యె. ఈశ్వరారాధనం బెఱుఁగమినో తలిదండ్రుల గౌరవింపమినో గురువుల నిందించుటనో బ్రాహ్మణోత్తములఁ దూలనాడుటనో యతిథుల వెడలఁగొట్టుటనో యిట్టిపాపఫలం బనుభవింపవలసె. ఆహా!

కాఁపురములఁ గూలఁద్రోసితినో వనముల నగ్గిని రగుల్కొల్పితినో జననీజనకుల విడిచి దారతోడఁ గుడిచితినో యింకే పురాకృతాఘ సంచితం బేర్పడెనో నేఁటి కిట్లనుభవమునకు వచ్చె" నని యేడ్చి యేడ్చి గోదావరిలోఁ బడ్డవానిం జూచి శ్రీగురుండు శిష్యుల కిట్లాజ్ఞాపించె: "అరరే! యెవఁడో యాత్మహత్య చేసికొను చున్నాఁడు. అయ్యో! యెంతపాపకృత్యము! పొండు. ఎందులకో యడుగుఁడు. వాని నిటు కొనితెం" డనవుడుఁ దచ్ఛిష్యులం గొందఱు పరువిడి నీటిలోనుండి వాని నీవలికీడ్చి గురుసమ్ముఖంబున నుంచిరి. అయ్యనాథనాథుం "డిదే మిట్టి యాత్మహత్యా మహాపాతకంబున కొడిగట్టుకొను చున్నాఁడ' వని యల విప్రునడిగె. అతఁడందుల కిట్లనె: "అయ్యా! యెందులకు మీరట్లడిగెదరు? మీరేమి సేయఁగలరు? నాదొక యనికిమాలిన పాడుజన్మము. భూమికి భారమైతిని. పదేను దినాలకో నెలకో యొకమాఱు గుప్పెడు మెతుకులు తిన్న నవి కడుపునఁబడి యుదుమలఁ గుడుపుచున్నవి. ఈబాధ కోర్వలేక ప్రాణములం దీసికొనుటే యంతకంటె మేలనిపించి యేటిలోఁబడితిని. స్వామీ! యీదేహ[illegible]మ[illegible]మాయె. అన్నద్వేషము కలిగిన వెనుక మనికి యేమిటికి?' కనియె. గురుస్వాములు కృపాయుక్తులయి యిట్లు పల్కుచున్నారు: "ఓయీ! నీవు మిక్కుటమగు బాధ నొందుచున్నావు. ఇపుడు నీకొక యౌషధము జెప్పెద. వెఱవకుము. సంశయింపఁగ నక్కఱలేదు. వ్యాధి రూపు[illegible]యు మందిదె నీభాగ్య[illegible]నంతవఱకుఁ గడుపార పిష్టాన్నభోజనంబుఁ గావించు [illegible]గాత"మనిరి. అట్లు గురుప్రభులు పల్కినంతనే కొంత శాంతి పొందిన మంతనంబుతో నాబాడబుఁ డవ్వారిపాదంబుల నిజశిరంబు వాల్చె.

అయ్యవసరంబున నొకగ్రామాధికారి యగు బ్రాహ్మణుం డచ్చోటికి స్నానార్థ మేగుదెంచినవాఁడై శ్రీగురువరేణ్యులం గనఁ గల్గినంత నమితభక్తి వొడమఁ దత్పాదంబులకు సాష్టాంగ దండ

ప్రణామంబుఁ జేసె. ఆతనింగని దయతో గురువు లరసినంత నిజ వృత్తం బిట్లు తెలిపెః "స్వామీ! మాయది యాపస్తంబశాఖ, కౌండిన్యసగోత్రజుఁడ. నన్ను సాయన్దేవుఁడని పిలుతురు. మా కాఁపురము కాంచీపురము. ఉదరపోషణార్థ యవనావనీపాలసేవ కుండను గావలసి పరిసరగ్రామాధికార పదంబంది యొకసంవత్సర కాలమునుండి యిట్లున్నవాఁడను. నేఁటికి నాపూర్వపుణ్యవశ మున నేలినవారి పాదదర్శనలాభం బొదవుటఁ గృతార్థతఁగంటిని. జన్మాంతరకృత కిల్బిషంబులెల్ల నంతరించె. మీకృపఁ బడసిన భవార్ణవతరణ సాధనం బదియౌననుట కబ్బురమే? ఎంత తపం బాచరించిననో కాని లాభింపని భవత్పాదసందర్శనంబు నాకిపు డప్రయత్నముగాఁ జేకుఱె.

ఆ॥ గంగవల్లనడఁగుఁ ♦ గలుషంబులెల్లను
దమ్ములపగవాఁడు ♦ తాపముడుపు
ధరను గల్పకంబు ♦ దైన్యంబుఁబోఁగొట్టుఁ
దారొపాపతాప ♦ దైన్యహరులు.

మీకృపావీక్షణంబు ధర్మార్థ కామమోక్ష ఫలప్రదంబ కాదే" యని పునఃపునః కృతప్రణాముండు కానుట్యు. అపు డాతని గురుపాదులు సాదరంబుగా దరిం గూర్చుండఁజేసి యిట్లు చెప్పఁదొడఁగిరిః "ఓయీ! నేను జెప్పునది [illegible] వినుము. పాపమీ బాఁపండు జఠరవ్యగ్రతుండై యున్నవాఁడు. ఆఁకలివల్లఁ బ్రాణంబులుం బోవును. ఈతనికి శూలరోగోపహరం బగు. [illegible] మీయింటికిం గొనిపోయి మధురాహారం బిడుముతిని. దాన వీని యాఁకలి యడఁగి రోగంబు నుడుగు. ఆఁకొని యున్నాఁడు. త్వరగాఁ దీసికొనిపొమ్మని యాజ్ఞాపించె. సాయందేవుండది విని "స్వామీ! అట్లుచేయుదుంగాని యన్నము తిన్ననే [illegible]తనికి ముప్పువాటిల్లునే. నెలదినాలకు నిన్న నేమాత్రమో యింత తిన్నంత బాధ దుర్భరమై యేటిలోఁ బడవచ్చెనే. ఇపుడింక నేను పెట్టించిన నీతండు బదుకునా? పుణ్యము వకుఁబోయి పాప

మొదటఁ గట్టుకో వలయునేమో! బ్రహ్మహత్య దాపరించునుగదా!"
యనెను. శ్రీగురునందందుల కిట్లనును: "నేను చెప్పుచున్నాను
గదా. గారెలు బూరెలుఁ బరమాన్నమే వీనికి మంచిమందు. అట్టి
యాహారంబిడిన నీతనివ్యాధి నివారణమై తీఱును. అనుమానిం
పక త్వరగాఁ బెట్టు" మనిరి. సాయందేవుం డట్లయని సద్గురు
స్వాముల నిజగృహంబునకు భిక్షార్థము శిష్యసహితులరై దయ
సేయుండని యభ్యర్థించె. స్వాములు సంగీకారసూచక నారా
యణస్మరణ మొనర్చిరి. భూదేవుండు హర్షపూరితుండై స్వాముల
వారిని దదనుచర శిష్యవర్గమును శూలరోగియగు విప్రునిం దన
వెంటఁ గొనిపోయె. తద్గృహిణియా పతివ్రతామణి వారిం గని
యుప్పొంగి షోడశోపచార పూజలం గావింప నిజభర్త కన్నిటఁ
దోడునీడయై మెలంగె. వారల పూజావైచిత్ర్యంబు శ్రోత
వ్యంబు. నాకన్నులారఁ జూచితి. సమాగతులం బూజింప నంద
ఱకు వేఱువేఱుగా మండలంబు లమర్పఁబడియె. ఒక్కొక్క
దానిలోఁ జక్కని పలురంగుల ముగ్గులు దిద్దఁబడియె. అంత
నతిభక్తి వినయ సంభ్రమంబులు పెంపగొన నాదంపతులు యతు
లకు సాష్టాంగప్రణామ పూర్వక స్వాగతమొసఁగి మధ్యస్థితమండ
లంబునఁ జిత్రాసనాసీనులం గావించిరి. తచ్ఛిష్యుల కుచితాస
నంబుల నొసంగిరి. పిమ్మట గురులకుఁ బాద్యార్ఘ్యాద్యుపచా
రంబుల నలిపి పంచామృతాదులతో రుద్రసూక్తపఠన సహిత
ముగా నభిషేకించి వస్త్రమాల్యాదుల సమర్పించి పాదతీర్థ
గ్రహణానంతరమున నీరాజనం బొసంగి గీతాదికంబులఁ సల్పిరి.
ఇట్లే తచ్ఛిష్యులకుఁ గూడ షోడశోపచారంబులు జరిపి దేవభావం
బునఁ బుష్పాంజలి ఘటించ గురుస్వాములు వారలభక్తి కలరి
సత్సంతాన సౌభాగ్యాభివృద్ధి యొసఁగి తద్వంశజు లందఱు దైవభక్తు
లయ్యెదరు గాకని యాశీర్వదించిరి. అంతట భోజనంబు
లమర్చి భోజనీయ వివిధమధురాహార పదార్థాన్నపానంబుల సంతర్ప
ణంబు గావింపఁబడియె. గురుపరిభృత్యులతోడ మన పరిణాము

పోలియు యథేష్టంబుగా భక్ష్యభోజ్యంబులం గడుపారఁ గుడిచిన నాతని కెట్టి బాధయుఁ గలుగదయ్యె. విప్రుని కానందమునను దత్ప్రత్యుల కాశ్చర్యమునం బరవశత కలిగె. పరుసవేది తాఁకున లోహంబు సువర్ణత నందుకైవడిని శ్రీగురుకృపాప్రసార మాత్రంబున నావిప్రునికాయంబు వజ్రతుల్యంబు కానయ్యె. తత్కృపాప్తిని దైన్యనాశం బొదవుట కబ్బురమేమి? భానూదయంబున నంధకారంబు వాయకుండెడినే? చూచితివా నామధారకా! శ్రీగురు కృపావృష్టి యెవ్వరిపైఁ గురిసిన నవ్వారి జన్మాంతర దోషంబులెల్లను గొట్టుకొనిపోయెడిసుమీ! ఇఁక రోగాలు పోవుటొక లెక్కయా?

జ్ఞానకాండము — ౧౪ దళము.

నామధారక సంప్రశ్నంబువిని సిద్ధుం డవ్వలికథ యిట్లు వచించె: 'భక్తిప్రకారవేత్తయైన సాయందేవుని సంపూజనంబున కలరి ప్రసన్నుండయిన శ్రీగురునాథుండు సాంజలియై యిట్లుసంస్తుతించె: 'స్వామీ! మీరు మాయామానుష విగ్రహులరు. వేదాతీతులరగు త్రిమూర్త్యవతార పురుషులరు. విశ్వవ్యాపకులరైయు భక్తులనుద్ధరింప నిట్లవతరించితిరి. భవన్మహిమాభి వర్ణనంబొనర్ప నేనెంతటివాఁడను. మద్వంశజులకుఁ బుత్రపౌత్రాది సౌఖ్యంబును మీపాదభక్తియుం గలుగ ననుగ్రహించితిరి. ఇఁక నొక్క మనవికలదు. దయచేసి యవధరింపుఁడు. నేనొక క్రూరరాక్షసకల్పుండగు యవనాధిపుని కొలువునలుపువాఁడను. అతఁడేటేట నొక బ్రాహ్మణునిఁ జంపుచుండు. ఇపుడది నాపాలఁ బడనున్నదేమో! ఇప్పుడ చప్పున రమ్మని యాఘాతుకుఁడు నన్పిలువనంపె. దరికేగినఁ బొరిగొనును. ఏమైనఁగానిండు. ఇదిగో మీచరణములనునమ్మి శరణుఁజొచ్చితి ననియె. అదివిని గురుండు తచ్ఛిరంబున నిజకరంబుంచి సాదరవాక్కుల నిట్లభయప్రదానంబుఁ జేసె: 'ఓయీ నీవిఁకఁ జింతింపకుము. నిర్భయంబుగఁ జనుము. యవనుండు కూళయైననేమి? నీజోలికి రాఁడుతెమ్ము. నిన్నుఁ ప్రేమతో

మాట్లాడి యంపివేయును. పొమ్ము. నీవిటు తిరిగి వచ్చుదనుక నేనిట నుందును. నీవుమఱలిన వెనుకనేఁ బోవుదు. నీవు నాభక్తుఁడవైతివి. నీవంశజులో యింకట్లు కానున్నారు. అట్టియెడ నీనిష్ఠార్థంబులఁ బడయకుండదవే! నీవింకఁ బుత్త్రపౌత్త్రాభివృద్ధిగా సుఖంబుండెదవుగావుత. నీవును నీవంశజులెల్లరు దీర్ఘాయుష్మంతులై యఖండ కారోగ్యైశ్వర్యాహ్లాదంబులతోఁ జెంపొందెదరుగాత' మను శ్రీగుర్వాశీర్వాదంబు లందిన గ్రామాధికారి సాహసించి యవనాధిప దర్శనార్థమరిగె. అకటకట తురక కాలాంతకోపమ కష్టాత్ముండయ్యు నీవిప్రునిఁ బొడఁగని తాఁగుపితుండైయు హింసింపక విముఖుండై లోనికేగెను. సాయందేవుండు చకితాంతరంగుండై శ్రీగురుసంస్మరించె.

ఆ॥ చిచ్చునచటనేని ♦ చెదలంటఁగలుగునే?
గరుడుఁ జంపనౌన ♦ యురగములను?
హరినిమ్రింగునెట్లు ♦ నైరావతంబల్లి
కలదె గురుకృపాప్తిఁ ♦ గలిభయంబు?

సద్గురువర చరణారవిందము లనవరత మెవ్వని మదినంటియుండు నవ్వానికిఁ గాలమృత్యుభయంబె లేకుండునన నింక నపమృత్యుభయం బెలయుండెడిని? యమునిభయమె లేనప్పుడింక నొక యవనునివల్లనా భయము? అట్టిచ్చోఁడే గురుభక్తిభావుండౌ సాయందేవుని పొడఁగనినంత భ్రాంతచిత్తుండై యంతఃపురంబుఁ జేరి తూఁగి పడి స్మృతిఁదప్పె. అంతటఁ దద్దేహంబు గ్రాఁగినట్లై ప్రాణాంతికవ్యథ నొందఁదొడఁగె. అపుడావిప్రుండు తనను శస్త్రంబుతోడఁ జిత్రవధ కావించుచున్నట్లు కలఁగని యంతలో మేలఁకువరాఁగాఁ బరువిడి తూలిపడుచు నీవలికివచ్చి దోసిలియొగ్గి యిట్లనియె: "అయ్యా! మీరే మారాజులు. బాబూ! మిమ్మిపుడెవ్వరు పిలిచిరి? మీరింక దయసేయుం" డని గాంగేయచేలాభరణాదికంబు లర్పించి సగౌరవంబుగా నాతని నంపివైచె.

పెద్దపులి పిల్లియైనందుల కత్యద్భుతానంద పారవశ్యంబునందిన సాయందేవుండు తన్నుం దరింపఁజేసిన గురుం దలపోయుచు సత్వరంబుగఁదత్సందర్శనంబు సేయవచ్చెను.

నిజగ్రామ పరిసర నదీతీరంబునకు స్నానార్థ మరుగుదెంచిన శ్రీగురూత్తములంగాంచి వారికి సాష్టాంగ దండప్రణామ పూర్వకానేక స్తుతివాక్యంబులతో రాజదర్శన వృత్తాంతంబు సాకల్యంబుగా నివేదించె. గురువు లందుల కానందించి యాతని దీవించి డించి యన్యతీర్థంబుల సేవింప దక్షిణదేశంబుల కేగ నెంచెదమనినంత సంప్రాప్త సహోదయుం డీనూతన శిష్యుండు కేల్మోడ్చి యిట్లు విన్నవింపఁదొడఁగె: "స్వామీ! నేనును మిమ్మనుసరింతు. భవహారకంబులౌ మీచరణంబులు వీడి క్షణమాత్రంబు నేనిట నిలువనేర్తునే? మున్ను సగరు నుద్ధరింప జాహ్నవియట్లు నాకు మీరలైతిరి. భక్తవత్సలా! నన్ను వీడకుఁడు. మీతోడనే యుండువాఁడ" నని గురుపాదంబులం బడియె. అందులకు స్వామి ముదితుండై యిట్లు బదులిడియె: 'భక్తా! నేనిప్పుడు కార్యార్థము తీర్థాన్వితంబగు దక్షిణదిశ కేగుచున్నాఁడ. తిరిగి వచ్చునెడఁ బునర్దర్శనం బొసంగెదను లెస్స. చింతింపకుము. అరిష్టంబు వాసె. సుఖముగా మను' మని తచ్ఛిరంబున నిజకరంబిడి యాతని నాశ్వాసించి మఱలించి సానుచరుండై కతిపయప్రయాణంబుల నారోగ్యభవానీ విరాజిత వైద్యనాథక్షేత్రంబుఁజేరి యట గురు లంతర్హితులైరని సిద్ధుండుపలికె. అది విన్నంతనే యాశ్రోత 'గురులట గుప్తతఁగన నేల? అప్పుడెఁ దచ్ఛిష్యులెటనిల్చిరి? సెలవీయరే' యని పృచ్ఛసేసె.

జ్ఞానకాండము — ఏకాదశము.

గురుపదంబుల నామధారకున కొదవిన దృఢభక్తి కిఁగుబ్బి సిద్ధుండు తద్గోపనప్రకారం బిట్లు తెలిపె: అప్పటికిఁ దన్మహిమను క్రమముగా వ్యాప్తమౌట లోకులు వారి వారి కోర్కెల్లం దీరిచి కొన దూరదేశములనుండి తత్సందర్శనార్థము రాఁదొడంగిరి.

ఈకలిలో సాధువులు నసాధువులు ధూర్తులుంగూడ ఛాత్రులుగాఁ జేరవత్తురు. మున్ను భార్గవుం డగణ్య రాజులనెల్ల నుగ్గడించి భూదేవుల కఖిలావనీతలం బధీనము గావించి తాఁ దపంబొనరింపఁ బశ్చిమసముద్రతీరంబుం జేర. గొందఱు విప్రు లక్కడను నాతని ముక్కుమూసికొని కూర్చుండ నీయరైరి. వారానకొలఁది దేవురించుచు నాతని వెంటఁబడి తుద గొరులకు దానమొనర్చిన నేలపైఁ గూర్చుండు టేమిటి కనిరి. అతండది విని విసివి జలధివల్ల నుండి సహ్యాదక్షిణస్థిత కొంకణాఖ్యామల భూతలంబుం గొని యాచకు లచ్చెరువడ నచ్చటువాసె. అట్టి శ్రీగురుమూర్తియుఁ దనను జేరి కోరువారికెల్లఁ బాత్రాపాత్రవిచక్షణంబుడిగి వరము లిడు టనుచితంబని తాన తిరోహితుండయ్యె. అతండు మాయాతీతుండైన జగద్వ్యాపకుండైయు సోపాధికుండైన యీశ్వరుండ కాదే? ఇఁక నశ్వరంబులగు వరంబు లిడుచుం దిరంబుగ ధరం బరంగునే? కావున నృసింహమూని యొక్కనాఁడు నిజానుచరాశ్రివాసికంబు నెల్లఁ జేరఁబిలిచి యిట్లుపలికె: 'ఛాత్రులారా! తీర్థయాత్ర లొనర్చుచుండుఁడు. శ్రీశైలంబున మరల నన్నుఁ జూడఁగల" రన్నంతనే వారొండొరుల ముఖంబులం జూచుకొని యొక్కుమ్మడి నేలకువ్రాలి యిట్లు మొఱ్ఱవెట్టిరి: "గురురాజ! కృపామూర్తి! మిమ్మునమ్మియున్న మమ్మెల్లర నుపేక్షింపనేల? భవత్పాద దర్శనంబునన సర్వతీర్థ సంసేవనమహాఫలంబు లభించునాయె. అట్టిదీనిని విడిచి మేమింకనేగంగన్నునుంగం గల్గు ఫలంబేమొకో యెఱుంగరాదు. భవచ్చరణంబులందే యఖిల తీర్థంబులుం గలవని నిగమాగమప్రసిద్ధంబ కాదే?

ఆ. చిచ్చుమొత్తనేల ♦ పెన్నిధి దరినుండ ।
గులకరాలవేల ♦ కొండదండ ।
ముండ్లమొక్కలేల ♦ ముందుండఁగల్పకం ।
బేటికేలమాకు ♦ మీరుగాక ॥

యన విని స్వామివరులు వారికిట్లుద్బోధించిరి: 'సన్యాసులమాట నొక్కట నైదు దినాలుండఁగూడదు. మనకుఁ దీర్థాటనము కర్తవ్యము. ఇఁకఁ జిత్తస్థైర్యమొందన నేకాంతవాసం బనుష్ఠేయము. నేను జెప్పినరీతి నాశ్రమ ధర్మంబు నెఱపునది. ఓయతులారా! మీరిట్లే నడచి యాయాతీర్థంబులఁ గనుచు బహుధాన్యనామ సంవత్సరమున శ్రీశైలక్షేత్రంబున మెట్టుఁడు. నేనయ్యెడ మీకుఁ బునర్దర్శనం బొసంగుదు'నని యాన వెట్టెను. అంతనాయతి శిష్యులెల్లరు కృతప్రణాములై యిట్లు విన్నపమొనరించిరి: 'గురూత్తమా! మీసెలవునకు బద్ధులమాట నట్ల కావింతుము. గురులయాజ్ఞ కడుగు దాఁటినవారికిఁ బరేతరాజపురంబున రౌరవంబు ప్రాప్తించు నాయె. ఇదిగో మీపాదంబులాన. పోయివత్తుము. కాని దయచేసి మేము సేవింపఁదగిన తీర్థంబులెవ్వియో సెలవిత్తురే నవి హృదిని నిలిపి యాచరింబోవువారము. మీరువల్కిన నదిమాకు సర్వసిద్ధిప్రదంబయ్యెడు' ననవుడుఁ బ్రసన్నులై గురుస్వాములు వారికిట్లా యాతీర్థంబులంగూర్చి తెల్పిరి:- బ్రహ్మాండగోళంబునఁ బ్రఖ్యాత తీర్థరాజంబు ప్రయాగాఖ్యంబు. వారణాసిని గంగాస్నానంబు నవశ్యాచరణీయంబు. పవిత్ర భాగీరథీయాత్ర యఱువది యోజనములు పరిమితిగలది. దానమష్టి కృచ్ఛ్రఫలంబులభించు. గంగాద్వార దర్శనంబుననది ద్విగుణంబగు. యమునాయాత్ర యిరువది యామడల దూరముండును. తదనుగుణఫలంబు చేకుఱు. సరస్వతి యుఁ గుమారియుం జతుర్వింశతి యోజనపరిమితములు. ఎటనే వెన్ని యోజనము లన్ని కృచ్ఛ్రములుగా నెఱుంగునది. తత్తీర్థ సేవనమునఁ బితృతర్పణము యజ్ఞఫలమును బ్రహ్మలోకావాప్తియు నయ్యెడిని. వరుణయుఁ గుశావర్తయు శతద్రువును విపాశకయు శరావతియు వితస్తయు నసిక్నియు మరుద్వృధయు మధుమతియుఁ బయస్వతియు ఘృతవతియు సేవింపఁదగినవే. ఇవి దేవనదులని ప్రఖ్యాతములైనవి. ఇవి యొక్కొక్కటి పంచదశకృచ్ఛ్ర ఫలాన్వితములు. అందందు మునుఁగిడిన బ్రహ్మహత్యాది మహాపాత

కంబు లడంగి పవిత్రతరకల్గు. ఇంకఁ జంద్రభాగను రేవతిని సరయూ గోమతులను వేదికాకౌశికీ నిత్యజలా మందాకినులను సహస్రి వక్రిను బూర్ణాపుణ్యనదులను బాహుదారుణాలను షోడశయోజ నార్హ ఫలంబుగలుగు. తత్తన్నదీ సాగరసంగమ స్థలంబులఁ గృత స్నానులైనఁ ద్రివేణీస్నాన ఫలాప్తిసుండు. మఱియు వైరోచనియుఁ బుష్కరతీర్థంబును ఫల్గుననదియు గయాక్షేత్రంబును బదరీనారా యణంబును నలకానంద మహాస్థలంబును గురుక్షేత్రంబును మహా పుణ్య ప్రతిపాదకంబులు. శ్రీశైల మనంతపుణ్యదంబు. వెండియు రామేశ్వరము సేతువు శ్రీరంగముఁ బద్మనాభము నైమిశారణ్యము పురుషోత్తమాఖ్య మహాస్థలంబు సకలసంసేవ్యంబులు. మహాలయ తీర్థం బత్యంత పితృతృప్తిదంబు. అటమెట్టినవారికి ముందిరువది యొక్కటి వెనుక నిరువదియొక్కటి తరములవారెల్లరుం దరింతురు. ఇంకఁ గేదారము కోటిరుద్రము నర్మదయు మహాఫలదాయక ములు. మాతృకేశముఁ గుబ్జతీర్థముఁ గోకాముఖయుఁ బ్రసాద తీర్థము విజయముం జంద్రతీర్థము గోకర్ణము శంఖకర్ణము సేవింప వలసినవి. అయోధ్యా మధురానగరంబులును గాంచీద్వారవతు లును మోక్షదాయకములు. శాలగ్రామ శబలగ్రామంబులును ముక్తిదంబులే. షడ్యోజన సమ్మిత గోదానదీతీర యాత్రవల్ల వాజపేయఫలంబు సంప్రాప్తమయ్యెడు. సవ్యంబుగా ముమ్మార్లు గోదావరీప్రదక్షిణముఁ గావించిన మహాపాపంబులెల్ల దగ్ధమయి దివ్యజ్ఞానంబు కరతలామలకంబు కానయ్యెడు. ప్రయాగతోఁ దుల్యఫలదంబులు మఱిరెండుగల వవి చెప్పెద వినుఁడు. అవి భీమేశ్వర పంచరాఖ్యంబులు, పరమ పావనంబులు. కుశతర్ప ణంబు గలదట ద్వాదశ కృచ్ఛ్రఫలాప్తియగును. గోదాబ్ధి సంగమ స్థలంబున ముప్పదాఱు కృచ్ఛ్రంబులుగా నెఱుంగునది. పూర్ణానదిని ముప్పదియోజనముల కగుపుణ్యము తారకము. కృష్ణను వేణను బదేను కృచ్ఛ్రంబుల సత్ఫలంబబ్బు. తుంగభద్ర నల్లి యిరువదియేను. ఇంకఁ బంపాసరస్సును బవిత్రమయినదే. హరి

హరక్షేత్రం బన్ననో సర్వపాప హారకంబగుండు. భీమానదీ తట
యాత్ర దశకృచ్ఛ్రఫల ప్రమాణంబుగలది. అటఁ బాండురంగని
మాతులింగముం జూడఁగలరు. తత్తీరస్థిత గంధర్వనగరంబు సర్వో
త్తమంబు. అచ్చోటఁ బెక్కులు తీర్థంబులును వరప్రదాతలు దేవతలుం
గలరు. పెక్కేల ? భీమామరజా సంగమస్థలంబునఁ గోటితీర్థంబు
లొప్పారు. అటఁగల రావిచెట్టొక్కటియే కల్పతరువలె నెల్లరకిష్టా
ర్థంబులొసఁగూర్చు. తత్సమ్ముఖంబునంగల యదినృసింహతీర్థము.
తదుత్తరంబుననే పురాణ ప్రసిద్ధ వరాణసీసమాన మహాక్షేత్రం
బఖిలాఘ తూలాగ్నిహోత్రంబగు క్షేత్రంబుకద్దు. పడమటఁ
బావనపాపవినాశ తీర్థంబలరారు. ఆపైన మహాకిల్బిష విచ్ఛేద
కంబు రుద్రపాదాఖ్యం బొప్పెడిని. ఇంకిటఁ జక్రతీర్థంబు గలదు.
కేశవుం డచ్చోటి దేవనాయకుండు. తరువాతఁగలవి కోటితీర్థ
మన్మథతీర్థంబులు. అందుఁ గల్లేశ్వరుం డొప్పునది సాక్షాద్గో
కర్ణంబ యనఁదగ్గ మహాత్తుగలది. ఇఁక గంధర్వపురం బన్ననో
యది సిద్ధభూమి. అచ్చోట జపానుష్ఠానంబు సల్పిన శీఘ్రం
బుగా ఫలసిద్ధియగును. కల్పవృక్షంబున్నెడ నేదికలుగదు ?
మఱియుఁ గాకిణీసంగమ స్థలం బనంతపుణ్య ఫలప్రదంబు. అది
ప్రయాగ కెనయనఁదగినది. తుంగభద్రానదియు వరదాయిని
యును. తత్సంగమంబున నగుఫలం బెచ్చు. మలాపహా నదీ
సంగమ స్థలంబు శతజన్మ కృతాఘ సంహారకంబు. నివృత్తి
సంగమంబు బ్రహ్మహత్యాది దుష్కృతినైన నిష్కృతిసేయు.
ఓహో శిష్యులారా ! విశేషంబుకల దిదివినుండు: బృహస్పతి
సింహరాశి స్థితుండౌనెడ గోదావరియుఁ గన్యను బొందునప్పుడు
కృష్ణయుఁ దులనుండఁ దుంగభద్రయు నుచ్చంగతుండైన మలా
పహయు గంగాయుతంబు లయ్యెడింగావున నయ్యెయెడల నటనట
స్నానదానాదులఁ గావించినంత బ్రహ్మహత్యాదు లడంగు.
భీమానది కృష్ణలోఁ గలిసినతావున స్నాతుఁడైనంత నరుండు
శుద్ధుండయ్యెడి. దాన నఱువది జన్మములవఱకు బ్రాహ్మణ

త్వంబ లభింపఁజాలు. తుంగభద్రా కృష్ణా సంగమంబున నంతకు మూడురెట్లు ఫలము. నివృత్తి సంగమంబున నాలుగంతలు. పాతాళగంగస్నానింగి శ్రీమల్లికార్జును దర్శించుట నాలురెట్లు పుణ్యము. ఇంక నేమిచెప్పుదు? పైపైఁ బుట్టువే యుండఁ బోదు. యుగాలయంబున ద్విగుణ సుకృతము. ఇంకఁ గృష్ణాసాగర సంగమంబునను గావేరీ సింధు సమాగమ స్థలంబునను బదేనురెట్లు పుణ్యఫలంబు. తామ్రపర్ణి మహాపుణ్యద. కృతమాల పాపహారి. పయస్విని భవహారి. సముద్రస్కంద సందర్శనంబున నెల్లకలుషములు వాయు. భూమిపైఁగల శేషాద్రియు శ్రీరంగనాథుండును బద్మనాభుండు ననంతుండును మల్లికార్జునుండును బూజ్యులు. కుంభకోణంబున నొక్కట నెల్ల తీర్థంబులంగల్గు ఫలంబు చేకురు. కన్యాకుమారి మత్స్యతీర్థముఁ బక్షితీర్థము రామేశ్వర ధనుష్కోటితీర్థము శ్రీరంగనాథ సమీప స్థిత కావేరీతీర్థంబును సంసేవ్యంబులు. పురుషోత్తమ చంద్ర కుండంబులు మహాలక్ష్మీపురంబును బాపహారములు. కరవీరము దక్షిణకాశి యనఁదగ్గది. కృష్ణానది యుదితంబైనతావున మహాబలేశుండు వెలయుచుండియుఁ దత్తీరస్థితమగు నుభయ రామేశ్వరంబును బావనంబులు. శ్రీపృగాద్రిము చాలపుణ్యస్థలంబు. అట నృసింహదేవుండును సదాశివుండును నుందురు. కృష్ణాతీరంబున భిల్లవటియను యొకటికలదు. అట [illegible] భువనేశ్వరి పాలించు. అటఁ దపంబుసేసిన సిద్ధసామ్యంబు బొందవు. ఇంక వరుణా సంగమ స్థలంబున స్నానముసేసినవారు మార్కండేయ తుల్యులయ్యెదరు. కృష్ణావేణీ పంచగంగా సంగమస్థలం బమరపురంబట మాఘస్నానంబు లోనర్చినఁ బ్రయాగనార్జించు పుణ్యంబుకన్న మిన్నయై తనరుదురు. ఘటవరాసులు తపశ్చరణంబున సిద్ధిఁగనిరి. సర్వతీర్థంబులటఁ జేరుట నట మున్కలిడిన నఖిలార్థ లాభంబౌట నిస్సంశయంబు. అంతంగల యుగాలయ సంకీర్తనము ముక్తిప్రతిపాదకము. పూర్వాలయంబును బావనంబే.

అట్లే విశ్వామిత్రి స్థానంబు మలాపహారకంబు. కృష్ణాసంగమంబు సర్వదోషహారంబు. ఇంకం బ్రికంసార్ధము సాత్త్వాద్విష్ణు ప్రతిభా దృశుండు కపిలుని యాశ్రమంబు. అటఁ గృష్ణానగ యుత్తరవాహిని యయ్యె. అచ్చోట నేమహామంత్రమైన నొకమారుచ్చరించిన మాత్రన కోటిగుణితముగా ఫలింపఁగలదు. తరువాతఁ జెప్పఁదగి నది కేదారతీర్థము. మఱియుఁ బీతపురంబుకల దదిదత్తాత్రేయ నిలయంబు. ఇంక మణిగిరియను మహాతీర్థంబుగలదు. అట ఋషి సత్తకము మున్నొకటఁదపంబుసలిపిరి. ఋషభాద్రియునొకపుణ్య స్థలంబు. కల్యాణనగరంబు ముక్తిదంబు. అహోబల సందర్శనం బున నలువది జన్మములోనర్చిన పుణ్యంబులభించు. శ్రీరంగనాథ సందర్శనంబుననో మఱి భవంబులేదు. ఛాత్రులారా! యిట్లు క్షేత్రంబులెల్ల సేవించి పవిత్రతఁగనుఁడు.

ఇంకఁ బ్రజావబోధంబు కొఱకీ నియమములును మీరె ఱుంగఁదగినవి. రజస్వల యగునంతి నదీస్నానం బొనర్పఁగూడదు. దక్షిణాయన ప్రవేశానంతరము రెండు మాసములఁ దత్తన్నదీ తీరవాసులుగా కితరులు జీవనదీస్నానంబు లొనర్పఁబోరాదు. వర్షాకాలంబులందెల్ల సరిద్వరములును సుమవతులౌటనె యందుఁ బ్రజలు మునుంగఁజనదు. అందు భాగీరథీ చంద్రభాగలకు సింధు గౌతమీ సరయూ నర్మదలకు మూడుదినాలురజోదోషము. వర్షా కాలంబుననో యెల్లనదులకుఁ బదిదినాలు రజస్వలాత్వంబని తెలి యునది. వాపీకూప తటాకంబుల కొకరేయి మాత్రమా దోషంబు వ్యాపించు. క్రొత్తనీరుగ నగపడునెడనది రజోదోష యుతత్వంబుగ గ్రాహ్యంబు. ఆనీట స్నానంబు దోషంబుఁగూర్చు. ఈసాధారణవిధి తీరవాసులకు వర్తింపదు. యాత్రికు లేతీర్థంబు సేవింపఁ బోయినను దప్పక క్షౌరస్నానోపవాసాదులు కర్తవ్యము, లను శ్రీగురుబోధ నాలకించిన వారెల్లరుఁ దద్వాక్యము కామ ధేనువేయని ప్రసాదరూపముగాఁ గొని యొక్కుమ్మడింబల్కి యొకొక్కరుగాఁ గృతప్రణాములై సెలవుఁగొనిరి. తుదకు నేశా

క్కుండను మాత్రము గురుసేవయే కోరి తత్సన్నిధినుండ ననుజ్ఞాతుండనైతి. ఇట్లనుచు చరిత్రం బింకను మనోహరంబని యాసిద్ధుండు తెలిపె.

### జ్ఞానకాండము — ౧౫ వ అధ్యాయము.

నామధారకుండు వినతుండై «స్వామీ! యాత్రకేగిన శిష్యులెవరెవ్వరో యిమ్ముక శేషింపఁజేయు నవకాశమొక్కండవెనో యవ్వలివృత్తం బేయదో వినిపింపఁగదరే' యన్న నక్కథకుం డిట్లుపక్రమించె: «భక్తచూడామణీ! నేను బరాకువడినను నీవు విడుచువాఁడవు కావు. నీ ప్రశ్నము నాకెంతయు నానందదాయకము. నీవు నాకుఁ బూర్వశిష్యుండవు. నీమూలాన నేకదా యీగురుచరిత్ర మెల్ల స్మరింపఁబడుచున్నది. తిరిగితిరిగి వేసరి యున్న నన్ను నీవు కథామృతసాగర నిమగ్నుం జేసినవాఁడవైతివి. దాన నామదికెంతయు శాంతియొదవుట నాకిది మేలయ్యె. కావున నీకుఁ బుత్రపౌత్రాది సమృద్ధియు ధనధాన్యాభివృద్ధియుం గలిగి సుఖంబుగా మనెదవుగావుత. గురుకటాక్షంబుకల్మి లోకమాన్యతయు నబ్బెడి. నీకింక సందియములెల్లఁ బాయ విపులంబుగాఁ జెప్పుచున్నాఁడ. చేతఁజేయివైచువాఁడ.

శ్రీ గురుస్వాములు వైద్యేశ్వర సమీపంబున నేరేటుంగకుండఁ జేరిరి. అనుచర శిష్యవర్గము వీడిపోయె. నేనక్కడఁ దత్పాదసేవ సల్పుచు దరినుంటి. అచ్చోట వారొక వత్సరకాల మెరుగులు గుర్తింపకుండ నుండిరి. అయ్యెడ కొక్కఁట నొక విప్రుండేతెంచి గురునాథులకు సాష్టాంగంబుగాఁ బ్రణమిల్లి తత్పాద ద్వయన్యస్త మస్తకుండై యిట్లర్థించె: "స్వామీ! అజ్ఞానాంభోధి నిమగ్నుండను. ఎంతకాలమునుండి తమ మొఱపెట్టినను నాదుర్గతి యేమోకాని యిప్పటికిని నామది కుదిరికఁ గనదయ్యె. మంచిదారి దొరకదయ్యె. జ్ఞానమబ్బునది నావద్ద పాటెల్ల వ్యర్థమేకదా. దేవా! యిప్పటికి నాకు మీపాదంబులు దొరకినంత

నామంతన మెంతయు హర్షపూరితము కానయ్యె. మనమున కిందనుక నిలుకడ కుదురమికిం గతంబుఁగానము. మీరు తారకులరు. సద్గురువులరు. కావున దయయుంచి యుపదేశించి సత్వరంబుగా జ్ఞానంబుఁ జేకూర్పవలయు" ననవిని మానివర్యులు చిఱునవ్వుతో నాతనిఁగని "ఏమయ్యా, తాపసీ! గురువుండమిఁ దపమేమి చేసితి" వని ప్రశ్నించిరి. అదివిని యాతండు విషాదాక్రాంత చేతస్కుండై కన్నీరు విడుచుచు నిట్లుపలికె: "బాబూ! ఏగురువు నాశ్రయింపని వాఁడఁగాను. ఒక్క తీక్ష్ణమూర్తి నాకతికష్ట సాధ్యంబగు నొక్క తపశ్చరణ విధానముం గఱపె. అది యనుష్ఠించుట కెంతయు వెతనందితి. అతఁడు వేదశాస్త్రంబులఁ దద్భాష్యంబుల నుద్బోధించిన వాఁడుకాఁడు. కసరుచు విసుగుతో నొకపంథను జెప్పెం గాని దాన నామనమునకు స్థైర్యము చేకురదయ్యె. తుదకు వారు చెప్పినట్లు నేను జేయఁజాలనైతిని. అతండు కుపితుండయ్యె. ఏమయ్యె నేమి నేనాతని వీడివచ్చితి" ననియె. అది విని గురుస్వాములు నవ్వుచు "అయ్యో! యేమిది? నీవాత్మఘాతుకుండవైతివే. ఇది యెట్లున్నదన నెవ్వఁడే నొక మూఢుఁడు దేవాలయమున మలవిసర్జనము సేసి తిట్టి యావలికి వచ్చి తానదృష్టవంతుఁడనౌట నట్లొనరింపఁగల్గితి ననికొన్న చందమైనది. ఎవఁడే నొరుల కపశకునము కల్పింపఁ దనముక్కుం జెవియుం గోసికొనఁ జూచునే? కాకున్న గురువులయెడ నవజ్ఞతతో మెలంగువాఁడేమి? జ్ఞానంబు నందునేమి? నీవే గురుద్రోహివై పైపెచ్చు గురునిందకుంగూడఁ గడంగుచున్నాఁడవే! నీచేసిన పని చూడ ముంగిటి పెన్నిధిం దన్ని యడవిలోఁ బడినరీతి నున్నది. ఓయీ! కామధేనువును విడిచి పాటిపట్టినవానిని నిన్నే చూచితిని. నీనోటనేకదా గురుదూషణ మే నిపుడు విన్నది? ఇట్టి నీకా, మనస్స్థైర్యము లేదనుచున్నావు? గురుద్రోహికేడ? జ్ఞానం బబ్బుటెడ? గురువులఁ దూలనాడినవారికి నిహమునను బరమునంగూడ సౌ

ఖ్యంబు సున్న. ఇట్టి యజ్ఞాని నవజ్ఞుఁడవు నీవేమ? జ్ఞానంబు లభించుటెట్ల? గురుసంసేవన విధానం బెఱింగినవానికి వేదశాస్త్రంబులతోఁ బనియేమి? గురుని సంతుష్టిపఱుపఁ జాలిన సర్వజ్ఞత కలిగినట్లు సుమీ. దాన నణిమాది సిద్ధులుం గలుగు. నిగమాగమంబులు క్షణమాత్రంబున నక్లేశంబున నలవడు' నని విప్రుండదివిని గురుదృష్టిపాతుండైన తనయుసుభాప్తి నెంతయుపగడి వినమ్రుండై దీనవాక్కుల నిట్లు విన్నవించెః 'ఓ మహా జ్ఞానాంభోధీ! సద్గురూత్తమా! నేను దుర్మతిని. నిర్భాగ్యాగులరు తామె నన్నెట్లయిన నుద్ధరింపవలయు. మాయాజాల వేష్టితుండనౌట గురు మహాత్మ్యంబు గుర్తింపఁ జాలనైతి. మీరు కృపఁజూచినం గాని జ్ఞానము కలుగనేరదు. స్వామీ! గురువులఁ దెలిసికొనుటెట్లు? తత్సేవావిధానం బెయ్యది? దయచేసి బోధింపఁగదరే. ఎవ్విధంబున నామనంబునకు స్థైర్యంబొదవు? సన్మార్గంబు వేద్యంబు గాఁదగునట్లు కరింప మీరుదక్క నాకింకెవరుశే' రని తత్పాదంబులంటె. అంత గురునాథులు సంతసించి యిట్లనిరి: 'తాపసీ! చెప్పెదవినుము. తల్లియుఁ దండ్రియు మేలుసేయువాఁడును నుపదేష్టయుం గురువులుగా నెఱుంగుము. విద్యాప్రదాతయౌ గురుం డన్న సాక్షాన్మూర్తి యాకారుండె యని దృఢమతివినమ్ర యాతనిఁ బూజసేయవలయు. ఇందుల కొక భారతగాథ కలదు. చెప్పెద నాకర్ణింపుము.

ద్వాపరంబున ధౌమ్యుండనుపేరిటి బుద్ధిశాలి యొక భూసురుండుండె. ఆతనికి మువ్వురు శిష్యులుండిరి. వారు గురుసేవానిరతులై యాతనితోడ వేదాధ్యయనముఁ గావించుచుండిరి. వారరుణాబైదోపమన్యు నామకులైయుండిరి. పూర్వగురు సంప్రదాయమున శిష్యులమనశ్శుద్ధిం బరీక్షింప సేవఁగొనెడివారు. అంత వారి యంతఃకరణశుద్ధియు దృఢభక్తియుం దెలిసి కృపఁజూపువారు. అట్లే ధౌమ్యుండును నిజసేవ చేయుచున్న శిష్యులం దరుణుండనువాని నొక్కనాఁడు సంబోధించి యిట్లనెను: 'ఓయీ!

త్వరగా నీవు పొలమునకుఁ బోయి యదెల్లఁ బూర్తిగాఁ దడియు నటుల నీరు పెట్టవలెను. నీరు లేనిది నాఱు బ్రదుకదు. కానవరి చేనెల్లఁ దడిపిరమ్మని యాజ్ఞాపించెను. అయ్యానతిఁ గొన్న శిష్యుఁడు సత్వరగతి నరిగి బోదె సేసి చెరువులోనుండి చేనికి నీరు వెట్టఁ బోయెను. ఇట్లుండఁ దత్తటాకమునకు వేఱొక దెస గండిపడి యందలి జలమెల్ల హోరను ధ్వని సేయుచు నామార్గంబునఁ బాఱుచుండె. అపుడయ్యారుణి యందు తనమనంబున నిట్లనికొనఁ దొడంగెను: 'అయ్యో! నీరెల్ల నామార్గంబునఁ బోవుచున్నదే గురువులు కోపింపరా? ఏమి సేయువాఁడ' నని ముందు మంటితో నాగండి కట్టఁజూచెనే కాని యది కొట్టుకొని పోవఁజొచ్చె. అంతఁ దాను మోయఁగలిగినంతటి పెద్దపెద్ద ఱాలు తెచ్చి యడ్డు వేయ సాగె. ఆప్రవాహవేగమున నవియుం దొలఁగిపోవుచుండె. ఎన్ని తంటాలు పడిన నానీరు కాఁదడుపనెంచిన పొలములోని కొక్కచుక్కయయిన నెక్కకుండె. అపుడా శిష్యుఁడు 'శ్రీహరీ! ఏమి సేయుదు? పొలము తడియదేని నాప్రాణంబులైన విడుచువాఁడ. ఱాలు కొట్టుకొనిపోయిన కావున నేనే యడ్డుగాఁ గూర్చుందును. అట్లయినను గురువుగారి చేను తడియకుండునా? చూత' మని కృతనిశ్చయుండై గురుపాదంబులు హృదిన్నిలిపి పాఱునీరంబు నరికట్టఁ బోయె. ఆగండి కొకకట్టను దనశరీరంబును కొండవదానికి నిజపాదంబులుం దన్నిపట్టి యటఁబడి యుండఁగాఁ బాఱునీరంబునం గొంత యడ్డుపడి ధౌమ్యులవారి పొలముపైపునకుఁ బాఱఁ జొచ్చె. అట్లాతఁడు గురుకార్య నిర్వహణైక దీక్షనూని తనదేహమందులకర్పించి యెట్టకేలకుఁ దాఁబూనినదానిని నిర్వహింపఁ జాలెను. సాయంసమయమున ధౌమ్యర్షి తనపొలముఁ గనవచ్చె. అదియంతయుఁ దడిసియుంట కెంతయు సంతుష్టాంతరంగుండయ్యె. అంతఁ దనపనుపు నెఱపిన యరుణునికొఱకు నలుదెసలం బరికించె. పొద్దుగ్రుంకుచుండె. శిష్యుఁడగపడఁడయ్యె. అయ్యో! పొలముఁ దడుపవచ్చిన బిడ్డని నేదుష్టమృగంబైనఁ గబళించి యుండలేదుగదా

యనికొనుచు నెంతయు వగచుచు 'నాయనా! అరుణా!' యని పేరెలుంగున ముమ్మాఱుపిలిచె. ప్రేమరసం బొలుకు గురువాక్కులు శ్రుతిపుటంబులం జేరినమీఁదట నీటికిని వలిగాని బిఱ్ఱబిగిసియున్న నిజాంగంబులు కొంతవడికెట్లో సడలించుకొని మెల్లఁగ లేచివచ్చి గురువర చరణారవిందంబులం బడియె. ధౌమ్యులా ప్రియశిష్యాగ్రణిం జూచి సంతసానిం దనహస్తం బూనిచి లేవఁ దీసి కూర్చుండఁజేసి మేనునిమురుచు జరిగినదెల్ల నడిగియాతనివల్లఁ దెలిసి యాతనిభక్తి కెంతయు నబ్బురపడి వేదశాస్త్ర ప్రవీణత యబ్బునట్లు వరప్రదానంబు సేసె. తత్క్షణ మాతఁడు నేత్రమై యాగురుపాద ద్వంద్వంబునకు మ్రొక్కె. ధౌమ్యుండు సంతుష్టుండై యరుణుని కిలుసేరి గృహస్థాశ్రమ స్వీకారమొనర్ప సెలవొసంగె. ఆతండు పోయెను.

ఇఁక ధౌమ్యుఁడు తనవద్ద శిక్షించిన శిష్యులందు బైదుని మనోరూఢిం దెలియ నిట్లాజ్ఞాపించె: 'నాయనా! పొలమునకుఁ బోయి యటఁ గాఁపుండి ధాన్యమును సురక్షితముగా నింటికిఁ జేర్పుమోయీ' యనియె. బైదుండది వినినంతనే వేగముపోయి కోఁతకనుకూల మగుదనుక నట శీతాతపంబులకోర్చి కావలిగాచి తాఁగోసిగింజలు రాలఁగొట్టి కుప్పసేసి గురుసవిధంబున కరిగి యిట్లు విన్నవించె: 'అయ్యగారూ! పొలమున ధాన్యము రాశిచేసివచ్చితిని. ఇంటికిఁ జేర్పసెలవా?' యనెను. అందులకు ధౌమ్యులిట్లు బదులు సెప్పిరి: 'శిష్యాగ్రణీ! కష్టించి పనిపూర్తిచేసితివి. సరిగాని వాని నీబండిమీఁద వేసికొనివచ్చి త్వరగా నింటఁజేర్పు'మని యొక దున్ననే పూన్చిన శకటంబుం జూపె. బైదుండట్లె కావింతునని దాపటఁ దానలాగికొనివచ్చి ధాన్యమంతయుఁ దానొక్కండ పండ్రెండు బస్తాలలోనికెత్తి మూఁపునఁ బుండుపడ నెడపుంబెడకొవ్వ వళ్లెలాగుచుండె ఇంతలో మార్గమధ్యమున నాదున్న యొకప్రక్కకీడ్చి బురదగుంటలోఁ బడెను. దానినందుండి బైదుండీవలికిఁ దెకలింపలేక పోయెను. తుదకది యందుఁ గూరుకొనిపోయె. దానఁ

గడుఁ జింతాక్రాంత స్వాంతుండైన బైదుం డమ్మహిషంబును యుగ్మంబునుండి తప్పించి తనబలముకొలఁదిఁ బెనఁగులాడుచు లాగలేక మూర్ఛిల్లిపడియుండె. ఇంతలో ధౌమ్యముని యాతని యెదుట నిలిచి యటఁగస్తినందియున్నవాని నిజశిష్యుంగని వాని యెడ దయఁగొని సంకటముడిపి ప్రసన్నుండై వానిం గవుంగలించుకొని నిగమాగమజ్ఞత యప్పుడ యబ్బునట్లు ప్రసాదించెను. తత్వరదాన మాత్రంబునన యట్లయయ్యె. అంత నాతండు గురువాజ్ఞ నిలుసేరి గేస్తయి కీర్తికెక్కె.

గురువులదరి శేషించినవాఁ డుపమన్యుఁడు. వాఁడు విద్యాభ్యాసంబున స్థిరమతిఁ గనకుండె. మిక్కుటంబుగ మెక్కుచుంట యామందమతితకుం గతంబు గానోపునని యెంచి ధౌమ్యుండు వానిని బ్రతిదినమును గోవులనటవికిం దోలుకొనిపోయి సంజవడుదనుక మేపికొని రావలెనని నియోగించె. శిష్యుండట్ల ప్రతిదినంబును గొనిపోయి తనకాఁకలి యైనంతనే పసులం దోలుకొని వచ్చి యిలు సేరుచుండె. అదిగని గురువులు వాని నొక్కెడ నిట్టుల మందలించిరి: "ఏమిది? అనుదినము నింతవేగముగా మఱలి రానేల? ప్రొద్దు క్రుంకువఱకుఁగదా నివ్వావుల మేపుమంటి" ననియె. అంత నుపమన్యుండు ముందు తానట్లు చేయుచుండునని మఱునట నటవికి గోవులఁ గొనిపోయి క్షుధాతురుండై గురులకు వెఱచిన వాఁడొట నింటికి మఱలక వాని నటఁగట్టిపెట్టి పరిసర తటినీతటంబునకుం జని యటస్నాన సంధ్యావందనాది కృత్యంబులం దీర్చికొని చేరువనున్న బ్రాహ్మణాగ్రహారంబున కరిగి మాధుకరము సేకరించి భుజించి పోయి ధేనువులనూడఁదీసి మేపఁ బోఁడఁగె. ఇట్లు తానొవ్వకుండఁ బ్రత్యహంబునను బసుల మేపికొని చీఁకటి పడ నిలుసేరుచుండె. ఎన్ని దినాలయినను దేహమునఁ గార్శ్యంబునందక చెక్కుచెదరకున్న వానిం గడపటి శిష్యుంగని గురుండు 'నీవిన్నాళ్లుపవసించినను నీదేహపాటవంబు సడలమికిం గతంబే' మని యడిగెను. అందులకు శిష్యుండు

తానను దినంబును వనసవిధస్థిత విప్రాగ్రహారంబునఁ బరిగ్రహిం
చిన భిక్షాన్నంబు మెసవి యావులఁగాచి సాయంవేళ కిలుసేర్చు
చున్న వయినముం దెలిపె. ధౌమ్యుండాగ్రహంబున "ఓరీ!
నన్ను విడిచి నీవెట్లు భుజించు చుంటివిరా చాలుఁజాలు! ఇంతటి
నుండి నీకట లభించిన భిక్షఁ గొనితెచ్చి నాకిడిపోయి గోసంరక్ష
ణముసేసి సంధ్యావేళ కిలుసేర్చు చుండవలయు" నని ముదలవెట్టె.
అంత నాతండు 'చిత్త మట్లయొనర్చువాఁడ' నని మఱునాటి దిన
మున నావులఁ దోలుకొనిపోయి యటడించి భిక్షాన్నంబుం గొని
తెచ్చి నిజగురువులకు సమర్పించుచుండె. అందుఁ దనకు మిగులు
నది స్వల్పమై కడుపునిండకుండె. దాన నాతండు తిరిగి యట
నట మాధుకరంబు గ్రహించి కడుపునింపుకొని గోవులఁ గాచు
చుండె. అంతటినుండి వాఁడు ప్రతిదినమును రెండుతడవలు
భిక్షాన్నంబునకై తిరిగి యందు మొదట లభించినంతవఱకు గుర్వ
ర్థముగను బిదప దొరకిన దాత్మార్థముగను వినియోగించు
చుండెను. ఇట్లు చూచిన నెన్నిదినాలకును దేహసౌఖ్యంబుడుగ
కున్న వానింగని ధౌమ్యులిదేమని యడుగ నుపమన్యుఁడు తానొ
నర్చు ద్వివారభిక్షాటన విధానంబెఱింగించె. అందుల కాతండు
కినిసి వానికిరు తేపలు దొరకినదియుఁ దనకే తెచ్చిపెట్టు చుండు
మని యాజ్ఞాపించె. వాఁడు 'సరే' యని యంతటి నుండియు
నట్లు కావించియుఁ గృశింపకుండె. ఆతండాలమేపి క్షుధితుం
డౌనెడ నందయ్యావి వానివాని దూడలు ద్రావి తనిసిన వెనుక
స్రవించు క్షీరంబులఁగని యవివృథ వోవకుండఁ దనదోసిటఁ బట్టి
త్రావుచుండె. ఇట్లు తాను కుక్షింభరణంబు సేసికొనుచు
ద్వివార భిక్షాన్నంబు గురువుల కొఱకు సమర్పించుచుండె.
కొన్ని దినాల కా గుమ్మపాలుత్రావి గుమ్మడికండువలె నున్న
వానిం గాంచి గురుండిట్లు దేహస్థౌల్యం బేర్పడె
నెట్లని పృచ్ఛసేసె. అతండును దాఁజేయుచున్న దెఱింగించె.
అగ్గురుండిట్లుబోధించెః 'ఓరీ! ఉచ్ఛిష్టక్షీరపానంబున మందమతివై

దోషభాగివైపోవుచున్నాఁడవుగదరా' యనెను. ఇఁక నా మాట
వాఁడు వాఁడాఁకలిగొని యతికర్తవ్యతామూఢుండైయుండ నొక
జిల్లేడు మొక్కనుండి పాలుగాఱుచుండుట వాని కన్నులఁబడెను.
అదిచూచి వాఁడు, 'మేలుమేలు. ఇది యుచ్ఛిష్టము కాదుగదా
యనియొక యాకుఁగోసిదొన్నెఁగాఁ జేసియందొక్కొక్కచుక్కగాఁ
బాలువట్టి తననోటఁబోసికొఁబోయెను. ఆగర్హ్యభక్ష్యమునవవి పొరలి
వాని కనులంబడెను. దానఁ గనులుపోయె. గోవు లెటకో తప్పి
పోయె. తెన్నుఁగానక వాఁడుదురంతచింతాక్రాంతస్వాంతుండయ్యె.
చేతఁగొన నొక కఱ్ఱయైన లేకపోయె. కనులు లొట్టలువోయి
గోధనముకొఱకై తడవికొంచుంబోయి యొక పాడునూతిలోఁబడి
యేడ్వఁదొడఁగెను: అయ్యో! ఆవులు వానియంత నవి యింటి
తోవఁ బట్టెఁగాఁబోలు. గురువుగారునన్నుఁ గూఁకలువేయుదురే'
యని కుందుచుండఁ జీఁకటివడెను. శిష్యుండప్పటికి నిలుసేరఁ
డయ్యెనే యందులకుం గతంబేమైయుండునని ధౌమ్యులు వాని
కొఱకు వెదకికొనుచు నటవి కేఁగి యట ధేనువులుమాత్ర ముండఁ
గాఁ గాపరికానరామికి వగచి గొంతెత్తి పిలిచె. అదివిని నూతిలోని
గుడ్డివాఁడు ప్రతివల్కె. ధౌమ్యుఁడాలకించి యుపమన్యుస్వనంబు
విననైనదెనవట్టి యాగోతిలోఁబడియున్నవానివల్ల సంప్రాప్తావస్థా
వివరంబుం దెలిసి ప్రేమమీఱ వానిం జేతఁగొని యుద్ధరించి సమంత్ర
కంబుగ నశ్వినీదేవతల సంస్మరింపుమని బోధించె. ఆ శిష్యుండు
నట్లుకావించినంతఁ దాఁజూడఁగల్గె. అపుడాతఁడు భక్తిమీఱ గురు
పదాబ్జాతంబుల కెఱఁగియెంతయు సంస్తుతించె. అప్పటికి సంతుష్టి
నందఁజాలిన ధౌమ్యమహర్షులు ప్రసన్నులయి వానిశిరంబునం
దమ దక్షిణకరంబు ననుసంధించి నంత నాతనికి వేదశాస్త్రాది
నైపుణ్యమొదవె. అంతఁగృతార్థతఁబడసినయాతనికిగురుండిట్లనియె:
'నాయనా! యింక నీవిలుసేరి సుఖంబుండుము. అనురూప కన్యా
గ్రహణంబున సౌఖ్యంబునందుము. నీయశస్సు దిక్కులకెక్కును.
నీకడ నిన్నుఁ బేర్మినందించు సచ్ఛిష్యులు చేరుదురు. అందు నుత్తం

కాఖ్యుండు భూమండలంబున ఖ్యాతిగాముండై యశేష విషాహుల జయించి నాగలోకంబునుండి కుండలంబులంగొనితెచ్చి నీకు గురుదక్షిణగా సమర్పింపఁగలుగుదువు. ఆతండే జనమేజయ మహీపాలుండు సేయనున్న సర్పయాగంబునఁ బాములనెల్ల హోమంబుసేసి తుదకుఁ ద్వత్కృపాప్తిఁ దక్షకు నింద్రుతోడ రావింపఁజాలి నాన జగద్విఖ్యాతుండు గానయ్యెడు'నని శుభో త్తరవాక్యంబులతో నాతని వీడ్కొల్పె.

గురుద్రోహులగువారి కిహామునను బరమునను సౌఖ్యంబు మృగ్యంబు. వారికొఱకే కుంభీపాకం బేర్పడియున్నది. గురులను సంతుష్టిపఱచిన నింకఁ గలుగనిదేమి? గురులరిన క్షణ మాత్రంబున నిగమాగమంబులెల్లఁ గరతలామలక ప్రాయంబులు కాకుండెడినే? ఈ మర్మమెఱుంగలేక మాయామోహితుఁడవై వ్యర్థముగా నిటునటు తిరుగక తిరిగి మీగురువులదరికే దారిఁ బట్టుము. ఆతండె నిన్నుద్ధరింపఁగలఁడు. అతండు తుష్టిపడసినంత నీకు సర్వమంత్రఫలంబు చేకుఱు ననినమ్మి మీగురువులకే శరణుఁ జొచ్చిన నీకింక మేలయ్యెడు'నని యావిప్రునకుపదేశింప నాతండది విని వివేకియై తద్గురుచరణంబుల నిజశిరంబుంచి యిట్లు మనవి యొనర్చె: 'స్వామీ! పరార్థ సాధనోపాయంబు చక్కఁగా నుప దేశించితిరి. నేను గురుద్రోహిని. మహాపరాధంబుఁ గావించిన వాఁడను. మఱిగురువులమనసు విఱిగియుండునా యె. అట్టిది మరల నదుకువడు టెట్లు? తునిఁగిన సువర్ణశకలములనైన నదుక వచ్చుఁగాని ముత్తెపుఁజిప్పల నొంటొంటిఁ జేర్చి సరిపనేస్తుమే? అట్లే విభిన్నంబయిన యస్మద్గురువరు చిత్తంబు మరల నదుకుపెట్ట నాతరమగునా? అయ్యో! యింక నేను బ్రదికిన లాభమేమి? నాకుజీవితాశ లేదు. గురుద్రోహినై నేనింక నిట్లు మనుటకంటె గురువులకొఱకు నాయసువుల నిప్పుడవిడువాఁడ' ననుచు నాతఁడు ప్రాణత్యాగంబొనర్ప నుద్యుక్తుండయ్యె. ఆ బాఁపని పశ్చాత్తాపం బునఁ దత్పాపమెల్ల దగ్ధమయ్యె. నిప్పుసెగతగిలిన మాత్రమున

నెంతపెద్దగడ్డివామియయినఁ జిచ్చున భస్మమైపోవుపగిది నగ్గియంటి నంతనే కర్పూరపు ముద్దయెల్ల రూపుమాయు చందమున నను తాపాగ్ని దగ్ధంబులయి శతజన్మార్జిత మహాఘంబులైన నాశంబు నందుఁజొచ్చె.

అయ్యెడ నాత్మహత్య గావించికోఁబోవు నాభూదేవు నుద్దేశించి శ్రీగురుండిట్లు పలికె: “ఓయీ! నీవింకఁ జింతింప నక్కఱ లేదు. నీకలుషంబులెల్ల నడంగె. వైరాగ్యంబు నీకబ్బె. నీ వింక నిజగురూత్తమునేని హృదంతరంబున నిల్పియుండు” మనియె. అదివిని యాద్విజుఁడు గురుపాదద్వంద్వంబంటి కేలొగ్గి యిట్లు పలికె: “ఓహో! జగద్గురూ! నీవు త్రిమూర్త్యవతారమవు. నన్నుద్ధరింప నేర్పడిన మహానుభావుఁడవు. సకల చరాచరాధార భూతుండవగు నీకృపాదృష్టివల్ల నాకిల్బిషంబులెల్ల క్షాళితంబులై పోవుటొక యబ్బురమా? భానూదయంబైన నంధకారంబు వాయకుండెడినే?” యని భక్తిమీఱ నగ్గురూత్తము నగ్గించి యగ్గించి తుదకు డగ్గుత్తికపడ రోమాంచ మొదవ నిర్మలమతి నవ్విప్రుండాతని పదములంబడి “నన్నుద్ధరింప వలయు నన్నుఁబ్రోవ నీవ ది” క్కనుచు మఱి మఱి ప్రార్థించె. అక్షణంబుననే గురు కృపాప్తిని జ్ఞానోదయంబై వేదశాస్త్రాది పరిచయంబొదవె. గురువులు ప్రసన్నులైనఁ గానిదేమి? అయస్సునకు స్పర్శస్పర్శంబు కలిగినట్లయ్యె. అయ్యెడ సానందుండగు నయ్యాశ్రునకు శ్రీ గురుండిట్లనియె: “ఓయీ! నామాటవిని నీవు విడిచివచ్చిన గురు వులదరికిపుడేగుము. ఆతండు నినుఁగన్నంతనే ముదమొంది నీ వందనమందినంత నానందపారవశ్యంబునందుసుమ్మ. ఆతండే నేనని సాక్షాత్పరబ్రహ్మ స్వరూపంబునుగాఁ దెలిసికొనుము. సంశయము వలదను శ్రీగురూక్తుల నాభూమీసురుండు కేల్మోడ్చి శిరంబునఁ దాల్చి యట్లకావించికృతార్థతఁబడసె. వెండియు శ్రీగురులు కృష్ణాతీరస్థితమగు భిల్లవాటియను గ్రామంబుఁజేగి భువనేశ్వరి సన్నిధానమునఁ గృష్ణావేణీ తటిద్వార పశ్చిమ తటంబున నొక యుదుంబర

వృక్షమూలంబున నుపవిష్టుండయ్యె. తత్క్షేత్రమాహాత్మ్య శ్రవణంబు సర్వసిద్ధిప్రదం'బని సిద్ధుండాలింగించె.

జ్ఞానకాండము — ౧౭ పటలము.

సిద్ధుండు నామధారకు సంబోధించి యిట్లనియె: 'ఓయీ! నీవు గురుపదారవింద మిళిందమవుగదా. తూర్పు గాడ్పు వీచిన వెంటనే జలదములు కదలునట్లు నీగురుకథాశ్రవణైక దృష్టివల్లనే కదా ప్రాగ్దైన్యహారక కామధేను సదృశంబిది వివరింపనగుచున్నది. సావధానుండవై యాకర్ణింపుము.

కృష్ణాపగాతటంబున శ్రీగురుం డౌదుంబర మూలంబున జపానుష్ఠానంబు సల్పుచు నాల్గుమాసములు కడపె. అటవారు నిగూఢవృత్తిని దినములు కడపినను దన్నివాసమాత్రంబునన యాస్థలంబెంతయుఁ బావనంబయ్యె' నను సిద్ధోక్తులు శ్రుతిగోచరంబులయినంత నామధారకుండువల్కె: 'సాక్షాత్పరుండగ్గురుం డిట్లు గుప్తస్థితినుండ నేల? వారనుష్ఠానంబు సలుప నేల? సర్వసిద్ధులందవి సంతృప్తిఁగన్నవారికి భిక్షాటనంబేమిటి' యనవుడు సిద్ధుండు బదులుపల్కె: 'నాయనా! వినుము. పినాకి భిక్షువుగదా. మూర్తిత్రయంబున నాతండొక్కండు కాన నీత్రిమూర్త్యాత్మకునకు భిక్షాటనమ్మె కర్తవ్యంబు కానయ్యె. అయ్యది భక్తానుగ్రహార్థంబని సుమ్ము. తత్తీర్థాటనాదికంబెల్ల లోకసంగ్రహార్థంబు. కాలక్రమంబున సంసేవ్యతీర్థంబులనెల్ల లోకానుగ్రహంబు సేయ నాతండు వ్యక్తంబు సేయు. తానే తీర్థస్వరూపుండయ్యుఁ దీర్థాటనంబొనర్చుట పరోపకారార్థంబు కాదే? ఇఁక గుప్తస్థితియొలన ఖలుల వంచింపసేయుని తెలియుము.

తే. భానుఁ దేజస్వి నెల్లను ♦ మఱుఁగుపఱుపఁ,
బరిమళము దుంపనౌనె క ♦ స్తూరిని గప్పి
దరిఁదగనెఱుంగ మింగల్ప ♦ తరమౌనెఁ గడె?
యట్లె గురువుల మహిమంబు ♦ దెట్లు డాఁగు॥

అచ్చోట వారియభిమతంబు వెలువడ్డ తెలుఁగుటీఁగించెద నాకర్ణింపుము: కరవీరనగరంబున వేదవేత్తయుఁ దర్కవ్యాకరణాభిజ్ఞుండును బురాణధర్మశాస్త్ర విశారదుండునగు కణ్వశాఖయుండు విపశ్చిద్వరేణ్యుండు విప్రుండొకండుండెను. అతండు స్వకర్మనిరతుండై నెగడుచుండెను. అతనికిఁ గౌమారదశయందొక సుతుఁడుదయించెను. వానికి ధీమందుండని నామంబిడెను. తజ్జన్మనక్షత్రదోషంబునం జేసి యనతికాలంబునన పితృమారకంబు కలిగె. ధీమందుండు పెరిఁగి పెద్దవాఁడై తిరుగుచుండెను. ఏడేండ్లు నిండఁగనే వానికి నుపనయన సంస్కారముగావించిరి. కాని వాని పశుప్రాయత యేమని చెప్పుదు? ఎన్నాళ్ళు బోధించినను సంధ్యావందనముగాని తుదకు గాయత్రీమూలమంత్రమైనఁగాని వానికబ్బదయ్యెను. ఇఁకనిట్టి యభాగ్యున కధ్యయన మెట్లుపొసఁగు? ఏమైన నాతని నొక వేదపాఠకుకడ నుంచిరి. అతనికడ స్వాధ్యాయాధ్యయనము గావించు పెక్కురు శిష్యులతోడ మనధీమందుండును గొంత కాలంబుఁగడపెను. వీనినోట నేరొక్క ముక్కయైన నుచ్చరింపఁ జేయుదమన్ననే దుర్ఘటమయ్యెడివి. తుదకెట్లో పలికించి వల్లె చెప్పుమటన్న నదిగురుదక్షిణగా వారికప్పుడ సమర్పించుచుండెను. తోడివారును గనువారెల్లరు వానినిట్లు నిందించుచుండిరి: ఓరీ, దుర్మతీ! కులపాంసనుండవైతివే. అయ్యో! యెంతటి మహా విద్వాంసుని కడుపు చెడఁబుట్టితివిరా! బండవై యుండి యాయువుతో మనుటకంటె మెడకొక బండను గట్టుకొని యేనూతిలోనో గోతిలోనో పడరాదటరా!

తే. ధరను నరుఁడందుఁ బేర్మి వి ♦ ద్యనుగఱచిన।
ధనమునార్జింప వచ్చును ♦ దానివలనఁ।
జదువరికిదాన భోగము ♦ ల్సంపదలగు।
సర్వసంపూజ్య పదము య ♦ శంబునబ్బు॥

వయసునఁ జిన్నయైనను విద్దెయున్ననే మిన్నగా నెంత్రు. పసపురాని మొద్దు తానెదిగి పెద్దయైనను జీదరింతురేకాని యాద

రింపరు. సోదరులు లేనివారికి విద్యయే యాదరువుసుమ్మీ. బుధుఁడు తనవారులేని యేదూరదేశమున కేగినను దత్రత్యులాప్తబంధు సదృశంబుగా గౌరవించెదరు. విద్యవల్లనేకదా జ్ఞానమొదవునది? విబుధాంగంబులనే విబుధానీకంబాశ్రయించు. కావుననే సర్వత్ర పూజలొందు. లోకవంద్యుండగు భూపాలకుండును విద్వాంసు నర్చించుచుండును. ధనములేకున్నను విద్యాధనంబున్నఁజాలు. విద్యావిహీనునిఁ బశువుగా నెంతురు. కావున విద్యాభ్యాసం బవశ్యకర్తవ్యం'బనుబోధ మనధీమందుం డాలకించి యిట్లనియెః 'నిజమె. కాని పూర్వజన్మమున నేను విద్యాదాన మొనర్పలేదై యుండవలెను. కాఁబట్టియే యిపుడబ్బలేదు. నాకుఁ జదువు రాఁదగిన యుపాయమేదైన నున్నం జెప్పుం' డనియె. అందులకా బుధులు నవ్వుచునిట్లుపలికిరిః 'పైజన్మమందుఁ బ్రాప్తింపవలయుఁ గాని యింక నిపుడబ్బు టసంభవము. నీకేడ? విద్యలభించుటెడ? నీవు ద్విపాదపశువవన నూరూర నడుగుకొని మనవలసినదే కాని గత్యంతరములే' దనిరి.

అంత, ధీమందుం డనుతాపంబున విరాగియై యటవికేగి యిట్లనికోఁదొడఁగెః "బుద్ధిహీనుఁడవని నన్ను లోకులు దూషించుచున్నారు. కాఁబట్టి ప్రాణములు విడుదు. ఈనాపశుప్రాయ జీవితంబేమిటికి? నాకంటె శ్వానంబుమేలు. ఇట్టిమనికి చాలింతు' ననికొనుచు భిల్లవాటిం జేరి కృష్ణాపాత్రటస్థిత భువనేశ్వరి సందర్శనంబుఁగావించి దుఃఖభరంబున నటఁ బ్రాయోపవిష్టుండయ్యెను. అట్లు మూనాళ్లు స్నానపానాదిక వివర్జితుండై పండియుండె. కలలోనైనను దేవీప్రసాదంబు గలుగదయ్యె. అపుడు వాఁడు 'భవానీ! నన్నుపేక్షించెదేల?' యనుచు నాకోశంబున నొక కరవాలంబుంగొని తన నాల్క చీల్చికొని తన్మాహేశ్వరీ చరణారవిందంబుల కర్పించుచు నిట్లు సూచించెః 'అంబా! యిప్పటికిని దయఁగనవేని నాయీశిరం బుంద్రుంచి నీపదంబుల కడ నుంచువాఁడ' ననుచు నిజశిరంబునఁ గరంబూనిచి యానిశిత

శరంబెత్తునంతలో నాకాళీమహాదేవి తెప్పపాటున వానికిఁ గనికి పాటుఁదెచ్చి నిజభక్తహృదయంబుసొచ్చి యిట్లెలుంగఁజేసె: 'క్రోధంబునఁ గార్యంబుగాదు. అవ్వలిగట్టునఁగల మేడిచెట్టు మొదట నొకమహాత్ముండు శివావతారుండు గలఁడు. అతనికి శరణుఁజొచ్చిన నీకభీష్టసిద్ధియగు' ననియెను. అట్లు ప్రబోధితుండై సత్వరంబునఁబోయి కృష్ణాప్రవాహంబునంబడి యీఁది యవ్వలి గట్టునంజేరి యటనుపవిష్టుండైయున్న శ్రీగురు సందర్శింపఁగలిగె. వాఁడురోఁజుచుఁబోయి యాస్థకాలఁదిఁ దత్పదంబులంబడి వీడకుండె. అపుడు వారు ప్రసన్నులయి వానినాశ్వాసించి నిజ హస్తంబుఁ దన్మస్తకంబున న్యస్తంబుఁగావించిరి. క్షణమాత్రంబున మున్ను భేదింపఁబడినజిహ్వ యథాపూర్వంబుగా నేర్పడె. ధీమందున కయ్యెడ జ్ఞానోదయంబయ్యె. వేదశాస్త్ర రహస్యంబు లెల్లఁ దన్మనంబున కెక్కెను. అపూర్వమనీషా ప్రభావంబున ధీమందుండు ధీమంతుండనఁ బూజార్హుండు కానయ్యెను.

'ఆ. కాకియంచయౌను ♦ గద మానసంబునఁ ।
బరుసమంటి యినుము ♦ పయిఁడియౌను ।
స్వర్ణమౌనుమన్ను ♦ జంబూనదింబడి ।
జిహ్వలేమి వేత్తఁ ♦ జేయుగురుఁడు ॥ '

చూచితివా నామధారకా! శ్రీగురుమహిమం బిట్టిదని చెప్ప నాతరముకాదు. పోయిన యింద్రియములంగూడ నొనగూడఁజేసె. అతండు వసించినతావు పావనంబయ్యె ననుట కబ్బురమా? ' యని సిద్ధుండువలికె.

జ్ఞానకాండము — ౧౭ దశము.

నామధారకుండు సిద్ధునిసంబోధించి యిట్లులడిగె: స్వామీ! మీరు కరుణాపరతంత్రమతులరై మత్కర్ణంబుల శ్రీగురుకథాసుధాపూర్ణంబులఁ గావించుచున్నను దనివిఁగనఁజాలకున్నాఁడను. ఇంకఁబిపాస వృద్ధియౌచున్నది. వినిపింపుము వినిపింపు' మని తత్ప

దంబు లంటినంత సిద్ధుండు మందహాసంబుతో నిట్లు చెప్పఁదొడఁగె:
సవిస్తరంబుగాఁ జెప్పెదు నాకర్ణింపుము. శ్రీగురుపదభక్తిచే
ధన్యతఁగంటివోయీ. నీసంప్రశ్నంబునఁ దత్పదాబ్జలగ్న చిత్తుండ
నౌట నాకును ధన్యతగలిగె. ఉదుంబరస్థానంబున నగపడిన
మహిమంబు వివరించితిఁగదా. అచ్చోట నాథకర్తారకులు కొం
డొక కాలంబు వసించిన మీఁదట వరుణాసంగమస్థలంబు నంద
ర్శించి యటనుండి దక్షిణకాశిం జేరిరి. కృష్ణావగాతీరస్థిత తీర్థం
బులు పావనంబులగుటఁ దత్పంచనదీ సంగమస్థలంబున ద్వాదశ
వర్ష పరిమితకాలంబు శ్రీగురూత్తములు గడపిరి. ఆకృష్ణాపంచ
నదీ సంగమమహాస్థలంబు వారాణసీ ప్రయాగా సదృశంబును
గురుక్షేత్రాధి పుణ్యదంబునగుట నారటనుస్థిరులైరి. పురాణోక్త
ములౌ నాపంచగంగలం బేర్కొందు. అవి శివాభద్రాకుంభీభోగ
వతీ సరస్వతులు. ఈపాపనోదక తీర్థపంచకంబు కృష్ణాంభ
స్సంగతంబులయ్యె. దాన నమరావతి దక్షిణప్రయాగ యననైనది.
ఇష్టార్థదం బుదుంబరం బవరకల్పద్రుమంబు. షట్కూలతీర్థసమీ
పంబున నమరేశ్వరుండు సాక్షాద్విశ్వేశుండు. తత్సన్నిధిం జేసి
యటఁ గృష్ణాతటినీజలంబు భాగీరథీసమంబుగా నయ్యె. అదిచతు
ష్షష్టి యోగినీసమాశ్రితంబు. అటఁగల విఖ్యాతశక్తితీర్థంబు లోక
పావనంబు. తత్సేవనంబున మర్త్యులు నమర్త్యులయ్యెదరు.
మాఘమాసంబునఁ బ్రయాగను మునింగినదానికంటె నటఁ
గృష్ణావగాహనశతగుణంబుగా ఫలంబుగల్గు. వేయేల? అట
కుంభోయి స్నానంబొనర్పవలె ననుకొన్ననే యధికఫలప్రదంబ
గాను. అయ్యమరేశ్వరుండు సాక్షాత్పరబ్రహ్మంబగుట నటఁ
గోటితీర్థంబు తీర్చెడేము. గ్రంథవిస్తరంబునకు వగచి యిట దిఙ్ము
ఖంబుగమాత్రమే పేర్కొందును. కృష్ణానదిద్వారంబు పశ్చిమ
వాహిని యైనతావున నుదుంబర సమీపస్థితంబు శుక్లతీర్థంబు
బ్రహ్మహత్యాది మహాఘహారకంబు. కామ్యవరదామరేశ్వర
నామకంబులు మఱిమూఁడుగలవు. లెక్కకుమీఱిన తక్కుంగల

పెక్కులతోఁ బనియేమి ? కృష్ణావేణీ పంచనదీ సంగమస్థలమహాత్వం బిట్టిదట్టిదని వర్ణింప నేరితరము ? తద్దర్శనమాత్రంబు ననే యఖిలాభీష్టంబు లొనగూడునన నచ్చోటి స్నానమహిమంబు నెన్ననానే? కల్పవృక్షంబు గలతావున నదులకు వారక నిది కూడ నుండునే ? కలిలోఁ గాలవశంబున గుప్తంబైనదానిని శ్రీగురుండు భక్తోద్ధరణార్థం బద్దానిని ప్రకటింపనెంచి తామటఁ బండ్రెండేండ్లు కడపిరి.

అయ్యెడ వారనుదినంబును భిక్షార్థ మమరపురగ్రామంబు నకుం జేరుచుండిరి. అందొక నిరుపాధిక వైదికవిప్రుండుపాదానము సేకరించుచు స్వకర్మరతుఁడై పతివ్రతయగు కులసతితోడఁ గాఁపురంబుసేయుచుండె. అతని పూరియింటిముంగిట శాకవల్లి విస్తరించి పెరిఁగె. దానికిఁ గుటుంబభరణ క్షమంబులగు పెక్కుశింబము లేర్పడియుండె. ఆవిప్రుండు తిండికి గింజలు దొరకనినాఁడవి వండించికొని తానుంగుటుంబము పదిమెక్కు మన్కుఁగనుచుండిరి. అతండు రిక్తుండయ్యుఁ బంచయజ్ఞంబుల నతిథిపూజనంబు నెఱపుచుఁ గాలంబు శాంతంబుగాఁ గడపుచుండె. అట్టి యాబ్రాహ్మణోత్తమునింటికి శ్రీగురుండు భిక్షార్థమరుగుదెంచె. భూసురుండదు రేగి వారికి స్వాగతంబిడి షోడశోపచారంబులతోఁ బూజించి భక్తిమీఱఁ దమకుంగల శాకంబు మొసపసిడెను. ఆశాక భిక్షంబే గ్రహించి గురుండు చాపసంతుష్టివడసి యాగృహమేధి నాశ్వాసించి యాతనికింక దారిద్ర్యనాశంబు గల్గునని మఱలుచుఁ దదంగణంబునఁ బెచ్చుపెరిఁగియున్న యాతీవియంబూచి మాయం దొలఁగఁ ద్రోసినోయన నద్దాని న్వామకరంబునం బెకలించి యవ్వలఁ బాఱవైచి సంగమస్థలంబునకుఁ ద్రోవఁబట్టె. అదికని యాయిల్లాలు, 'నాపిల్లల నింకెట్లు సాఁకఁగల్గుదు ? అయ్యో ! మాకు జీవనాధారమైనదానిని నిర్మూలించెనే! యతివరులయెడ నేమి యపచారంబొనర్చితి' మని రోదనంబుసేయఁజొచ్చె. అంత నాకాంతను గాంతుండిట్లు మంతలించె: ఓసీ ! దుఃఖింపరాదు.

ఇది యదృష్టసూచకముగా భావింపవలయు. చేయుమంచు రోగ బాధను దొలఁగించునని తెలియుఁగదా? గుణహాయుము. ఇయ్యది శ్రేయోదాయకంబగు. ప్రారబ్ధము ప్రమాణము. శ్రీచంద్ర మౌళీశ్వరేచ్ఛ నేదెప్పుడెట్లు కావలయు నట్లయొనర్చుండు. జగ మెల్లఁ దదధీనంబకాదే? అతండిచ్ఛామాత్రంబున గుణకర్మవిభా గంబుల సృష్టిస్థితిలయంబులఁ గావించుచుఁ దా నసక్తుండు నన హంకారుండునయి పిపీలికాది సర్వభూతకోటికి నన్నంబుఁ బెట్టు చాలనుమ్ము. 'అయురన్నం ప్రయచ్ఛతి' యనవినమే? హరి త్తంబున కన్యాహంబు మత్రిభంబు నాహారంబుగా నొసంగఁజాలును గదా. అద్వైతంబుముందుగా నీరంబునుసృజించి యాపైన నేనారు నోసినుమ్ము. ఆహారమేర్పఱచక యీరెనుబదినాల్గులక్షల జీవరాసులఁ గల్పించెనను కొందువేమి? ఆపరాత్పరుండొకఁడు ధనికుఁడని వేఱొండు దరిద్రుఁడని భేదదృష్టినిగనఁడు. అందఱ సమదృష్టింగనుచు వారివారి పురాకృతంబు ననుసరించి ప్రసా దించుచుండు. ప్రాగ్భవార్జిత పుణ్యపాపఫలంబు లెవరివారనుభ వించి తీఱవలెనేకాని యొరులందు భాగంబునందవత్తురే? తానుభ వించునది తనకర్మఫలంబు కా కన్యంబనుకొనువాఁడు మూర్ఖుండ సుమ్ము. నీవు మున్ను చేసికొన్న దానిఫల మిప్పుడనుభవించుచున్న దానవనిలోక యతిదూషణ మొనర్చెదేల? మాయలోఁజిక్కి వారి వల్ల మనగ్రాసంబువోయెనని కొనుచున్నావు. వారు మనలనుద్ధ రింప నేఁడు మనయింట నీహారాను భుజించిరేగాని వారియాఁకలిఁ దీర్చుకొనుటకనుకొంటివే? దీనమన దారిద్ర్యనివృత్తి కలుగనున్నది. ఆభగవానుఁడు 'నేను నాఁడియనునీగట్టి మోహాగ్రంధిని దీఱఁ జేయు జ్ఞానమూర్తిసుమీ' యని బోధించి నిజదారనూఱడించి తునిఁగిన తీఁగ నావలఁ బాఱవైచి మున్నున్న మొదలునకొకబోడ త్రవ్వఁబోయెను. అందు గురుప్రసాదఫలంబయి యొకసువర్ణనాణక మహోరుఘటంబు లభ్యంబుకాన నయ్యె. దానినీవలికిందీసి లోని కిం గొనివచ్చి గృహిణితో నిట్లను: 'ఓసీ! యీరావిచిత్రంబుఁ

చూచితే! యతివరులు ప్రసన్నులయి మాయావరణమెడలించి జ్ఞానంబుఁ బొడసూపుభాతి నాపాదనడలించి యీమహానిధి దృగ్గోచరంబుఁగా నొనర్చిరికాదే. ఈతండు యోగిమాత్రుండు గాఁడు. సాక్షాన్మహేశ్వరుండ మనదైన్యమడంప నీరూపంబున సాక్షాత్కరించెఁ జువ్వె. కావున లేలెమ్ము. తద్దర్శనమ్ముఁగావించి కృతజ్ఞతాపూర్వక ప్రణామంబు లర్పించి వత్త్ర'మని ధర్మపత్నినమే తుండై యాకుంభినీసురుండు గురువులు వసించుతావున కరిగి తచ్చరణ ద్వయంబునకు మ్రొక్కి నిక్షేపప్రాప్తింగూర్చి విన్నవించె. శ్రీగురుండదివిని యిట్లుపల్కె: 'ఓయీ భూసురా! నీవెవ్వరికి నీవివరం బెఱింగింపకుము. వెల్లడింతువేని లక్ష్మి నీయింట నిలువ నేరదు. మత్ప్రసాదంబున నీవఖండైశ్వర్య సంపన్నుఁడవై పుత్త్రపౌత్త్రాది సంపదలతో వర్ధిల్లెదవుగావుత' మని వరంబిడెను. అట్లు గురువరంబు నాజ్ఞయుంగొని యావిప్రదంపతులు మఱలిరి. గురుకృప యన్న సామాన్యంబుగాదు. ఎట్లది దైన్యహారకంబయ్యెనో చూచితివా? ఇట్లే తత్కృపా ప్రసాదం బెవరెవ్వరి మొఱంగల్గు వారెల్ల రపేతదైన్యులయ్యెదరని వేఱనుడువనేల? ఎవనిముంగిటఁ గల్పకంబుద్భవిల్లు వానియింటదరిద్రదేవత యింకఁ గాఁపురంబు సేయ నేర్చునే? ఏఁడేని దీనుండై గురుభజనంబొనర్చునేని లోకైక పూజ్యపదంబునంది తుదకు మోక్షంబు నందఁజాలు. ఎవ్వఁడు గురుభజనంబొనర్చు నవ్వాఁడిహపరంబుల సిద్ధిఁగనును. తద్గృహంబున నఖండ లక్ష్మీవిభవంబులు గలిగి యష్టైశ్వర్యంబులుం బెంపొందుచుండు. గురుమహిమంబిట్టిది. నామధారకా! కావుననే గురుభజనం బొనర్పుమంటి. దానం గామధేనువు మీముంగిట నిల్చు' నని సిద్ధుండుబోధించె.

## జ్ఞానకాండము — ౧౯ దశము.

సిద్ధచరణంబులంటి నమస్కరించి శిష్యుండగు నామధారకుండిట్లుపల్కు: 'అజ్ఞానధ్వాంత భాస్కరా! సద్యశస్కరా!

మీరు భవాంభోధి తారకులరు. నామనమీమోహరాత్రియం దజ్ఞానాంధకారంబున నిద్రించుచున్నది. అట్టి నామనంబును మీరు మేల్కొల్పి గురులీలామృతంబుం బ్రసాదించితిరి. అస్మన్మనోవీధిని జ్ఞానార్కోదయుం బొడవింపంజేసి నన్నుం బ్రవృద్ధచేతసుం గావించితిరి. యోగీంద్రా! అవ్వలి కథావిశేషంబు దెలియంగింపరే' యని తలొగ్గి యర్థింప సంతుష్టస్వాంతుండై సిద్ధుండిట్లు చెప్పం దొడంగె: 'అనుపమంబగు గురుమహాత్మ్యంబింక నెఱింగించెదను వినుము. శ్రీగురుం డుదుంబరవృక్షమూలంబునం గూర్చుండియుండె' నన్నంతనే నామధారకుండిట్లు ప్రశ్నించె: 'స్వామీ! యేమిది? పావనపాదపానేకంబు లుడిగి యీమేడిచెట్టు నీడంజేరనేల? అశ్వత్థంబు పవిత్రంబని నిగమోదితంబయి యుండ మనగురువు లుదుంబర వృక్షంబు నాశ్రయించిరేల?' యనియె. సిద్ధుండాతని సందియంబిట్లు నివారించె: 'ఓయీ! అందులకొక కారణంబుగలదది నుడివెద నాకర్ణింపుము. మున్ను హిరణ్యకశిపుండను దైత్యుని సంహరింప శ్రీమన్నారాయణుండు నృసింహాకృతిం ధాల్చెనని విని యుందువుగదా. తద్రక్షస్సంహారంబునకై క్రుద్ధుండైన యానృహరి నిజ నిశితనఖాయుధంబులతోం దన్నెంచరు కోష్ఠంబు వ్రీల్చి వానిప్రేవులం బెకలించి మాలలుగాం దనకంఠదేశంబున ధరించె. అయ్యెడ నారాకాసికడుపున సందహ్యమాన బడబానల సదృశంబయి కాలకూటంబుభాతి నసహ్యంబైన విషంబు తన్నఖంబులందు లగ్నంబయ్యె. దాననాగోళ్లు మలమల మాడిపోయె. దుస్సహవేదనంబు కలిగె. హరికిం దాపోపశాంతిఁగావింప నబ్జాలయ మేడిపండ్లొసంగె. అయ్యవి స్పృశించిన మాత్రమున నావిషాగ్ని బాధయుడంగి యాయుగ్రనృసింహమూర్తి ప్రశాంతుండై లక్ష్మీసమాలింగనంబొనర్చె. అపుడా లక్ష్మీనృసింహులు ప్రసన్నులై మేడిచెట్టున కిట్టులం బ్రసాదించిరి: 'ఓయుదుంబరావనీరుహంబా! నీవు కల్పవృక్షంబవై సర్వకాలంబు ఫలప్రదాత్రివగుచుందుము. నిన్నాశ్రయించువారి కిష్టార్థంబులు వెనువెంట నొస

గూడుచుండు. నిన్నుఁ జూచిన మాత్రముననే యెట్టి హాలాహాలంబైనం జల్లారు. నినుఁగొల్చువారి కభీష్టసిద్ధి యగుచుండుఁ బాపక్షయంబు నయ్యెడు. నిన్నారాధించినంతనే గొడ్రాలు బిడ్డలతల్లి యగును. నిఱుపేద ధనసంపదఁగనును. ఇంక నీనీడనుండు జలమున జలకమాడుట గంగాస్నానఫలంబు దక్కుసుమ్ము. నీనీడం గూర్చుండి జపానుష్ఠానంబుఁ గావించుట ననంతఫలంబు నిష్టలాభంబునొదవు. నిన్నర్చించువారికి వ్యాధిబాధయుండదు. దేవతలెల్లరు నీకధీనులయ్యెదరు. లక్ష్మీనృసింహులము మేము నీయంద వసించువార' మని వరప్రదానంబు సేసిరి. నాఁటినుండి యయ్యుదుంబరవృక్షంబే కల్పతరువుగానయ్యె. కావుననే శ్రీనృసింహసరస్వతు లావృక్షచ్ఛాయం జేరిరి. గురులటఁ జేరిన నాఁటినుండియుఁ దరువధిక ఫలపత్రదాత్రియయి విరాజిల్లుచుండు. భక్తోద్ధరణార్థమియ్యిల నవతరించిన త్రిమూర్తిస్వరూపులా నృహరులాకల్పద్రుమంబుదరి కుత్తరంబుననుండఁ బ్రతిదినమునను మధ్యాహ్నవేళను మహోత్సవంబయ్యెడిది.

అమరేశ్వరమునుండి యఱువదినలువురు యోగిను లచ్చోటికేతెంచి బత్తిమీఱ గురువుల నభ్యర్థించి నిజాశ్రమంబులకుంగొని పోయి గంధపుష్పాక్షతాదులతోఁ బూజించు చుండెడివారు. గురులు వారిసపర్యలంది యౌదుంబరచ్ఛాయనే యాశ్రయించి యుండెడువారు. ఈగోష్ఠ్యర్థం బెఱుంగని యచ్చోటి విప్రులియతు లేడకు భిక్షాటనమొనర్పఁ బోరేమనికొనుచుండెడివారు. కొంత కాలమునకు వారికచ్చెరువుదోఁప వీరికి భిక్షంబెట్లు లభించునో తెలిసికొనవలెనని కుతూహలము మెండుకాఁగా నొక్కనిఁ దద్గుప్తచేష్టం దెలియఁ గావలియుంచిరి. వానికట మధ్యాహ్నవేళంగూడ నొంటరియైయుండ వెఱపుగలిగెడిది. మఱియు గురువులగోష్ఠ్యర్థంబులం బరికింపఁగోరువారికి నరకప్రాప్తియౌనానాయె వాఁడెందులకుఁగాని వెఱచిపాఱి యులుదూరె. అంతనొక్కనాఁడు దైవయోగంబున గంగానుజుండను భక్తుండొకచేలకావరి వానిపూర్వపుణ్య

మున నౌకవినోదంబుఁ జూడఁగలిగె. తన్నదిజలంబు రెండుపాయలగు టయునడుమ నౌకమార్గంబు గలుగుటయును దానిలోనుండి యోగి నులు వరుసగా నీవలికివచ్చి యాయొడ్డున మేడిచెట్టుక్రిందఁ గను లుమూసికొని తపస్సు చేసికొనుచున్న యతివరు పాదాగ్ర ముల సన్నిధింజేరి ధ్యానించి పూజలునలిపి తామువచ్చినత్రోవనే యాతనిఁగొనిపోయి యదృశ్యులౌటయుంగని విస్మితాంతరంగుండై “యీయతియెవ్వండు? నీటినడుమనీబాటయెట్లేర్పడె?” యని తనలో నాలోచించుకొని ‘యీశ్వరుండ యిట్లవతరించి యుండనోపు. కొల్చినవారు దేవకన్యకలై యుందురు’ రని నిశ్చయించుకొని మఱునట శ్రద్ధనై వేచియుండి పూర్వదివసము నందువలెనే నడచిన మహోత్సవం బెల్లం గాంచి వారు తిరిగి వచ్చిన త్రోవనే యా త్రివాహ మధ్యంబునం జొచ్చుచుండ వారి వెనువెంటం దాను నందుం బ్రవేశించె. అట్లందుఁజొచ్చి నవరత్న ఖచిత గోపురా నేక మండితంబగు నొక్కపురంబుఁ గన్నుల పండువుగాఁ జూడఁ గలిగెను. ఆయోగిను లెల్లరు జ్యోతులు వెలిఁగించి యాజ్యోతి స్స్వరూపునకు నీరాజనంబులు సేసిరి. అంత వారు సౌధన నగ రావతిని దేజంబున భానుమండలంబుం బుగుడించు నిజపురవరం బున కాతనిం గొనిపోయి రత్నఖచిత సింహాసనాసీనుం గావించి విధివిహిత షోడశోపచార పూజలు సక్రమంబుగా నడపి వివిధ భక్ష్యానేక సహిత చిత్రాన్నంబులం గుడిపి సంతుష్టినందించిరి. అయ్యెడ మునగురులచ్చోటునఁ జొచ్చిన యాయపూర్వునగుంగని “నీవెవ్వఁడ వెందేల వచ్చితి” వని ప్రశ్నించిరి. అందులకు గంగా నుజుం డిటుల బదులు పలికె: “స్వామీ! భవత్సందర్శనార్థినై వచ్చినవాఁడను. త్రిమూర్తులు కలరని వింటినే కాని యుందనుక మీస్వరూపం బెఱుంగనైతి. ఓయీ దయాబ్ధీ! సంసారాంభోధి నిమగ్నుని నీదీను నుద్ధరింపఁ జేయరే. మీరు విశ్వకారకుల రయి యిట్లవతరించిన మహానుభావులరు గదా. అజ్ఞానాంధ కారంబునం బడియున్న లోకులకు జ్ఞానదానంబు సేసి వెలుంగుఁ

జూపు స్వయంప్రకాశ స్వరూపులరుగదా. మహానుభావులరగు మీపాద సందర్శనం బెవ్వరికి లభించు నవ్వారి కైహికాముష్మికార్థంబులెల్ల నచిరంబ సంప్రాప్తంబులు కానయ్యెడుంగాదే" యని పెక్కుభంగుల నగ్గురునగ్గింప నాతండు సంతుష్టిఁగని వానిని దగ్గఱకు రావించి యిట్లు సానుగ్రహ వాక్యంబులం బల్కిరి: "ఓయీ! నేఁటితో నీదైన్యంబెల్ల నడంగు. నీమనమునంగల యెల్లకోర్కులును నీవందఁగలవు. సరికాని నేనిట నుండునంత కాలమును నీవిక్కడఁ జూచినవిషయములను వెల్లడింపఁ గూడదు సుమీ. నీకో యింక సద్గతి కలుగఁ బ్రసాదించువాఁడ' నని యథాపూర్వంబుగ నౌదుంబరచ్ఛాయం జేరె. ఇంక గంగానుజుండు భక్తిమీఱ గురువులకుఁ బ్రణమిల్లి వారిసెలవంది స్వక్షేత్రంబుంజేరి గురుప్రసాదంబున నచిరంబ యాతని కొక నిధి లభింప మహానందభరితుండై సర్వసంపదలు పెంపుమీఱ విరాజిల్లుచుండె. ఆతండనుదినమును సకళత్రంబుగా నదీతీరంబునకుంబోయి గురుపాద జలజంబులకు మ్రొక్కి వచ్చుచుండె.

ఇట్లు కొంతకాలము నడచిన వెనుక నొక్కట మాఘపూర్ణిమనాఁడాతండు నదీజలంబులఁ గృతావగాహుండై గురువులకు సాష్టాంగ ప్రణామంబుసేసి వినయావనత వదనుండై యిట్లులడిగె: "గురువరా! ప్రయాగలో మాఘస్నానంబు సల్పుటచే మహాఫలంబు గలుగునని వినియుంటి. మఱియుఁ గాశికాపురీ మహిమంబును బహుముఖంబులశ్రుతం బయ్యె. అవారణాసి యెట్టిదో ప్రయాగ యెయ్యదో జాతిహీనుండనగు నాకెఱుకపడదయ్యె. నాయెడ ననుగ్రహించి సెలవీయరే" యని ప్రార్థించె. ఆభక్తుని పల్కులాలించి శ్రీగురులు చిఱునగవున నిట్లనిరి: 'ఓయీ! యీకృష్ణాపంచ నదీసంగమంబ ప్రయాగనా నెఱుంగుము. ఈసంగమ పరిసర ప్రదేశంబే కాశి యని తెలిసికొనుమీ. కొల్హాపురంబే గయ యని మదిం దెలియుము. ఇవి దక్షిణదేశస్థ త్రిస్థలీ ప్రఖ్యాత మహాస్థలంబులు. ఏమైనఁ దత్తన్మహాస్థల సంద

ర్శనంబు కోరువాఁడవాట నీకిప్పుడ చూపెద ననుచు వ్యాఘ్రాజి నాసీనుండై శ్రీగురుండు పాదుకలను దృఢముగా ధరింపఁజేసికొని యట్లపోయి ప్రయాగను స్నానంబుసేయించి యటనుండి కాశీకా పురంబుం జేర్చి యట విశ్వనాథు దర్శింపఁజేసి మధ్యాహ్నవేళకే మనోవేగంబున గయాక్షేత్రంబున స్నాటించి సాయంకాలమునకు నిజాశ్రమంబుం జేర్చెను. గంగానుజుం డిట్లు తత్క్షేత్రయాత్ర లేకైకదినంబునం గావింపఁజేసిన తెఱంగుంగని విస్మయానంద భరితుండయ్యె. జగన్నాటక సూత్రధారుండాతం డిచ్ఛామాత్రంబునం జేయఁ జాలనిదున్నె ? స్వయంప్రకాశు నెవ్వరెంతకాలము కప్పిపుచ్చఁ గల్గుదురు? క్రమముగా నానోట నానోటఁబడి శ్రీగురు ప్రతిభావిశేషంబు దశదిశలకుం బ్రాఁకె. తత్స్థలమహాత్వంబును గ్రమముగా వెల్లడియయ్యె. అంత శ్రీగుర్వుం డమరేశ్వరు ననుమతివడసి యచ్చోటువాయ నుంకించుచుండెను.

అయ్యెడఁ బోవనున్నవాని నాతని నయ్యోగిని జనంబు దర్శింపవచ్చి చేతులు మొగిడ్చి యాతని మదికరఁగ దీనముగా నిట్లు పల్కిరి: ' బాబూ! మిమ్ముం గనుపెట్టుకొని నిత్యము మిమ్ము సందర్శింపఁ జాలుటఁ దాపత్రయంబు లడంగఁ గాలంబు పుచ్చుచున్న మమ్మిట్లు విడిచి పోవుట మీకుఁ బాడియా ? తండ్రీ ! అన్నపూర్ణా సహితులరు మిమ్మువీడ నెవ్వరిమనముల కింపుగొలిపెడి? ' ననవుడు నాభక్తవత్సలుఁ డవ్వారికి వరప్రదానంబు సేయువాఁడై యిట్లనియె: ' నేఁడెక్కడికిఁ బోవుదును ? ప్రచ్ఛన్న రూపంబున నీయుదుంబరంబునన సతతంబుండువాఁడను. మనోహరంబగు నీకల్పతరువు నాశ్రయించి మీరలు నుండెదరు గావుత. అన్నపూర్ణ నిచ్చోట స్థిరముగా నిల్పువాఁడ. అమరపురంబునఁ బోలె మదికను నాసెలవయి యుండు. మిమ్మర్చించు వారికి మీరలు నిష్టార్థంబు లొసంగఁ గల్గుదురు. మిమ్ములను నీయుదుంబరంబును నాపాదుకలం బూజించువారికిఁ గామితార్థంబు లొసఁగూడు. ఇట నన్నపూర్ణ వెలయుట నిత్యంబును బ్రాహ్మణ సమారాధ

నంబు జరిగి పురుషార్థదం బయ్యెడు. పాపనాశక్షేత్రంబునఁ గామ్యతీర్థంబునను సిద్ధతీర్థంబునను మున్కలిడి యుదుంబరంబును మిమ్మ్రను సత్తువారాభిషేచనం బొనర్చునింతి ముదుసలి యయినను గొడ్రాలయినను దీర్ఘాయుష్మంతుండగు సత్పుత్త్రుఁ బడయఁ జాలు. తదవగాహనంబున నివి యివి యననేల? బ్రహ్మహత్యా మహాదోషంబయినను రూపుమాసి పోవును. సోమార్కోపరాగ వేళలయందును సూర్య సంక్రమణ కాలంబులందు నట స్నానదానంబులఁ గావించువారి కశ్వమేధం బొనర్చుకన్న మిన్నయగు ఫలంబు చేకుఱు. మఱియు సోమవత్యామావాస్య యగుతఱింగాని వ్యతీపాతాది యోగంబులంగాని యందొక్కసారి మునింగిన మాత్రముననే వెండిగిట్టలును బంగరు శృంగంబులునుగల కపిలధేను సహస్రంబును గంగాతీరంబున నుత్తమవిప్రులకు దానంబొనర్చిన దానికంటె నధికంబగు ఫలంబు లభించు. అటనొక్క బ్రాహ్మణుని కాపోశనం బొసంగినఁ గోటి వేదవిప్ర సమారాధనంబుఁ గావించినంత ఫలంబుదక్కు. మఱియు నట విశుద్ధమతి నేమహామంత్రం బేనొక్కమాఱుచ్చరించినను బరిమళద్రవ్యంబు లగ్నికర్పించినను గోటిజపహోమ ఫలంబు సులభంబుగాఁ జిక్కు. అట రుద్రాభిషేకంబుఁ జేయించిన నతిరుద్రాభిషేక ఫలంబబ్బు. అటఁ బ్రదక్షిణంబొనర్చుట నడుగడుగున వాజపేయంబు సల్పినంత ఫలితము చేకుఱు. రెండు పర్యాయము లటసాఁగిలఁబడినంత నఖిలాఘంబులుం బోవు. గళత్కుష్ఠవ్యాధి బాధితుండై యంగహీనతఁ గన్నను లక్షప్రదక్షిణంబు లొనర్చినమీఁదట దివ్యదేహంబునందును. ఇది యింతటి పవిత్రమహాస్థలంబని యేరికోరి యీతీరంబునంగల యీకల్పభూరుహంబు చెంత నేరికింగానరాకుండఁ దపంబొనర్పఁ జేరినాఁడ' ననుచు నటనున్నట్టియుండి యాకస్మికంబుగాఁ దిరోభూతుండై భీమామరజాసంగమ స్థలంబునంగల గంధర్వనగరంబునం జేరె. అట్లయ్యు నాతండు విశ్వరూపుండౌ జగన్నాథుండౌట సర్వగతుండై

యయ్యౌదుంబరంబున నిత్యనివాసంబుఁ గల్పించుకోఁజాలెసుమ్ము. లోకుల దృష్టిని వేఱొకతావున నున్నట్లగపడినను నౌదుంబరంబున మాత్రము గురుండుండకపోఁడని యెఱుంగుము. నామధారకా! కృష్ణాతీరంబున సద్గురుమహిమం బిట్లు పేర్మినందె. ఇంక గంధర్వపురంబున నడచిన కథావిశేషంబు ముందు నీకు శ్రుతంబయ్యెడు.

## జ్ఞానకాండము — ౨౦ దశము.

అంతనామధారకుండు భక్తిభావంబునఁ గేల్మోడ్చి సిద్ధవరేణ్యు నిట్లుపృచ్ఛసేసె: ‘స్వామీ! శ్రీగురుండు గంధర్వపురంబునకుం బ్రస్థితుండయ్యు మేడిచెట్టును వీడకుండెనంటిరి. యోగినీజనంబులకు వరదానంబుసేసి యచ్చటువాసియు నటనే యదృశ్యాకృతినుండి వరదుండైయుండుననియు సెలవిచ్చితిరామె. అయ్యది యెట్లు పొసంగునో వెండియు నయ్యౌదుంబరంబుం జేరినవారెవరెవ్వరేయేవరంబు లందఁగలిగిరో సాకల్యంబుగాఁ దెలుపఁగదరే’ యని ప్రార్థించె. శిష్యునికోర్కి తీర్ప సిద్ధవరు లిట్లనుడువఁగడఁగిరి: ‘బిడ్డా! కృష్ణాతీరమహాత్త్వంబుఁ దెలుపు కొన్నిలీలలం దెల్పెదు. వినుము. గురుండు ప్రీతిమై నెటనిల్చునట ఫలంబు దొరకుచుండు. కల్పవృక్షంబున్నతావున లభింపని దొకటి యుండెడినే? తత్స్థలమహాత్త్వం బిట్టిదని నేను వివరింపఁజాలను. కాని యొక్కనిదర్శనంబు చూపఁగలను.

శిరోలాఖ్యపురంబున గంగాధరుండను వేదవిప్రుని సహధర్మచారిణి యొక సాధ్వీమణియుండె. పాపమాయమ కైదుగురు తనయులుదయించియు నొక్కండును దక్కఁడయ్యె. ఎందఱో దేవతలకు మ్రొక్కులిడెను. ఆమెయొనర్చిన యుపవాసవ్రతాదికంబు లిన్నియనిచెప్ప మితిలేదయ్యె. కాని పురాకృత దుష్కర్మఫలంబువీడకుండె. అయిల్లాలొకనాఁడు కర్మవిపాకజ్ఞుం డొకవిప్రునిఁ గని తాను మున్నేమహాపాతకంబు లొనర్చుట నిట్టిగర్భశోకం బను

భుక్తంబు కానయ్యెనో తెల్పు' మని యడిగె. ఆదైవజ్ఞుం డామెకిట్లు బోధించె: 'అమ్మా! సంతతినిలువమికిఁ గారణంబైన ప్రాగ్భవార్జిత మహాదోషం బెఱింగించెద. వినుము. జన్మాంతరంబున గర్భపాతంబొదవించినను బరద్రవ్యము హరించినను గోవుల నశ్వములం జంపినను వారికిఁ దదనంతరభవంబునఁ బిల్లలుపుట్టి చచ్చుచుంద్రు. అందీవొనర్చినదిది: నీవు తొలిభవంబున శౌనకగోత్రజుండగు నొక విప్రుని ద్రవ్యము నూఱు రూపాయ లపహరించితివి. అతం డెన్ని విధాల నడిగినను దీర్పవైతివి. తుదకతఁడు వేసారి నీవుచేసిన జోగిమై మనలేక మహాదోషాకరంబగు నాత్మహత్యకుం బాల్పడెను. అతండిప్పు పిశాచరూపముం దాల్చి నీసంతతి నెల్ల నశింపఁ జేయుచున్నాఁడు. నీపూర్వకర్మం బిట్టిదాటఁ దత్ఫలం బీవనుభవించి తీఱవలెను. కాని ప్రారబ్ధక్షయంబునకు మార్గాంతరంబు గానరాదనెను. అదివిని ఖిన్నురాలైన యాయువిద యనుతాపంబునఁ దద్దైవజ్ఞుని పాదాబ్జాతంబులం బడి యతిదీనముగా నిట్లు మనవి యొనర్చెను: 'విప్రోత్తమా! నేను బ్రాహ్మణద్రవ్యరూపక దుర్విషంబు ద్రుంగిన మహాపాపాత్మురాలను గదా. దానినుడిపి యాకిల్బిషంబడంప నౌషధప్రదానంబొనర్ప మీరేదిక్కుసుండీ' యని మొఱ్ఱపెట్టుకొను నావిప్రుండిట్లను: 'నీవు కారణముగా నాతండు మరణించినందున బ్రహ్మహత్య నీవొనరించిన దానవైతివి. అతండామృతినంది పైశాచరూపమొందె. అతని కౌర్ధ్వదైహిక విధులాచరించినవారు లేరైరి. నీవాతనిసొమ్మపహరించిన దానవైతివి. కావున నాతని కూర్ధ్వగతి కల్పింప నంత్యసంస్కారంబులు నీవ నెఱపించి యాతనివారసుల కానూఱురూకలు సమర్పింపుము. దాన నీకుఁ గృతార్థతకలుగును. అంతఁ గృష్ణా పంచగంగా సంగమస్థలంబునకుం బోయి యొక్క నెలదినాలు నిత్యస్నానోపవాసదీక్షలతో మేడిచెట్టునకుఁ బ్రదక్షిణములు సేయుము. పాపనాశ తీర్థంబున స్నానంబొనర్చి యేడుసారు లౌదుంబరాభిషేచనంబు గావించునది. పెండియుఁ గామ్యతీర్థంబున విధివిహితస్నానం

ఘోనరించి యొక నెలదినాలు శ్రీగురుపాదుకాభిషేకంబు సల్పి భక్తి మీరాలఁ బూజసేయవలయును. అప్పుడా పావన నృసింహ సరస్వతీ స్థానంబున నీదోసంగులెల్ల నశించి సత్సంతాన ప్రాప్తికిది సాధకంబగు. కాన శ్రీగురుకృపగలిగి నీ కుదయించు పుత్త్రుండు సంపూర్ణాయుస్సంపదతోఁ బెంపొందఁగలఁడు' అను దైవజ్ఞబోధ విన్న యా పేదరాలు, 'అయ్యా! మీరు సెలవిచ్చినవానిలో స్నానోపవాసాభిషేచనాది కృత్యంబులు నేను దదేకాయత్త చిత్తంబు నంబొనరింపఁజాలుదునే కాని వందరూపాయలు మాత్రము తేఁజాల. నన్నేమి సేయుమందు?' రనెను. అయ్యంతిదీనాలాపంబు లాలించిన విప్రుండిట్లు పలికె: 'అమ్మా! రొక్కముచిక్కదేని మిక్కిలి భక్తితో సద్గురుపాదంబులనే యాశ్రయింపుము. ఆయౌదుంబరవాసి కృపాలోకంబునను నీదోషంబు పాయఁజాలును లెమ్ము. గురునానతి యథాశక్తి ద్రవ్యవ్యయంబు గావించెదవుగాక' మనియెను.

దానసంతుష్టిఁగన్న యాయమ్మ తిన్నఁగా నన్నరసింహ సరస్వతీ స్థానంబుఁజేరి తత్సంగమంబునంగల పాపనాశతీర్థంబున నవగాహంబొనర్చి మేడిచెట్టు మొదట నేడుదోసిళ్ల నీరముంచి ప్రదక్షిణంబులు సేసి యంతఁ గామ్యతీర్థంబునం దిరిగి మునిఁగి పాదుకాభిషేచన ప్రదక్షిణాదికంబులు నెఱపుచు మానసభక్తితో నుపవాసవ్రతం బుపక్రమించె. ఇట్లు మూఁడుదినాలు కడచునప్పటి కాయమకు స్వప్నంబున నొక చిత్రవృత్తాంబుగదోఁచె. ఒక్కొక మగవాడి యిట్లు భీకరంబుగాఁ బిక్కనట్లు మదిఁగొట్టాడెఁట్లు: 'ఓసీ! నాడబ్బాగవేసి బాగుపడుదు ననుకొంటివేమి? ఇప్పటికైన నాడబ్బిచ్చివేయుము. లేదా నీవంశమెల్ల నాశనమొనర్చి తుదకు నీప్రాణములే తీసికొందునసుమీ! నీపెనుపుత్త్రులమెల్ల నష్టముగు. నీకిఁక సుతుఁడేకలుగఁడు. కలుగు నేనిఁ బరిమార్పఁ సంసిద్ధుఁడనై యున్నాఁడ' నని బెదరుపెట్టి నిర్ఘాతపడిన ట్లదరుఁగొని యున్న యాయబల కుదుంబరంబున శ్రీగురుండు దర్శనంబొసంగె. దాన నాయమ ప్రాణంబు లెప్పించినట్లుగాఁ దచ్చరణంబుల నాశ్రి

యించె. శ్రీగురుండపుడాయమ కభయప్రదానంబుసేసి పిశాచంబును సంబోధించి, 'నీవాపె పీడువడఁ బెఱుఁదుకొన నేమిటి' కని యడిగె. అందులకా బూచివాఁడిట్టులనియె: 'ఇది తొలిపుట్టువున నాకష్టార్జిత ద్రవ్యమపహరించె. దాననాకడుపుకగిలి యురి వోసికొంటిని. ఇపుడీరూపమున నాయురిం బొరిగొనవచ్చితిని. తాపసోత్తములరగు మీకుఁ బక్షపాతంబు తగదు గాన నిట్టిపర ద్రవ్యాపహారిణియగు దుష్టురాలి కాశ్రయ మొసంగఁగూడ' దనియె. ఆపిశాచోక్తులకుంగనలిన నృహరి యిట్టులమందలించు: 'ఏమీ! నాభక్తురాలి నింక బాధింతువేని నిన్ను శాసింతుఁజుమ్మీ. నీకింకనైన సద్గతికలుగ హితంబువల్కెదు. నీవు నామాటవిన్ననే నీపిశాచత్వంబునుండి విముక్తిఁగందువు. కాని వేఱొక తెఱఁగు నంగాదు. ఈపెశక్తికొలఁదిఁ దీర్పఁదగునంత తీర్చును. అద్దానిం గొని సంతుష్టిఁగనవేని నీకింక గతిలేదు. ఇఁకఁబొమ్ము. నాభక్తురాలికి వంశవృద్ధి యగునట్లు వరంబొసంగువాఁడ. కాక నీవు తిరిగి యాపె తెరువునకు వత్తువేని దండ్యుండవయ్యెద' వను శ్రీగురూక్తు లాలించిన యాదయ్యము నెయ్యంబుదోఁప నిట్టుల విన్నవించె: 'స్వామీ! నేఁటికి మీపాద దర్శనంబగుటఁ గృతార్థతఁగంటి. క్షమించి నన్నుద్ధరింపుఁడు. అందులకిట్లువీలయిన నట్లుకావింపుఁడు. మీయాజ్ఞకు బద్ధుఁడ'నననును. అంత గురువరులిటు లానవెట్టిరి: 'ఓయీ! యీయమ శ్రద్ధాభక్తులతో యథాశక్తిని నీప్రేతత్వ విముక్తికగుకర్మంబు జరుపు. దాన నీకు సద్గతికలుగు'నని యా బ్రాహ్మణి కిట్లాజ్ఞాపించెను: 'సౌభాగ్యవతీ! నీవు శక్తివంచన లేకుండ ద్రవ్యము వెచ్చించి యీబాఁపని యౌర్ధ్వదైహిక విధులు నెఱపింపుము. దాననీకు బ్రహ్మహత్యా దోషంబువాసి శతాయు స్సంపత్తిమీఱు తనయులుదయించి పెంపొందఁజాలుదురు. అష్ట తీర్థస్నాన పూర్వకంబుగా నాతనిపేరిట నంత్యక్రియలుసేయించి యేడుదినా లుదుంబరాభిషేచనంబు సేయుమని శ్రీగురుండు తనకుఁగలలో నుద్బోధించినట్లయి యంతలో మేల్కాంచి చకిత

దృష్టిని దిక్కులు పరికించి కనులుమూసికొని జరిగినదానిని మరల మరల జ్ఞప్తికిం దెచ్చికొనఁజొచ్చె. అంతంబోయి గుర్వాజ్ఞానుసారిణియై యనుష్ఠింప మొదలిడిన బ్రహ్మహత్యాదోషంబువాసె. పిశాచంబు వీడిపోయె. అంత నొకనాఁటిరాత్రి తిరిగి యామెకు స్వప్నంబున శ్రీగురుం డగపడి రెండు నారికేళముల నామెచేత నుంచి, 'అబలా! యింకవ్రతముఁ జాలించి పారణానంతరమున నీఫలంబులు భుజింపుము. దాన నిస్సంశయముగా నీసంతతి వృద్ధిఁ గను' నని యనుగ్రహించె. అంతనాయింతి మేలుకొనఁగని నిజపతికి జరిగినదెల్ల నివేదించి యథాప్రోక్తంబుగాఁ బ్రవర్తించె. గురుప్రసాదంబున నామెకుఁ గ్రమముగా నిరువురుసుతులు జన్మించిరి. ఆతలిదండ్రులు వారిని మురిపెంబునం బెంచికొనుచు నానందవారాంనిధి నోలలాడుచుఁ గాలంబు పుచ్చుచుండిరి.

ఏడేండ్లకందు జ్యేష్ఠుని కుపనయన సంస్కారంబు జరుప సంభారములు సేకరించిరి. పెండ్లికుమారుం జేసి మఱునట లగ్నమని సంబరపడుచుండ నాకస్మికముగా నారాత్రి వానికి ధనుర్వాతం బేర్పడి వానికాలుసేతులు కొంకరలువోయి వాఁడొదలెఱుంగక మూఁడుదినాలిటునటుం గొట్టుకొని తుదకు గతప్రాణుండయ్యె. వానితల్లి తనపుత్త్రిమీఁదను గడుపునను జాతితో బాదుకొనుచు బహువిధములవిలపింపఁదొడఁగెను. వానిగుణవిశేషములు మఱిమఱి మదికిరాఁగా నవెల్లఁ జెప్పుకొనుచు నేడ్చియేడ్చి తుదకు మూర్ఛిల్లి నేలంగూలెను. కొంతవడికి మరల లేచి యాశవముపైఁబడి కౌఁగిలించుకొని పెద్దపెట్టున రోదనంబుసేయుచు మాయావేష్టితయయి యిట్లనఁదొడఁగె: 'అయ్యో! నిన్నుఁజూచుకొని వెనుకటి దుఃఖాలు మఱచితిఁగదరా. కన్నతండ్రీ! నాగాదిలి వొడువనుకొంటినిరా. ఎక్కడికిఁబోయితివోయీ! నాయనా! పలుకవేమి? నీ మనస్సింత కఠినమై పోయెనా! ఎక్కడికయి న నాడుకొఁబోయినాఁడవా? బిడ్డా! పాలిత్తును రావోయీ. బాబూ! కోపమువచ్చెనా? రావా? అయ్యో! నీగుణములు మఱపుదగు

జాలితే? ఆవచ్చిన బ్రహ్మచారి యెవ్వండనుకొనుచున్నావో ? ఆరూపంబున సాక్షాత్కరించిన యాభక్తవత్సలుండగు త్రిమూర్త్యవతార భూతనృసింహ సరస్వతులేకాని యన్యులుకారుసుమ్మీ, తల్లీలా వివరణం బింకఁగానవయ్యెడు ' నని సిద్ధుండు వలికెను.

జ్ఞానకాండము — ౨౧దశము.

సిద్ధుండు వర్ణిస్వరూప నృసింహగురుబోధాక్రమం బిట్లెఱింగించె. బిడ్డనిఁగోల్పోయి ఖిన్నురాలై ఏడుచున్న యాయన్ననకుం దెన్నుఁజూపవచ్చిన యన్నారసింహుఁడాయమను సంబోధించి యిట్లుబోధించె: 'మూఢత్వంబున దుఃఖింపరాదు. క్షణభంగురమగు నీసంసారంబునఁ జిరజీవియెవ్వండు? పుట్టువాఁడు గిట్టువాఁడు నెవ్వండు? ఈపుట్టువ దెందులకో యోజింపవైతివే. మనకనుల కగపడు నీదేహములెల్ల బుద్బుదప్రాయములని యెఱుంగవా? కర్మవశమునఁ బాంచభౌతిక సంయోగమై యేర్పడిన యీతనువు తత్కర్మక్షయం బయినంతనే నాశంబుఁగనుచుండును. మాయాబంధంబునం జిక్కినవారీ పంచభూతాత్మక దేహములే దారపుత్రాదులుగా భావించుచుండుట కేవలభ్రాంతిసుమ్ము. మాయామయ సత్త్వరజస్తమో గుణంబులచే మనోవికారంబు లొదవుచుండును. దాన నేను నాదేహము నాభార్య నాబిడ్డ' లనికొను భ్రాంతి కలుగుచున్నది. సత్త్వప్రాబల్యమున దేవత్వమును రజఃప్రాచుర్యమున మర్త్యత్వమును దమోగుణప్రకటనంబున నధమతయు జీవునికిఁ గర్మానుసారముగాఁ గలుగుచుండును. పురాకృత సుకృత ఫలంబైన సుఖంబును దుష్కృతవశమగు దుఃఖంబు నెవ్వనిదివాఁ డనుభవించి తీఱవలెను. తత్తద్గుణ వాసనానుగుణముగాఁ దదధీనములయిన యింద్రియములు వానివాని పను లవి సేయుచుండును. మాయాపాశబద్ధులగు జీవులు వానికిలోఁబడి సుఖదుఃఖంబులం గనుచుందురు. ఇట్లు సంసారమునం జిక్కిన యీ స్వకర్మ గుణోద్భవులగు జీవులు 'చేసికొన్నవారికిఁ జేసికొన్నంత'

యున్నట్లాయా సుఖదుఃఖానుభవములం గనుచుందురు. ఇఁకఁ గల్పకోట్యాయుః పరిమితిగల దేవతలైనను గర్మమనుభవించి తీఱవలసినదే. నరమాత్రులమాట చెప్పనేల? జీవులా దేహాధీనులు. దేహంబు కాలాధీనంబు కాఁగా దేహధారి నానా గుణకర్మవశగుండై వ్రివగిల్లుచున్నాఁడు. దేహధారికే షడ్వికారంబు లేర్పడు. ఇట్టి దేహమునకును వానిసంబంధము గలవానికిని నిలుకడ యెక్కడిది? లేదు గనుకనే వేత్తలగు విబుధులు తమకుఁ బుత్రులుదయించునెడ నానందమునుగాని తన్మరణంబున విషాదంబునుగాని పొందరు. జీవుండవ్యక్తముననే గర్భంబునఁ బ్రవేశించి పిదప వ్యక్తుండయ్యెం దుదకవ్యక్తతఁగనును. దేహములు నీటిబుడగలవలె నస్థిరములు. ఎప్పుడు గర్భస్థమయ్యె నప్పుడ స్థైర్యంబుపోయె. కర్మానుబంధ ముండువఱకు సుఖదుఃఖఫలానుభూతి తప్పదు. తత్తదుపార్జిత కర్మఫలానుసారముగా నొకఁడు బాల్యమునను వేఱొకఁడు యౌవనమునను మఱొకఁడు కౌమారమునను మరణించును. మాయాపాశంబులం జిక్కిన మూఢులు మాత్రపితలయెడం బుత్రకళత్రాదులయెడలం దమవారను భ్రాంతితో మెలంగుచుందురు. బాహ్యమునకుఁ బరిశుభ్రముగా నున్నట్లగపడినను లోపల మలమూత్ర మాంసాదియుతమై రేతోరక్తోద్భవంబగు తోలుబొమ్మ యెట్లు శుచియానుకోఁదగును? విధి నుదుట వ్రాసినరీతిని శుభాశుభంబు లెల్ల ననుభవించి తీఱవలసినదే యాయె. కాలకర్మంబులను జయింపఁ గలుగువా రెవ్వరును లేరుగదా. ఇఁక నిట్టి యీ దేహము నిత్యమని కోనా? అట్లని కోనుట కలలో దొరకిన పెన్నిధిని మెలఁకువం గన్నయైంద్రజాలిక కర్మంబులను నమ్మినచందమౌఁగదా. కాక జీవులకుండు సంబంధము నిత్యమనుకొందేనిఁ బూర్వజన్మమునం దీవు నరజన్మమే యెత్తియున్న నెవ్వనికిఁ దల్లివో యెతనికి సతివో మఱి ముందు భవంబున నెవ్వరిదానవు కానుందువో చెప్పఁగలవా? లేదు. ఇఁక నీపాంచభౌతికమగు చర్మపుఁదిత్తిపై మమత్వము కల్పించుకొని

వృథాశోకంబునందనేల? ఇఁక వీఁడు నీకొడుకనుకోనేల? ఇట్టేఁడు మరణించెనేయని భ్రమవెట్టుకొని యేడ్చుదేల? శాస్త్రోక్త పద్ధతుల ననుసరించి యిఁకనైన నాశవంబును సంస్కారార్థ మిచ్చివేయు" మనియె.

ఆయపూర్వ బ్రహ్మచారి మహోపదేశంబును విన్న యాయన్నుమిన్న యిట్లన్నది: "అయ్యా! మీ రెవ్వరో నాకుఁ బరమధర్మముం గఱపితిరి. కాని నామనమున కింక స్థైర్యంబు గలుగదయ్యెను. ఏమన మీరన్నట్లు ప్రారబ్ధమే ప్రమాణమగు నేని దైవారాధన మెందులకు? లోకంబున నేదియొక్కట్లఁ గ్రప్పడిన నట్లే యుండవలెనన్నఁ బరుసమంటినందువల్ల నినుము బంగారముకానేల? మున్నె దైవతము నెఱుంగని నేనాగురుపాదంబుల నాశ్రయించి నంత నా కభయప్రదానంబు చేసినవాఁడతఁ డిప్పుడు నన్ను పేక్షింపఁదగునా? జ్వరపీడితుఁడై పడియున్నవాని కౌషధమొసంగిన నదిమేలుఁగూర్పదే? ప్రభువు తలఁచిన శరణాగతుఁడగు నాపన్నుని సంపన్నుఁ జేయఁజాలఁడా? నేనాశ్రయించినదో సాక్షాత్త్రిమూర్తియగు గురుమూర్తినయ్యె. వరమూ పొందితి నయ్యె. అట్టిదానికి మార్పుండదని యాతని మాటలనునమ్మి చింతవీడియున్న నాయెడఁ దుదకాతండే విశ్వాసఘాతుకుండై నాకొంపఁదీసినాఁడే! అయ్యో! యెంత బుద్ధిమాలినదాననై యామునగకొమ్మను బట్టుకొని వ్రేలాడుచుంటిని? ఏమయిన నేనాగురుమూర్తియెదుట నాయసువులనీడ్చుదాన. ఈదేహంబు నాతనికి సమర్పింపఁ బోవుచున్నాను. ఆతండు నన్నిట్లు మోసపుచ్చెననికూడ నందఱు నాతనింగూర్చి చెప్పికొని"మ్మనపుడు నాయమ మనోగతంబెఱింగిన యావామనాకారుం డిట్లామెకొక యుపాయంబును బోధించెను: "సరే, నీమనంబెట్లైన గురునిష్ఠాగరిష్ఠంబైయున్నది. నీవందినవరమునంజేసి పూర్ణాయువగు పుత్త్రునిఁ గంటివి. దైవయోగంబున వాఁడిపుడు మృతుండయ్యె. కావున

నీవేడ వరంబుఁగంటివాడఁ గృష్ణాపంచనదీ సంగమస్థలంబున నుదుంబర పరిసరంబునన శరీరత్యాగంబు కర్తవ్యంబనియె. అది విన్నంతనే యావిప్రాంగన 'యహా నట్లచేయుదాన' ననుచు నా శవముం దనకడుపునకుం గట్టుకొని యయ్యుదుంబర స్థానంబునకుం బోయి నరహరిపాదుకలం దనశిరంబును మాటిమాటికి గొట్టుకొన్నదై రుధిరాభిషేచనంబుఁ గావించె.

పాపము, పుత్రశోకమును మించినది లేదు. అది కన్న తలిదండ్రులను క్షయరోగమువలెఁ బీల్చి పిప్పిసేయునుగదా. అప్పటికానాఁడు సూర్యాస్తమయము కానుండె. ఆమె వెంట వచ్చెటికి తెంచిన బ్రాహ్మణు లప్పటికైన నామె శవసంస్కారంబున కంగీకరించునేమోయని విసువుకొలఁదిఁ దుదకిట్లనిరి: 'ఏమమ్మా! చీఁకటిపడుచున్నది. యీదిక్కుమాలిన యడవిలోఁ బడి మమ్ముఁగూడఁ జావుమందువా? యిప్పటికైన నాపీనుఁగు నీవలఁబడవేయవే!' యన్నను వారికామె ప్రత్యుత్తరమిడదయ్యెను. శ్రీగురుపాదుకలంబడి పెద్దపెట్టున నేడ్చుచుండె. అపుడావెంట వచ్చినవారెల్ల రిట్లనికొనిరి: 'పొద్దుగ్రుంకుచున్నది. ఈమొండి దిప్పుడది విడుచునట్లు లేదు. ఈప్రాంతమందు దొంగలవలని భయముకొండు. మనమిఁక నిట మసలఁగూడదు. త్వరగా స్నానాలు చేసి యిండ్లకుఁబోయి యీరాత్రి తిండ్లు తినకుండఁ బరుండి రేపటియుదయ మిక్కడికిఁ దిరిగివత్తము. ఈరాత్రి యంతయు మేలుకొని గవులుగొట్టిన మీఁదట నైన విడువకయుండునా? అపుడామెపని చూత' మని శవజాగరణాం బోనర్ప నాయమ నటడించి పోయిరి. ఆమెకుఁ దోడామె పెనిమిటి మాత్రము కూరుచుండెను. ఒకజాము గడచె. రెండుజాములయ్యె. ముందు మూన్నాళ్లు బిడ్డనివ్యాధిభరంబునను బిదప రెన్నాళ్లనుండి శవజాగరణంబునను నిద్రాహారములు లేక యేడ్చి యేడ్చి బడలికఁగన్న యాతలిదండ్రులు కానిర్జనప్రదేశమునఁ గునుకువట్టెను. అపుడా

చావకు స్వప్నాన నొక్క దేదీప్యమాన మానికుంజ రాకారుండు కానవచ్చెను.

తే॥ జడలువ్రేలాడ నొడల భ ♦ స్మంబుగ్రాల
మెడను రుద్రాక్షమాలిక ♦ ల్గడలు కొనఁగ
నమరశూలంబు యోగదం ♦ డముఁ గరముల
జటికనంబడెఁ బులితోలు ♦ కటిఁగలాఁడు॥

ఆతండాపెకిట్లను: "ఏమమ్మా! నన్ను దూషించెదేల? నీబిడ్డనికి వచ్చిన భయమేమి? ఇదిగో చికిత్స చేయుచున్నాను. వాతోద్రేకంబున మృతినందిన నిందుఁ బ్రాణవాయువు ననుసంధించి వీనిం బునరుజ్జీవితు నొనర్పఁగల" నన్నవాక్కులా తల్లికిఁ గలలో విన్నట్లయి మేలుకువఁగని వెఱఁగుపడి దిగ్గునలేచి యిట్లను కొనును: "అయ్యో! యింకెక్కడి భ్రాంతి! చచ్చిన వాఁడింక బ్రదికివచ్చునా? లేదు. లేదు. మనసులో నేమనికొన్న నయ్యది కలలో నయినట్లుండునే కాని యిదియెల్లఁ గలలోనివార్త కాదా? అన్నృసింహులుండెక్కడ? నాయీవెఱ్ఱి భ్రాంతియెక్కడ? నాప్రారబ్ధమున కాయన యడ్డుపడునా? నామూర్ఖ్యముకొలఁది నాగురువులు విశ్వాసఘాతుకులైరని కొనుటకాని యదికల్ల" యనికొనుచు నాసవీడియుండ ముహూర్తమాత్రంబున నాకళేబరమంతట నుష్ణంబు వొడమెను. నాళ్లయందుం గీళ్లయందును జైతన్య మొదవెను. అల్లది కని శోకాకులచిత్తయా నాకామిని "యేమిది! యేదైన భూతం బాశించెనా?" యనికొనుచు విభీతచేతసయయి యాశవమ్ము నావలకుఁద్రోసెను. క్షణమాత్రంబున బాలుండు లేచి కూరుచుండి "అమ్మా! ఆఁకలియాచున్నది. త్వరగా నన్నముపెట్టు" మని యేడ్చుచు లేచి తనతల్లిదరికి వచ్చెను. ఆపె కయ్యెడ నత్యద్భుత స్తన్యస్రావ మొదవె. అపుడాపె తన బిడ్డని నొడిలోఁ గూర్చుండఁబెట్టుకొని చనుగుడిపెను. మొదట నాయమకు భయాశ్చర్యంబులు పెనఁగొంచు నొదవినను వాఁడు

పాలు శ్రీవినమీఁదట సంతతియములెల్ల పీడెను. దాన నమం దానంద కందళిత హృదయారవింద యగునామందయాన తనభగ వత్ప్రసాదితాపత్యంబునుగొని భర్తనుదరిసి యాతని న్నిద్దుర నుండి మేలుకొలిపి మెల్లఁగ నాతనికి జరిగినదెల్ల నివేదించి బిడ్డనిఁజూపెను. వారానంద బాష్పంబులతో నాపువరుజ్జీవి తార్భకుఁ గృతస్నానుంజేయుచుఁ గౌఁగిలించి ముద్దాడిరి. అంత నాదంపతులు సపుత్రికులయి పోయి నదీజలంబులఁ గృతావగా హులై యౌదుంబర ప్రదక్షిణ నమస్కారంబులొనర్చి భక్తిమీఱ కమీపత్రిపుష్పాదులతోఁ బూజించి నీరాజనంబిడి పుత్రభిక్షంబు పెట్టిన నారసింహు నిట్టుల స్తుతిచేయఁ దొడఁగిరి:

దోదక. నీమహిమంబు గ ♦ ణింపఁ ద్రిమూర్తీ ।
        దేమొక ప్రీతి ♦ నేలుహకీర్తీ ।
        ప్రేమనుదుంబర ♦ వృక్షనివాసా ।
        కామితమిత్తు జ ♦ గన్నుతభాసా ॥

తోటక. పరిపాలిత భక్త కృ ♦ పాజలధీ ।
        శరణీయుఁడ నీవ యశః ♦ పరిధీ ।
        నరసింహ క్షమింపుము ♦ సద్వరదా ।
        గురుమూర్తి మదిన్ననుఁ ♦ గొల్తు సదా ॥

యని భావజ్ఞుండగు భావనాముయు సద్భావంబునం బ్రార్థించు తటి నరుణోదయంబయ్యె. అయ్యెడఁ బూర్వసాయం కాలము వారిని డించిపోయిన విప్రులూరినుండి శవదాహంబుఁ గావింపవచ్చిరి. వారామృతబాలుం డిప్పుడు సజీవుఁడయి యుంటం గని నివ్వెఱపడిరి. ఆబిడ్డని జననీజనకులు మహోత్సాహంబున జరిగినదెల్ల వారికెఱింగించి యట భగవత్ప్రసాదంబు సేకరించి పోవుదమనిన వారెల్ల రత్యానందంబున నట్లకావించిరి. మహి మంబుఁ దెల్పు మొదలిడిన నింకిట్టిన్ని యో గాధలుగలవు. అట శ్రీగురుండు సుస్థిరుండై యుండును. తదారాధనంబున నదిరంబ

యిష్టాప్తి నిక్కువంబు. గొడ్రాండ్రకు బిడ్డలును నిలుపేదలకు సంపదలును రోగులకారోగ్యంబు నబ్బు. అచ్చోట నపమృత్యు భయంబు లేదు. అంగహీనుండయినను గుష్ఠవ్యాధి బాధితుం డయినను భక్తితో శ్రీగురు పాదుకాభ్యర్చనం బొనర్చిన నవివోయి సువర్ణదేహం బేర్పడు. దాన మూకబధిరత్వాదులునడంగు. ఇవియవి యననేల? అది యఖిలపురుషార్థదంబును' మ్మని సిద్ధుండు బోధించె.

జ్ఞానకాండము — ఏకాదశము.

నామధారకుం డాబోధనుం గొనియాడి శ్రీగురుండు గంధర్వ నగరంబుం జేరిన వెనుక నడచిన కథావిశేషంబులం దెల్పుండనప్పుడు సిద్ధ యోగీంద్రుం డాతని ధన్యత నెంచుచు సాహ్లాదంబుగా నిట్లు చెప్పందొడంగె: భీమామరజాసంగమంబు ప్రయాగకెనయైనది. అట నెనిమిదితీర్థములుగలవు. వాని మహిమంబు ముందెఱింగింతు. భక్తోద్ధారకుండగు శ్రీగురుండు గుప్తరూపంబున నటనిలిచె. క్రమముగా నది వెల్లడియయ్యె. అది యెట్లనిన నాతండు సంగమ ప్రాంతారణ్యంబున వసించి యనుదినంబును మధ్యాహ్నవేళను భిక్షాటనంబొనర్ప గంధర్వపురంబున కేగుచుండె. ఆయూర నొకవంద బ్రాహ్మణాగారంబులుండె. అందొకవిప్రుండు నిలుపేదయయియుండె. ఆతనిభార్య మహాపతివ్రత. వారికిఁ బండ్లులేని యొకముదుసలి గొడ్డుగేదెయుండె. ప్రతిదిన మాయూరిలోని కర్షకులొక్కరొక్కరుగావచ్చి యావిప్రునివద్దనుండి యద్దాని నద్దెకుంగొనిపోయి దానిముక్కునకుఁ ద్రాడువోసి యుప్పుమోయించుచుండెడివారు. ఇట్లాగేదెవల్ల నావిప్రుండు జీవించుచుండె. ఒకనాఁటి మధ్యాహ్నవేళను శ్రీగురుం డాపేదబాఁపని యింటికి భిక్షార్థమేగుచుండె. ఆయగ్రహారమందలి శ్రోత్రియద్విజులుగొందఱీతండు షడ్రసోపేత భోజనంబు లభింపఁదగిన తమయిండ్లకు రాక యానాఁడాదరిద్రు నింటికేల పోవలసె' ననిరి.

ఆ. రాయబారిఁ గృష్ణు ♦ రారాజు విందుకై ।
పిలువఁ బోకయుండె ♦ విదురుఁజేర ।

భక్తవత్సలునకు • రిక్తులు సాత్త్వికు।
శ్రితులుకాని ధనులు • గతి కగుదురె?॥

అయిన నెవఁడు దయఁగన్న మాత్రముననే యుండనిల్లుఁ బండమంచము లేనివాని నుర్వీశ్వరుం జేయుటకు నెవ్వండు కోపించిన నెట్టి సంపదనైనఁ గనుమూసి తెఱచునంతలో నడఁచుటకును సమర్థుండట్టియా మహాత్ముండు శ్రీమంతుల నరకు సేయునా? తత్పదంబులంటఁ గనుమాత్రముననే బమ్మవ్రాసిన వ్రాఁతైన మార్పఁగనునే! ఇఁక నాతని బిరుదములెన్న నాతరమా నే? అట్టి యాతం డేతనియింట పుట్టినపది యాతని సుకృతవిశేషంబునవ యనికోవలసినదే.

ఒకనాఁడా గేదె నెవ్వరును దోలుకొనిపోలేదు. అయ్యది యింటనేయుండె. శ్రీగురుండు భిక్షార్థము వారియిలు సేరినదానాఁడే. అది వైశాఖమాసము. మధ్యాహ్నవేళ యైనది. ఆపేదబాఁపఁడు యాయవారార్థము వెలుపలికేగి యుండెను. ఆయిల్లాలిని స్వామి భిక్షమిడుమని కోరఁగా నాయమ వెంటనే లోపలినుండివచ్చి భయ వినయావనత వదనయయి యిట్లను: 'యతీంద్రా! మాయింటివారు పశ్రిస్త్రాహార పదార్థము లిప్పుడ కొనిరాఁబోయిరి. మీరొక్కింతసే పిటదయసేయుం' డని యొకపీట వేసె. శ్రీగురుండు మందస్మితవదనుండై యట్లకూర్చుండి యామెతో నిట్లనియె: 'అమ్మా! భిక్షార్థము మాకిన్ని క్షీరము లొసంగరాదా? నీభర్తగారెప్పుడో వత్తురందు వేల? మాకు మీవాకిటనున్న గేదెపాలు చాలునే' యనెను. అందులకామె యిట్లు బదులుపలికె: 'స్వామీ! యీగేదె ముదుసలిది. దీనికిఁ బండ్లు లేవు. ఇది యొక్కయీఁతయైన యీనినది కాదు. దీనిని ముక్కుఁ ద్రాడువోసి దున్నలతోఁ బాటు బరువులీడ్పించుచుందుము. ఆబాడిగవల్లనే మాజీవన' మనియె. అంత నయ్యతివరుండామెతో 'నీవు మాతో నబద్ధాలాడక త్వరగా దాని పాలుపిదికి నాకిమ్మ' నియె. తదుక్తుల కాసాధ్వీమణి బదులాడలేక పెద్దలయాజ్ఞ నుల్లంఘింపఁ దగదని యొకమానుమును తను

గొనిపోయి పాలుదీయఁ గూరుచుండెను. ఆగురూత్తముల విశ్వాస ముంచి పిదుకఁగా నైనక్షీరములు రెండుకడవలు నిండెను. ఆమె యా యపూర్వ వైచిత్ర్యంబున కద్భుతపడుచు నాదుగ్ధంబులను లోనికిఁ గొనిపోయి పొయ్యిమీఁదనిడి యించుక వెచ్చఁబఱచు చుండె. అంతలో స్వాములవారామెను వేగిరపెట్టి తత్క్షీరంబుం దెప్పించికొని క్రోలితనిసి వారి కఖండ లక్ష్మీప్రాప్తి యగునట్లు దీవించి తాను సంగమస్థలంబునకు మఱలె. పిమ్మట యజమానుం డిలుసేరి నిజసతివల్ల జరిగినదెల్ల మహాశ్చర్యంబు గదుర నాకర్ణించి యాతండు నరమాత్రుండు గాఁడనియుఁ బరమపూరుషుండనియుఁ దెలిసికోఁగలిగె. అంతనాతండు గురుదర్శనమొనరింప సకళత్రుం బుగా నేగి యథావిధిగా నర్చనంబొనరించి తదనుగ్రహంబువడసె. అంతనాదంపతులు శ్రీమత్తయుఁ బుత్త్రపౌత్త్రసంపత్తియుం బొదల నిశ్చింతతోఁ గాలంబుఁ గడప గురువరంబంది నిజాగారం బునకు మఱలిరి. ఇట్లే గురుకృపాప్రసారం బెవ్వారియెడంగలుగు నవ్వారి కష్టైశ్వర్యంబు లొనగూడకుండెడినే? యనియె.

జ్ఞానకాండము — ౨౩ దళము.

శిష్యుండవ్వలికథ తెల్పుమన సిద్ధుండిట్లు చెప్పుచున్నాఁడు: ॥గురులీలం దెల్పెదవినుము. ఎల్లరెఱిఁగిన యాపేదబాఁపని ముదుసలి గొడ్డుగేదె గురుప్రసాదంబున దుగ్ధదాయిని యైన నాఁటి నుండి తన్మాహాత్మ్య ప్రకటనంబు కాఁదొడఁగెను. అదెట్లన్న యతివరులా విప్రాలయంబున మెట్టిన మఱునటి యుదయమే కృషీవలు లద్దాని నద్దెకుంగొనిపోవచ్చిరి. వారికాపాఱుండు పాలిచ్చు గేదె నిఁకనీయను బొమ్మనెను. వారదికని యచ్చెరువడిరి. క్రమముగా నీవార్త చారులవల్ల భూపాలునికిం దెలియవచ్చె. అతం డారయఁ బరిసర సరిద్వర తటంబునంగల జటివల్లభు మహిమంబ యని వేద్యంబు కానయ్యె. అంత నయ్యవనీపతి చతురంగబల సమన్వితుండై సతీ సహితంబుగ నాతని సందర్శనంబొనర్ప నేగుదెంచె. ఆతండగ్గురూత్తము నెదుట సాఁగిలఁబడి యనేక ప్రకా

రంబుల సంస్తుతించె. గురువరుఁ డానరపతితో నరణ్యంబున నేమూలనో పడియున్న తనతెరువునకు రానేమిటికని యడిగె. అందులకా భూజాని యిట్లు విన్నవించె: స్వామీ! మీరిట్లు వనస్థలిఁ జేరనేల? భక్తుల నుద్ధరింప భూమికిడిగ్గిన నారాయణులర కారె? మీయశంబు శ్రుతుల వేనోళ్లఁ జాటఁబడి యున్నదాయెను. జనతారకులరై యవతరించిన మీరీవనంబువీడి మా గాణగాపురంబుఁ బావనంబొనర్పరే. అట మీరనుష్ఠానంబుఁ గావించికొనొక మఠమేర్పఱతు. మీరటవసించి మమ్ముద్ధరింపవలయు'ననుచుఁ దచ్చరణంబులంటి వీడకుండెను. అపుడా శ్రీగురుండు కొలఁది కాలం బట్లు ప్రకటంబుగానుండి భక్తత్రాణంబు సేయఁ దగ్గదేయని కృతనిశ్చయుండై జానితో 'నీమనోరథంబుఁ దీర్తునట్లుకాని' మ్మనియె. ఇట్లు గురువులు సెలవొసంగినంత సంతోషాక్రాంత స్వాంతుండగు నయ్యనంతాకాంతుం డాతనింగొనిపోయె.

సీ. కాహళంబులు మృదం ♦ గ ముఖాదిగాఁగల్గు
కమనీయ వాద్య ఘో ♦ షములు ప్రబల
నాగవాసముల మం ♦ గళనృత్త గీతము
లు రమణీయనాగస్వ ♦ రములు సెలఁగ
చతురంతయానము ♦ లైన్యనికానీకంబు
గజతురగోష్ట్రాది ♦ కములు సాగ
వేదపారగులైన ♦ విప్రోత్తములువెంట
స్వస్తివాక్యంబులు ♦ సదువు చుండ

తే. జేఁడు వింజామరముఁగొని ♦ కూడనడవ
వందులు త్రిమూర్తి బిరుదాళిఁ ♦ బాడుచుండఁ
బౌరకాంతలారతులతో ♦ స్వాగతమిడ।
బ్రహ్మరథమున గురుఁడు పు ♦ రంబుసొచ్చె॥

ఇట్లు మహోత్సవంబున నాతం డానీతుండౌ తఱిఁ దద్గ్రామంబునం బశ్చిమభాగంబునఁ బాడువెట్టఁబడిన పెక్కిండ్లనడుమ నున్న యొక మహోన్నతాశ్వత్థంబు వాసంబుగాఁగల యొక క్రూర బ్రహ్మరాక్షసుండు శ్రీగురూత్తముల దర్శనమయినంత నటనుండి క్రిన్నన డిగ్గివచ్చి తత్పాదంబులంటి యిట్లు ప్రార్థించెను: 'ఓ మహా కృపాళూ! నన్నుద్ధరింపుము. నినుఁజూచినమాత్రమున నాదోసఁగులెల్లఁ బాసె' ననవిని గురుండు నిజకరంబును దచ్ఛిరంబునం జేర్చె. అట్లు హస్తమస్తక సంయోగంబైనంతనే యాబ్రహ్మరక్షస్సునకు నరరూపంబొదవె. అంతనాతండు గురునానతిఁగొని సంగమంబునకుంజని యటస్నాతుండై దాన జ్ఞానసంపదనంట ముక్తుండయ్యె. అది చూచినవారికెల్ల నద్భుతావహమయ్యె. దాన నాతని యవతారత్వంబు వారెల్లరకు వ్యక్తంబయ్యె. అంత శ్రీగురువుల కొఱకు చోట నేర్పఱుపఁబడిన మఠంబున వారు సుఖంబుండిరి. పార్థివేశ్వరుండును భక్తిమీఱఁ దద్గురువరులకు షోడశోపచారంబులు గావించుచుండె. మఱియు ననుదినంబును గురుండు సంగమ ప్రదేశంబునకు స్నానానుష్ఠానాదికంబుఁ దీర్చికొన నేగుచుండ నృపతియు నిజభటానీక సహితుండై యనుసరించి డించి వచ్చువాఁడు. మధ్యాహ్నవేళ నాతండు మఠంబునకు మఱలు తఱిఁ దాను ససైన్యంబుగా నెదురేగుచుండు. క్రమముగా నన్య గ్రామవాసులకు నాతని మహిమంబు తెలియరాఁగాఁ గొండఱు తద్దర్శనార్థమేగుదెంచుచుండెడివారు.

ఇట్లుండఁ గుమసీ గ్రామవాసి నృసింహభక్తుండొక తాపసి త్రివిక్రమభారతి యనువాఁడీ యతి యానారూఢుండై పోవుచుండుననివిని యిట్లు నిందించె: 'ఈతఁడెవ్వఁడో డాంభికుఁడు. తురీయంబుఁ గొన్నవాఁడేమి? పల్యంకికారూఢుండై చనుటేమి? ఇది యోగ్యమా?' యనియెనఁట. భక్తాధీనుండై యట్లాసర్వు నీసర్వసాక్షి త్రివిక్రమభారతి తన్ను నిందించువాఁడని గ్రహింప

లేడా? నామధారకా! యింక నేమయ్యెనో చెప్పెద. సావధాన మతివై వినుమోయీ' యని సిద్ధుండు పలికె.

## జ్ఞానకాండము — ౨౫ దళము.

శిష్య సంప్రశ్నంబున సిద్ధుం డవ్వలికథ యిట్లు నుడువం దొడంగె: 'బిడ్డా! వినుము. కుమసీవాసియగు త్రివిక్రమ భారతి తననుగూర్చి నిందావాక్యములం బల్కుచుండునని యావిశ్వసాక్షి యగు గురుండు నిజశిష్యుండగు క్షితిపతికిం జెల్పి తామాగ్రామము నకుం బోవలయుననిరి. అది విని యానృపుం డపరిమితానందం బున శ్రీగురుం బుష్పమాలాలంకృతుం జేసి యాందోళికారూఢుం గావించి హ స్త్యశ్వాది పరిభవంబులు డంబుమీఱ నానావాదిత్ర గీతాదికంబులతోడ నుహాసంభ్రమంబునం గుమసీగ్రామంబునకుం గొంపోయె. అలనాండా త్రివిక్రమభారతి నృసింహమానస పూజారతుండై కూరుచుండ నెంతసేపటికి నాతని చిత్తంబున స్థైర్యంబు చిక్కదయ్యె. అపుడాతండు తన మదిలో 'నృహరీ! నన్నుపేక్షించెదేల? నాతపంబెల్ల వృథయయ్యెనే' యని చింతించి పునస్సమాహిత చిత్తుండౌటచే నాతనికి నదీతీరస్థ నృహరి సంద ర్శనంబాదవె. ఇంక నయ్యతివరుం బరివేష్టించియున్న సేనానివ హంబెల్ల నామానసార్చాపీఠ నాతనికి యతి సమూహంబుగా గోచరింప నాతండు విస్మితుండయ్యె. మున్ముందుగా నృసింహ సరస్వతులకు సాష్టాంగ దండప్రణామంబుసేసి యాతని యనుచర జాతివర్గంబునం జానడంకువసూప జ్యేష్ఠులెవ్వరో కనిష్ఠులెవ్వరో యెఱుంగరాక కేల్మోడ్చి యిట్లుపలికె: 'ఓసహా స్వామీ! మీరు జగద్గురువులగు. బ్రహ్మ విష్ణు శివ స్వరూపులరు. మాయాజా లంబునం జిక్కువడియున్న నేను మీరూపంబుం దెలిసికోలేక యున్నాను. మీరు సర్వవ్యాపకులరౌ నారసింహులరు. ఈ చర్మ చక్షువులతో మిమ్ముంజూడంజాల. మీరే దయచేసి సాక్షాత్క

రింపవలయు. విశ్వతారకా! గురునాథా! చిరతపః ఫలంబుగ నన్నాదరింప మీరిట్లుదర్శనం బొసంగితిరిగాదే. నాయెడ ననుగ్రహించి మీ చిన్మయ స్వరూపంబు గుర్తింపం జేయరే' యని బత్తితో మ్రొక్కులిడియె. దాన సంతుష్టిఁగొన్న యగ్గురుండు త్రివిక్రమునకు భ్రాంతియుడిపి చతురంగసైన్య మధ్యస్థిత నిజ స్వరూపం బగపఱిచి యాతనితో నిట్లు పల్కెఁ: ఓయీ, ముండీ! దాంభికుండని నిత్యంబు నిందారూపంబున నెవ్వాని సంస్మరించు చున్నాఁడవో వాఁడే వీఁడు. అందుంగూర్చి నిన్నడుగవచ్చినాఁడు. నీవు మానసికోపచారంబుల నిత్యనృసింహార్చనం బొనరించువాఁ డవని లోకంబునఁ బేర్మిఁగంటివి. కావున దాంభికుండన నెట్టి వాఁడో వివరింపుమయ్యా, త్రివిక్రమా! నీచిత్తంబు త్రివిక్రమా యత్తంబ కానినాతండ నీకిది మదిని స్ఫురింపఁ జేయఁగలఁడామె' వను తద్గురూక్తులు ములుకులవలెఁ దన చెవులం బడినంతనే యొడలు జల్లుమన గజగజ వణఁకుచుఁ జేతులు కట్టుకొని వంగి గద్గదస్వనం బుతో నిట్లు విన్నపంబుసేసె: 'సద్గురూత్తమా! సేనవిద్యలోఁ బడి కొట్టుకొనుచున్న మూఢుఁడను. తెలియక పొల్లులాడిన యీమీపాదసేవకుని మన్నింప మీరెదిక్కు. ఓహో, త్రిమూర్తీ! మీరే మాయాపవివర్తకులరయితిరి. నేనో, యజ్ఞానపటవేష్టితుం డనై మాయాసముద్రంబున మునింగి యున్నవాఁడనైతిని. మోహంబు నాకనులఁ గప్పియుంట దివాంధప్రాయుండ నుమ్మ. జ్యోతిర్మయుం బరమపూరుషు నిన్నెఱుంగనైతి. ఎట్లకే నేఁటికి మీపాదంబులు సేవింప నాకులభించె. దేవరాజా! క్షమింపుము. క్షమింపుము.

తే. కర్మవశమున నీయ వి ♦ ద్యోర్మిలందు।
మూఁగుచున్నాఁడఁ బరపార ♦ మొంద లేక।
జ్ఞాననౌకను జేర్చి నీ ♦ స్థానమునకు।
నన్నుఁ గొనిపొమ్మయ్య చి ♦ న్మయ! కృపాబ్ధి!

స్వామీ! భవదీయకటాక్ష వీక్షణంబొదవిన నెల్ల దొసఁగులు దుఃఖంబులుం బాయుఁగాదే? అద్ది కలికలుషాపహారకంబయి పరమార్థైక్య సంపాదకంబు గానోపుట కబ్బురంబే? మున్ను శ్రీకృష్ణ భగవానుం డర్జునునకు విరాడ్రూపంబుఁ జూపెననివింటిమి. అట్లే మీరు నేఁడు నాకగపఱచితిరి. మీమహిమం బపారము. భవాబ్ధి తారకులగు మీపాదంబు లిపుడు నాకు దొరకెఁగానఁ గృతార్థతఁగంటిని. అనాయాసంబుగాఁ జింతామణి లభింప నింకఁ జేదఱికంబెక్కడిది?

తే. గంగనగరుల నుద్ధరిం ♦ పంగనెట్లో ।
విదురునింటికిఁ దానయి ♦ విష్ణుఁడెట్లో ।
యట్లనన్నిప్పుదరిఁజేర్ప ♦ నాగతుఁడవు ।
ధన్యతనుగంటి నీదుపా ♦ దంబులంటి ॥

అని త్రివిక్రమ భారతీయతి సాఁగిలఁబడినంతఁ గరుణామయుండగు శ్రీగురుం డాతని సైరించి భ్రమాపనోదంబై ఖేదంబు వాసి పునరావృత్తి రహిత పరమకైవల్యపదం బొదవునట్లు వరప్రదానంబు సేసె. అంతఁ గనుమూసి తెఱచులోపల గురుండు ససైన్య రాజన్యుండై గంధర్వపురంబునం జేర. నామధారకా! నరరూపంబుఁ దాల్చిన యీ త్రిమూర్తి మహత్త్వం బింతేమి చెప్పుదు? అయ్యది వేదశాస్త్ర పురాణ ప్రకీర్తితంబు. జనులిందు విశ్వాసముంచి గురుభజనంబుఁ గావించి తరించెదరుగావుత.

తే. నిర్మలామృత రుచిరసా ♦ నీయశాల ।
జ్ఞానకాండాఖ్య మీకథ ♦ జ్ఞానదంబు ।
నఖిల పురుషార్థదంబిద్ది ♦ యతిసులభము ।
పూరుషోత్తమ సంప్రీతిఁ ♦ బొల్పుఁగాత.

శా॥ జ్ఞానంబబ్బు సరస్వతీ కథితము ♦ సద్గ్రంథము వ్యాసుదే,
వానందుల్ గురుసంహితాఖ్యమునుగీ ♦ ర్వాణంబునంబల్కఁ, బ్ర
హ్మానంద ప్రతిపాద్యమయ్యె నిటులే ♦ నాంధ్రీకరింపఁ, గురు
ధ్యానాప్తింబురుషోత్తమ ప్రియముగా ♦ స్వార్షంబు చేకూరఁగాఁ

—♦ కం ద ము ♦—

శ్రీపాదులు, శ్రీదత్త శ్రీ । పాద నృసింహా
భిధులయి ♦ పరఁగి త్రిమూర్తుల్ ।
ప్రోది యొనర్చినకథ తగు ।
నాదెల్లకు లీనదక్షి ♦
ణా మూ ర్తి
కృతిఁ ॥



శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః.

# శ్రీగురుదత్త సరస్వతీయము.

కం. అందుం బురుషోత్తములకు
ముందు సరస్వతికి నిందు ♦ బుధనుత మూల
గ్రంథాజ వాసుదేవా
నందసరస్వతికి దక్షి ♦ ణామూర్తి నతుల్.

కర్మకాండము — ౧దశము.

శ్రీ గురుకథా సుధాస్వాదనంబున జ్ఞానంబువడసిన నామధారకుండు సిద్ధయోగీంద్రుని కిట్లనియె: 'ఓహో! గురుశిరోమణీ! మీకంటె సద్బోధకులు లేరని నామనోరూఢి. నరరూపంబున ధరపై నవతరించిన కృపాళుండగు నా సర్వేశ్వరుండు జ్ఞానులకు సాక్షాత్కరించు చుండుంగావునఁ ద్రివిక్రమునకు నిజరూపదర్శనం బొదవించెనని మీవల్ల గ్రహింపఁ గలిగితి. అవ్వలి వృత్తంబు మీరు నాయెడఁ గృపాయత్త చిత్తంబున ననుగ్రహింపఁ గోరు వాఁడ' ననవుడు నాసిద్ధుండిట్లు చెప్పందొడంగె: 'శిష్య చూడామణీ! నీకుతూహలంబు నాకెంతయు సంతోషదాయకంబు. కాని యీగురులీలలెల్ల వివరింప మొదలిడిన నెంతకాలంబునకుం దఱుఁగవు. గ్రంథవిస్తరభీతిని దత్తస్వరూప కథాభాగంబులు మాత్రమిందు సంగ్రహించువాఁడను.

మున్నొకప్పుడు వైడూర్యనగరంబున నొక తురుష్కుఁడేలు చుండెను. వాఁడు బ్రహ్మద్వేషియై యుండెను. అతఁడొక తన రాష్ట్రంబునంగల వేదవేదాంగ పారంగతుల నెల్లఁ గట్టి తెప్పించి తనయెదుట మంత్రపఠనంబు సేసి యందలి యర్థంబు వివరింప

వలయునని నిర్బంధించుచుండె. అందుల కొడంబడనివారికి ధనాశ యుం గొల్పుచుండెను. ఏమైననను శిష్టులు తామది నేరమైతిమను చుండెడివారు. నికృష్టులు కొందఱుమాత్రము సంభావనకొఱకాశ పడి యామ్లేచ్ఛునెదుట వేదార్థ వివరణమొనర్చుచుండిరి. వారి వల్ల యజ్ఞకాండములోని యంశములు విన్నప్పుడా దుర్బుద్ధియగు తురుష్కుండు సోమయాజులు తాము పశుహంతలయ్యు నొరుల హింసాకృత్యములంగూర్చి నిందింతురేల యని యజ్వలను నోటికి వచ్చినట్లెల్లఁ దిట్టుచుండువాఁడు. ఆచార ధర్మంబులు న్మానాభి మానంబులు నుడిగి తుచ్ఛమ్లేచ్ఛ ధనేచ్ఛంబడియున్న బడుగు బాఁపనయ్యల కామెఱమెచ్చులదాత చేతికందినదెల్ల నిచ్చుచుం డెడివాఁడు. అది విని ధనలుబ్ధులగు పెఱవారుం జేరుచుండిరి. ఇట్లు క్రమక్రమముగా వేదశాస్త్రజ్ఞులుం గలిదూషితులయి దురాచా రంబులకు లోనై మ్లేచ్ఛాధిపు మెచ్చుకోలునకై తమ తమ వైదు ష్యమును దత్సభాంతరంబునం బ్రకాశింపఁజేసికోఁ జూచు చుం డెడివారు.

ఇట్లుండ నొకనాఁడిద్దరు నిగమాగమజ్ఞులు విప్రులాతని దర్శనార్థమరుదెంచిరి. వారాత్మ ప్రకటనార్థమయి తమ త్రయీ పరిచయంబును షట్ఛాస్త్రవేతృతయుం దెల్పికొనుచు నిట్లనిరి: ఁరాజా! విద్యావిషయమున మాకీభూవలయంబున నెవ్వరుసాటి రారు. మేము దిగ్దేశ రాజన్య సభాంతరాళంబు లంగల పండిత ప్రకాండుల డీకొన వెడలినారము. మీరాష్ట్రంబున మాతో వాదంబు సలుపఁజాలు విద్యావిశారదులున్న యెడ రావించి మీ సమ్ముఖమ్మున మమ్ము వారితోడ డీకొల్పుడు రేని మాప్రతిభా విశేషంబు మీకిప్పుడ తెల్లంబు గాఁగలదనిరి. తత్ప్రగల్భోక్తు లాలకించిన స్వాభిమాని యా భూజాని నాఁటిమధ్యాహ్నమే సభ చేయింతునని నిజ పుటభేదనంబునంగల విద్వత్పటలంబుం బిలి పించి నూతనాగత వేదవిద్వరులతో వాదించి గెలుపొందఁ జాలువారికి వేయునూటపదాఱులు బహూకరింతునని పణంబు

వెళ్లెను. కాని వారెల్ల దైకకంఠ్యముగాఁ దద్విద్వన్మండప ద్వితయ శ్రేష్ఠ్యాభివర్ణనముఁ గావించి తాము వారితో న్యాయవాదం బొనర్చి వారిం బరాభూతులం గావింప దక్షులము తామనిరి. అంతనా యవనావనీశుం డవ్వారి నవ్వారిగా బహూకరించి వస్త్రాభరణా ద్యలంకృతులర్పించి యేనుఁగు నెక్కించి బహువిధవాద్య పరిఘవంబుల డంబుమీఱ నూరేగ నేర్పఱచె. మఱియు వారి కగ్రహారంబులిచ్చి వాఁటినుండి యొరులం జేరనీయక వారివల్లనే తాను వేదార్థముం దెలిసికొనుచుండె. అట్లా బుధద్వితయము తామందు గౌరవాతిరేకంబులవల్ల గర్వోద్రేకంబున మత్తగజంబులట్లు మిన్నుమన్నుఁగానక తామే ప్రభువులమనుకొనుచుఁ దద్రాష్ట్రంబునంగల బ్రాహ్మణులనందఱి నిచ్చవచ్చినట్లెల్ల దూషించుచుండెడివారు. ఒకనాఁడు వారు భూనాథునకిట్లనిరి: 'మహీపాలా! మామనీషావిశేషంబు లోకవిఖ్యాతంబౌట నెవ్వరు మాతోడి వాదమునకుఁ దలపడకున్నారు. మాకో, 'విద్యావివాదాయ' యనునట్లది లేమిని మాచేయు పరిశ్రమమెల్ల వృథయనిపించుచున్నది. ఎటనేని నైయాయికులతో వివాదంబు సలుపవలెనన్న కుతూహలము మాకు మెండగుచున్నది. మీ సెలవైన దేశసంచారంబుసేసి యీచతురబ్ధిపరీత భూవలయంబున నేభాగంబుననైన మాతో వాదంబుసేయవచ్చు తార్కికులున్న వారితో వాదించి గాని లేకేని దిగ్విజయంబుసేసినట్లు జయపతాకనిలిపికాని 'యనామికా సార్థవతీ బభూవ' యనిపించుకొని రావలెనని కోరువార' మనిరి. ఱేఁడును విప్రపరాభవంబ కర్తవ్యంబనుచు నందుల కంగీకరించి వారలనంపెను.

అంత వారుభయులు సవారులమీఁద వెడలి యూరూరఁ దిరిగి జయపత్త్రంబులం గొనుచుండిరి. వారియెదుట నిలువ నేరికి సామర్థ్యంబు లేకయుండె. అట్లు జయధ్వానంబులతోఁ బర్యటనంబుఁ గావించుచు నొక్కట వారు దక్షిణదిక్కునంగల కుమసీ గ్రామంబుం జేరిరి. ఆయూరఁ ద్రివిక్రముండు వేదశాస్త్రవేత్త

యని విఖ్యాతినొందియుంట నాతని డాయఁబోయి వారిట్లనిరి: 'ఏమయ్యా! నీవు త్రివేదజ్ఞుండవేనిఁ జేతనైన మా తో వాదింప రమ్ము. లేదా జయపత్త్రంబు మాకొసంగవలయు' ననిరి. అందులకుఁ ద్రివిక్రమభారతి యిట్లుబదులిడెను: అయ్యలారా! నాకే వేదమునురాదు వేదశాస్త్రవేత్తనే నైయున్న నీమూలఁబడి యుందునా? మీవలెనే రాజపూజితుఁడనై భోగంబు లనుభవించుచుండనా? అన్నియు నుడిగి యీవనప్రాంతంబున ముక్కుమూసికొని కాలక్షేపము చేయుచున్న భిక్షువను. నాకెందు నభిమానము లేదు. ఇట్టి నన్ను మీరు జయించితిరనియేమి? లేదనియేమి? 'పిచ్చుకమీఁద బ్రహ్మాస్త్ర' మన్న ట్లీమూలనున్న ముదుకనితోఁడ నా మీవంటి విద్వద్వ్రముఖులు వాదింపవలసిన?' దనియెను. అందులకు వారిట్లందురు: 'మమ్ము జయింపఁగలవారెవరు? మాతో వాదంబునకు సంసిద్ధులు కాఁదగ్గవారని యీభూమండలంబున నింతవఱకు నెవ్వరిం గనివిని యుండమైతిమి. తుదకు మాకించుమించగు విద్యాపరిశ్రమ మొనర్చినవారును లేరైరి. కావుననే యిట్లు లెక్కలేనన్ని జయపత్త్రముల నందివచ్చినారము. ఇట్లే నీవు నొక్కటి వ్రాసియిమ్ము. కాదందువా వాదంబునకు డిగ్గితీఱవలయు' ననిరి. ఇంక నయ్యతి యెన్నివిధాల సౌమ్యముగాఁ జెప్పి యంపివేయఁ జూచినను వారు పట్టిన పట్టు వీడరైరి. అపుడు త్రివిక్రమభారతి తనలో నిట్లనుకొనియె: 'వీరికి గర్వము తలకెక్కియున్నది. క్రిందను మీఁదను గానకయున్నారు. సాటిబ్రాహ్మణుల నందఱసి[illegible]వచ్చినట్లు దూషించుచున్నారు. ఇందులకుఁ దగు ప్రాయశ్చిత్తము జరుగవలయు. అదికావింప మనగురువులే దక్షులు. కావున వీరి నెట్లయిన వారిదరికిఁ గొంపోవుదు' ననికొని వారితో నిట్లుపలికె: "సుధీమణులారా! మీరు నావెంట గంధర్వపురంబునకు దయసేయుఁడు. అచ్చోట మాగురువర్యులు గలరు. వారి యనుజ్ఞఁగొని మీరు కోరినట్లైఁ బ్రవర్తింప నిశ్చయించుకొంటి" ననుచుఁ దాను పాదచారియై గంధర్వపురంబునకుఁ ద్రోవఁబట్టె.

జయపత్త్రార్థులు నరయానోపవిష్టులై యాతని ననుసరింపఁ దొడఁ గిరి. ఆహా! ఆగర్వాంధులు తమకు దాన నాయుఃక్షీణమగు నని యైన గ్రహింపలేక పోయిరే. అట్లా విద్వన్మత్తేభములను త్రివిక్రముండు భీమాతీరస్థిత శ్రీగురుసింహము నెదుటికిం గొం పోయి "ఓహో కృపాంభోనిధీ! భవాబ్ధితారకా! భక్తవత్సలా! మిమ్ముఁ బరమేశ్వరులనుగా గుర్తింపఁ జాలనివారి కధోగతి యగుంగాని మీపాదసేవకునకుఁ గొదవయే?" యనుచు సానంద బాష్పాతురుండును రోమాంచయుక్తదేహుండును రుద్ధకంఠుండునై తచ్చరణాంబుజాతంబుల సన్నిధిని సాష్టాంగ దండప్రణామంబు సేసె. అయ్యెడ గురుం డాతనిఁ గృపాలోకంబున దరిఁ జేర్చి యపుడచటికి రాఁగతంబేమని పృచ్ఛ చేసె. అంతఁ ద్రివిక్రముండు కేల్జోడించి యిట్లు విన్నవించె: "స్వామీ! నా వెంట వచ్చి యున్న విప్రులు విద్యామదోన్మత్తులు. వారందఱుపై వాదాలకుఁ గాలుదువ్వువారు. తాము వేదచతుష్టయంబునను మీమాంసాదికంబునం బ్రవీణతఁ గన్నారమని విఱ్ఱవీఁగుచున్నారు. వాదమ్ములైనఁ దమతో వాదింపుమందురు. లేదా జయపత్త్రింబు లొసంగుమందురు. నాతెరవునకు రావలదు. మీత్రోవను మీరు పోండని నే నన్నివిధాలం జెప్పినను వినరైరి. గురూత్తములరు భవద్వాక్యంబు లెట్టయిన బలవత్తరంబులు గదా యని వీరిం దమసన్నిధికిఁ గొనివచ్చితి" నని మనవిచేసెను.

ఆగురుండది యాలకించి హాసన్ముఖుండై వారి దెసఁ గని యిట్టులనియె: "భూసురులారా! మీరిట్లేల వడిగిరి? వాదాల వల్లఁ బ్రయోజనమేమి? తోడి విప్రులం బరాభవించిన మాత్రన మీ రందు లాభమేమి? యతులమగు మాకు జయాపజయంబులతోఁ బనిలేదు. మేము జయమువలన గర్వమునుగాని యపజయంబున లాఘవంబునుగాని పొందము. ఇట్టి సన్యాసులమగు మమ్ము మీరు జయించిన మీరందఱకుఁ గల్గు పురుషార్థమేముండెడి?" ననియె. అందులకా జిగీషువు లిట్టుల బదులు పలికిరి:

ఉ॥ పండిత సార్వభౌములము ♦ వల్లెలు వేసితి మెల్ల వేదము
ల్దండిగ శాస్త్రమట్కమును ♦ దద్దయు మించి పఠించినార ము
ద్దండ బుధాళికిన్ముఖపి ♦ ధానముగాఁగ నశేషభూంతరా
ఖండజయంబుఁగాంచిన జ ♦ గన్నుత కీర్తులమేము భిక్షుకా!

శా॥ దిగ్దేశంబుల సంచరించితిమి ధా ♦ త్రిన్వేద విద్యార్యుల
న్వాగ్ధాటిం బచరించువారలెవరు ♦ న్వాదింపరా రైరి స
మ్యగ్ధీపాటవమున్నవాద మొనరిం ♦ పవ్వెందు లేదేని మీ
ముగ్ధత్వంబును దెల్పు పత్త్రిమిడి పం ♦ పుండయ్య పెక్కేటికిన్.

పండితుల మనుకొను కొమ్ములుదిరిగిన వారెల్లరు మా యెదుట నిలువఁజాలక విముఖులై తమ యోటమిం దెల్పు పత్త్రింబులిచ్చి యంపిరివిగో చూడరాదా? అల్లె త్రివిక్రముండుం దానొక్కటి యిచ్చి యంపక మమ్మెచ్చోటికిఁ గొనివచ్చినాఁడు. మీయుభయులలో నేయొక్కరికింగాని పాండిత్యాభిమానమున్న నిప్పుడా నిగమాగమాదికంబులం దెందైన వాక్యార్థంబుఁగావింప సంసిద్ధులమనిరి. అయ్యఖర్వ గర్వ ధూర్వహోక్తులు శ్రీగురూత్తములు చిఱునగవుతో నాలకించి యింక వారికిట్లు హితంబుసెప్పఁ దొడఁగిరి:

తే॥ బలి మొఱుంగరె యడఁగె గ ♦ ర్వంబువల్ల
బాణుఁడీలిగె దాన రా ♦ వణుఁడుమడిసె
దైత్యులందఱుం గెడు ♦ దానవయ్యె
నెంతఘనులును గాన గ ♦ ర్వింపఁదగదు॥

ఇంతకు బ్రహ్మాదుల కలవిగాని వేదపారంగతత్వ మెవ్వరికింక సాధ్యమగును? వేదము లనంతములయి యుండఁగా నెల్ల వేదంబులు వల్లెలు వేసితిమని చెప్పికొనుట కల్లగాదె? నామాట విందురే నింకనైనఁ బ్రగల్భములు మానుఁ" డనిరి. అంతనా యహంయువులు తోఁకలఁదొక్కిన త్రాఁచులవలె లేచుచుఁ జాలుఁజాలు. మమ్మెఱుంగక మాయెదుట నింకవదరకుము.

ముమ్మాటికిని మేము సాంగవేదజ్ఞులమే. మాకంటె వేత్తలీధరా వలయంబున మున్నుండియుండరు. ఇపుడు లేరు. ముందుండఁ బో"రనుచు నాత్మస్తుతి పరనిందారూప ప్రసంగములింక సాగించిరి. శ్రీగురువుల యంతరమును తమస్థితియు గుర్తింపఁజాలని వీరికిఁ దుద కేమి గతి యయ్యెనో ముందు నుడివెద" నని సిద్ధుండు నామధార కున కనియె.

కర్మకాండము — ౨దశము.

నామధారకుం డాపొగరుఁబోతుల గురుఁడెట్లు పరాభూతులఁగావించె వైళంబ సెలవీయ రేయన సిద్ధుండిట్లు నుడివెను: "ఓయీ! వినుము. శ్రీగురుం డామూఢుల నిట్టుల మందలించె: "అర్భకులారా! నిర్భయముగా నట్లనుట కేవల సాహసముసుండీ. అపారములగు సూక్తులెల్లఁ గించిద్వ్యక్తిమాత్ర సాధ్యంబులనికోలు వట్టి భ్రాంతి. చిరజీవులగు పూర్వమహర్షులే వేదాంతగాములు కానైరి. ప్రాఁజదువులతుద యాచదువుల ముదుకండే తెలియం గండయ్యెనే. నారాయణుండో బాదరాయణుండై యీధరాతలంబున మున్నవతరించి వేదవిభాగంబుసేసి తత్సారంబుఁ బురాణేతిహాస రూపంబుల లోకవిదితంబుఁగావించి వ్యాసాభిధాన విఖ్యాతుండు కానయ్యెఁగాని యాతండుమాత్రము సంపూర్ణంబుగా వివరింపఁజాలె ననికొంటిరా? పైలుండును వైశంపాయనుండును జైమినియు సుమంతుండు ననునలువురు శిష్యులుం వేదవ్యాసులతోడ వేదంబుపఠింపఁజేరి కల్పాంతంబునకైన నొకరొక్క-రొక్కొక వేదంబునకును దరిఁగానరైరే. ఇఁక నల్పాయువులు మీ రేడ! చతుర్వేదపారగులమైతి మనుకొనుటేడ! చెప్పెద వినుండు.

మున్ను బ్రహ్మకల్పత్రయజీవియౌ భరద్వాజుండు బ్రహ్మచర్య దీక్షంగొని వేదంబులెల్ల నభ్యసింపవలెనని దృఢసంకల్పుండై యట్లు కావించుచుండెను. అయ్యవి పూర్తికాదు నాతండింక నాయువుకొఱకు విధాతృవరంబందఁ దపంబుసేసె. కొంతకాలము

నకుఁ జతురాననుండు సాక్షాత్కరించి 'యేమికోరెద?' ననిన. అయ్యజుని భరద్వాజుం డఖిలాగమాధ్యయనంబుఁ గావింపఁదగు నాయుస్సొసంగుమనుచుఁ దదంఘ్రులకు మ్రొక్కెను. ఆచదువులవేల్పాతనికిట్లనెను: 'ఓయీ! యింత దుస్సాధ్యవరం బడిగితేల? శక్తియున్నఁ బఠించుట యుక్తమే కాని యమితంబు లగు శ్రుతులెల్ల గ్రహింపనీకెట్లు వలనుపడును? పోనిమ్ము. చెప్పఁగల ననుటకైన నన్నియు నాకుమాత్రము గోచరములా? సావధాన మతింగను' మనుచుఁ బెద్దకొండలంత యెత్తుగాఁ జేరి యున్న జ్యోతిర్మయ వేదరాశిత్రితయం బగపఱచెను. అయ్యవి ధిక్కృతార్కమండలంబులై యాతనికనుల మిఱుమిట్లుగొలిపె. అవికని వెఱఁగుపడిన యమ్మౌని తనలో నిట్లనుకొనును: 'అహో! బ్రహ్మచర్యమున నిక్కడికి మూడు కల్పంబులు గడపితి. ఇంత కాలము పఠించిన వేదభాగముచూడ నత్యల్పమేయాయె. ఈలెక్క నెన్నికోట్ల కల్పాలకైన నీవేదాలు పూర్తికాఁగలవా? ఇఁక వేదపూర్తి చేసికోఁగల్గుదు నన్నయాస వీడవలసినదే. కాని యోపినంతవఱకింకెకొంతయైన గ్రహింతు'మనికొని, 'అబ్జాసనా! శరణాగతత్రాత వాట బహువేదపఠనావకాశ మాత్రమైన నొసం గుము. ఇఁక మీచిత్తము నాప్రాప్తము నెట్లున్నదో' యని దీనం బుగా వర్ణించిన యధ్యయనాభిలాషి యెడఁ బ్రసన్నుండైన స్రష్ట ముష్టిత్రయపరిమిత వేదదానంబుసేసి 'యది యలవఱచికొను దనుక మను' మనిన. అంత సంతుష్టిఁగొన్న భరద్వాజుండందలి త్రయీమంత్రజాలంబును విభజించుకొని క్రమముగాఁ బఠింపఁ దొడఁగెను. ఏమిచెప్పుదు! ఆమూఁడు గుప్పిళ్ల వేదమే యిప్ప టికి నాతండు తుదిముట్టఁ జదువలేకయున్నాఁడు. ఒకలమాట చెప్పనేల? కొంచెమోపికపట్టి విందురేనద్ది యింకను వివరింతును.

సర్వైక వేదపాఠంబున మహాశ్రమయాస కావుననే నాల్గు శాఖలుగా విభజింపఁబడియెనని వ్యాసుండు తనశిష్యులఁ దల కొక భాగమును యథాశక్తి గ్రహించెదరుగావుత మనిన. అంద

గ్రేసరుఁడు పైలుఁడు. వానిని ధ్యానపూర్వకంబుగ ఋగ్వేదముఁ బఠింపుమనియె ఆతండును దనగురువులకెఱఁగి ఋక్కుల లక్షణంబును ధ్యానంబునందలి భేదంబులం దెలిపిన శక్తికొలఁది భక్తి మీఱ ధర్మానుసారియై పఠింతునని బదులువలికె. అంత వ్యాసమహర్షి తద్ధ్యానవిధానంబును వర్ణాకృతిరూపశాఖలం జెప్పెద విను' మని యిట్లు బోధింపఁజొచ్చె: 'ఋగ్వేదమున కుపవేదమాయుర్వేదము. గోత్రమాత్రేయము. దేవత బ్రహ్మ. ఛందస్సు గాయత్రి. వర్ణమెఱుపు. కనులబ్జాతపత్త్రాయతములు. కంఠము సువిభక్తము. రమారమి రెండుమూరలు పొడవు. మెలితిరిగిన మీసలుంగేశము లొప్పు రూపంబెసంగు. కావున సమాహితచిత్తుండవై నీహృదయఫలకమున నట్టిరూపమునం బ్రకాశించు ఋగ్వేదపూరుషు ననుసంధింపుము. ఇఁక నందలి భేదంబులెవ్వియనినఁ జర్చ శ్రావకముఁ జర్చకము శ్రవణీయపారముఁ గ్రమపారము జట రథక్రమము దండక్రమమునననునవి. తత్క్రమంబునఁ బారాయణం బొనర్చినఁ బుణ్యఫలంబు చేకుఱు. ఇంక నందాశ్వలాయనీ సాంఖ్యాయనీ శాకలా బాష్కలా మాండూకేయాఖ్యము లైదుశాఖలు గలవని వ్యాసులు పైలున కవ్వెల్లఁ దెల్లంబుసేసిరేకాని యొరుల కెఱుకపడునే? ఇఁకనిపిదపకాలమున నేమి నాల్గువేదము లొక్కండ పఠింపఁగలుగు టేమి? సాక్షాన్నారాయణుండౌ వ్యాసుండొక్కండుదక్క నష్టవికృతి సహితంబుగ సలక్షణంబుగ నీయొక్క శాఖయైన నేర్చినవాఁ డీభూతలంబునం బెరొక్కన వేఱొక్కండు గలండే? అది యటుండె.

ఇంక నాతండు వైశంపాయనునకు యజుర్వేద స్వరూపం బిట్లెఱింగించె: 'ఉపవేదము ధనురాఖ్యము. గోత్రము భారద్వాజము. దేవత రుద్రుండు. ఛందస్సు త్రిష్టుప్సంజ్ఞకము. యజుస్సు కృశదీర్ఘముం గరధృతకపాలంబునై సుమనోహరంబులగు తామరతేకులవంటి సువర్ణాక్షరములతో సుమారైదుమూరల పొడవున నుండు తామ్రవిగ్రహంబుగా ధ్యానించునది. భేదము లెనుబదాఱు

అందుఁజరకములు ఆహ్వారకములుఁ గఠములుఁ బ్రాచ్య కఠములుఁ గపిష్ఠలములు చారాయణీయములు వారాయణీయములు వార్తాన్తవేయములు శ్వేతతరములు మైత్రాయణీయములు నని పదిభేదములు ప్రఖ్యాతములు. ఇందు మైత్రాయణీయమ్ములందు మఱియేడంతర్భాగములు గలవవి మానవములు దుందుభములు నేకేయములు వారాహములు హారిద్రవేయకంబులు శ్యామంబులును శ్యామాయణీయంబులు ననునవి. ఇంక వాజసనేయాఖ్య విశ్రుతంబు లష్టాదశ భేదయుతములు. అవి వాజసనేయబౌధేయ జాబాల కాణ్వ మాధ్యందిన శాపేయ తాపనీయ కాపాల పౌండ వత్సావటుక పరమావటుక పారాశర్య వైనేయ వైధే యాఘేయ గాలవ బైజవ కాత్యాయనే యాఖ్యాకములు. తైత్తిరీయభేదంబు లౌఖ్యకాండికేయము లనునవి రెండు మాత్రమే. అందలి కాండికేయములు పంచవిధములు. అందాపస్తంబోదితశాఖ వ్యాప్తిఁగన్నది. అది సర్వయజ్ఞంబులందును విస్తారముగాఁ బ్రశంసనొందునది. ఇంక బౌధాయనీ సత్యాషాఢీ హిరణ్యకే శ్యౌఖేయములను వానితో నైదు భేదాలందినది. మఱియుఁ బ్రతిపదము ననుపదము ఛందస్సు భాష ధర్మము మీమాంస న్యాయముఁ దర్కంబునను నెనిమిదియు వీనికుపాంగంబులు శిక్ష కల్పము వ్యాకరణము నిరుక్తము ఛందస్సు జ్యోతిషము నను నవి షడంగములు. ఇట్లు వేదరాశికి శాఖోపశాఖలుగా వివరింపఁబడినదెల్ల మందమతులకుఁ దదర్థావబోధన సాధకంబౌటకేయని యెఱుంగుమ'దనియె. అదివిని వైశంపాయనుండు బాదరాయణు సవినయంబుగా నిట్టులడిగె: 'స్వామీ! తాము యజుర్వేదము శాఖాభేదక్రమంబుననైనవిస్తారము కృపమీఱ సెలవిచ్చితిరి. ఇంతకు మూలంబెయ్యది యని సందియము పొడమెడింగాన దయ చేసి నివారింపుఁ'డనియె. అంత నాతండిట్లు బోధచేసె: 'శిష్యా! నీవట్లడుగఁదగినదే. చెప్పెద. వినుము. ఋషులు యజుర్మూలంబు మంత్రబ్రాహ్మణ సంహిత యని తెలిపియున్నారు. తత్కాండాం

తర్గతం శారణ్యకంబు యజ్ఞాదికర్మంబుల కుపయుక్తం” బని వైశంపాయనునకుఁ బారాశర్యుండు యజుర్వేదంబు సవిస్తరం బుగాఁ గఱపెను.

వింటిరా విప్రులారా! అవ్యాసమహాముని యంత జైమినిం బిలిచి సామవేదంబునుగూర్చి యిట్లుపన్యసింపఁజొచ్చె: “ఉపవేదము గాంధర్వాఖ్యము. దేవతవిష్ణువు. జగతీచ్ఛందస్సు. కాశ్యపగోత్రము. మెడలోఁ బూలదండ మొలను దెల్లని బట్టయుంగలిగిన చర్మదండధారి. శమదమాది సంపత్తులుగలిగిన విశుచి. సొన్న వన్నె కన్నుఁగవ. ఆఱుమూరల పొడవుగల తెల్లని దేహమును గలిగినది సామము. ఇద్దానికి వేయి శాఖలుగలవు. వానిని నారాయణుండు దక్క దక్కుంగలవా రెవ్వ రెఱుంగుదురు? అందేడు భేదాలు చెప్పెదవినుము. అయ్యవి యాసురాయణీయ వార్తాన్తవేయ వాసురాయణీయ ప్రాంజలిబుగ్వ ధాన ప్రాచీన యోగ్య జ్ఞానయోగాఖ్యములు. ఇంక రాణాయనీయ శాట్యాయనీయ శాట్య ముద్గల ఖల్వల మహాఖల్వల లాంగల కౌథుమ గౌతమ జైమినీయ సంజ్ఞకములున్నవి వానిం జేర్కొన మొదలిడిన నంతులే” దని వ్యాసప్రోక్తము లెన్నేనిఁ దెలిపిరి.

శ్రీగురులు తుదకిట్లనిరి: “అయ్యో! సామవేదంబెల్ల నెవ్వని కబ్బె? ఓయిపిచ్చివాండ్రారా! మీరు త్రయీపారగులమని చెప్పుకొన్నంత మాత్రమున నౌదురా? చెప్పెదవినుఁడు. సుమంతున కథర్వాణవర్యుం డథర్వవేద విషయం బెట్లు బోధించెనందు రేని దానికుపవేద మస్త్రరూపముసుండు. వైజానగోత్రము. ఇంద్రదేవతాకము. త్రిష్టుప్ఛందస్సు. తీక్ష్ణాకృతియుం గృష్ణవర్ణమును గల కామరూపుఁడు. క్షుద్రకర్మాచరణనిరతుఁడు. స్వభార్యయందు సంతుష్టి నందువాఁడు. ఏడుమూరల పొడవుగల రూపముగా మనమున నిల్పుము. ఇఁకఁ దద్భేదంబు లన్నవో పైప్పల దాన్త ప్రాతౌత బ్రహ్మ దావల శౌనకీయ దేవర్షి చరణ విద్యాభిధాన

సమన్వితములు. ఇంక విధానకల్ప నక్షత్రకల్ప సంహితాకల్ప శాంతికల్ప విధివిధానకల్పములను పేరులుగల వైదుగలవు.

ఇట్లా పురాణవిధాత బోధించిన యంశములకు మితము లేదు. అవెల్ల గ్రహింపఁదగిన యోగ్యతగల వర్ణాశ్రమాచార రతులుం బెక్కురయ్యెడ భారతావని నుండెడివారు. కావున వేదములు నిలువఁజాలె. ఈకలి యుగముననో బ్రాహ్మణులు తమవిహిత కర్మంబులుడిగి భ్రష్టులైచున్నారు. దాన శ్రుతులును ఖిలములగు చున్నవి. కర్మదూరులయి ధర్మబాహ్యంబుగ మ్లేచ్ఛులదరి వేద పాఠంబుఁగావించు మందబుద్ధుల వాక్కులందు మంత్రసత్త్వం బెట్లుండును ? పూర్వమో బ్రాహ్మణులందు దేవత్వమును మహా త్త్వము నుండెడిది. కావుననే వారిని భూసురులని పిలువందగిన సర్వమాన్య పదమొందఁ గలిగిరి. భూపాలురుం దత్పదసేవకులయి యుండెడివారు. ఎంతధన మిత్తుమన్నను వారికి లెక్కలేకుండెడిది. వారైహిక భోగాలందు నిస్పృహులై వెలయుచుండిరి. తదభ్యస్త వేదమంత్రబలంబున మూర్తిత్రయంబు తదధీనం బయ్యెడిది. ఇంద్రాదులో వారికి వెఱచి వారిపనుపులు నెఱపఁ జేతులుకట్టుకొని నిలిచెడివారు. వారినోటిమాటయన్నఁ గల్పకమో కామధేనువో యన్నట్లు పరిగణింపఁ బడెడిది. మంత్రసత్త్వంబున వారు తృణమే మేరువుగను మేరువుం దృణముగ మార్చివేయఁ గలిగెడివారు. అట్టి వేదమూర్తుల నావిష్ణుమూర్తియే సమర్చించువాఁడు. కావుననే,

‘ తే. అఖిలజగము దైవాధీన ♦ మై యొసంగు ।
దైవతంబో మంత్రాధీన ♦ తంబెలంగ ।
నాను మంత్రమొబ్రాహ్మణా ♦ ధీనమిలను।
దానఁ గొల్తు బ్రాహ్మణు ♦ దైవతముగ।’

అని విష్ణువు తానపల్కియుండె. అంతటిమహోత్తమపదము నందఁదగినవారు కాలగతిని కుమార్గరతులయి వేదవిక్రేతలన హీనులంగొలుచుచు మంత్రసత్త్వంబుఁ గోల్పోయి యధమాధము

దశ నొందుచున్నారు. హీనజనులయెదుట వేదపాఠంబుఁ గావించు వారి మొగమైనను జూడరాదు. వారు బ్రహ్మరాక్షసులు కానౌదురు. ఇఁకఁ జతుర్వేదవిస్తారం బిట్టిదనియైనం దెలిసికోఁజాలిన వా రిపుడమింగలరే? క్రమముగా నాగమంబు లంతరించినాయెను. ఇట్టియెడ మీరెట్టి సర్వవేదవేత్తల మనుకొందురయా? మీరేడ? మీవిజిగీష యేడ? దుర్బుద్ధితో ద్విజుల క్షోభిలఁజేసినఁ గలుగులాభ మేమి? మీకీదుర్బోధఁ గావించినవారెవ్వరు? చాలుఁజాలు. ఇఁక శీఘ్రముగా నడువుండి. మిమ్ముమీరు పొగడుకొని జయపత్త్రాల కట్ట యొకటి ముందుపెట్టుకొని మాత్రివిక్రమునిఁగూడ నొక్కటి వ్రాసి యిమ్మని యడుగుదురేమిటికి? ఇంతటనైన నామాటవిని దురాగ్రహంబు వీడుఁడు. లేనిపోని యిక్కట్టు మీప్రాణాల మీఁదికిఁ దెచ్చిపెట్టుకొనకుఁ' డనుచు నోర్పుమీఱ నాదయామయుం డెంతబోధించినను వారు తమపట్టినపట్టు వదలక యిట్లనిరి: 'ఏమైననుసరే వాదమైనను జరుగవలెను. లేదా పత్త్రమైనను బడయవలయును. కాకున్న మేముపోయి రాజుమొగ మెట్లు చూడఁగల' మనిరనుచు సిద్ధుండు 'చూచితివా' నామధారకా! మదోన్మత్తులయి తమమేలు తాముగుర్తింపఁ జాలకిట్లు వాపోవు వారికిఁకఁ గీడుమూఁడనున్నదిసు' మ్మనియె.

## కర్మకాండము — 3 దశము.

నామధారకుం డుపదేశకుం గొనియాడి యిట్లను: 'సిద్ధవరేణ్య! జ్ఞానప్రకాశం బొనరించి నన్నుఁ దరింపఁజేయ భవదీయ పాదదర్శనంబు నాకొదవించితిరిగాదే. గురుండు వేదరహస్యంబులు విస్తరించినమీఁదట నింకేమిజరిగె? వేగంబ సెలవీయవే' యని యర్థింప నాసిద్ధుం డిట్లుచెప్పసాగెను: 'ఓయీ! గురుమహిమం బిట్టిదట్టిదనరానిది. చెప్పెద వినుము. ఆజయాభిలాషులగు పండితంమన్యులకు మనగురుండు చిలుకకు బోధించిన ట్లన్ని తెలుంగుల హితంబువల్కినను దాముపట్టిన కుందేటికి మూఁడేకాళ్లన్నట్లు

పల్కుచుండఁ దుదకాతండు కుపితుండై 'యట్లయిన మీముచ్చట యుం దీఱునుకెండు. అదిమాత్రమెంతసే?' యనియె.

తే. సర్వము గ్రసింపనేగు మూ ♦ షకముభాతి ।
మ్రింగ దీపంబుఁ బరువిడు ♦ మిడుతరీతి ।
నిగ్రహించినమత్తుల ♦ కుగ్రహేతి ।
కలదె? శ్రీగురు ధిక్కృతి ♦ కంటె లాఁతి ॥

ఆవేళ కటుదవ్వున నెవ్వండో పోవుచుండ శ్రీగురుం డవ్వానిం బిలువనంపి వాఁడాసీనుండైనంతనే వానినిట్లడిగెః 'నీవెవ్వఁడవు? నీకులమేది? నీదేయూరు? నీవిపుడెక్కడికిఁ బోవుచున్నా?' వనఁగా వాఁడందులకిట్లు బదులుచెప్పెను: 'బాబూ! కవజాతి వాఁడను. నన్ను మాతంగుఁడని పిలుతురు. నేనూరిబయట నుండు వాఁడను. అన్నిటిని బాలింపఁగల యేలినవారి దయ నేఁటికి నామీఁదఁగలిగి యిట్లడిగితిరి. అందదొరకినది. ఇఁకఁ బైకిరాఁగల' ననుచు నేలమీఁదసాఁగిలఁబడెను. ఆపరమపురుషు లపుడు వాని దెస దయాదృష్టిఁ బ్రసరింపఁజేసిరి. పరుసవేదివల్ల లోహంబు వన్నెఁగన్నట్టులయ్యె. అయ్యెడ గురుండు నిజశిష్యునొకనింబిలిచి వానిచేతఁ దనదండంబిడి దానితో నేలమీఁద నేడు గీఱలు గీయించెను. అంత నాపంచముని నొక్కొక్కగడిలోనికిఁ గ్రమముగా మెట్టుమనెను. వాఁడట్లొనర్చుచుండె. అందు మొదటిగీఁత దాఁటిన వెంటనే యతివరులు వానిని 'నీపుట్టువిపుడెదియో చెప్పు' మని యడిగిరి. తాను మైందుండననియె. రెండవగీటు దాఁటి తానరణ్య రక్షకుండఁ గిరాతుండ ననియె. మూఁడవగీఱఁ ద్రొక్కఁగాఁ బూర్వస్మృతి కలుగఁ దాను గంగాపుత్రుండననియె. నాలవ యడుగునఁ దాను జతుర్థుఁడననె. పంచమంబున వైశ్యుండ సోమదత్తుండననిపల్కె. ఆఱవగీఱం జేర గోదావరి యనుపేరం బరఁగు క్షత్త్రివంశజాతుండ ననియె. తుదిమెట్టున వేదశాస్త్ర వేత్తను బ్రాహ్మణోత్తముఁడ నైతి ననియె. శ్రీగురుండప్పు డాత

నితోఁ ‚బాగుబాగు. వేదశాస్త్రజ్ఞుఁడ నైతి వేని వాదార్థమేగు దెంచిన వీరితోఁ దవాదించి జయించి పరాభవింపుమా' యని యాన పెట్టుచుఁ దద్దేహంబున భస్మం బభిమంత్రించి యుంచెను. దాన నాతనియం దపూర్వజ్ఞాన ప్రకాశంబొదవె. కాకంబు మానససరో వరంబున మునిఁగి హంసమైనయట్లది గురుదృష్టి ప్రసారంబున హీనుండు నెట్లు జ్ఞానవంతుండు కానయ్యెనో చూచితే! నృసింహ సరస్వతులన సామాన్యులా? వారు సాక్షాత్త్రిమూర్త్యవతార పురుషులైరి. అట్టి మహనీయుని నరమాత్రునిఁగా నెంచువాఁ డధోగతి నందును. తన్మహత్త్వంబింకేమి చెప్పవలయు? త్రోవం బోవు కడజాతివాఁడైనఁ జూచునంతలోన నెంతటి నిగమాగమ వేది కానయ్యె! అహా! ఇవియువి యనియేమి? నిగమాగమాది శాస్త్రంబులెల్ల వాఁడపుడుగ్గడింపఁజొచ్చె.

వాదార్థ మేగుదెంచినవారు నివ్వెఱపడి జడులట్లు చూచు చుండిరి. వారికిఁ గడుపులోఁ దాయి పడ్డట్లయి వెఱఁగుఁగొని వణఁ కుచు గురుపదముల కడ్డుదు సాఁగిలఁబడి యిట్లనిరి: 'స్వామీ! మాగతియింకేమి? గురుద్రోహులమైతిమి. బ్రాహ్మణదూషణముఁ గావించితిమి. మీరు సాక్షాత్పరశివుల రిట్లవతరించితిరి. మమ్ము మన్నింపవలయు: మాయలో మునిఁగియున్న కాముకులకు మాకు మీస్వరూపజ్ఞానంబు గలుగనేర్చునే? మీకృపకలిగిన గడ్డిపోఁచ యైనను దొడ్డ కొండంత ఘనతఁగనును. మీరు కోపించిన నెంత దియు నింతలో బుగ్గికాఁదగ్గదే. జగద్గురువులరా త్రిమూర్తులరైతిరి. సత్త్వరజస్తమంబుల స్థితిసృష్టిసంహారంబు లొనర్పదక్షులరు. మీమహిమ యిట్టిదని వర్ణింప మాతరముగాదు. స్వామీ! శరణా గతత్రాతా! మమ్ముద్ధరింపవలయు" నని కేలొగ్గి మ్రొక్కిరి. అవ్వారికి నారసింహయతీంద్రు లిట్లనిరి: 'ఏమైనను మీవల్లఁ ద్రివిక్రముండు బాధింపఁబడెను. ఇంకఁ బెక్కురమొదను దోసం గులఁ గావించితిరి. సంతత బ్రాహ్మణ దూషకులరైతిరి. కావున మీరు ముందుజన్మమున రాక్షసులయ్యెదరు. ఎవరెవ్వరు చేసికొన్న

పుణ్యపాపఫలంబులు తామే యనుభవింపక తీఱవుగదా' యనిరి. అదివినినంతనే వారు గురువుల కాళులఁ బట్టుకొని 'యయ్యో! యింక మాకీ దుఃఖసముద్రపుదరి దొరకునదెన్నఁటి' కని వగంబొగిలిరి. శ్రీగురుం డపుడు వారితోఁ గృపమీఱ నిట్లు పలుకు: 'విప్రులారా! వినుండు. పండ్రెండేండ్లవఱకే మీకు రాక్షసత్వమేర్పడియుండెడిని. అంతమీకుఁ బశ్చాత్తాపం బొదవి శాంతతఁ గంద్రు. అవ్విధంబున మీకుఁ బాపవిమోచనమైనవెనుక నారాయణానువాకం బుచ్చరించి దాన ద్విజత్వంబు నందఁగలరు. అందు మొదటివాక్యమును మీనోళ్లఁ బలికినంతనే మీకు సద్గతియొదవెడిని. గంగాస్థానంబున మీరుండుండు. పొం'డని వారిం బనివినిచెను. వారూరి వెలుపలి కేగునప్పటికే వారికి గుండెలలో నొప్పియేర్పడెను. వారయ్యెడఁ బరిసర నదీతటంబుం జేరునంతలో నదివృద్ధియై దుర్భర మాట వారందుంబడి మరణించిరి. ఎవరికర్మఫలము వారుగాక న్యులనుభవింతురా? చూడుము. గురువులన్నట్లే యయినది. వారంత రాక్షసజన్మమెత్తి పండ్రెండేండ్లట్లు గడపినమీఁదటఁగాని సద్గతిఁ గనరైరి. నామధారకా! పావనంబగు నవ్వలిగాథ యాకర్ణింపుమోయీ!

అల్ల యంత్యజుండు బ్రహ్మవేత్తయై కడచిన యేడుపుట్టువుల వృత్తాంతం బెల్లఁ గనులఁగట్టినట్లు కాఁగాఁ దుదకుఁ దానందు విప్రుఁడనైతినని నిర్ధారణ మొనర్చికొని భక్తితో గురువులకు మ్రొక్కి సవినయంబుగా నిట్లు పలికె: 'ఓహో' సద్గురూత్తమా! మీరు మాయయను పెంజీఁకటిం దరింపఁ ద్రోవఁ జూపు జ్యోతిస్స్వరూపులరు. మీవల్ల నేనొక్క సంశయము నివారించికో వలసియున్నది. పూర్వజన్మమున విప్రుండనైయుఁ బిదపనిట్లు జాతిహీనుండఁ గానేమిటికో త్రికాలజ్ఞులరగు మీరే తెలుపవలయు. జన్మాంతరంబున నాయొనర్చిన దోసంగేమొకో సెలవీయరే మహాదేవా!' యన నాతనికి గురుం డెఱిఁగించిన తెఱంగు ముందు నుడివెద:

'కం. ఏతచ్చరితామృతసే।
వాతత్పరుఁడౌను జ్ఞాని ♦ పతితుండైనం।
బూతుండౌ నిదివిన్నం।
జేతంబున నెద్దికోర ♦ సిద్ధించునదే ॥'
యని సిద్ధుండు పలికె.

కర్మకాండము — షోడశము.

నామధారకుం డవ్వలికథ నాస్వాదింప మహోత్సుకుండౌడు సిద్ధుండిట్లు వినిపించె: ఎల్లకలుషంబులడఁగి తెలివిగలుగ నాపతిత పావనుం డాహీనజన్ముతోనను: 'ఓయీ! నీవీజనిఁ జండాలుండ వై తెట్లంటేని నేఁజెప్పెదవినుము. పుణ్యంబున నూర్ధ్వగతియుఁ బాపంబున నధోగతియుం గలిగెడినని కర్మవిపాకమునఁ జెప్పంబడి యున్నది. బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రు లెవ్వరైనను దురాచార రతులైనఁ జండాలతనందుదురు. శూద్రునకు విప్రాంగనయం దుదయించినవాఁ డంత్యజాతిం జేరు. ఇంక ననాచారుండగు విప్రుం డును హీనజాతిని జన్మించు. ఎట్లంటేని ద్విజులందుఁ దలిదండ్రుల గురువుల సేవింపనివారును గులస్త్రీత్యాగంబొనర్చి వేఱొకతెను పెండ్లియాడువారును గులదైవతమునువిడిచి యన్యదేవతల నర్చించు వారును నసత్యవాదులు జీవహింసాపరులును గన్యావిక్రేతలును శూద్రాన్నభోక్తలును నశ్వవ్యాపారులును సంతతశూద్ర సంపర్కులును శూద్రీరతులును దాసీరతులును బితృదేవతా కర్మంబుల నాచరింపనివారును వనముల నగ్గిపెట్టువారును నావులను దూడల నెడఁబాపువారును దలిదండ్రులను బిడ్డలను వేఱిడు వారును నెద్దుపై నెక్కిపోవువారును మహాక్షేత్రంబులకేగి తీర్థవిధు లాచరింపనివారును దీర్థంబులఁ బ్రతిగ్రహం బొనర్చువారును స్వధర్మరహితులును గపిలగోక్షీరము నీశ్వరార్పణంబుఁగావింపక తామే క్రోలువారును నతిథియాఁకొని రాఁజూచియు నన్నమిడక యాలసించువారును యోగ్యులగు బ్రాహ్మణుల దూషించి యయోగ్యులగౌరవించువారును నొరులక్షేత్రంబు నపహరింపఁ

జూచువారును వాపీకూపతటాకాలయాది నిర్మాణంబుల కంతరాయంబుఁ గల్పించువారును దమగురువులతోడను యజమానుల తోడను ద్వేషించువారును విశ్వాసఘాతుకులయి మిత్రదారగమనం బొనరించువారును నిర్వురు భార్యలుండ నందొకర్తెతోడఁ బక్షపాతం బొవ్వువారును సంజవేళల నిద్రాభోజనాదికంబులం బుచ్చువారును దత్తద్రవ్యాపహర్తలును వైశ్వదేవకాలంబుల నభ్యాగతిని వెడలఁగొట్టువారును దిట్టుచుం బెట్టువారును గంగాదితీర్థనిందకులును నేకాదశినాఁడు భుజించువారును యుద్ధవేళను దమస్వామిని విడిచిపోవువారును వ్రతదినములందును బర్వములందును బగటివేళను స్వదారగమనం బేనిఁ బొనర్చువారును శూద్రులకు వేదంబుఁ గఱపువారును సకాలంబున శ్రాద్ధకర్మం బొనర్పనివారును దామొనర్చిన పుణ్యకర్మంబులను జెప్పికొనువారును బాంధులకుఁ దప్పుత్రోవలఁ జెప్పువారును గ్రీష్మకాలమున నొరులువెట్టిన చలిపందిరిం దీసివేయువారును నాడీజ్ఞానంబును జికిత్సాపరిచితియు లేకయే వెజ్జులమని మందులిచ్చువారును వేదమార్గంబుడిగి జారణమారణ మోహనాదికంబు లొనర్చువారును గురుండును నరుండయని తద్దోషంబు లెంచువారును నొరులు గురునిందసేయఁగా విని మేలని మెచ్చువారును దేవతాంతరసేవకులగుచు హరిహరనిందకులౌవారును దమతమ విహితకర్మంబులఁ ద్యజించినవారును బరకర్మరతులును గుక్కచర్మపుఁ దిత్తిలోనుండు పాలంగ్రోలుపగిది శూద్రుని వల్ల మంత్రోపదేశంబు నందువారును శ్రాద్ధంబులఁ బిండప్రదానం బొనర్పనివారును విధవారతులును విప్రద్వేషులును బ్రహ్మరాక్షసత్వముం బ్రాప్తింపఁజేయు వేదచర్చకుఁ గడంగువారు నందఱును జన్మాంతరంబులఁ జండాలత నందనాదురు. ఎవఁడేని గురుదేవతాభక్తి నెఱపువాఁడయ్యు నన్యదేవతా విరసనంబుఁ గావించినవానిజన్మ మపస్మారదారిద్ర్య భాజనంబగు. పితరుల గురులం ద్యజించి తానే సౌఖ్యంబునందఁగోరి కుటుంబము నుండి చీలిపోవువాఁ డుత్తరజన్మంబున వంశచ్ఛేదకులగు మేదరులం

దుదయించి వ్యాధిబాధితుం డయ్యెడిని. పాఱులను గేరుచు వేదములను దూషించి కర్మభ్రష్టుం డగువాఁడు మూత్రకృచ్ఛ్ర రోగపీడితుండౌను. లోకుల రహస్యాలును బాపకృత్యంబులం జాటునతఁడు జన్మాంతరమున హృద్రోగియు సంప్రాప్త మహా కష్టుండునుం గానవును.

ఇంక స్త్రీలోకంబునందు గర్భపాతంబుఁ గావించుకోఁ జూచుదుశ్చరిత యుత్తరజన్మంబున గొడ్రాలగు. కాదేని దానికిఁ బుట్టినబిడ్డలెల్లరు గిట్టుచుందురు. కావున గర్భపాతనం బకార్యం బుగా నెఱుంగునది. మఱియు ధర్మశాస్త్ర పురాణాది శ్రవణంబు లేమిని జెవుడును నోరులెక్కుఁడు మెక్కుఁడురనికొన్న గ్రుడ్డితన ముం బ్రాప్తించెడిని. పతితులతోడిపొందు గాడిదకడుపు పంటకే. హీనులవల్ల మందు మృగజన్మంబు రానుంటకే. బ్రహ్మహత్య చేయుట క్షయరోగంబు వెంటనంటనే. కల్లుత్రావిన శ్యావదంత ములును బంగరు దొంగిలుటఁ బిప్పిగోళ్లునేర్పడు. గురుదార పొందువల్ల నరుండు కుష్ఠరోగంబు నందును. గుఱ్ఱమునుగాని గోవునుగాని చంపినవారికి సంతతియుండదు. పశ్చాత్తప్త మనస్సు నకు దొనఁగువాయు. లేదేని మున్నొనర్చిన పాపఫలము జన్మాంత రంబున వ్యాధిరూప బాధానుభవంబుగాఁ బరిణమింపక మానదు. విశ్వాసఘాతంబొనర్చిన నన్నద్వేషంబుగలిగి తిన్నతిండి దక్కకుం డును. ఒరులసేవకుల మతులుచెడఁగొట్టి వెడలించి తన నౌకరి చేయించుకొనువాఁడు చెఱసాలంబడి యఘోరయాతనలనందెడిని. పరదారల నపహరించువాఁడు దారుణనారకంబునందు. అంత మతినోయి క్లేశంబులంబొందెడిని. పామునుజంపినఁ బాపజాతి పుట్టువబ్బెడి.

ఇట్టి కలుషఫలంబులం జెప్ప మొదలిడిన వీనికంతులేదు. ఏమైనను జౌర్యంబున నగునదియు దిఙ్ముఖంబుగఁ దెల్పుదు. వినుము. సువర్ణహర్త ప్రమేహవ్యాధి బాధితుండగు. ఒరుల గ్రంథము

లపహరించినవాఁడు పుట్టుగ్రుడ్డగు. బట్టలదొంగ తెల్లపొడలకుష్ఠ మొందిన పతితుండయ్యెడిని. గంధద్రవ్యహర్త గండమాలోదర రోగపీడితుండౌను. శ్వాసార్తితుండౌ నానన్నమరణమసి సొమ్ము కాఁజేసినవాఁడు కారానిబద్ధుండౌనని బ్రహ్మాండ పురాణాదులు ఘోషించుచున్నవి. పెక్కేల? పరద్రవ్యహర్తయుఁ బరన్యాస హర్తయుం బరద్వేష్టయు భవాంతరంబున సంతతిలేక చింతనందుడుగు. అన్నహర్త గుల్మవ్యాధివల్లఁ బీడింపఁబడు. ధాన్యహారి రక్తగాత్రుండయ్యెడి. నూనెను దస్కరించువాఁడు కంపుగొట్టు నొడలు కలవాఁడగు. బ్రహ్మహత్యయు స్త్రీహత్యయుం గావించువాఁడు బ్రహ్మరక్షస్సౌను. మౌక్తిక మాణిక్యహారి హీనజాతిని జనిఁగును. ఆకులుం బండులును దొంగిలువానికిఁ దీఁట యేర్పడు. కంచును బిత్తియు నినుము మొదలగువానిని దొంగిలించువాఁడు నాశంబొంది పిదప శ్వేతకుష్ఠికానగు. దేవళముల సొమ్ము తినువాఁడును దినఁగూడనివి తినువాఁడును బాండురోగులయ్యెదరు. ఒకరు దాఁచుకొన్న ద్రవ్యమును దొంగిలించువాఁడు దుఃఖభాగియగు. ఇంక జన్మాంతరంబులందో ధనచౌర్యంబొనర్చినవాఁడు లొట్టియయు ఫలహారి కోఁతియు నౌదురు. జలహర్త వానకోయిలయు గృహోపకరణహారి కాకియునయ్యెదరు. తేనెదొంగ యీఁగగను పుట్టును. పాలదొంగకుఁ గుష్ఠవ్యాధి సంప్రాప్తమౌను. ఇట్లు హీనజన్మంబు లొందించు దోషాలెన్ని మొదలిడిన వేలకొలఁదిగ నుండును.

ఇంక భారత శాంతిపర్వంబున జెప్పంబడిన వ్యభిచార ప్రకరణంబు నందలి యంశములం దెలిపెదము. పరదారాలింగన మొనరించినవాఁడు జన్మశతంబులఁ గుక్కయై పిదప బహుదుఃఖదంబగు పాపజాతిం బుట్టు. వినస్త్రీరూపా పరనారివంక దుర్బుద్ధితోడఁ జూచినఁ గనులుపోవు. బంధుస్త్రీగమనంబున ముందు గాడిదయై పిదపఁ దుష్టపుసర్పమై పుట్టనగును. జారునకెట్టియైన నారకంబు తీఱదు. అందును నమ్మిన మిత్రుని నాతినిగాని మేనమామ

భార్యనుగాని పొందఁగోరువాఁడు గుల్మరోగిపుట్టును. చెడుతలఁపులతోఁ బరనారిదెసం జూచిన మాత్రముననే నేత్రరోగంబుగల్గు. విప్రాంగనాశూద్రి సంగమంబున నుభయులుం బుగుపులయ్యెదరు. నిరంతర శూద్రి సంసర్గ దుర్భగకుక్కురై పుట్టునని బోధించిరి.

ఇట్లు కర్మవిపాకంబుం దెల్పిన శ్రీగురువుల పల్కులాలకించి తుదకుఁ ద్రివిక్రముండిట్లు పృచ్ఛసేసెః 'స్వామీ! మొన్న ధర్మశాలఁ గ్గడించితిరి. సరిగాని యెప్పుడైన నేదేనొక్క పాపంబుఁ గావించిన నద్దానికిఁ బ్రాయశ్చిత్త విధానంబున్న సెలవిండని యెను. తద్గురుఁ డందుపై నిట్లు చెప్పుచున్నాఁడు: 'ఓయీ! పశ్చాత్తాపంబునఁ బాపంబులు వాయుసుమ్ము. ఏదేని మహాఘం బొనరించితినేయని మనంబున నంటియున్నవాని కద్దానికిఁ గర్మవిపాకోక్త ప్రాయశ్చిత్తంబుఁ జెప్పెదవినుము. పలువురు ఋషులు పలుతెఱంగులఁ బలికిరి. అందునా మతమిదిః ముందు సభ గావింపఁజేసి పాపస్థాపనమున కగు బ్రహ్మదండముగా గోదానాదికంబు గార్యంబు. మఱియుఁ దన్నిర్ణాయక సభ్యులాదేశించిన తెఱంగున సప్రాయశ్చిత్తవిధులు యథాశక్తిగ నెఱపవలయు. గోవులనీయఁ జాలనివాఁడు నిష్కమో యందర్ఘమో పాతికోదానము సేయవలయు. అగు దోసఁగుల యంతరములనుబట్టి కృచ్ఛ్రంబు లనుష్ఠేయంబులు. తెలియక చేసిన పాపకృత్యములకో పశ్చాత్తాపంబే చాలు. తెలిసి గురునివల్లను దగ్గోపంబు తొలఁగఁగలదు. స్నానసంకల్పంబున రెండామడ దూరానవున్న తీర్థంబు సేవించుటయు స్వర్ణదానంబుం గార్యంబు. ఇట్టి దానతులంగ దేశదేశాను సంధానంబున శుభయులకుం బాధితంబు గావలసినదే. అత్యల్ప పాపనాశంబునకైన నయుతగాయత్రీ జపంబు చాలు. గాయత్రీజపంబు తోడి యాజ్ఞవల్క్యాదులవల్లను స్వాధ్యాయంబునను కృచ్ఛ్రసిద్ధి యగు. కృచ్ఛ్రసంఖ్యలోఁ బ్రాజాపత్యంబు గావ్యంబు. పగభుక్తమును నక్తదీక్షయు నుపవాసవ్రతమును గ్రమముగా జేసి దినాలవంతునన్నైన పండ్రెండుదినాలు గడపిన నది ప్రాజాపత్యం

బనఁబడు. శ్రీగురు స్మరణంబున సామాన్య పాపక్షయంబగు.
కృచ్ఛ్రాతికృచ్ఛ్రానుష్ఠానంబున నజ్ఞాత పాపక్షయంబు. ఆయా
సమయముల భోజన నియమంబెట్లన్నఁ బవలు పదియైదును రాతిరి
పండ్రెండును గబళములు. అయాచితాన్నమైన నెనిమిదేసియే.
ఇట్లు నెలదినాలు కడపిన సౌమ్య పాపనాశంబయ్యెడి. లేదా
ప్రత్యహమును రెండు కమికెళ్లన్నముతోడనే క్షుత్తుఁదీర్చికొన్న
మతిమేలు. కాకున్న మూన్నాళ్లు పస్తుండి మూడు దినాలు
ఘృతాశనంబుఁగొన్నను బాపహారకము కాఁగలదు. తుదకు
నేయియుఁ బాలును గాలియుంగ్రోలుచు మూడేసిదినాలు కడపి
నను గడవఁదగును. పాలుద్రావి యుండలేనివాఁడు తెలికపిండి
తిండితోడనైన నపాకృతాఘుండగు. ఓపిక గలవాఁడు పశ్చా
త్తప్తహృదయుండై యేడుదినాలు పర్ణకృచ్ఛ్రింబొనర్చునది. అదె
ట్లన్న మారేడు దళాలు రావియాకులుఁ దామరాకులు దర్భగడ్డి
యాన్నిఁటి యున్నినీళ్లు త్రావుచుఁ బర్ణకృచ్ఛ్రంబు నిర్వర్తింప
వలయు. కాదా చాంద్రాయణం బొనర్పవలె. అందుఁ జందురు
వృద్ధిక్షయంబులతోడ దినదినంబును గోడిగ్రుడ్డంతపంతునఁగ బళా
లెచ్చించుచుఁ దగ్గించుచుఁ బూర్ణిమనాఁటికిఁ బదేను ముద్దలుగ
భక్షించి యమావాస్యనాఁ డుపవసించుట కార్యంబు. తీర్థ
యాత్రాఫలంబు నుడివెద నాకర్ణింపుమోయీ! నలదినాలు వరు
సగా వారాణసీ స్నానంబొనర్చి సహస్ర గాయత్రీ జపంబొనర్చిన
నెల్లకలుషంబులు వాయునని యగస్త్యులువల్కిరి. సేతుస్నానంబు
వల్ల భ్రూణహత్యాది పాపనాశనమనిరి. ధనుష్కోటిం గోటిగా
యత్రి జపంబొనరింప బ్రహ్మహత్యాది దురితంబులు దగ్ధంబు
లయ్యెడు. లక్షగాయత్రీజపంబున సురాపానదోషంబుపోవు. పదు
లక్షలు జపించిన బంగారము హరించిన పాపమ్ముమాయు. ఎనిమిది
లక్షలు దీక్షతో విధివిహితానుష్ఠానంబు నెఱపిన గురుతల్పగ శుద్ధి
యుం జెప్పందగు. త్రివిక్రమా! వేదపాఠఫలం బింకనుడివెద.
పావమాన జపంబున బ్రహ్మహత్యాదోషనాశమౌను. ఇంద్రిం

మిత్ర'మ్మను మంత్రంబును నెలదినాలు జపించుటను శాంతి సూక్తపాఠంబునను గల్లుత్రాగుట మొదలైన కిల్బిషంబులడంగు సుమ్ము. శునశ్శేఫసూక్త జపాచరణంబునను స్వర్ణస్తేయత్వశుద్ధి. మఱియు ముప్పది దినాలు హవిష్యాశిశాంతిసూక్తం బెడతెగ కుండఁ బఠింపజాలిన గురుతల్పాది పాపంబులనుండియు శుద్ధి యయ్యెడి. పంచమహాపాపంబు లొనర్చిన నైదాఱునెలలు మితా హారంబు సేకరించుచుం బురుషసూక్తంబు జపించుటను శుద్ధి యబ్బు. అట్లే భక్తితో త్రిసుపర్ణజపంబొనర్చిన సర్వాఘవినాశ కంబయ్యెడి. నారాయణోపనిషత్తు సభక్తికంబుగఁ బఠించినఁ బంచమహాపాతకంబులును భగ్నంబయ్యెడు. ఇంక గాయత్రీ జపంబే సర్వాఘహారకంబన నఘమర్షణసూక్తంబుఁ బఠించుటవల్ల నేడు జన్మాలఁ జేసిన పాపాలెల్ల దుడిచికొనిపోవుఁ గాదే. విష్ణు సూక్త మంత్రపాఠంబునను నట్లయగు. అజ్ఞాత దోషంబులఁ బాపికోఁ బంచగవ్య ప్రాశనమొనర్చి పశ్చాత్తాపంబు నొందినం జాలును. ఒకనాఁడుపవసించి మఱునటి నీలధేను మూత్రము గిద్దెడు, కఱియావుపేడ దఅయంగుటమంతయు, దోరమొదవుపాలేడు గిద్దలును, తెల్లదానిపెరుఁగు మూడుగిద్దలును, గపిలగోఘృతము కుంచెడు నంతయే దర్భోదకము నొకకంచుపాత్రిలోఁ గలిపి 'ఇరావతీ' ప్రభృతి మంత్రవాక్యములతోడను 'ఇదంవిష్ణుర్విచక్రమే' యను ఋక్కులతోడను 'మానస్తోక'యనియు 'ప్రజాపతఇతి' యనియు నుచ్చరించుచును గాయత్రీ మంత్రంబుతోడను సప్రణవ వ్యాహృతు లర్పించినమీఁదట సానుతాపంబుగా నాపంచగవ్య శేషంబు 'యత్త్వగస్థిగతంపాప'మ్మను మంత్రంబుఁ బఠించుచు లోనికింగొనినశుద్ధుండౌను. పైనఁ జెప్పఁబడిన యాయా ధేనువులు దొరకనియెడ దర్శన మాత్రంబున నెల్లకల్మషంబు లడంపఁజాలు కపిలగోసంబంధి ద్రవ్యములే నైదును సేకరింపవచ్చును. బ్రహ్మహత్యసేఁత కల్లుత్రాగుట గురుతల్పగుఁడౌట స్వర్ణస్తేయంబొనర్చుటయు ననునవి యన్నిట మహాపాతకంబులు నాఁబడునవి గాన

నట్టదొంగలు గావించినవారితోడ నెట్టిపొత్తు గలిగినవారును వారితో సమభాగు లయ్యెదరు. ఉపపాప లఘుపాపంబులకే ప్రాయశ్చిత్తంబుననైన నిష్కృతి కాఁజెల్లుఁగాని పంచమహాపాతకంబులు మాత్రము దుష్పరిహార్యములు సుమ్ము. అట్టివానికిఁ బైఁజెప్పఁబడిన ప్రాయశ్చిత్తంబులయిన వెనుక సద్గురువుల యనుగ్రహము దొరకినమీఁదటఁగాని పాపలయంబు గానేరదు. ఒక్కొక్కెడ స్వధర్మనిరతులు వేదవేత్తలునౌ విప్రుల యనుగ్రహంబువల్ల శుద్ధత్వము సంప్రాప్తమౌటయుంగల' దని శ్రీ గురువులు ప్రాయశ్చిత్తప్రక్రియ త్రివిక్రమున కుద్బోధించిరి.

దానం బ్రబోధితుండౌ నాయంత్యజుఁడు ప్రాయశ్చిత్తంబుల కుంగొనియాడె. అంత, గురుండు వానికిట్లు తెల్పు. 'పూర్వజన్మమునందుఁ దలిదండ్రులం దెగడుటఁ జండాలుండవై పుట్టితివని చెప్పియుంటినిగదా. నీకుం బ్రాయశ్చిత్తంబు విధింతు నట్లు చేయుము. నెలదినాలీ సంగమస్థలంబున యథావిధి స్నానాదికంబు నెఱపినకడఁ గ్రమముగా మలంబువాసి విప్రత్వముఁ గందు'వనియె. అందులకు వాఁడిట్లను: 'స్వామీ! అట్లందు రేటికి? మీ పాదదర్శనంబుననే పూతుండనైతిఁగాదే? మానససరోవరంబున మునిఁగిన కాకంబు హంసరూపంబుఁ దాల్పకపోదు మీ కటాక్షప్రసారము నాపైన నయినంతఁ బరిపూతుండనై పోయితినాయె. ఇంక నందు నందియు నుండనేర్చునే? ఈరలు శరణాగతత్రాణపరులైతిరి. కావున నన్ను రక్షింప దక్షులరు. ఓహో జగద్గురూ! పరుసమంటినంత లోహంబు స్వర్ణంబైనకైవడి నా కలుషంబులెల్ల భవదీయ దివ్యకటాక్షవీక్షణ స్పర్శంబున మాసిపోయె ననుకొనుటలో నబ్బురమేమున్నది? సర్వజ్ఞమూర్తీ! నాకు జ్ఞానంబు గలుగ నభిమంత్రించి విప్రులం బరిగణనీయుం గావింపుమయ్యా' యని యాతండు దోసిలియొగ్గిన నగి గురువరు లిట్లనుచున్నారు: 'ఓయీ! హీనజన్ముని నిన్ను విప్రులందెవ్వరు పరిగణింతురు? హీనరక్తరేతోయోగంబునం బుట్టి యాచండాల గృహంబునం బెరిఁగినవాఁడవైతివి. నీవు విప్రుండ

వైతివనికొన్నంత నవ్వుదువా? నిందాస్పదుఁడవు కావా? ఎట్లన్న వినుము. మున్ను గాధేయుండు తాను బ్రహ్మర్షి ననిపించుకోవలె నని పూని వందలకొలఁది సంవత్సరాలు మహాతపంబొనర్చె. అప్పటికిందాను బ్రహ్మర్షిత్వమార్జింపఁ గలిగితిననికొని యింద్రాది దేవతలనెల్లఁ దనకయ్యది ప్రసాదింపవలయునని కోరె. వారెల్లరుం దమవల్లఁ గాదనియు నేమన్నను వసిష్ఠుండే యనవలయుంగావఁ దత్కులగురు ప్రవరునే యాశ్రయింపుమనిరి. 'తుదకు నీవే గతియా?' యని యాబ్రహ్మర్షి శేఖరుఁ దరిసి బహుకాల తప స్తప్తుం దన్నుం బ్రహ్మర్షింజేయుమని యడిగె. అదివిని యాతండు నీరస దృష్టింగని యిట్లుపల్కె: 'ఓరీ! క్షత్రియా! అపవిత్రా! విశ్వామిత్రా! చాలుఁ జాలు. నోరుమూయుము. నీవేడ? బ్రహ్మర్షి వోఁటేడ? నక్కయెక్కడ? దేవలోకమెక్కడ? నీవుచచ్చి యెన్ని జన్మాలకయినను బ్రాహ్మణవంశజాతుండవు గాఁగలుగుదువేని మెడలో జందెము పడునెడ బ్రహ్మోపదేశంబుఁ గనినమీఁదట బ్రహ్మర్షి వనిపించుకోవలెఁ గాని తన్నుకొన్నను నీవిప్పుడట్లనిపించుకోలేవని వెడలఁగొట్టె. అందులకుం గినిసిన విశ్వామిత్రుండు వసిష్ఠతనూజాతుల నూర్వుర మడియించె. ఏమైనను వసిష్ఠమహర్షి కోపించి ప్రతిక్రియయుఁ గావింపఁడు. పోనిమ్మని యాతని బ్రహ్మర్షిత్వము నొప్పుఁడయ్యె. అంతనాకౌశికుఁ డిదేమదేమని యొక పెద్ద బండనెత్తి వసిష్ఠునెత్తిపైఁ బడవేయనుంకించెను.

అంతలోఁ దనకుఁదాన తెలివితెచ్చుకొని యిట్లనికొనియె: "ఎబ్బె! యిదిపనిగాదు. వసిష్ఠుఁడు చచ్చిన నన్ను 'బ్రహ్మర్షి' యనఁ జాలిన వారింకెవరుందురు? దేవర్షులెల్ల రీతనినే యనుసరింతురాయె. వీనిం జంపిన లేనిపోని మహాపాతకమొక్కటి కూడ నెంబడించునాయె" యనికొనుచుఁ జేతనున్న బండ నావలఁద్రోచి పశ్చాత్తప్తమానసుండగుచు నావసిష్ఠులవారి పాదములమీఁద నేవడెను. అప్పుడా బ్రహ్మర్షి విశ్వామిత్రుం జూచి 'ఓయీ రాజర్షీ!' యని సంబోధించె. గాధేయుండాతనినాయర్థోక్తిలోనాపియిట్లువేఁడె: 'మీరన్నది

కాదనను. కాని మీనోట ‘బ్రహ్మర్షి’ యనిపించుకోవలెనని కాదా నాచేయునదెల్ల?’ యనెను. వసిష్ఠుం డందులకిట్లు బదులుచెప్పె: ‘ముందు నీవు సూర్యకిరణములతో నీయీదేహంబెల్లఁ దహింపఁజేసి కొని క్రొత్తమేనిం జూపుము. అపుడు చూత’ మన్నంతనే విశ్వామిత్రుండును సరేయని మరలఁబోయి ఘోరతపంబున సూర్యకిరణంబుల నిజదేహంబెల్ల మాడిపోవ ననుష్ఠానసామర్థ్యంబున నూతన దివ్యదేహంబు కొంతకాలమునకుఁ దాల్పఁగలిగె. అప్పటికి వసిష్ఠుల యనుమతివడసిన విశ్వామిత్రుండు లోకమున ‘బ్రహ్మర్షి’ యనిపించుకోఁ జాలెఁగాదే. అట్టిమొదలఁ గేవల హీనజాతి సంజాతుండవు. నీవేమి? ఈమాత్రమున నుత్తమబ్రాహ్మణుఁడవుగాఁ బరిగణింపఁ బడఁజాలుదేమి? నీవిప్పటికయిన ననుతాపంబునంది నేఁజెప్పి నట్లు చేసి పాపంబుఁ బాపుకొందువేని ముందు జన్మమున బ్రాహ్మణుండవు కాఁగలుగుదువు. కాని యేమైన నిపుడు కావు. ఇంక నింటి త్రోవఁ బట్టుము.’ పొమ్మని శ్రీగురుండెంత చెప్పినను లబ్ధసుఖుం డాతండటువాసిపోయి నీచత్వంబునం జొరనొల్లఁడయ్యె.

తే. పేదవిడుచునె దొరకిన ♦ పెన్నిధినట?
మర్త్యుఁడమృతంబును ద్యజింప ♦ మదిఁదలఁచునె?
కడుపుమాడినగిడ్డిలే ♦ గడ్డివిడునె? ।
జ్ఞానమొదవిన నొల్లునే ♦ హీనగతిని? ॥

వాఁడు తానగ్రజాతిం జేరిపోయితిననుకొన్నవాఁడై తిరిగి మాలపల్లికేగనని యక్కడనే కూరుచుండె. కొంతసేపటికి వాని పెండ్లము బిడ్డలు నటకువచ్చి వానినింటికి రమ్మనిపిలిచిరి. తాను బ్రాహ్మణుఁడ నైతిననుచు వారిని దూరముగా నుండుఁడనియె. ఆ మాటలువిని వారచ్చెరుపాటున ‘నిదియేమి? నీకుఁ బిచ్చియెత్తినదా?’ యనుదాని నాబిడ్డలతల్లిని వాఁడు గొట్టఁబోయెను. అపుడా మాలెత యేడ్చుచుం గేల్మోడ్చి గురువులవారు వినునట్లు మొఱ్ఱ వెట్టె: ‘బాబూ! నన్నిప్పుడెక్కడికిఁ బొమ్మనునో చూడుండి.

నేనిక్కడినుండి యీబిడ్డలందఱికిఁ గూడు గుడ్డయుం దెచ్చిపెట్టఁ గలను? మీరే యీయన బుద్ధిమరల్పవలెను. లేదా నేనిక్కడనే యురిపోసికొని చావవలసినదే' యను మొత్తుకోలువిని యాపతితుని దెసంగని నవ్వుచు గురుప్రవరుండు ధర్మసూక్ష్మం బిట్లుగ్గడించె: 'ఓయీ! యింకనైనను నామాటవిని యింటికిఁబొమ్ము. దారపుత్త్రుల నేడిపించిన నీకింక సద్గతికలుగునా? కలుగదు. ఇహమున సాంసారిక సౌఖ్యంబనుభవించుచునే ధర్మంబువీడకుండేని భవాంభోనిధి దాఁటఁగలవు. కాకున్న ముందే భార్యయని యూర్తుఁ బరిగ్రహింపకుండవలసినది. పరిణయమ్మై వీడుట కూడనిదనిసుమ్ము. సూర్యచంద్రాదులు సాక్షులుగాఁ గొన్నదాని న్విడనాడుట దోషభాజక మాటటుండ నీకిఁక గతియేలేకుండెడి' ననిరి.

అంతఁ జేతులుకట్టుకొని యాపతితుండు, 'స్వామీ! జ్ఞానినైయు మరల హైన్యంబు నెట్టుకనఁగలననఁగా గురుస్వాములు వానిమాటలకుఁ దమలోనవ్వుకొని వీనియొడలిపై నలఁదించిన బూదిదులిపించిన నన్నియునుడిగెడి ననుకొని యొకశిష్యుం జేరఁ బిలిచి ధనలుబ్ధు నెవనినైన వేగఁగొనిరమ్మని యానవెట్టిరి. వాఁడును బోయి యాయూర వాణిజ్యరతుండగు నొక ద్విజుంగొనివచ్చె. గురుండాలుబ్ధుని కిట్లాజ్ఞాపించె: 'ఓయీ! యీపతితుని స్నానము చేయింపుము. [illegible] పసికిపుడు కలిగిన తెలివియుడిగి సంసారాసక్తుండు కానో'యనెను. ఆతండు వెనువెంటనె వానినెత్తి నొక కుండెడునీళ్లుపోసెను. దానివలన వానియొడలిపైనున్న బూదియెల్లఁ గొట్టుకొనిపోయె. అదిపోవఁగనే వాఁడంతయు మఱచి భ్రాంతిఁగొని యపుడు తనపెండ్లమును బిడ్డలంజూచికొని వారింగౌఁగిలించుకొని యిట్లడిగె: 'ఇంతకుమును పాకక్షణము నామతిపోయె. మీరందఱిక్కడి కెందులకు వచ్చితిరో చెప్పుఁ' డనుచు విస్మితమానసుండై దారపుత్త్రులతో నింటికేగె. వారివల్ల జరిగినదెఱిఁగి వెఱఁగుపడియె. ఆయాకస్మికములగు మార్పులంగన్న లోకులు నేమి విచిత్రమిదని యనికొఁజొచ్చిరి. త్రివిక్రముం డయ్యెడ గురున

కిట్లనియె: 'స్వామీ! నాకిపుడొక గొప్పసందేహము కలిగె. దయ
చేసి వినుండు. అదేమందురేని వాఁడు జాతిహీనుండైనను బ్రసా
దింపఁబడిన జ్ఞానమెల్ల నిట్లు క్షణమాత్రంబున నెట్లుపోఁగలిగె?
సెలవిం'డని మ్రొక్కెను. గురుండు సస్మితవదనుండై యిట్లుత్తరం
బొసఁగెః 'ఓయీ! యేమున్నది? భస్మలేపనంబున నేకదా
వానికా జ్ఞానముకలిగెను. అదికడిగినవెంటనే వచ్చినది వచ్చినట్లు
పోయె. ఇంకేమున్నది? భస్మమహిమంబిట్టిదని యెఱుంగుము.
కావుననే శివుండది ధరించుసుమ్ము: అద్దానికి మహాత్ములచేయి
తగిలినమాత్రమున నయ్యది ప్రపంచమును బ్రహ్మమయంబుఁ
గావింపఁజాలు' ననియె. అట్లయిన భస్మమహిమంబు వివరింపుఁ
డని త్రివిక్రముండు వేఁడె. కావున శ్రీగురుడింక భస్మమాహాత్మ్యంబు
బోధింపఁగడంగెడి'నని సిద్ధుండు నామధారకునకుం దెలిపె.

### కర్మకాండము — ౮దశము.

నామధారకుండు గురుండు మున్ను తెలిపిన భస్మమాహా
త్మ్యంబుఁ దనకు బోధింపుమనవుడు సిద్ధుండిట్లు చెప్పుచున్నాఁడు.
శ్రీగురుండు త్రివిక్రమ సంప్రశ్నంబునకు మెచ్చియిట్లు వివరింపఁ
దొడంగెః 'పూర్వము కృతయుగమందు ముక్తసంగుండు వామ
దేవాఖ్యుఁడొక యోగి సత్తముండుండె. ఆతండు శుద్ధుండును
బుద్ధుండును బ్రహ్మవేత్తయునై కామక్రోధాదులుడిగి జీవన్ముక్తుం
డన నిస్పృహుండయి తనలోఁదా నానందించుచుండె. అమ్మౌని
శేఖరుండు జటావల్కలాజినధారియై బూదిఁబూసికొని యిటునటు
సంచరించి తుదకు నరసంచార విరహితంబగు క్రౌంచారణ్య
దేశంబునం జేరె. ఆ ఘోరాటవిలో నతిక్రూరుం డనేకప్రాణిభక్ష
కుండొక బ్రహ్మరాక్షసుండుండె. వాఁడయ్యెడ కేగుదెంచిన
యమ్మౌనిని ధురుంగని సమృద్ధిగా నెరవొరకేఁగదా యనుకొని
యాఁకలితీర్చుకొన నాతని గుటుక్కన మ్రింగివేయునోయనఁ బండ్లు
కొఱుకుచు మీఁదికివచ్చి మోరచాఁచె. అయుగ్రాకృతిఁగనియు

జ్ఞానియగు వామదేవుండించుకయు జంకఁడయ్యె. ఏమి చెప్పుదు? మునిస్వాంగభస్మ స్పర్శమాత్రంబునన యాక్రూరరాక్షసుండు మహాజ్ఞానియయ్యె. దానవాతనికిఁ బూర్వజాతి స్మృతికలిగె. పరుసవేదితాఁకున లోహంబు స్వర్ణంబైనభాతి మానస సరోవరోదక స్నానంబునఁ గాకంబు హంసంబైన కైవడి జంబూనదింబడినమన్ను బంగారమైనభంగి వాఁడు పరమపాపుండయ్యు సమ్మౌనిస్పర్శంబున నపేతపాపుండయ్యెసుమ్ము. ఏకోర్కెయయినఁ దీరనగుఁగాని యంటిన మాత్రమునఁ బాపంబులెల్ల గెంటజాలు సత్పురుష దర్శనంబు దుర్ఘటముగదా. మానవుల నేనుంగుల న్మ్రింగిన నవ్వాని యాఁకలితీఱదో సప్తసముద్రములును బానము చేసిన నవ్వానిదప్పి యడఁగదో యట్టి పరమపాపునికి క్షణమాత్రంబున మునిస్పర్శంబుననవ్వెల్ల నడఁగి క్రోధాదులునుడిగి శాంతియొదవి జ్ఞానంబబ్బె. చూచితే? ఆతఁడు మ్రింగవచ్చినవానికి లొంగిపోయి మౌని పాద జలజంబులకడవంగి 'గురూత్తమా! రక్షింపుము రక్షింపుము. నీవే సాక్షాజ్జగదీశ్వరుండవు. ఘోరసంసారార్ణవ మగ్నుండనగు నన్నుద్ధరింపవలయు. మీకటాక్షవీక్షణంబున నాదోసఁగులెల్లఁ బాసె. నా చెడ్డ తలంపులెల్ల వడ్డగింపఁబడియె' ననుచు బహుప్రకారంబుల నమ్మౌనిశేఖరు నగ్గించె. అప్పుడు కృపాళుండగు నావామదేవుం డవ్వానింగని యిట్లడిగె: 'ఓ నరా! నీవెక్కడఁబుట్టితివి? ఈ దిక్కుమాలిన యడవిలోఁ బడియుందువేల?' యనియె. అది విని వినతుండా నా రాక్షసుం డిట్లు బదులు పలుకు:

'స్వామీ! మీదయవల్ల ననేకజన్మజ్ఞానంబు నాకుఁ గలిగె. అదిప్పటికిరువదేనుపుట్టువులకుఁ బూర్వము నేనుత్కృష్టజన్మమందియుంటినని స్మృతివచ్చుచున్నది. అప్పుడేనుదుర్జయాఖ్యుండనొక్క యవనావనీపాలుండనై యుండి దురాచారంబులకు లోనైతి. అన్యాయశ లోకుల కెన్నియో బాధలఁ గలిగించితి. మదోన్మత్తుండనై పరదారలఁ బెక్కురఁ జెఱఁగొంటి. మఱెందఱనో నిర్బంధించితి. అట్టియబలల దినానికొకరితనుగా ననుభవించి విడిచి

తిరిగి వారిముఖాలవంకఁ జూడక వారిగతి విచారింపక యుండెడి వాఁడను. ఇట్లుండ నొకప్పటి కావెతలపాలయినసుదతులందఱైక కంఠ్యముగాఁ గోపముకొలఁది శాపంబువల్కిరి. ఇం దేనాయా రాజుల జయించి కొనితెచ్చిన వారివారి యంతఃపుర కాంతలుం గలరు. ఎక్కడెక్కడి సుందరులను బలాత్కారమున నేని రొక్క మిచ్చియేనిఁ జేరఁదీసితి. మాదేశమునందలి బ్రాహ్మణులు దేశాంతరమున కేగిన వారియిల్లాండ్రను బట్టితెప్పించి కులముఁ జెఱిచితి. ఎందఱో సాధ్వీమణుల సువాసినుల రజస్వలలం గన్నియల న్నాయధీనలొనర్చికొంటిని. ఇట్లు దేశోపద్రవ మొదవించితి. ఇట్టిట్టు నేఁజెఱఁబట్టినవారు బ్రాహ్మణులందు మూఁడువందలు క్షత్రియులందు నాల్గువందలు వైశ్యుల నాఱువందలు శూద్రులు వేయిమంది చండాలాంగనలు శతసంఖ్యాకులు పుళిందస్త్రీలు పది వందలు మైందులో యైదువందలు చాకితలు నాలుగునూర్లు నింకేమిచెప్పుదు రోసెలందు లసంఖ్యాకులు. ఈ తెఱంగున మదోన్మత్తుండనై తప్పుఁద్రాగి యెందఱెందఱఁ బొందునందియుఁ దృప్తి నందనైతి. తుట్టతుదకు నాకు క్షయరోగము సంప్రాప్తమయ్యె. పరరాజులు నన్నుజయించి నారాష్ట్ర మాక్రమించుకొనిరి. అంతఁ గొంతకాలమువఱకు కిడుములఁ గుడిచి తుదకు మడిసితి. యమదూతలు నన్నుఁగొంపోయి ఘోరనారకంబులకుం దార్చిరి. అటఁ బదివేలు దివ్యవర్షములవఱకు దారుణయాతనలకు లోనయితి. పిదప నూఱు దివ్యవత్సరములు ప్రేతరూపంబున నుండి తిరిగి పరేతరాజ పురంబుఁజేరి దుర్గతి ననుభవించితిని. రెండవది పులి పుట్టువు. మూఁడవజన్మమున నజగరమనైతి. నాలవ భవమునం దోడేల నయితిని. అయిదిట నూరఁబందినై జన్మించితి. షష్ఠము శరభజన్మము. సప్తమమునఁ గుక్కనయి జనించితి. ఎనిమిదవజనిసి జంబుకంబనైతి. తొమ్మిదిట జింకనైతి. దశమావిర్భవమునఁ గుండేలనయితి. పదునొకండవభవమం దేఁగొఁతినైతి. పండ్రెండవది చీపరపిట్టపుట్టువు. త్రయోదశావిర్భావమునఁ గప్పనై యొప్పితి.

చతుర్దశంబునఁ గాకమనైతి. పదేనవపుట్టుక నేనెలుఁగుబంటినయి తిని. పదాఱిట నడవికోడినైతి. పదేడవపుట్టున గ్రుడ్డిగాడిదనయి తిని. పదునెనిమిదవ జన్మమునఁ బిల్లినయితిని. తిరువాత మరల మండూకజన్మము. ఇరువదవది తిరిగి వాయసజన్మము. ఇరువది యొకటవది చేఁపపుట్టువు ఇరువదిరెండవసారి నేనెలుకనై యొక పిల్లినోటఁబడి యిరువదిమూడవ పర్యాయము గుడ్లగూబనయి పుట్టి తిని. ఇరువదినాల్గవ భవమున నేనుంగనైతిని. తుట్టతుద కిపుడీ బ్రహ్మరక్షస్సనయి రాత్రింబవళ్లిట నొంటరిగాఁ బడియుండి పలు బాములనందుచు నీయటవీస్థలిఁ దినఁదిండియుఁ ద్రాగనీరును లేక దుఃఖించుచుంటి. ఇట్టి నాకంట మీరు పడ్డంతనే గర్భాత్రము కొలఁది మిమ్ము దిగమ్రింగివేయు తలంపుతో మీమీఁది కుఱికితి. కాని మిమ్ము స్పృశించిన మాత్రన నాపూర్వజన్మ పారంపర్యం బెల్లను నామనమున కద్దమునఁ బెట్టినట్లగపడుచున్నది. స్వామీ! ఏమి చెప్పుదు? అహా! ఈదురాత్ముఁడు వేయిజన్మలఁ జేసిన ఘోరా ఘంబెల్ల నొక్కపెట్టునఁ దుడిచిపెట్టినట్లయిపోయె. ఇఁక నాకుఁ బుట్టువే మట్టుపడెడుఁగావుత. బాబూ! నన్నీఘోర సంసారార్ణ వమునుండి యవ్వలఁబడవేయుఁడీ. మానీంద్రా! దైవయోగమున నాకిప్పటికే పుణ్యలేశముననో మీరలేనాకిట్లు తారకులరుగా దొరకితిరి. మీరు పరమాత్ములరుగారు. మిమ్మంటినమాత్రమునఁ బాపిని దురాచారుండ నగు నా కింతటి జ్ఞానసంపద నొడఁగూర్పఁ జాలిన వారలు మీరలీశ్వరులు గాకేరులా? మహానుభావా! కాకున్న మీపాదాబ్జాతముల కింతటి మహత్వమెట్లుకలిగెనో దయతోడ నెఱుంగఁజెప్పరే' యనివాఁడతిభక్తియుక్తుండై ప్రార్థించి నంత సంతుష్టచేతసుండగు నా వామదేవుండిట్లు బదులుపలికె:

ఓయీ! యిదెల్ల నామహిమము కాదు. ఇది నాయొడలిపై నేనలందికొన్న భస్మముయొక్క మహాత్మ్యమునుమ్ము. ఆబూడిద నీ కేమాత్రమో యంటినందువల్లనే నీకిట్లనేకజన్మ జ్ఞాపకంబు కానయ్యెనోయీ. ఆభస్మమహిమము నీకేకాదు బ్రహ్మాదులకు

నగోచరము పరమేశ్వరుఁడద్దానినెప్పుడు ధరించునది పరమా
త్ములు వర్ణింపఁగలుగుదురా! అదియెల్ల నాశివునికే యెఱుక. భస్మ
మాహాత్మ్యం బపారంబయినను నిదర్శనమున కొంత నుడివెద.
వినుము. మున్నొక కర్మభ్రష్టుండైన దురాచారుండు ద్రావిడ
విప్రుండుండె. వాఁడొక శూద్రాంగన తగులంబునం బడెను.
వాని నూరివారెల్లరు వెలివెట్టిరి. బంధుగులు వానిం బిలువరైరి.
తుదకుఁ దల్లిదండ్రులే వానిని జేరనీయకుండిరి. ఏమైనను వాఁడా
కులటపొందు విడువఁడయ్యె. ఆదౌర్భాగ్యునికిఁ గల్లుద్రావ నల
వాటయ్యె. అందులకు డబ్బులేక కన్నాలు వేయఁదొడఁగె. తుదకు
వాని విషయము 'భ్రష్టస్య కావాగతి' యన్నట్లయ్యె. అట్టివాఁ
డొకరేయిఁ దాగి యాస్వైరిణి యింటికేగ నద్దాని శూద్ర
ప్రియుండు వేఱొకఁడుండటఁ దారసిల్లి వీనిని సున్నములోనికెముగ
లేకుండ నలుగఁబొడిచి గతప్రాణుండయ్యెనని నిశ్చయించుకొని
యాయూరి వెలుపలఁ బొదలనడుమ నొక గోతిలోఁ బాఱవైచెను.
వానికింకఁ గొనయూపిరి యుండెఁగాని కదల మెదల లేక యుండె.
కొంతసేపటి కాచేరువ భస్మరాశియందుఁ బన్నుండి యాఁకొన్న
యొకకుక్క యామృతప్రాయునిఁ బసిగట్టి చీల్చితినవలెనని దగ్గఱి
యాకళేబరము నాపాదమస్తకమును వాసనఁజూచె. అయ్యెడ
నాకుక్క యొడలినంటియుండిన బూడిద యాచచ్చియుఁ జావని
వాని శిరమున బొమ్మనంజేతుల నంటెను. అంతవాని గొనపాస
మెదలు నెడ యమదూతలువచ్చి వానింగట్టికొట్టి యమలోక
మార్గంబుఁ బట్టింప నుంకించుచుండిరి. ఇంతలోఁ బిలపిలలాడుచు
రుద్రాక్షపేరుల వారలు శివదూతలెక్కడినుండివచ్చిరో తటాలున
నటనూడిపడ్డట్లయిరి. వారికాలకింకరులతోఁ 'గోకంబుమి చేయుడె?
భస్మలిప్తంబయి కైలాసార్హంబగు నీశవమును మీరేడకుఁ గొం
పోవుదురు?' రని యదలించి కొట్టఁబోయిరి. ఆ యమదూతలదరిని
వెఱఁగువడి యాకళేబరము నటనేవిడిచి 'మొఱ్ఱో' యని పాఱి తమ
పెబువుకాళ్లమీఁదఁబడి, 'బాబూ! ఇఁక మేమాభూమిపైఁద్రొక్కము

ఆశివదూతలు ఘోరపాపుల దెసకుఁగూడఁ బోనీయక మమ్ముఁ జావమోఁద వచ్చుచున్నారు. ఇఁక మే మానరలోకమున కేగిన లాభము లేకపోఁగా శివదూతలచేతులలో మాప్రాణాలుకూడ దక్కునట్లులే'వనిరి. ఆదండధరుండదివిని కుపితుండై తన దున్న పైనెక్కి రాఁదగినంత వేగముగా వచ్చుచుండె. త్రోవలో నాశవ ముంగొనిపోవుచున్న ప్రమథగణములతోఁ దారసిల్లి వారినాపి యిట్లడిగె: 'ఏమీ! నానౌకరులంగొట్టి మా ప్రేతమును మీరపహ రించుచున్నారా? ఘోరపాపంబులెన్నో మూటఁగట్టుకొన్న యీ పాధుశవమెక్కడ? మీకైలాసమెక్కడ? ఇట్టి వానిని మీదివ్య విమానములోఁ బెట్టుకొనిపోవుటకంటె మాఢ్యము వేఱున్నదా? చాలుఁ జాలు. ఇఁక మా నౌకరుల తెరువునకు రాఁగూడదు. ప్రేతము నిటుడించిపొం'డనవుడు నాగణము లిట్లు శమనునికి బదు లిడిరి: 'ఏమయ్యా! మమ్మేమో మందలింప వచ్చినావు. ముందు మీనౌకరులకుఁ గన్నులున్నవా? చెప్పుము. కాకున్న ముఖమున వక్షమున బాహువుల భస్మము పూయఁబడియున్న యిద్దానిం దాఁకుట సాహసింపఁదగునా? భస్మాంకిత మృతకళేబరంబెల్లఁ గైలాసంబున కానేయంబని మా యీశ్వరాజ్ఞయాయె. బూదిఁ బూసికొన్నవారి కెల్లరకు శాశ్వతకైలాసవాసం బిట్లేర్పడియుండ మీదూతలీభస్మాంకిత శవము తెరువునకు వచ్చుట వారితప్పా? మాయేలిక యాజ్ఞచొప్పునఁ బ్రవర్తించుట మాతప్పా? తమది కానిదాని నంటవచ్చినవారి నక్కడనే మట్టుపెట్టక పోనిమ్మని విడిచినందులకా పైఁబెచ్చు మీరు మమ్మేమో తర్జింప వచ్చితిరి. చాలుఁజాలు. ఇఁకముందైన మీదూతలకు బుద్ధిఁ జెప్పుకొనుఁడు: 'ఎట్టిపాతకము లొనర్చినవారయ్యు భస్మధారణ మొనర్చినయెడ నవ్వారు దండ్యులు గానేరరు. వారినెన్నఁడు నేదోసఁగులు నం టవు. వారు స్వర్లోకంబున కర్హు'లని మీనౌకరులకు బోధించి కొనుఁ'డని శివదూతలు పల్కినదెల్ల విన్న యా సమవర్తి యట్ల కానిమ్మని తనదూతల దిక్కుఁజూచి యిట్లుపన్యసించెః 'లెంకలారా!

మీరింక భస్మాంకితుల నెల్లర శైవులనుగాఁ బరిగణించి వారినంటఁబోకుఁడీ. వారెన్ని పాపకృత్యములొనర్చినవారయ్యు మనపురంబునకు రాఁదగ్గవారుకారు. బూదియు గుదురాక్షపేరులును ధరించినవారెల్లరు రుద్రులనుకొని మీరు తొలఁగిపొండని పరేతరాజు నిజదూతలకుఁదెల్పిన యీభస్మమహిమ మాకర్ణించితివిగదా. కావుననే భక్తితో నేనాబూదిఁ బూసికొంటినోయీ, రాక్షసా! దీననాఫలము దేవతలకును దుర్లభముసుమ్ము. సాక్షాత్పరశివుండిద్దానిం బ్రీతిమై ధరించుటయే యందులకుందార్కాణ' యనవినిన యారాకాసి యిట్లుప్రార్థించెః 'ఓయీ! జగజ్జీవనా! వామదేవా! మీరేపరమేశ్వరులరు. అనేకజన్మస్సుకృతి కలిగింపఁజాలిన మీపాదంబుల దర్శింపఁజాలితి. ఇపుడు మీదర్శనం బబ్బుట ప్రాగ్జన్మార్జిత పుణ్యలేశమునన. ఔనౌను. ఇపుడు నామదికొకటి పొడకట్టుచున్నది. నేను మున్నేలికనైయుండఁ జేసినసుకృతములు కొన్నిలేకపోలేదు. అడవులలో బావులుత్రవ్వించితి. బ్రాహ్మణుల కగ్రహారంబులిచ్చితి. ఇఁకఁ జేసిన యగణిత దోషరాసులెన్నియున్న నీసుకృతఫలమును దక్కవలెఁగాన నేనా భూపాలకదశ యుడిగి మృతుండనైనవెనుకఁ జిత్రగుప్తులం బిలిచి తెలిసిన యమధర్మరాజు నాయిరువదైదవ జన్మమందు నాసుకృతఫలముఁ గందునని యుండెఁగాదే. ఇంకేమి? ఆపుణ్యఫలముననే భవత్పాదదర్శనము. స్వామీ! యిఁక నన్నుద్ధరించి తీరవలయు. కావున నోహోజగద్గురూ! ఆభస్మధారణ విధానం బదియెట్లో నాకు స్పష్టము గావింపుండీ' యని సాఁగిలఁబడెను. అంతం గృపామతియగు వామదేవుండు 'భస్మధారణవిధానం బెఱిఁగించెద విను' మని యిట్లుద్బోధింపఁదొడంగె.

ఒక్కెడ మందరపర్వతంబునకుఁ గోటిగణయుక్తుండై సాంబుండు క్రీడార్థం బేగుదెంచె. అచ్చోటి కింద్రాదులగు ముప్పదిమూడుకోట్ల దేవతలును దిక్పాలురుం జేరిరి. చిత్రసేనాది గంధర్వవారంబును యక్ష ఖేచర పన్నగ విద్యాధర కింపురుష సిద్ధసాధ్య

గుహ్యకాదులును వసిష్ఠ నారదాది మహర్షులును దేవాచార్యుండౌ బృహస్పతియు నార్యముండును దక్షాదులును బితృదేవతలు నూర్వశీ ప్రముఖాప్సరస్సమూహంబులును ద్వాదశాదిత్యులు నష్టవసువులు సప్తమాతృసహిత చండికాదేవియు నశ్వినీదేవతలును విశ్వేదేవతలును మరుద్గణంబులును మహాకాల మహానీలాదులును భూతేశులు నందికేశులుమణిభద్రవీరభద్రవృకోదరులును షట్కర్ణ శంఖకర్ణులును గుంభోదర మందోదరులునువికటకర్ణధార ధారకేతుప్రముఖ వివిధవర్ణాంగరూప ప్రమథవరేణ్యులు నానాస్త్రపాణులై బహువాహనారూఢులై యటకేతెంచిరి. తత్తద్గణానేక మండిత మండపమధ్యస్థ సప్తప్రభావళియుక్త సింహాసనంబున రవికోటితేజుండైన శివుండు దేదీప్యమానుండై

సీ. ఆపాదమస్తక ♦ మహిభూషణంబులు
జడలందుఁ గమనీయ ♦ చంద్రకళలు
పంచవక్త్రంబుల ♦ భాభాసమానము
ల్చంద్రసూర్యాగ్ని వీ ♦ క్షణగణములు
కరముల డమరు ఖ ♦ డ్గ త్రిశూలాంకుశ
పరశుపినాక ఖ ♦ ట్వాంగబాణ
పాత్రపానపాత్రిలు ♦ మేనెల్ల భస్మంబు
వ్యాఘ్రాజినంబందుఁ ♦ బైనసంగ ॥

తే. దివ్యకర్పూరగౌరాక్ష ♦ తిందలిర్చు।
కామసంహారియోగిలో ♦ కైకవంద్య।
సచ్చిదానందమూర్తియా ♦ సాంబమూర్తి।
భక్తవాత్సల్యపూర్తి యై ♦ ప్రస్ఫుతార్తి ॥

సీ. ధగధగలాలెడి ♦ తనుకాంతి పెంపొంద
మణిమయహారము ♦ ల్భాసిలంగఁ
బగడంపుటధరంబు ♦ పైనముక్కఱముత్తె
మింపుగా లేనవ్వు ♦ సొంపుగులుక

నందమౌమోమున ♦ నష్టమీతిథినాఁటి
నెలపోల్కి రతనంపుఁ ♦ దిలకమమర
ధమ్మిల్లకుసుమా స ♦ వమ్మానమూఁగిన
భృంగావళులవ్రంది ♦ బృందములుగ ॥

తే. దాడిమచ్ఛాయమెఱయు వ ♦ స్త్రముధరించి
రత్నఖచితకంకణ నూపు ♦ రములమించి
మంచుమలపట్టి పతివామ ♦ భాగమందు
విశ్వవందితగానంపుఁ ♦ బెంపునందు ॥

తత్పరిషన్మధ్యంబున సనత్కుమారుం డీశ్వర చరణయుగంబున కెఱఁగి సవినయంబుగా నిట్టులడిగె:‘ఓహో! ఉమాకాంతా! జగన్నియంతా! ముల్లోకంబులధర్మార్థకామమోక్షప్రదాతలు మీరలేకదా. లోకులపాపంబులంబాపివారలభవాంభోనిధినుండి తరింపఁజేయునేకాదే మీరెల్లధర్మంబుల నుగ్గడించుచుందురు? స్వామీ! నాయెడ దయఁజూచి యల్పశ్రమంబున నధికఫలంబుఁ గూర్చు చతుర్వర్గ సాధనం బొండుసెలవిండు. ఇలఁగల సర్వసుకృతంబులు నధికాయాసంబున సాధింపఁ దగినవైయున్నవి. కావున లోకహితంబు సేయు సులభోపాయం బనుగ్రహింపవేఁడితి’ నను భక్త వచనంబుల కాగిరిజావల్లభుండు మెచ్చి యెల్లరుం జెవులొగ్గివిన నిట్లుద్బోధించె:

‘ఓహో! వినుండు. దేవవిహితంబును ధర్మ్యంబును స్వర్గ్యంబు ననంత పుణ్యదంబునై సుకరంబుగా వెనువెంటనే ధర్మార్థ కామమోక్షసాధకంబౌనది భస్మత్రిపుండ్రధారణంబ సుం’ డనియె. అదివిన్నంతనే సనత్కుమారుం డిట్లు మరలఁబ్రశ్నసేసె: ‘దేవా! అందులకగు విధానంబెయ్యది? సేకరింపవలసిన ద్రవ్యమేది? ఎట్లు ధరింపవలయు? దానికగు శక్తియెద్ది? తదధిదేవత యెవ్వరు? అందుల కధికారియెట్టివాఁడు? ప్రమాణమెద్ది? ఏమి మంత్రము నుచ్చరించుచు నద్దాని ధరింపవలయు? సెలవిం’ డని

యాపరమేశ్వర పాదారవిందంబులకు మ్రొక్కెను. అంతశివుండు కృపాళుండై యిట్లనియెః భస్మంబుకొఱకు గోమయద్రవ్యంబు సేకరించి దేవతాగ్నికార్యంబు జాబాలోక్తవిధి నాచరించి పూర్వ యజ్ఞ సంభూతంబగు భస్మంబు గ్రహింపవలయు. అయ్యది మహా పుణ్య సంపాదకంబు. గ్రహించునెడ 'సద్యోజాత' మను మంత్రంబుఁ బఠింపవలయు. పిమ్మట 'నగ్నిరిత్యా' ద్యుచ్చారణంబుతో నభిమంత్రింప వలయు. అంత 'మానస్తోక' పఠనంబున బొటమనవ్రేలితో నలిపి 'త్ర్యంబక' మ్ముచ్చరించి శిరమున ధరించునది. తరువాత, 'త్ర్యాయుషం జమదగ్నే' యను మొదలగు మంత్రములతో యథాక్రమంబుగఁ ద్రిపుండ్రధారణంబుఁగావించుకొనునది. ఆమూఁడిటఁ బ్రతిరేఖయుఁ గనుబొమలకొనలుదాఁటకుండ నుండవలయు. ఫాలభాగంబున మధ్యమానామికలతో నూర్ధ్వాధోరేఖలు లిఖించిన మీఁదట నంగుష్ఠంబుతోఁ గుడి వైపునుండి యెడమప్రక్కకు మధ్యమరేఖ రచించునది. ఇట్లు దేవతాధ్యానపూర్వకంబుగాఁ ద్రిపుండ్రధారణంబొనరించునది. ఇఁక నందొక్కొక్క రేఖంగూర్చియు దేవతాదులంగూర్చియు వివరించువాఁడను. ప్రథమరేఖకు 'అ'కారము వర్ణము, గార్హపత్యమగ్ని, భూమితత్త్వము, రజోగుణము, ఋగ్వేదము, క్రియాశక్తి, ప్రాతస్సవనము, బ్రహ్మదేవత. ద్వితీయరేఖకు 'ఉ' కారమువర్ణము, దక్షిణాగ్ని, ఆకాశతత్త్వము, యజుస్సువేదము. మాధ్యందినము సవనము, ఇచ్ఛాశక్తి యంతరాత్మ, విష్ణుపుదేవత. తృతీయరేఖకు 'మ'కారమువర్ణము, ఆహవనీయమగ్ని, స్వస్తత్త్వము, జ్ఞానశక్తి, తృతీయసవనము, శివదేవతాకమునుగా భావించి భస్మత్రిపుండ్రధారణం బొనరింపవలయు. ఇయ్యది దేవబోధితము. భక్తిశ్రద్ధలతో ముక్తికాముండై యిట్లది ధరించువానికి, బునరావృత్తిలేదు. ఎల్లరకును దాన నిష్టాప్తియుం బురుషార్థసిద్ధియునగునది రూఢము. కావున బ్రహ్మచారులును గృహస్థులును వానప్రస్థులును యతులును బ్రత్యహమునిట్లు భస్మత్రిపుండ్రము ధరింపవలయు. శ్రౌత

స్మార్త కర్మాచరణంబు నెడలను ధరింపఁదగ్గది. దాన మహాపాతకపాపములు నశించి పుణ్యంబు చేకూరు. స్త్రీశూద్రవిరాత్మహాంత్రలుంగూడ నిట్లు విధివిహిత భస్మధారణం బొనర్చినంత నపేతపాతకు లయ్యెదరు. భక్తితో యథావిధిగా భస్మధారణం బొనర్చువారు దేవవంద్యు లయ్యెదరు. విధియిట్టిదని తెలినయెడఁ గేవల భక్తితో ధరించినను రిక్తపోవదు. ముక్తిచేకుఱు. సందియము వలదు. మఱియుఁ బరద్రవ్యహర్తయుఁ బరనారీప్రియుండును బరనిందకుఁడును బరక్షేత్రాపహారియుఁ బరపీడకుఁడును సస్యారామాదిభంగకారుండు నసత్యవాదియు దుష్టాలాపియు గృహదాహకుండును వేదవిక్రేతయుఁ గూటసాక్ష్యప్రదుండును దుర్వృత్తయుఁ గుక్షింభరణంబుకై కౌటిల్యంబుఁ గావించువాఁడును గోభూమహిష్యాది ప్రతిగ్రహీతయు నీచులవల్ల ధాన్యాదిదానంబుల గ్రహించువాఁడును దాసీవేశ్యావృషలీ రజస్వలాది గామియుఁ గన్యావిధవాది సంసంగియు మాంసగోరస సాముద్ర ద్రవ్యాది క్రయకారియు వీఁడువాఁడననేల యెట్టి జ్ఞాతాజ్ఞాత మహాపాతకియైనను దుదకుఁ బశ్చాత్తప్త మానసుండై పూర్వోక్త విధ్యనుసారముగాఁ ద్రిపుండ్ర ధారణం బొనరించికొన్న శుద్ధుండై తీఱునని నమ్మవలయు. భస్మధారణంబు బహుళపాపఘ్నం బానింతటి మహత్తు కలదయ్యు శివనిందకునిఁ దద్ద్రవ్యాపహారిని శైవదూషకుని మాత్రమెందును బునీతులఁ గావింపదుసుండీ. శివభక్తుండై గళమున రుద్రాక్షమాలికయు నుదుట భస్మత్రిపుండ్రమును ధరించువాఁడు త్రిలోకపూజ్యుఁ డయ్యెడి. తద్భస్మధారణ మాత్రంబునన పుడమింగల తీర్థంబుల నన్నిట మునింగినంతటి సుకృతంబును సర్వమంత్ర జపానుష్ఠానాదికంబులం గల్గుఫలంబును సుకరంబుగాఁ జేకుఱు. వేయిజన్మంబులం జేసిన మహాపాతకంబైనను క్షాళితం బయ్యెడి. పితరులకెల్ల నుత్తమగతి గలిగెడి. ఇదియదియననేల బూదిఁబూసికొన్నవారికి నిహమున నాధివ్యాధి భయంబు వీడి యఖిలసౌఖ్యంబును దీర్ఘాయువును దివ్యైశ్వర్యంబును జ్ఞాన

షంప త్రియు నొదవెడిని. తుదకవ్వారిని దివ్యవిమానారూఢులం గావించి యప్సరసలు సేవింప స్వర్గలోకంబునకుం గొంపోవుదురు. వారు సిద్ధాది దేవవంద్యులై చిరకాలము స్వర్గసౌఖ్యము లనుభవించిన వెనుకఁ గల్పశతంబు బ్రహ్మలోకంబున నుందురు. పిదప బ్రహ్మకల్పత్రయంబు వైకుంఠ వాసంబొనర్చి తుదకు శివసాయుజ్యంబు నందెద రది నిస్సంశయంబు. ఓయీ సనత్కుమారా! కావున, నీవింక యథావిధిగఁ ద్రిపుండ్రధారణం బొనర్పుము. ఇది వేదోక్తవిధి సమ్మతమునుమ్ము. దీనఁ జతుర్విధ పురుషార్థంబు లందఁగల్గుదువు. ఈ నానుడు లాలకించిన వారెల్ల రట్లుకావించి తరించెదరు గావుత' మని వృషధ్వజుండు పల్కి కైలాసంబునకుఁ బోయె. అపరిమితానంద భరితుండైన సనత్కుమారుండును బ్రహ్మలోకంబున కేగ' నని దయాన్వితుండా వామదేవ మహాముని బోధింప వినిన యారాక్షసుండు భక్తిమీఱ నాతని చరణాబ్జాతంబుల కెఱఁగె. అంత వామదేవుం డిట్లను. 'ఓయీ! నాయొడలి భస్మం బంటుటచేకదా నీకు జ్ఞానంబొదవె' ననుచు భస్మమభిమంత్రించి యారాకాసికిం బ్రసాదించె. వాఁడు నప్పుడ యథావిధిగఁ ద్రిపుండ్రంబు ధరించి సద్యస్తేజోమయుండును బ్రహ్మానంద నిమగ్నుండును బ్రభాకర ప్రభాభాసుర దివ్యదేహుండుం గానయ్యె. అంత నాతఁడు వామదేవ సంయమీంద్రులకుఁ బ్రదక్షిణ నమస్కారంబు లర్పించునంతలో స్వర్గలోకంబునుండి దినకర కోటి దేదీప్యమాన విమానరాజం బాతనికొఱకై యానీతం బయ్యె. అతండు నందెక్కి యపవర్గంబునందె. ఇట్లు వామదేవుం డాతనికిఁ గైవల్యంబుఁ బ్రసాదించిన వాఁడయ్యె. ఆగంధ సాక్షాత్పర శివుండునుమ్ము. శ్రీమూర్త్యవతారుండును జగద్గురుండు నగు వామదేవుండు నరరూపంబున జగంబు నుద్ధరింప భూలోకంబునఁ బర్యటనం బొనర్చుచుండెడి. భస్మమాహాత్మ్యం బపరిమితంబు. అయ్యది గురుశాస్త్ర గళితంబౌట నత్యధిక ఫలదంబగు. కావుననే బ్రహ్మరాక్షసుండును క్షణమాత్రంబునఁ బరపారము నొందఁగల్గె.

మంత్రాదులు తరింపఁజేయునవి కొన్నియుం గలవుగాని యెందైనను గురువుల యందలేని దేదియు నెఱవేఱదు. 'నాస్తి తత్త్వం గురోః పర' మ్మని ప్రమాణము కలదుకదా. భస్మమహాత్మ్య మిట్టి దని మున్ను శౌనకాదులకు సూతుండును బలికియున్నాఁడు. దానికి గురుకటాక్షంబు కూడ జతపడిన నింకఁ జెప్పనేల?' యనుచు శ్రీగురుండు త్రివిక్రమున కెఱింగించె. ఆతండును గురుపాద ద్వంద్వంబునకు సాష్టాంగ ప్రణామంబు సల్పి వారి సెలవుఁగొని స్వస్థానంబునకు మఱలె. ఇట్టి శ్రీగురూపదేశంబున నెల్లరు జ్ఞానులై రనుచుఁ బరమాదరంబు మెయి నాసిద్ధజ్ఞాని శ్రద్ధాళువగు నామధారకున కుపదేశించెను.

## కర్మకాండము — ఉపశము.

నామధారకుండు సిద్ధపదంబులకుఁ బ్రణతుండై, 'భవతారకా! భవత్కృపాప్లవంబూఁతగా నవిద్యాంభోనిధినుండి యుత్తీర్ణుండనైతి. మీరలే నాకుం ద్రోవఁజూపిన సారథులైతిరి. నాకుఁ బరమార్థంబు లభింపఁజేసిన గురునాథు లీరలు. ఇట్టి మీ ఋణమే నెన్నితరముల నైనం దీర్పఁగోఁ జాలుదునే! దయానిధీ! అపూర్వగాథ లెన్నియో తెల్పితిరి. పతితునిచేఁ ద్రుటిలో నామ్నాయంబు లెల్లఁ బల్కం జేసిన తెఱంగెఱింగించితిరి. త్రివిక్రమునికి జ్ఞానబోధ గావింపఁబడిన రీతిఁ దెలిసికొంటి. అన్యలీలకథ వినిపింపు మ' యని వేఁడిన సిద్ధుండును సమున్నదితాంతరంగుండై శిష్యుం దరిఁజేర్చి సాదరవాక్కుల నిట్లు పల్కఁ దొడఁగె: 'ధన్యుండవోయీ, గురుచరితామృతంబు నీవీనుల సోఁకుభాగ్యంబు గంటివి. దాన నఖిలేష్టంబు లందఁజాలుదువుగాదె. శ్రీగురుకృప నీయెడఁ గలిగె. జన్మరాహిత్యంబుఁ గంటివి. నీమనంబు గురుపదలగ్నంబై యున్నది. నీప్రశ్నంబులవల్ల నీనావాక్కును ధన్యంబయినది. శ్రీగురుమహిమంబుఁ దెల్పు నుపాఖ్యానంబు లెల్లను జెప్పెదనేని గ్రంథము విస్తరించును. కావున సంక్షేపముగాఁ బల్కువాఁడను. అయిన

నాతని మహిమము పండితులకే పూర్తిగా గోచరముకానేరదు. ఇంక మందబుద్ధినగు నాకా? కానిమ్ము. యథామతిం దెల్పుదును.

నరరూపంబునం గానుపించు చున్నను నాతండు త్రిమూర్త్యవతారుండని క్రమముగాం దన్మహిమంబు లోకవ్యక్తంబు కానయ్యె. తద్దర్శనార్థము భక్తులు దూరదేశంబులనుండి వచ్చి యిష్టార్థంబులం బడయుచుండిరి. దరిద్రులకు ధనసంపత్తియు సంతతి లేనివారికి సత్పుత్రప్రాప్తియుం గుష్ఠరోగులకు వజ్రకాయంబును గ్రుడ్డివాండ్రకు దృష్టియుం జెవిటివారికి శ్రవణభాగ్యంబును నపస్మారాది రోగపీడితులకుం దన్నివారణమును నయుస్సునకుం బరుసమంటినట్లై నగుచుండెను. అందొక విచిత్రకథ నుడివెద నాకర్ణింపుము. మాహురంబున గోపీనాథాభిధానుం డొకధాత్రీసురుం డుండెను. ఆతనికిం గొడుకు లెందఱో పుట్టిపోయిరి. దానవార్తుండై యాతండు సతీసహితుండై శ్రీదత్తారాధనముం గావించె. కొంతకాలమునకు వారికిం గలిగిన బిడ్డనికి దత్తాత్రేయాఖ్యనిడిరి. వాండు దినదిన ప్రవర్ధమానుండౌచుండె. ఆతలిదండ్రులు వానిం బ్రేమమీఱం బెంచుకొనుచు నైదవయేటనే యుపనీతుంగావించిరి. పండ్రెండవయేటం బరిణయంబును జరిగె. చక్కని కోడలు లభించెను. రతీమన్మథులట్లు శోభిల్లునా నూతనదంపతులు మురిపెంబు గొలుపుచుండిరి. వారి గుణసంపదయు రూపసంపదయు నొకటికొకటిమించ ననురూప దాంపత్యమెసంగె. పదాఱేండ్లనిండుజవ్వనము నందుండ వారొండొరులం బాయనొల్లని పరస్పరానురాగ బంధంబున మెలంగుచుండిరి. ఇట్లుండ నాపాపంపువిధి సైంపదయ్యెంగాంబోలు. నావిప్రకుమారునికి దేహంబున రుజ యొదవించె. ఎన్నెన్ని యౌషధము లిప్పించినను నివారణము కాదయ్యె. అన్నద్వేషంబుకలిగె. పాపమాతనియు న్నాచిన్నదియు నన్నంబు ముట్టదయ్యె. తనపెనిమిటి త్రింగంగా మిగిలినమందే యొక్కింత తనగొంతులోం బోసికొనుచుండె. ఇట్లొక పక్షము కాదు, ఒకనెలకాదు; మూడేండ్లాసావిత్రి నిజభర్తృంశ్రుషసేవైక

తత్పరమై కాలంబుఁ బుచ్చుచుండె. రోగమువల్లఁ బరికృశింప నాతనితోఁ దానును గార్శ్యంబు నందుచుండె. ఆపతివ్రతాతిలకంబు తనపెనిమిటిపాదములు గడిగి తజ్జలంబులం గ్రోలి యసువుల నిలుపుకొనుచుండె. నగలెల్లఁ దీసివైచె. తల దూవికొనమిఁ గురులెల్ల జడలుగట్టె. చింపిచీరెఁ గట్టి యస్త్రీశల్యావశిష్టురాలై యుండె. పతియె ప్రత్యక్షదైవతమని నమ్మిన యాసాధ్వీమణి తలిదండ్రులు నత్తమామలు మున్నగువార లెన్నివిధాలఁ జెప్పినను దనభర్త భుజింపమిఁ దానుఁదిననని తనప్రాణంబులకంటె నాతనినే యెక్కుడుగా భావించి సేవించుచుండెను. ఆమె పుట్టినింట మెట్టినింటం గలిమికలిమి నాయువు సౌభాగ్యంబు పెంపొంద జ్యోతిషికులతో యోజించి మంత్ర జప దానహోమాది శాంతులకొఱ కెంతేని వెచ్చించిరి. రోగికి వారిప్పించిన రసాయనౌషధాదికంబులకు మితములేదు. దేశదేశంబులంగల భిషజ్ఞులెల్లర చికిత్సలుం జరిగె. పాదుకొన్న యావ్యాధి నున్మూలింప నేరితరమునుగాదయ్యె. తుదకు వెజ్జులెల్లరు వేసారి దైవాధీనమే కాని తమవల్లఁ గాదనిరి. రోగితలిదండ్రు లతిదుఃఖితాత్ములై యపుడా దత్తాత్రేయుం దలంచి యిట్లనిరి: 'స్వామీ, జగన్నాయకా! నిన్ను సేవించి నీకృపవల్ల దరిద్రునికి లభించిన నిధివలె నీపుత్త్రిం గనుఁగొని పెనుకటిదుఃఖములెల్ల మాపికొని కాలక్షేపము సేయుచుంటిమే. ఏమి యీపాపము! వీనిని దక్కించవేని మాకింకఁ బ్రపంచంబునం జూచుకోఁదగ్గదేమున్నది? ఇప్పుడ మాప్రాణంబులఁ దీసికొందు' మనుచుఁ బెద్దపెట్టున రోదనము సేయుచున్న పితరులం గని రోగి కౌఁగలించుకొని వారల నూఱడించుచు నిట్లను: 'అమ్మా! నాన్నా! నామాట వినుండి. ముందెంత ఋణమో యంతయే తీఱుంగాని యధికము కావలెనని యాసఁగొన్న లాభముండునా? ఇదెల్ల ఋణానుబంధ రూపమే కదా' యన విని వారు మఱిమఱి పొగులుచు నిట్లనిరి. 'అయ్యో! నాయనా! నీవు మమ్ముఁ గడతేర్తువని గంపెడాసతో నుంటిమే. మాయాస యడుగంటఁ జేయుదువా.

మన్నిట్లు దుఃఖసముద్రింబునం ద్రోసి పోవుట నీకు ధర్మమా ? కాటికిం గాళ్లు సాఁచినముదుసళ్ళము మాకింక దిక్కెవ్వ'రని పెద్ద పెట్టున రోదనము సేయుచుండు నాతలిదండ్రులంగని రుగ్ణుండౌ సుతుండుం గనుల నీరువెట్టుకొనియె. కొంతవడికిం దెప్పిఱియతం డంబ కిట్లనె: 'అమ్మా! సర్వ మీశ్వరాధీనము కాని మనుష్య యత్నమునం గాదగ్గదేమున్నది? నేనో, నీవు నాకొక్క గడియసేపు పాలిచ్చిన ఋణమయినం దీర్చుకోఁ గలిగితినా ? ఇఁక మాతృఋణం బెల్లఁదీర్చుకోఁ జాలుదునే? నేను నీకడుపునఁ బుట్టినందుల కడు గడుగున నిడుములనే కుడిపితిని. నావల్ల మీకింత సుకమేని దక్కదయ్యె ' ననుచు నాతఁడా ప్రక్కనున్న భార్య దిక్కుయి యిట్లు తుదిపల్కులం బలికె: 'ప్రేయసీ! నాకిఁక భూమిపైబత్తెము లేదు. నాకొఱకై నీవుచేసిన చేతలకుం బడ్డపాట్లకును మితము లేదు. నేను నీకు దాపరించిన పూర్వజన్మవైరిననికొమ్ము. ఇఁక ముందు నీవిక్కడ నుండేని మానాయనగారు నిన్నుఁ దనబిడ్డవలెఁ బోషింపఁగలఁడు. అందుల కిచ్చగింపవేని నీపుట్టినింటికిం బొమ్ము. నీసౌందర్యము దైవహీనునికి నాకు నిరుపయోగము. నాయీపాడు కట్టెనంటుట నీసౌభాగ్యంబును మంటఁగలిసె' నను పల్కులు ములుకులై సావిత్రిచెవుల నాట నాయమ మర్మరవేదనంబునం బొగులుచుఁ దత్పదంబులంబడి యిట్లనియె: 'స్వామీ ! నన్నువిడ నాడి పోవుదురా? మీకంటె వేఱుగతి నాకేది? మీదేహమెక్కడ నుండునో నాయీకళేబరము నక్కడనే యుండును. అందుల కింక సందియమా ? ' యను నాపైఁబలి వాక్కులుం జెవిసోఁకినంతనే యాపె యత్తమామ లిఁకఁ దముగాదిలికోడలును దమకుదక్కదు గాఁబోలు నని మఱింత చింతతోఁ బడి మూర్ఛిల్లిరి. అయ్యెడ సావిత్రి వారిందేర్చి యిట్లూరార్చె: 'అమ్మో! మీరిట్లు చింతించు టవల్లఁ గార్యమేమి ? వినుఁడు. ధైర్య మవలంబింపుఁడు. నా ప్రాణేశ్వరుని కిఁక నే యాపదయు రాదు. పరమేశ్వరుఁ బ్రార్థింతము. మీ కుమారుని నన్ను నేఁజెప్పు తావునకుఁ బంపుఁడు.

లోకు లెందఱో చెప్పఁగా వినుచున్నదానను. గంధర్వపురంబున మహాత్ములు శ్రీ నృసింహ సరస్వతులు గలరఁట. వారి దర్శనము వల్ల నా పసపుఁ గుంకుమ నిల్చునని నాకు దృఢవిశ్వాసము కుదిరినది. నా మాటవిని మమ్ముఁ బోనిం'డనుచు శ్వశురాంఘ్రి కంజాతంబులకు మ్రొక్కుచు వేఁడెను. వారు కామాశ వదలిన బిడ్డఁ డెట్లు బ్రదికినం జాలునని కొని యందుల కంగీకరించి వెనువెంటనే రోగి నొక సవారీలోఁ బరుండఁ బెట్టికొని [illegible] సాగించిరి. అపుడు సావిత్రి యత్తమామల సెలవుఁగొనుచు నిట్లనుః 'పూజ్యులారా! మీరు దృఢమనస్కులరై చింతవీడి యుండుఁడు. నా యీ ప్రాణప్రియునకు సద్గురుదేవుండే ప్రాణదాత కాఁగలఁ'డనుచు సాష్టాంగ ప్రణామంబు లొనరించెః ఆ భూలోకమాతంగగా స్నుషారత్నము యొక్క నిబ్బరమునకు నారబ్బురపడుచు నా వృద్ధ దంపతులు, 'సమాశ్రిష్టి! సౌభాగ్యవతీభవ. త్రిమూర్త్యనుగ్రహమున నీ పతి చిరంజీవి యగుంగావుత' మనుచు మనఃపూర్వకాశీస్సులిడి వీడ్కొలిపిరి.

అట్లత్తమామలవల్ల సెలవందిన యాయభినవ సావిత్రి భర్తృసహితయై యాత్రంబుగొలఁది మార్గంబెట్టులనోఁ గడచి తుదకు భీమాతీరంబునం జేరె. ఆ సత్వర గమనంబు రోగికి రోగప్రకోప కారణంబు కానయ్యె. అట్టి చరమావస్థనున్నవాని నెట్టకేని నగర సమీపంబున కట్టలోఁ జేర్చి యుటడించిరి. సావిత్రి శ్రీగురు లెక్కడ నున్నారని యాయూరివారల విచారించె. ఆమె వారు స్నానార్థ మరిగినట్లు తెలిసి యచ్చోటికిఁ బోనుంకించుచుండె. అంతలో నాకస్మికముగా నీదత్తాత్రేయుండు గతప్రాణుండయ్యె. పాపమా తనిపడఁతి గుండెబాదుకొనుచు నేడ్చి విగతాశయై యత్యుద్వేగంబుఁ గొలఁది నొక కరవాలంబుఁ గొని తనశిరంబును నఱికికొనఁ బోయె. అపుడటఁ జేరినలోకు లా సాహసకృత్యంబును వారించిరి. అపుడామె మఱింత దుఃఖించుచు నిట్లు పల్కెః 'అయ్యో,

స్వామీ! నాకీగతియేమి! ప్రాణరక్షకుఁడవనికదా గంపెడాసతో నింతదూరము కాళ్లీడ్చుకొనుచు వచ్చితిమి.

తే. మ్రొక్కఁ బోయినదేవళం ♦ బురుదురీతి।
తరువునీడకుఁ జనసది ♦ విఱిగినగతి।
జలముఁగొనఁబోయి మొసలిచేఁ ♦ జచ్చుభాతిఁ।
బతిని బ్రదికించికోవచ్చి ♦ పాడయితిని॥

నాయిప్పటి గతిచూడఁ బులిబారినుండి తప్పించుకొని యవనునిలుదూరి వానిచే మడిసిన ధేనువు మాదిరిగానున్నది. దైవోపహతిం బతిఘాతిని నయితినే. కాటికిఁ గాళ్లుసాఁచియున్న యత్తమామలకు వారియేకపుత్త్రుని దూరముసేసి విదేశమునదిక్కుమాలినచావు ప్రాప్తింపఁజేసినదాన నైతినే?' యనుచిట్లు పలుభంగుల విలపించు నాయబలంగని యచ్చోటఁజేరిన వారిలోఁ గొందఱిట్లోదార్చిరి: 'అమ్మా! నీవూరకయేడ్చినందువల్ల లాభమేమి? 'కానున్నది కాకయున్న కమలజునకునే' ననవినమే? కానున్నదిమాన్ప నెవరితరమ' నుచు బోధింపఁజొచ్చిరి. కాని పాపమామెకు పచ్చలారని ముగుదకుఁ బూర్వసుఖంబులు తలఁపునకు రాఁగా మఱిమఱి దుఃఖించుచు 'అన్నలారా! అక్కలారా! తల్లులారా! యేమిచెప్పుదు? మామవారివ్యాధి నివారణమగు ననునాశతోఁ గదా యిక్కడికి వచ్చితిమి. నాపని యింతలోనె తెల్లవాఱె. ఇంక నేనెట్లునిలుతు? ఎవ్వరికి శరణుఁజొత్తు? నాకింక రక్షకుండెవ్వఁడు? నాప్రాణేశ్వరుఁడుపోఁగా నేనింకెట్లు జీవింతు? చిన్ననాఁటఁ బరిణయవేళనే గౌరీశంకరులఁ బూజించితిఁగాదే! మఱియు సౌభాగ్యంబుకొఱకెంతవఱకు భక్తిశ్రద్ధలతో నాభవాని మహాదేవి నర్చించుచుంటినాయె. సువాసినులకొఱకుఁ జెప్పంబడిన యఖండసౌభాగ్యవ్రతంబు నాచరించితినాయె. నాపున్నెంబెల్ల నేమాయెను? అంతయు నేలపాలయ్యెనే. నగలెల్ల నీవటికే పీడితి. తుదకీ పసపుఁదాళ్లికైన నోఁచనైతినా? నాప్రాణాలకంటె నాపతి నత్యధికముగాఁ జూచుకొనుచుంటినే. ఇంతటి

యోగ్యుఁడు మఱియొక్కఁ డీభూమిపై లేఁడుగా' యనుచు గతప్రాణుండౌ పతిమోముఁ గాంచి పొంగి పొరలి వచ్చు దుఃఖతరంగముల నాపికోలేక యాశవముపైఁబడి పూర్వస్నేహ స్మరణంబున నిట్లు మఱిమఱి రోదన మొనర్పఁజొచ్చెను:

నాథా! నన్ను దిక్కుమాలిన దానిం జేసి యిటడించి పోయితి రేల? మీమాట కడుగు దాఁటి నేఁ జేసిన దేమి? అయ్యో! యెంత దురదృష్టవతిని! పెన్నిధిం గోల్పోయితినే! మీప్రాణ మెటు పోయెను? మిమ్ముం జంపుకొఁ దీసికొని వచ్చినట్లయినదే! మున్ను దశరథునికివలె మీవారికి దూరము చేసితినా? గుదుర్వార్త విన్నంతనే మిముఁ గన్నవారికిఁ బ్రాణాలింక నిలుచునే? ఆహా! మిమ్ము మీతలిదండ్రులను గూడఁ దుదిముట్టించిన కట్టఁడినైతినే. నామాట యటుంచుఁడు. పెద్దలైన యత్తమామలకు మీరొక్కరే పుత్త్రులైతిరి. వారినైన దిక్కులేనివారిం జేసి పోవుట న్యాయమా? నేనిపు డెక్కడికిఁ బోవుదు? ఎవ్వరి నాశ్రయింతు? నాకేయుపాయంబుం జెప్పకయే చప్పున మున్నుఁగంటిరే. ప్రాణేశ్వరా! మీసౌభాగ్యత నేనెట్లు మఱవఁగల్గుదు? మిముఁ జేపట్టిన దాదిగ నీగడియవఱకుఁ జూసి యెఱుఁగనైతినే. ఇఁకమీఁద నేనెట్లు జీవింపఁగలను? మీరే నాప్రాణముగాఁ జూచుకొనుదానను. ఈమీ ధర్మపత్నిని విడనాడి యెక్కడికిఁ బోయితిరి? నన్నిఁకముం దెవ్వరు పాలింతురు? తల గొఱిగించుకొని బాలవిధవ ననిపించుకొనుచు నెవరికొంపకుఁ జేరుదు? అయ్యో! యింతవఱకుఁ దిరిగి పుట్టినింటి వాకనైనఁ జూచినదానఁ గానే. మీకెపు డేమిలోటు గలుగునో యని మీచిత్తవృత్తిని గనిపెట్టి నడచితినే. మీరు రక్షకులై యున్నంతవఱకు నాపవిత్రత కేవిధమైన భంగమును లేకుండె. ఇంకముందు నిందలపాలయి పోవుదునే నాయకా! నా పాడు మొగముఁ జూచినంతనే యత్తమామలుం గూలిపోవ నిర్జనారణ్యప్రాయమైన యాకొంపలో నేనెట్లు నిలువఁగల్గుదు? ఇంతకు మీరుగ్రతఁ బోఁగొట్టుదునని తీసికొనివచ్చి మిమ్మే పోఁగొట్టు

కొన్నదాన నిపుడేమొగముతో నింటికిఁ బోవుదు' ననుచు ననేక ప్రకారంబుల విలపించుచుండెను.

అట్టియెడ మెడలో రుద్రాక్షమాలలుఁ జేతజపమాలయు నొడలెల్ల భస్మముంగ్రాలు నొక్కతాపసి యెటనుండియో డాయవచ్చి యయ్యువిద కిట్లనియె: ‘మూఢురాలా! నీవేడ్చినలాభమేమి? నొసట వ్రాయఁబడినవ్రాలు మార్ప నేరితరము? పురాకృతమనుభవింపక తీఱునా? ఎనిమిది దినాలనుండి యొక్కపెట్టున దుఃఖించుచున్నావుగదా! పోయినప్రాణాలు తిరిగి రాఁగలిగెనా? బమ్మ వ్రాసిన దెన్నఁడయిమాఱు? ఎవ్వఁడు శాశ్వతముగా నిల్చును? చావనివారెవరు? ఇతఁడెటుపోయె నందువు? నీవెక్కడనుండి వచ్చితివి? నీతల్లిదండ్రు లెవ్వరు?

తే. ఇలనుజీవుల సంబంధ ♦ మెన్ననేట ।
ఋణముకంటయి విడిపోవు ♦ కట్టెలట్టుఁ ।
బ్రొద్దుగ్రుంకినఁ జెట్టుపై ♦ నిద్దురింపఁ ।
జేరు చుండెడిపక్షుల ♦ తీరుఁగాదె? ॥

గాలితాఁకుడువల్ల నీటిబుడగలవలె నీమేనులు కర్మవశమున నాశమందునవి కావే? ఇందుఁ బుట్టువాఁడెవ్వఁడు? గిట్టువాఁడేఁడు? జీవుఁడు మాయకు లోనయి నాయవి నావారు ననుకొనుటెల్ల వట్టిభ్రాంతి. ఆత్మవిచారము లేక జడమగు నీకళేబరమే నీపతిగా భావించుచున్నదానవు. దేహధారణ మొనర్చుటెల్లఁ గర్మవశమున నవుచుండెడిని. కర్మమో గుణానుబంధమున నేర్పడి సుఖదుఃఖఫలంబు లొసఁగును. గుణము లన్ననో మాయవల్ల నున్నట్లుండెడినే కాని లేనివే. త్రిగుణాత్మకమైనది మాయ కాని యాత్మ కాదు. జననమరణాది వికారశూన్యంబగు నాత్మకేమాత్రమును సత్త్వరజస్తమో గుణసంబంధము లేదు. జీవుఁడు కర్మాధీనుఁడయి యీసంసారమునఁబడి యీఁదులాడుచుండు నంతవఱకే సుఖదుఃఖభాగి యయ్యెడిని. కల్పాంతాయుః పరిమితిగల దేవతలయినను గర్మాధీనులేసుమ్ము. ఇఁక నల్పాయువులగు మర్త్యులమాట వేఱ

చెప్పనేల? కాలముతోడనే కలిగి తదధీనమైన మేనేడఁ దిరంబో వుడ? కావునఁ గాలకర్మ గుణాధీనమైన యీ పాంచభౌతిక దేహంబు పుట్టినందున కానందముగాని గిట్టినందునకు విషాదము గాని యుండఁదగదు. పిండరూపమున గర్భగోళమునఁ జేరినది మొదలుగాఁ బుట్టి పెరిఁగి వార్ధిక మందువఱకుఁ దత్తదుపార్జిత కర్మానుసారముగా నెప్పుడో యొకప్పుడు మరణము తప్పనిదే. అందందుఁ బురాకృత పాపపుణ్యానుసారముగా సుఖదుఃఖంబు లనుభవించి తీఱవలసినవే. ఏయేసుఖదుఃఖమ్ము లెవ్వరెవ్వ రెక్కడెక్కడ నెట్లెట్లనుభవింప వలసినవిగా నావిధాత లలాటమున లిఖించెనో యయ్యయి విధములుగా ననుభవించి తీఱవలసినవే కాని వాని నన్యథాకరింప నేరితరమగు? ఎప్పుడైనఁ బుణ్యవశమున దుష్కర్మంబును బరిహరింపవచ్చుఁ గాని కాలగతి నడఁప దేవ దానవ మర్త్యులం దెవ్వరికింగాదు. ఈమీసంబంధమే సత్యంబం దేనిఁ గడచిన జన్మమున నేమయి యెవ్వరితోడి సంబంధము గలిగి యుంటివో చెప్పఁగలవా? ముందు భవమున నేమికానున్నావో యదియైనఁ జెప్పఁగలవా? వృథావ్యథ నొందుటేల? ఇంచుక యోజింపుమా. త్వగస్థి మాంసాస్థి శ్లేష్మ విణ్మూత్రాత్మకంబై లోపలను వెలుపలను జుగుప్సితంబైన యీపాంచభౌతిక దేహంబున కెవ్వండు స్వార్థంబు పాటించెడిని? నీవేడ్చిన దీమలమూత్రాత్మకమయి హేయమగు తోలుబొమ్మ కొఱకేకదా. చాలుఁ జాలు. ఇదిమాని సంసార తరణోపాయం బూహింపుము.

ఇట్లామహాత్ముండు బోధసేయుడు నాయింతి చింతయుడిగి చేతులు జోడించి యమ్మౌనీంద్ర పాదాబ్జాతంబుల నిజశిరంబూంచి దీనముగా నిట్లులర్థించెః 'స్వామీ! నన్నిట్టయిన నుద్ధరింపుఁడు. మీరెట్లుపదేశించిన నట్లు మెలఁగుదాన. ఓమహాదయాసాగరా! తల్లివైనం దండ్రివైన నీవే. భవోత్తరణోపాయంబుఁ దెలిపి రక్షింపవే రక్షింపవే!' యనపుడు భవాంభోధి నిస్తారకుండును నభవమో

పుండునగు నావరిభాషిశేషుండు జటివల్లభుం డాయమకు స్త్రీజన సమాచరణీయ ధర్మంబు లుపదేశించెడి' నని సిద్ధుండు పలికె.

కర్మకాండము — ౮వదళము.

సిద్ధపూరుషుండు నామధారకునకు స్త్రీధర్మ్యం బింక శ్రోతవ్యంబని యా యోగీశ బోధితాపూర్వార్థంబు లిట్లు గ్గడింపఁ దొడంగెను: 'సాధ్వీమణీ! యువతులు తమపతి జీవించి యున్నయెడను గడపటను నడపవలసిన ధర్మంబుల న్వివరించెద నాకర్ణింపుము. స్కాందంబునందలి కాశీఖండంబున నావివరణము బాగుగాఁగలదు. అందొక్కింత యిటవచింతు: కాశికాపురంబున మున్నగస్త్యుండు వసించుచుండె. తద్రమణీమణి లోపాముద్రాఖ్య విఖ్యాత పతివ్రతామతల్లి. ఆదంపతులు వారణాసికి భూషణాయమానులు. వారికి నానాతరువనావగామండితుండు వింధ్యాచలుండు ధాత్రీవర్యుండై యుండెను.

ఒకొక్కఁడం త్రిలోకసంచారం బొనరించు నారదుండా వింధ్యాద్రిం గని యిట్లనియె: 'ఓనగా! అచలేంద్రా! నినుఁబోలిన భూభృత్తును నేనింకెక్కడఁ గానను. రతనములు మొదలగు సంపదలకు నీకుఁ గొఱఁతలేదు. కాని మేరు మహీధరంబుభాతి నున్నతుఁడవు గావైతివే యనిమాత్ర మెంచుచున్నాఁడ' ననెను. అదివిని మేరువునడఁ గినిసిన వింధ్యావనీభృత్తు తానంతకంటె నెత్తుగా నుండవలెనని పెరుఁగఁదొడఁగెను. అయ్యద్రి క్రమముగాఁ బెరిఁగి పెరిఁగి తుదకు భానుమండలమునుగూడ నతిక్రమించె. దాన వింధ్యకంటె దక్షిణదేశంబెల్ల నంధకార బంధురంబయ్యె. సూర్యదర్శనమే లేమి యజ్ఞాది కర్మంబులెల్ల లోపించె. అందులకుం గారణంబిదియని ఋషులు పురుహూతునకుం దెల్పిరి. ఇంద్రుం డది విని కోపించి విరించి కెఱింగించె. చతుర్ముఖుం డాతనికిట్లను: 'శచీధవా! వానినడఁప నుపాయం బొక్కటి చెప్పెద. అట్లు చేయుము. కాశిలోఁ దద్గురుం డగస్త్యుండను బ్రహ్మవేత్త కలఁడు

గదా. నీవు వారిం బ్రార్థించి దక్షిణాభిముఖులం గావింపుము. వారు సమీపించునెడ నీశిష్యుండు గురుచరణంబులకు సాగిలంబడెడిని. శిరమువంచిన భూధరం బింక మీఁదట లేవకుండెడిని తెమ్ము పొమ్మనియె.

అంతనయ్యమరేంద్రుం డఖిల సురమునిగురు పరివృతుండై వారాణసి నివసించు నగస్త్యపాలికిం బోయెను. అట లోపాముద్రా కుంభసంభవు లగ్గురుపురస్సరుల విబుధవరులకు మునీశ్వరులకు నర్ఘ్యపాద్యాది విధుల నెఱపిరి. అందియు, నగస్త్యసతిం గుఱించి వాచస్పతి

“సీ॥ అత్రివరించిన ♦ యనసూయ హిమవంతు
నకుఁ గూర్చుసతియు మే ♦ నకయు నెనయె ?
పశుపతికర్థాంగి ♦ పార్వతీదేవియు
హరిని జేపట్టిన ♦ సిరియుసరియె ?
సవితృనారీమణి ♦ సంజ్ఞాసుసంజ్ఞయు
నగ్నియిల్లాలు స్వా ♦ హాంబదీటె ?
యలవసిష్ఠాంగన ♦ యౌ నరుంధతిసమ్మ
తాభిఖ్య శాండిల్య ♦ సతివతులయె ?
ధ్రువుని జనని స్వాయంభువు ♦ తొయ్యలియును
సత్యవంతుని యింతియు ♦ సాటిరాదు
రేమహీస్థలి నీకు సా ♦ ధ్వీమతల్లి !
పరమపూజ్య లోపాముద్ర! భద్రచరిత ॥ ”

యని కొనియాడి యాగరితచరిత గరిష్ఠంబు గానేమిటికో యెఱుంగుదురే యని సురలకుం బతివ్రతాధర్మంబు లివ్విధి నుగ్గడించెను:

“సీ॥ అతివ యెల్లెడఁ బతి ♦ స్వామినిగా భావించి
యెడపక తత్సేవ ♦ నడపవలయు
విసువొందక తిథుల ♦ మెసవింపఁగావలె
స్వేచ్ఛనుదానంబుఁ ♦ జేయరాదు

పొరుగిండ్లకరుగరా ♦ దరుగంగవలసినఁ
దలవంచికొని వేమ ♦ రలవలయును
గుంటెనకత్తెల ♦ నింటఁ జేర్పఁగరాదు
కులటలతోఁ బల్కఁ ♦ గూడదెందు॥

తే॥ నుత్సవాదులఁగననిచ్చ ♦ నొందరాదు।
తీర్థసేవనుదానొంటి ♦ తివురఁ జనదు।
కాంతుఁడున్నడ నొవ్వసిం ♦ గారములెవి।
ప్రోషితుండైనఁ దగవెట్టి ♦ భూషణములు॥

సీ. గ్రామాంతరమునుండి ♦ కాంతుఁడిల్సేరనే
మంతనంబునఁగాంత ♦ సంతసమున
వేయిలొందరపను ♦ ల్విడిచియే నెదురేగి
కడుబత్తితోఁగాళ్లు ♦ కడిగి తుడిచి
వీవనచేఁగొని ♦ విసరిసేదను దేర్చి
యల్లనసేమంబు ♦ నరసి తెలిసి
సంవాహనమొనర్చి ♦ స్నానాదికముదీర్చి
పాదంబులకు మొక్కి ♦ పాద్యముఁగొని॥

తే॥ హితమగుపదార్థములమర్చి ♦ యిడినవెనుక।
సతివి యుచ్ఛిష్టముండిని ♦ కుతుకమునను।
ముడిచికొని కురులాభూషణం ♦ బులను బెట్టి।
కొనియు నిజపతిసంతుష్టిఁ ♦ గొలువవలయు॥

ఇట్లు సకలోపచారంబులం దనిపి పురుషుని పవ్రిపుచ్చిన వెనుకఁగాని వనిత నిదురింపరాదు. మరల నిజభర్త మేల్కాంచక మున్న తా మేలుకువఁగని ప్రాఁచిపనులు నిర్వర్తించుకొని శుద్ధురాలయి వలసినదెల్ల సమకూర్చుచుండవలయు.

మ. పతిదైనంగృహణుండు రుగ్ణుఁడునుగు ♦ బ్జాకారుఁడున్నండుఁ జే
సతిపూజించుననారతంబతఁడె యీ ♦ కానుండుగానామె కే

వ్రితము తీర్థము లింక నేమిటికిఁ ద ♦ త్పాదోదకంబుండ స
ద్గతి తానంది తరింపఁజేసెడిఁ బతి ♦ గ్గన్నారిఁ బొన్నారిమై ॥

త్రిమూర్తి కృపయుం దానఁజెన్నారు. కాక పతియను మతిలేని వ్రతోపవాసాదు లెన్ని నెఱపిన నీశ్వర ప్రీతిదాయకంబు లవి కానేర్చునే?

తే. పతినివిడిచి భుజించినఁ ♦ బందియౌను।
గామమున నన్యుదెసఁగన్నఁ ♦ గనులుపోవు।
రాగదైవ నిష్ఠురంబాడ ♦ మూఁగయగును।
సవతితోఁబోర దౌర్భాగ్య ♦ మవ్రుఁబడఁతికి.

తే. అత్తమామల వేర్పట్ట ♦ నగుఁగదశుని।
మగఁడుకొట్టిన 'నీదుంప ♦ తెగ' యనఁ బులి।
నాథుతోడను బోరాడ ♦ నక్కయౌను।
గోపమున నిలువీడిన ♦ గూబయునగు.

ఒక్కఁడుఁ దనవల్లఁ దప్పేమియు లేకున్నను మగవాఁడలిగి దూఱినను గ్రోధమూనక వేచి మెల్లఁగ మన్నింప వేఁడవలయు. వలయు సంబారము లేవేని సమయమెఱిఁగి తమబిడ్డల ద్వారమునఁ దెలుపవలయు. లేదేని సైగలవల్ల నిజనాథు నెఱుంగఁజేయ వలయునే కాని తా నెదుట నిలఁబడి యివిలే వవిలే వనుచుండరాదు.

ఆ. బోటినిలువఁదగదు ♦ రోటరోకఁటఁ దిగు।
గంటసన్నికంట ♦ గడపమీఁద।
స్నానవేళ నెపుడు ♦ నగ్నగాఁగూడదు।
రవికనంటనీయ ♦ రాదధిపుని.

తే. సతులు ఋతుమతులౌటకుఁ ♦ బతికి దూర।
మునను మౌనమునను మూఁడు ♦ దినములందు।
వేదఘోషము వినకుండి ♦ వెనుకస్నాత।
లై నిజేశునిఁ గనవలె ♦ నక్కనేని.

మఱియు దీర్ఘసౌమంగల్య మపేక్షించి పసపుఁ గుంకుమును గజ్జలంబుసూత్రంబు మున్నగాఁగలవానిని సుమంగలులు ధరించు చుండవలయు. ఏలన, సతికిఁ బతిజీవిత మున్ననే పవిత్రతయు నైహికాముష్మిక ఫలసాధకతయు నౌఁగాదే. తుదకుఁబతిహీనురా లెదురైననే యమంగళంబని యెంతురామె. అట్టిది సుతహీన యునైన మరణప్రాప్తి యాసన్న మౌనన్న సన్నగానెన్నవౌను.

ఈతెఱంగున వితావితయా బ్రతుకుకంటె మబ్బుతో నేగు మెఱుపుమాదిరిఁ జందురుతోడనేడిందు చంద్రికయుంబోలె భర్తృ సహాగమనం బొనర్పమేలు. అట్లయిన నగడులేక పున్నగము న్విహాగపతియట్ల మగనికి దురాపంబైనం దానస్వర్గంబు ప్రాపింపఁ జేసినదై తనకుముం దిరువదియొక్కటియు వెనుక నిరువదొకటి యుం దరములవారిం దరింపఁజేయఁ జాలెడిని. అట్టిపతివ్రతామణి వంటలేక యమదూతలు పలాయితులయ్యెదరు. స్వర్గలోకంబు నుండి డిగ్గిన విమానంబున సుఖాసీనయైన యానారీమణి నీగాజ నంబుతోఁ దారాపథంబుఁ జేరఁగలుగును. అట్టి సాధ్వీశిరోరత్న ముంగూరిచి యాకాలానుసారు లిట్లనికొంద్రు:

"ఆహా ! యీ కాంతారత్నంబుం గనఁ గృతాంతోరుభీక రంబై పొడకట్టుచున్నదే. సూర్యుండు న్నిజకిరణవారప్రసారంబడంచు చున్నట్లున్నాఁడు. దాహకుండును సాహసంబడంగి యుండునా ? ఇఁకఁ జుక్కలమాట లెక్కయేల ? సతీపతు లిదె స్వర్గతినందు చున్నారు. స్వధర్మ నిర్వహణ ధుర్యమ్ములైన సమ్మోహినీమణి కేశమ్ము లెన్ని హుతమ్ములో నన్నికోట్ల పరిమితమ్ములగు నబ్దమ్ములు వారు స్వర్గమ్మునం దిరమ్మైయి యుందు'రని యనుకొనఁ బోఁడఁగదు. పత్యనుగమనఫలం బింతటిది. నిశ్శంకంబుగ సహగమనరింపఁజాలు పతివ్రత యొక్కతె యేకులమున జన్మించు నాకులమున నాకుల ముడిగి తరతరంబుల నెందఱెందఱో యుద్ధరింపంబడుదురు. అట్టి సుతం గన్నపితరులుం జేపట్టిన పతియు నెంతయు ధన్యులుగదా.

ఇఁక వ్యభిచారిణులం గన్నవారో మున్నున్న పున్నెంబు వోయి దారుణ నారకంబులం జేరుదురు. ఇట్లు తత్పూర్వజన్మానేక సహస్రసంబంధికులు నయ్యెదరు. వీరెల్లరుం బతివ్రతాపాద రజస్స్పర్శంబునం గాని పరిపూతులు గానేరరు. సాధ్వీమణుల చరణ రజంబుం దమకిరణంబుల నంటిన మిత్రాబ్జవైరులే పవిత్రతం గంటి మనుకొందురు. వాయువరుణాది దిక్పతులుం దద్దర్శన మాత్రంబునం బావనుల మైతిమందురు. రూపలావణ్యాది శోభిత లింటింట నెందఱెందఱు లేరు? వారలఁ బేర్కొన నేల? పూర్వోక్త పాతివ్రత్య ధర్మంబుల న్నెఱపు నిర్నిద్రలోపాముద్రా సదృశాంగనా మణులకాదే కులత్రయ పవిత్రతా గరిమంబు నందించువారు. అట్టి లోపాముద్ర లున్నయింట లేనిదేమి? సప్తజన్మార్జిత పుణ్య పరిపాకంబునం గాక యిట్టియిల్లాలు లభింపనేర్చునే? ఇట్టిగరితం జేపట్టినపురుషునికిం బురుషార్థసిద్ధిం గొదవయేమి? సహధర్మ చారిణి లేనియిల్లు యజ్ఞకర్మ ధర్మానర్హమ్ముగాదే? వనము గాకది భవనమా? పతివ్రతయగు సతిలేని జీవితమే వెత. సత్పతి దొరకిననే సత్సంతతియుం బుణ్యగతియుం జేకుఱు’ తద్దర్శనంబు ననే జాహ్నవీ నిమ్నగాంబుస్పర్శ ఫలంబుదక్కు. దాన సప్త జన్మార్జిత పాపౌఘంబు నొక్కుమ్మడిని డక్కు. ననుచుఁ బాతి వ్రత్యమహాత్త్వంబు వాక్పతి యొఱింగించిన తెఱంగెల్ల సిద్ధుండు వివరించె.

## కర్మకాండము — నవదశము.

ఆసిద్ధయోగి వాగీశ్వరప్రోక్త విధవాధర్మంబులుం దెల్పుచున్నాఁడు: ‘ దేవతలారా! సతులకుఁ బతి సహగమనంబు విధి విహితంబ యయినను బతిపోవునెడఁ దా దూరాననున్నను గర్భ వతియయినను స్తన్యపాయియగు చిన్నబిడ్డం డున్నను నదికూడదు. అట్టి యువిదయావజ్జీవంబు యథావిధి వైధవ్యోక్త ధర్మంబుల నెఱపి నను గూడఁ బూర్వోక్తానుగమనఫలంబు నిస్సంశయంబుగాఁ జేకుఱు. వైధవ్యాచారనిర్వహణంబునను మహాసుకృతంబుగలదు. గతభర్తృ

ఇట్టి దత్తదాజ్ఞానుసారంబుగా వైశాఖంబున జలదానంబును గార్తికంబున దీపదానంబును మాఘంబున ఘృత తిలార్పణంబును గర్తవ్యంబులు. అవెట్లంటేని వేసఁగిలో నిర్జలదేశంబులందుఁ జలిపందిళ్లు వేయింపవలయు. మఱియు వేదవిప్రులు రుద్రాభిషేచనంబులఁ గావించికొన గంగాంబు పూరంబులతో గిన్నెచెంబుల నొసంగనగును. ఇంకఁ గార్తికంబున సువాన్న భక్షణంబును నక్తవ్రతంబు ననుష్ఠేయంబులు. అయ్యెడ శాకంబులందుఁ గంద వంగమునగలును మధుతైలాదులును వర్జ్యములు. మోదుగాకుల యంటలో భుజించు టుత్తమము. ఏమైనను ద్విదళంబునను గాంస్య పాత్రమునను గుడువరాదు. ఇట్టి నియమములు గలిగి నిర్మల మనంబుతోడ మాసమెల్లఁగడపి వ్రతోద్యాపన సహితముగాఁ బరిసమాప్తి నందించునది. అందు ఘృతపూర్ణ కాంస్యపాత్రి దానంబును బహుక్షీరద కపిలగోదానంబును యథాశక్తి హిరణ్య సహితదీపమాలికా దానంబుం గావించిన సుకృతంబు చేకుఱు. ఇన్నిట దీపదానంబున మహాఫలంబబ్బెడినని యెఱుంగునది. ఇతరములవల్లనా ఫలంబిందు వీసంబేనియుం గానిదిసుండి. అదెట్లన్న శ్రీసోమేశ్వరుల కేకాదశ రుద్రాభిషేచన పూర్వక షోడశోపచార పూజలంగావించి నారాయణ భావనంబున నిజపతిరూపంబు హృదిన్నిలిపి యేయంబ దీపమాలికాదానంబుఁ గావించు నాయంబ మున్నొనర్చిన దానంగులెల్లం దొలంగి ప్రశంసకెక్కు. మఱియు మాఘంబున భానూదయంబొనడ నీరంబు నారాయణ స్వరూపంబుగా భావించి స్నానాలొనర్పఁగావలయు. అంత గంధ పుష్పాక్షతాదులతో శివారాధనంబొనర్చి యతిథి సత్కారంబులం బ్రాల్మాలకుండవలయు. తత్సత్కార విధానంబు నుడివెద. వినుఁడు. వేదవిదులకుఁ బాద్యంబొసంగి వ్యజనంబుంగొని విసరి పరిమళద్రవ్యంబు లర్పించి సదక్షిణ కర్పూర తాంబూలాన్విత వస్త్రదానంబుసేసి ద్రాక్షాకదళీఫలాదులును దీయని పానకపుఁ బాత్రంబుం జేతఁబెట్టవలయు. అంతఁ దన పెనిమిటిపేరు చెప్పి

కాని యాహోశనంబిడి సాత్త్వికాహారంబునసంతృప్తిపఱపవలయు. మఱియునందుఁ దీర్థాటనపరులౌ వారికి ఛత్రింబులుం బాదుకలు నొసంగుట యనంత ఫలదాయకము.

పూర్వోక్త నియమంబులతో మెలఁగుటవల్ల సహగమనమునకుం దుల్యంబౌ ఫలంబు చేకూరు. ఇట్లేపుణ్యాత్మురాలు నడపు నాయమ భర్త మున్నొనర్చిన పాపకర్మంబున నారకంబులొందిననుదీననుద్ధరింపఁబడి స్వర్గతింగను'ననుచుఁ బెక్కుధర్మంబులుచ్బోధించిన యాబృహస్పతి తుదకా లోపాముద్రాభిధాన మహాసాధ్వీమతల్లి యపరజహ్నుకన్యయే యనియు నాయమం జేపట్టినభాగ్యంబున నయ్యగస్త్యమహర్షు లపరభవులైరనియు వారఖిల త్రిదశ సంస్తూయమాన చారిత్రులనియు వర్ణించె నను సందర్భమున గురూక్తంబులైన ధర్మంబులంగొన్నిటినేనిటఁ జెప్పితి. ఇందులోకులకు సాధనభూతంబులైన రెండుమార్గములు కానుపించుచున్నవిగదా. ధైర్యముగలవారు మహాఫలదాయకంబగు సహగమనంబ యొనరించునది. కాదా సమాన ఫలదాయకంబగు వైధవ్యాచారంబునేని నెఱపునది. ముగుదా! దుఃఖంబిఁక మాని నా చెప్పినయది నీమదిన్నిలిపి యుందేది నీకనుష్ఠేయముగాఁదోఁచు నద్దాని నవలంబింపుము. నీకెదిరుచించెడి?'నని యావచ్చిన తాపసోత్తముండుతత్సతీమస్తకన్యస్తహస్తుండై పృచ్ఛసేసె. అందులకా సావిత్రి బత్తిమీఱ నిట్లు బదులిడె: 'యోగీశ్వరా! నాకుందల్లియైనను దండ్రియైనను సహోదరుండైనను మీరే. స్వామీ! మీకంటె నాకింక బంధుగులులేరు. తుదకీ విదేశంబున కేనుజేర నాకాప్తబంధువతంసుల లీరలై తారసిల్లితిరి. తాము సెలవిచ్చిన తెఱంగున వైధవ్యధర్మం బెట్లయినఁ బాలింపఁజాలను. అయ్యది యసిధారావ్రతంబుగాఁ దోఁచు. ఇక్కాలంబునఁ జక్కందనంబున కిక్కయౌ జవ్వనిమనికి నిందాపవాదాస్పదంబు కాకుండుననుట కలలోనివార్త. కాన ననంత పుణ్యసాధకంబగు భర్త్రనుగమనంబ నాకెంతయు సంతోషదాయకంబు కాఁగల' దనుచు

నతోన్యాగివరేణ్యుని చరణాబ్జంబుల నిజశిరంబుంచి 'సంసారాంభో
నిధిన్మునింగి యున్నదాన నన్నుద్ధరింపుఁ డుద్ధరింపుఁ'డని వేఁడెను.
అయ్యమివరుండుం గరుణమీఱ నాదీనురాలిని లేవనెత్తి యభయ
ప్రదానంబుసేసి యిట్లుపల్కెః 'తల్లీ! నీభర్తయెడకేగి నీవునాడకే
చేరెదవుగాక. సావధానమనంబున నాపల్కులు మురదాలకిం
పుము. నీపీడకు నీపెనిమిటికి రోగనివారణంబుఁ గావించికోనెంచి
భక్తితో శ్రీగురు దర్శనార్థ మేగుదెంచినదానవుగదా. ఇంతలో
విధివశంబునఁ గానైనదైనది. ఏకాలమున కేదియెట్లు జరుగనై
యుండునది యట్లయితీఱెడి. అయ్యది భగవదిచ్ఛాకము. దైవ
నిర్ణయ మలంఘ్యముకదా. నొసట బమ్మవ్రాసిన వ్రాలు తుడిచి
వేయనేరితరము? కానౌనది కాకమానదు గాన శోకంబువల్ల
లోకంబున నిష్ప్రయోజనము.

తే॥ అల హరిశ్చంద్రుఁ డంత్యజుఁ ♦ గొలువలేదె ?
బలి మహాదాత చనఁడె సు ♦ తలముఁజేరఁ ?
బంక్తికంఠుఁడు చిరజీవి ♦ వదదుకాఁడె ?
బందుగులతో సుయోధనుం ♦ డందఁడె దివి ? ॥

మఱి స్వచ్ఛందమరణుండు దేవవ్రతుం డేమాయె? తుదకు
రణరంగంబునఁ బతితుండుకాలేదే ? శ్రీకృష్ణపరిరక్షితుండు పరీక్షి
న్నృపుండో సర్పదష్టుండైపోలేదే ? ఏమైన వీరెల్లరు నరమాత్రు
లందేమో. సాక్షా చ్ఛ్రీవిష్ణ్వవతారంబులుమాత్రము తిరంబు
లయ్యెనే ? వీరు వారననేల ? సరదేవతాదు లెల్లయుం గాలాధీను
లనుట నిక్కువంబు. శ్రీగురుండొక్కరుండతక్కఁ గాలజితుండు
గానివాఁడెవ్వండు ? కానిమ్ము. పాపము. సతీమణీ! నీవిక్కడికి
దూరదేశమునుండి వచ్చినదానవు. నీవిప్పుడు చేయఁదగినదేమన,
వేగమ సంగమస్థలంబుఁజేరి శ్రీగురు సందర్శనంబొనరించి మఱి
వచ్చి చిచ్చునంజొచ్చెదుగాక' మనుచు శవమూర్ధంబున భస్మంబి
లంది యాసావిత్రాంబచేత నాలుగురుదురాక లిడియుండొక రెండా
శవగళంబునను మఱిరెండు తత్కర్ణ యుగంబునం గట్టుమనియు

రుద్రసూక్తాభిషిక్త గురుపాద తీర్థంబువల్లఁ దాను బరిపూతురాలైన పిదపఁ దచ్ఛవంబుపయిం బ్రోక్షించి సువాసినులకు వాయన దానంబులును వేదవిప్రులకు యథాశక్తి హిరణ్య దానంబులుం గావించి యాశవము నగ్నిసంస్కార సహగమనంబులకుం గడంగుమనియు బోధించి యాయోగి పుంగవుండు వోయెం. ఆయమయు యమివరుండెట్లుద్బోధించె నట్లు నడవఁ గడంగె.

ఆమె విద్వద్ద్విజజనంబులం బిలిపించి వారిచేత నౌపాసనాగ్ని సిద్ధ్యాది ప్రాయశ్చిత్తంబులఁ గావింపఁజేసి తాను స్నానంబొనర్చి పీతకౌశేయంబు ధరించి పసపుం బారాణియుఁ గుంకుముం గొని యలంకరించికొని యుపాసనహోమాది విధులచే నాచ్ఛాదితంబౌ నాశవంబుం గంగాంబుపరిసరంబునకు మోయించికొని తానగ్గిం జేతఁబట్టి ముందు మెలమెల్లఁగా నడచుచుండె. అయ్యెడ రూపలావణ్య రంజితయు బహుభూషణభూషితాంగియునై మహాలక్ష్మివలె విలసిల్లుచున్న యాతరుణీమణి సహగమనాభిలాషిణియై యేగుచున్నదని విని స్త్రీలుం బురుషులును వేనవేలుచూడవచ్చిరి. అందుఁగొందఱ టెట్లనికొఁ దొడఁగిరి: 'అయ్యో, యెంత చిన్నదమ్మ! ముకుపచ్చలారలేదే! సుఖ మనున దెటువంటిదో యెఱుఁగదే. కడుపున నొకకాయ యైనఁగాయలేదే. పదుది! చావన్న వెఱపు లేక యెంత సంతోషముతో ముందడుగు వేయుచున్న' దనుచు ముక్కులపై వ్రేళ్ళునెట్టుకొనిరి. మఱికొంద ఱామెను డగ్గఱి 'యేమమ్మా, వృథగాఁ బ్రాణాలు తీసికొందువేల? చాలుచాలు. ఇఁక మీ పుట్టినింటికిఁ బొ'మ్మ్మనిరి. ఆయమ నిరుత్తరయై తదేక దీక్షతో సాగుచుండం గాంచిన వేఱొకత యిట్లనికొనును: 'ఆహా! ప్రాజ్ఞురాలా మహాపతివ్రత కావునవే ధర్మంబు తప్పక యిట్లు నడచుచున్నది. జగన్మాయకా! కాంతలెల్లర కీయమ మార్గదర్శకురాలౌఁగాత' మనికొని కొనియాడుచుండె. ఏమైన కాంతముగా వారెల్లను నదీతీరముం జేరిరి. అయ్యెడ నాశవమును డించి చితిపేర్చి యందుఁ గ్రవ్యాదాగ్నిని బ్రజ్వరిలఁ జేసినమీఁదట నా

సావిత్రి యటఁజేరిన సువాసినులెల్లరకు మూసివాయనములును విప్రోత్తములకు సంభావనలు నొసంగి కేల్మోడ్చి సోత్సాహంబుగా నిట్లు పలికె. 'ఓహో, నారీమతల్లులారా! విప్రోత్తములారా! ఇదె మీయందఱివల్ల సెలవుఁ గొనుదాన. నాపాలిటి దీపావళి ప్రాపించినది. పుట్టినింటఁజేరఁ బిలుపు వచ్చినది. అగారీ నిలయంబుఁ జేరఁబోవుచున్నాను. నేను మావారితోడనాడఁ బార్వతీ పరమేశ్వరుల సేవింపఁగల' ననుచుఁ దమయూరినుండి తావెంట నిడికొని వచ్చినవారి దిక్కుఁగని యిట్లుపలికె: 'నాయనలారా! చింతింతురేమిటికి? మీరిఁక నింటికిఁబోఁదగును. కాని మిమ్మత్యాసక్తిమై మాసేమంబారయు నత్తమామలకు మాత్రము ముందుగా నీదుర్వార్త మీరు చెప్పఁగూడదుసుండీ. మీ రశుభంబువల్కిన నిలువున నావృద్ధులంగూల్చినవారౌదురు. కాన, మేము భీమా తీరమున శ్రీగురుసన్నిధానమం దారోగ్యమొదవ సుఖముగాఁ గాలముపుచ్చుచున్నారమని వారికిని మా బంధుమిత్రాదులకున్ని వేదింపుఁడి'యనుచు బోధించె. అదివిని వారతిఖిన్నమానసులయిరి. అప్పటి కాయమకు యోగీశ బోధితార్థంబులు మదికిరాఁగాఁ దచ్ఛవకర్ణయుగంబునం గంఠంబునను భక్తితో రుద్రాక్షలంగట్టి పరిసరబ్రాహ్మణోత్తముల కిట్లనియె: 'అయ్యలారా! శ్రీగురుసందర్శనం బొనర్ప సంకల్పించి వచ్చితింగానఁ గనులార నవ్వారిదర్శించి వచ్చి మఱి సహగమన కర్మంబునకుం గడంగుటుచితంబని తోఁచుచున్నది. సెలవా?' యనవుడు నాబాఁపలిట్లనిరి: 'అమ్మా! సరే కాని సూర్యాస్తమయము కాకముందు మాత్రి మగ్నిసంస్కారము జరుగునట్లు చూడు'మనిరి. ఆమె యుత్సాహమలరుదాననని యా గురుస్వరూపుండు హృషీకేశుం డున్న తావునకుం బోయెను. అటఁగల స్త్రీపురుష ప్రజాలోకంబెల్లఁ గౌతుకంబున నామెననుసరించె. సావిత్రి నడచుచుఁ దనలో నిట్లనికోఁ దొడఁగె; 'ఓహోస్వామీ! నన్నుపేక్షించెదేమి! సర్వేశ్వరుఁడవు సర్వశరణ్యుఁడవు నఖిలార్థదాతవౌ విశ్రుతకీర్తి! త్రిమూర్తి! త్రిగుణా

లీతుండవయ్యు నిచ్ఛామాత్రంబున వాని ననుసంధించి సృష్టిస్థితి లయంబు లందింపఁజాలు ననాదిపూరుషుఁడవే. అష్టసిద్ధులు నవనిధులు నీయఱచేతిలోనివారౌ. నీకటాక్షప్రసారంబునం గానిదేమి?

ఆ. ధారుణీశుఁడరసి ♦ దండ్యులదండించు
వెజ్జుకీలెఱింగి ♦ వేయువాఁత
నృహరి! కర్మఫలము ♦ నీకొనడంపంగఁ
భువనవిదితకీర్తి! ♦ పుణ్యమూర్తి!

నీవు భక్తాధారుండవని విని పెక్కుయోజనములు నడచి నడచి నేనిట్లు వచ్చినది నాపతి న్నీవు బ్రతికించి నాకు సత్సంతానంబుం బ్రసాదింతువనికాదే? అట్టినాయాస యడుగంటె. నామనోరథాలెల్ల మంటఁగలిసె. అహా! నేనేమి యపరాధ మొనర్చితినో కాని నాతోటివారెల్లరకు సంతానసౌభాగ్యంబు లబ్బియుండ మొదటినుండి నాకిట్టి దౌర్భాగ్యంబె ప్రాపించె. తుదకు నీపై నాస పెట్టుకొని వచ్చినందుల కన్నియు వింతచక్కఁగా సఫలంబులయ్యె. ఇహమున నీయాశ్రితుల కీవిచ్చున దిట్లు సువ్యక్తంబయ్యె. ఇఁకఁ బరమున నీకీర్తి విస్తరింపఁజేయ నిదిగో నాపెనిమిటితో సహగమనం బొనర్పఁ బోవుచున్నదాన' నని పరిపరివిధములఁ జింతించుచు శ్రీగురుం డెదుట నున్నట్లు ధ్యానించుచుం బోవఁబోవ సంగమ స్థలంబునం జింత్యుండుం జింతితార్థప్రదుం డా సచ్చిదానందమూర్తి శ్రీమూర్తి ప్రత్యక్ష దృశ్యమానుండు కానయ్యె. ఆదేదీప్యమానాకారుం గాంచినంత నాయమ దూరాననే బత్తిమీఱ సాష్టాంగ ప్రణామంబుఁ గావించె.

అపుడా శ్రీగురుం డాయమం గని సానుగ్రహుండై 'సువాసినీ! చిరంతన సౌభాగ్యవతీభవ' యనె. ఆయాశీర్వాదం బాయమ కర్ణంబుల సోఁకినంతనే మరల సాఁగిలఁబడె. మరల గురుం 'డష్టపుత్రాభవ' యనెను. అట్లన్నంతనే యాప్రక్కనున్న జనంబులం గొందఱు తమలోఁ దాము నవ్వికొనిరి. అందొకఁ డిట్లువల్కె:

‘స్వామీ! ఈమె పెనిమిటి యిప్పుడే యీడ మరణించె. ఇంక నీయమ సువాసిని యగుటెట్లు? శవము శ్మశానవాటినున్నది. మీవెల దైవం త్వరగా నీయమ్మ మఱలి సమాగమనం బొనర్పవలసియున్న’ దనెను. అదివిని గురువరులు మందహాసంబుతోఁ బల్కుచున్నారు: ‘ఏమైన నీయమ సౌభాగ్యంబు సుస్థిరంబ. ఇఁకఁ దత్పతి మృతుం డెట్లయ్యె? చూతమా శవంబు నిటుగొనిరండు. ఎప్పుడాతండు గతప్రాణుం డయ్యెనో చూచెదంగాక. ఈయమ సౌభాగ్యంబు ధ్రువం బను నావాక్కింక మృషగానేర్చునే? ప్రేత సంస్కారంబు మాని వెంటనే తెసికొనిరండు పొం’ డను గురూక్తుల కందఱుబ్బురపడి మేము మేమనుచు సకౌతుకంబుగా నాప్రేతంబుం గొనిరాఁ బరుగుబరుగున బోయిరి. ఇంతలోఁ గొందఱు ద్విజోత్తములు గురుపాదార్చనంబునకుం గడంగి రుద్రాభిషేకం బొనర్చుచుండిరి. శవంబు నానీతం బయ్యె. తద్బంధంబులు సడలించి యుపరివసనంబుం దొలఁగింపించి నిజపాదోదకంబు నందా పాదమస్తకంబుగాఁ బ్రోక్షించి సుధామయదృష్టి వీక్షించె. అహో! ఏమిచోద్యమ్మిది? చూచువారెల్ల విస్మయంబంద నామృతకళేబరంబునఁ జైతన్యం బొడమె. ఇంతలో దత్తాత్రేయుండు లేచి కూర్చుండె. ముండి మొలలో నుంటినేయని యాతండు సిగ్గునొంది వట్లగబడు నంతలో నాతనిసతి వసనంబొసంగ. అతఁడద్దానిని ధరించి యపుడు సావిత్రిని దనదగ్గఱకుఁ బిలిచి యిట్లడిగెను: ‘ప్రేయసీ! నీవు నన్నుంగొని వచ్చిన దేయెడకు? ఈయతివరు లెవ్వరు? నేనింత గాఢనిద్రఁ జెంద నన్ను లేపవైతివే’ యని యడిగెను. అందులకు స్మితాననయగు సావిత్రి యానంద బాష్పంబులొలుక జరిగినదెల్ల నిజేశునికి నివేదించి తమపాలిటి పరమేశ్వరుం డాప్రాణదాత శ్రీగురూత్తముం డని తెలిపె.

అంత నాదంపతులు నేలకువ్రాలి తద్గురుపాద ద్వంద్వం బంటి సంతోషము పొంగి పొరల నానంద బాష్ప ప్రవాహంబులం బాద్యంబిడి యిట్టుల సంస్తుతించిరి;

పంచ. పరాత్పరా! జగద్గురూ! కృపాబ్ధి! భక్తకల్పకా!
శరణ్యమూర్తి! జ్ఞానపూర్తి! సాధులోకపాలకా!
సరాజివాశ్రి కార్తికేంబి నాకపాణి నీవకా
పరాకృతీ! హరీ! విరించి! నారసింహ నామకా!
భుజంగ. జగంబెల్ల నీలీల సచ్చిన్మయంతా!
దిగంతస్తుతానంత! దివ్య ప్రకాంతా!
దిగుల్బాయఁ జేయుమ్ము దేద్య ప్రపూతా!
యుగున్నష్టమార్గమ్ము మర్థ ప్రదాతా!
తే. పాపులము పాపమునఁ బుట్టి పాపమునటి
చేసి దుఃఖాలఁబడి మఱి చితిమి మిమ్ము
జీవులందఱఁ బ్రోచెడి శివుఁడ నీవె
దిక్కుమాకెత్తి సైరింపు మొక్కెదమిదె.

ఇట్లు భయభక్తి వినయసంభ్రమంబులు పెనంగొన నాదంపతులు తమ యొగ్గులుడిపి లగ్గులొనగూర్చిన యగ్గురూత్తము నెంతయు నగ్గించుం దనిసి ప్రసన్నుండైన యతండు వారి నాశ్వాసించి యిట్లనుగ్రహించె: 'బిడ్డలారా! శ్రీమంతుల నాయుష్మంతుల నష్టపుత్త్రులం గాంచెదరు గావుత. మీ పురాకృత దుష్కృతంబు లెల్లం దీఱె. మీ దేహములు పవిత్రములైనవి. ఐహిక సుఖంబు లెల్ల ననుభవించిన మీఁదట ముక్తిం గనెదరుగాత. మత్ప్రసాదంబునం జతుర్విధ పురుషార్థంబులుం జేకూరెడిని. నిశ్శంకంబుగా నింక నింటికి మఱలుం డనవుడుఁ దత్ప్రసాదోక్తు లాకర్ణించిన లోకులు జయజయ ధ్వానంబుల న్సల్పిరి. ఎల్లరు నామహానీయునికిఁ బ్రణతులర్పించి భక్తిమీఱ నీరాజనంబిడి గురువరు సంతుష్టిఁ గొల్పిరి.

అందొక్క భక్తిహీన దుర్ధీయుండిట్లనె: 'అయ్యా! నాకొక సందేహము కలుగుచున్నది. నా మాటకు సమాధానము చెప్పండి. లలాట లిఖిత రేఖలం దుడువ నేరికిం గాదని కాదా వేదశాస్త్ర పురాణాదులం జెప్పెదరు. ఈ విప్రకుమారుఁడు ముందు మరణింప

వారము. బ్రహ్మలిపి సత్యమేని మరల నెట్లు జీవింపఁగలిగెనో తెలు
పవలయు' ననియడిగె.

గురుండా మొలకు పలుకులకు నవ్వి యిట్లు బదులిడె: బాఁపఁడా! వినుమో యీ యాతనికి బమ్మ యీ జన్మమునఁ ద్విదశవరిమితాయువును ముందుభవమున శతాయువు నేర్పఱచె. నేను భక్తహితార్థ మది ముందు వెనుకలుగా మార్చి యిందు శతాయువిచ్చి పిదపఁ ద్విదశత్వ మొసంగితిం గాని విధివ్రాలు సత్యంబుగాకే' మని బోధించె. వాఁడు నిరుత్తరుండయ్యె. అందుల కచ్చెరువడి యెవరి యిండ్లకు వారేగిరి. ఆనృసింహమూర్తి కీర్తి నాఁటి నుండి పెచ్చుపెరిఁగి దశదిశల వ్యాపించెను.

సావిత్రి దత్తాత్రేయు లుప్పొంగి భీమామరజాసంగమంబున స్నానింగి నారసింహులం గొల్చి వేదవిప్రులకు భూరిదక్షిణ లిచ్చి యంపివేసిరి. అర్కుఁడపు దస్త్రాద్రిం జేరుచుండె. ఆదంపతుల వెంటఁగొని శ్రీగురుండు నిజమఠంబునకుం జేరెనని యపూర్వ మహిమాభిరామంబగు నీగురు చరిత్రామృతంబు సిద్ధవరుండు నామధారక కర్ణపేయంబుఁ గావించె.

### కర్మకాండము — ౯ వ దళము.

సిద్ధవద లగ్నుండైన నామధారకుండు బత్తిమీఱ నాతని నిట్లడిగె: 'ఓయతీ మౌనిశేఖరా! సావిత్రిదత్త సహితుం డా గురూత్తముండు నిజమఠంబునం జేరిన వెనుకనే మాయె సెలవీయ వేఁడెద' నని వేఁడె. అంత సిద్ధుండిట్లు చెప్పందొడంగె: 'శిష్యా! వినుము. వారా నాఁడట విశ్రమించి మఱునట వఱువాత లేచి స్నాతులై గురున కెఱఁగిరి. అపుడు సావిత్రి చేతులు కట్టుకొని యాతని నిట్లడిగె: దేవా! నిన్న నేను శోకించుతఱి నెవ్వరో యతివ్రవరులు నన్ను డాయవచ్చి పెక్కుధర్మంబు లుగ్గడించి నా చేతికి రుద్రాక్షలొసఁగి యనుష్ఠేయం బుపదేశించి పోయిరి. వారికి మేము కృతజ్ఞతాభివందనము లర్పింపవలయును. వారెవ్వరో వారి నేమొట సందర్శింపఁ గల్గుదుమో దయచేసి సెలవీయఁగోరెద' ననినంత

శ్రీగురుండు లేనవ్వుమోమున దీపింప నిట్లు బదులువలికె: ‹బిడ్డా! నీభక్తిభావంబుఁ దెలియ మాఱురూపమున నీకగపడి యవియడిగిన వాఁడనేన. రుద్రాక్షలొసంగ నేమిటి కందేని తన్మహిమం బుభయసిద్ధిదము. మీరు నాభక్తుల దాటం జెప్పెదవినుఁడు.

ఎట్టి నీచుండైనను రుద్రాక్ష మహిమంబుఁ బాటించికాని పాటింపకయకాని ధరించునేని దోసఁగులెవ్వియు వాని నంటవు. తద్ధారణ మాత్రంబమిత పుణ్యసంపాదకం బౌననునది శ్రుతిస్మృతి పురాణ విహితము. సహస్రాక్షధారి సాక్షాద్రుద్రుండ సుండీ. ఇఁక నన్ని దొరకమి బాహువులం బదాఱేసియు సికలో నొక టియుం జేతుల నిరువదినాల్గేసియుఁ గళంబున ముప్పదిరెండు న్నాత్రి న్నలువదియుఁ జెవులం బంద్రెండేసియుఁ గన్నుల నొక్క టొక్కటియు వక్షంబున నష్టోత్తరశతంబును ధరించువాఁడు రుద్ర పుత్ర సమానుం డనంజెల్లు. ఇఁకఁ బగడాలుం బటికములుం జేరిచి బంగారముతోఁ జుట్టిన యక్షమాల ధరించువారి పుణ్యం బమితంబై వారికి రుద్రలోకంబు చేకుఱు. రుద్రాక్షమాలికతో జపంబు సలిపిన నంతఫలంబగు. పెక్కేల? రుద్రాక్ష భస్మపుండ్ర వర్జితుని జనియే వ్యర్థము. మస్తకంబునం గంఠంబునం గర్ణంబు లందును రుద్రాక్షలు ధరించి స్నానంబుఁ గావించువారికి గంగా స్నాన ఫలంబబ్బెడిని. ఏకాదశ రుద్ర పారాయణం బొనరించుచు రుద్రాక్షాభిషేచనం బొనరించిన లింగార్చన ఫలంబుదక్కు. మఱియు నీరుదరాక్షలం దేకముఖ భవాపహారకము. పంచముఖయు నేకాదశాదిముఖులును గ్రాహ్యంబులే. దొరకినంతవఱకు భక్తితో గ్రహించి ధరించినఁ జతుర్విధ ఫలదాయకము లయ్యెడిని. ఇందు లకుం బాపాపహారకం బొకపూర్వగాథ కలదు.

మున్ను కాశ్మీరంబున భద్రసేనాఖ్యుం డొక భూపాలకుం డుండె. ఆతనిమంత్రి సుధర్మకుఁడు. మఱియు నాతనికి లసద్గుణ నిలయు లిరువురు సత్పుత్రులునుండిరి. వారిర్వు రన్యోన్యప్రేమ మీఱ నాటపాటలం జదువుసందెల నభివృద్ధిఁ గనుచుండిరి. వారు

భస్మరేఖాలిప్త లలాటులు నక్షమాలా భూషితాంగులు నయి యనుదినము శ్రద్ధాభక్తులతో శివారాధనముఁ గావించి మఱి భుజించువారు. రత్నఖచిత స్వర్ణభూషణములనే న్నాటింపక రుద్రాక్షపేరులనే వారల్లెడ ధరించుచుండిరి. మఱియు వారితలిదండ్రులును దగ్గఱచుట్టాలుం బెట్టిన నగలనెల్ల నిరుపమాగ్యలనువలెఁ ద్రోసివేయుచుండెడివారు. అప్పుడొక నాఁడా విరించియే సాక్షాత్కరించెనో యనఁ బరాశరమహర్షి భద్రసేనాస్థానంబున కేగుదెంచె. అతఁడు ససంభ్రమంబుగ వారికర్ఘ్యపాద్యాది విధులు నడపి యుచితాసనోపవిష్టులం గావించి సేదఁదేర్చి తాను బద్ధాంజలియై స్తుతించి భక్తితోఁ బ్రణమిల్లి వారినీరీతిని బ్రశ్నించెను: స్వామీ! నాపాలిటి ప్రత్యక్షదైవతములరై దయచేసితిరి. నామనమునఁగల వ్యాకులము మనవిసేయుదు. ఏమన నాకిరువురు పుత్త్రులు గలరు. వారేలకో యెప్పుడును పిశాచములట్లు రుద్రాక్షపేరు లిన్ని వేసికొని తిరుగుచుందురు. అమూల్య రత్నఖచిత వివిధాభరణంబుల నుదరికి రానీయరు. వీరలకిట్లు బుద్ధిరాఁగలదో వీండ్రి యభిప్రాయం బేమిదో నాయెడ ననుగ్రహించి నాకు బోధింపఁగోరెద. త్రికాలజ్ఞులకు మీకెఱుకలేని విషయ ముండదు. కాన మీవల్లఁ దెలియఁ గోరువాఁడ నైనను.

అదివిని యమ్మునిశేఖరుం డాతనికిట్లు బోధింపఁ దొడంగెను. భూజానీ! వీరల పూర్వజన్మవృత్తంబు విస్మయజనకంబు. అదినుడివెద. ముందు వినుము. దాన వీరలిట్లాటకుం గతంబీవ తెలియఁగలవు. మున్ను నందిగ్రామంబున రూపలావణ్య రంజితయౌ వారవనిత యొకతె యుండెను. ఆయువతి రతిప్రతిమాన సౌందర్యవతియై ప్రకాశించుచుండె. ఆవెలయాలు వెలలేని నగలం దులలేని పట్టంబులను ధరించుచుండె. తద్గృహంబెల్ల హేమమయంబును దత్పర్యంకంబు రత్నఖచితంబునై విరాజిల్లుచుండె. ఇఁక గోమహిష్యశ్వాది పశుసంపదకేమి ధనధాన్య సంపత్తికేమి దాసదాసీజనంబులకేమి మితిలేకయుండె. ఇట్లు సకలోక

భోగంబు లింపొందఁ బురందరుం డిందుపఱచు చందంబు నొందిన యామందయాన గానములపొందికచే మఱింత వన్నె కెక్కు. తాను స్వైరిణిగాక పెద్దలవల్ల సకలధర్మంబులరసి సన్మార్గంబున న్మెలంగుచుండె. తన్నారి సూరివర్యుల కవ్వారిగా నన్నవస్త్ర ద్రవ్యాది దానంబు లొనరించి పేర్మిఁగాంచె. ఆవేశ్యాంగన బహుభూషణ భూషితాంగియై నిజగృహాంగణస్థిత రత్నఖచిత మంటపంబున సఖీజన సహితముగ నిత్యంబు నృత్యంబు సలుపుచుండెడిది. అచ్చోట నృత్యకళా శిక్షితములు కుక్కుట మర్కటము లొకరెం డిరు పార్శ్వములందు రుద్రాక్ష పేరులతో నలంకరింపఁబడి వినోదము కొఱకయి కట్టఁబడి యుండెడివి. అట్టియెడ నొకచిత్రకథ జరిగె. చెప్పెదవినుము. ఒకనాఁడొక వైశ్యకులజాతుండు మహాధనికుండు శివవ్రతి యట కేగుదెంచె. ఆతం డతిశాంతుఁడు భస్మలిప్తాంగుండు నయియుండెను. తన్మణిమయ కంకణాంకిత కరకమలంబున నధఃకృత భాస్కర బింబప్రభం బొకరత్నలింగంబు కాంతులఁ గ్రక్కుచుండె. ఈవార వనితామణి హృదయంబు తన్మణిమయ లింగాకర్షితంబు కానయ్యె. తత్కాంతి పటలంబున కబ్బురపడి నదై తన మనసు కలిసిన యొక సఖియం బిలిచి నిజమనోగతంబుఁ దెలిపె. అంత వారు శివవ్రతిని గృహాభ్యంతరంబునకుం గొంపోయి రత్నమండపంబునఁ గూర్చుండఁ జేసిరి. ఆచెలికత్తె యాతనికిట్లను: 'అయ్యా! మీచేతనున్న లింగము కడురమణీయముగ నున్నది. దానిమూల్యమెంత యుండెడినో! ఆహా! కాంతారత్నముమనం బదికన నమోమయంబై రత్నకాంతాకర్షితం బైపోవుచున్నదే. ఏమి మీభాగ్య!' మనెను. అందులకుం బ్రతివ్రతి యిట్లను:

చ. కరము మురుసంపదున్నతి ము ♦ ఖద్యుతి నిర్జిత పూర్ణయామినీ
కరము మనోహరం బమిత ♦ కామితదాయిని వారకామినీ
కరము శివవ్రతి స్తనుపఁ ♦ గల్గినమూల్య మమూల్య సత్ప్రభా
కర ముకుటాయమానము జ ♦ గన్నుతకీర్తి లింగమూర్తికిన్.

అనవుడుఁ దత్కారగ్రహణం బానట్లు సాభిప్రాయ వాక్యంబు లేర్పడ. ఆపైన నాతఁ డావధూమణి త్రిదినమాత్రం బేని వ్రతి మాత్రవ్రతమై యుండఁగోరి యంగీకారంబుఁ బడసి యిట్లను:

క. కులవృత్తిని బుంశ్చలులా
వెలయాండ్రకు నెందు ధర్మ । విహితాచరణం
బులు కర్మంబులు కర్మం
బులు సత్యనిరతియు నొప్పుఁ । బోలున తలఁపఁగా॥

అని ముదిరుం దన్నంతనే యన్నెలంత యను: 'మంతనంబున మీకింతయు నాయెడ సందియంబు వలదు. త్రికరణ శుద్ధిగా మీసతినై పాతివ్రత్యంబు నెఱపుదాన' ననుచుఁ దత్కారాంచిత లింగోత్తమంబున న్నిజకరం బూంచి సూర్యచంద్రులు సాక్షులుగా బాసచేసె.

అపుడా వైశ్యరసికోత్తముండు నిజప్రకోష్ఠోపరి మణిమయ కంకణంబుం దీసి తత్ప్రియాంగన చేతనలంకరించి లింగంబొసంగుచు నిట్టులానవెట్టె: 'ప్రేయసీ! ఇది నాప్రాణతుల్యముగాఁ జూచుకొనువాఁడను. జాగ్రత్త. దీనికెట్టి ముప్పుముగల్గిన నప్పుడనే నురివోసికొందు' ననవిని యావనితామణియుఁ దాన దానిని బ్రాణపదమున నుంచికొని పూజించుదాన నని నిస్సంశయముగాఁ బలికె. అంత నావ్రతి యద్దానికి మైల సోఁకకుండ శుచిస్థానంబున ముందుంచి రమ్మన్న నే వల్లెయని యాయింతి తన్మంటపాంతర రత్నస్తంభంబున నాలింగంబుంచి యాభుజంగు నంతిపురంబునకుం గొంపోయె. అంతలో నొకవింత జరిగె.

అహో! యేమిచిత్రము! క్షణమాత్రంబున నానాట్య మండపంబు భగ్గున మండి యంతయు భస్మమైపోయె. అందా రుద్రాక్షల కోఁతియుం గోడియుం దప్పించుకొని పోవలేక ముప్పొనొందెను. వాడవాడల వారెల్ల నాడకుంజేరి యగ్గిచల్లారఁ జేయుచుండిరి. వేశ్య విభ్రాంతిఁగొని మూర్ఛిల్లె. వైశ్యుండు 'నాప్రాణ

లింగము పోయెనే! అయ్యో! నేనెట్లు బ్రతుకుదు' నని యేడ్చుచు నీవలికి వచ్చి యగ్గి రగిల్చి యందుఁజొచ్చె. లోకు లిదేమని యందులకే యచ్చెరువడు చుండిరి. ఇంతలో నవ్వారకాంత లేచి యది కని తన నత్తిని బాదుకొనుచు హాహాకారంబులు సేయుచు, 'నాథా' మిమ్ముఁ జంపితినా? లింగంబు భంగం బయ్యెఁగా. అయ్యో! ప్రాణేశు విడిచి క్షణమాత్ర ముండఁదగునా! ఇదిగో, సహగమనం బొనరించుదాన' నని యందులకుం దలపడె. సతీధర్మంబున భర్త్రనుగమనముఁ గావించెదనను నాయువతి పూనిక కబ్బురపాటున నటఁజేరినవారిలోని తద్బంధుప్రముఖులిట్లు మతిమరల్పఁ బూనిరి: 'బాలా! యింత ముగ్ధత్వమేల? ఇది యెక్కడిధర్మము? వీఁడెవ్వఁడు? నీకేమి వెఱ్ఱియా? మనయిండ్లకు రోజురో జెందఱెందఱు వచ్చుచుందురు? నీకీచచ్చినవాఁడే పతియనికొనేల? ఎక్కడివైశ్యుఁ డేమిలింగము? చాలుఁజాలు. మన కేనాఁటిపతి యానాఁడే. కనుకనే వారాంగనల మనిపించుకొను చున్నామూరె. నీవేయొక్కనికో యిల్లాలవన్నఁ గన్నవారెల్లరు నవ్వరా?' యని పెక్కుభంగుల నొక్కుమ్మడిం జెప్పఁదొడఁగిరి. కాని యాగుణమణి యవి యణుమాత్రము పాటింపక వారిబోధ యెల్లం బెడచెవినిడి యిట్లుగ్గడించె: మీరేమైనఁ జెప్పుఁడు. నూరేండులు సాక్షులుగాఁ దత్కర గ్రహణంబుఁ గావించినదానను. అట్టివాఁడు పోవ నేనింక జీవింపనేర్తునే? వేదశాస్త్ర సమ్మతంబగు పాతివ్రత్య ధర్మంబు నెఱపి తీఱవలయు. భర్తృ సహగమనంబునం దడుగడుగున హయమేధతుల్య మహాఫలంబు గల్గుఁగాదే. అట్లొనరింపఁ జాలుసతి తనతలదండ్రిలం దద్భర్తృ సంబంధికు లిరువదియొక్కతరములవారిం దాఁ దరింపఁజేయఁ జాలెడిని. అందు నారకంబులందువారింగూడఁ దనవెంటఁగొని స్వర్గతి నందఁగలదనిక దా చెప్పెదురు. మరణమో, యేనాఁటికైనఁ దప్పనిదేయామె. అట్టియెడ నసారంబగు సంసార బంధంబున జిక్కి బ్రతుకు నిం కావించుకొనేమిటి?' కనుచు నగ్నిప్రదక్షిణముఁ గావించి నర్వ

శ్వరు సంస్మరించి సూర్యనమస్కారం బొనరించి యగ్నికిఁ బ్రదక్షిణముగాఁ దిరిగి విప్రుల సెలవంది యందుం బ్రవేశింపఁబోయెను. ఆహా! యేమిచిత్రము!

తే. అయిదుమోములు పదిచేతు ♦ లమరువాఁడు।
భస్మలిప్తాంగుఁడై నంది ♦ వాహనుండు।
సతినిగరములఁగొనియెఁ బ్ర ♦ సన్నుఁడగుచుఁ।
జప్పునడంగిపోవ వై ♦ శ్వానరుండు॥

అట్లు సాక్షాత్కరించిన నాగభూషణుం డానాగవాసము నెడఁ గృపమీఱ నిట్లనియె: "మనోజ్ఞస్వరూపిణీ! నీమనోధైర్యంబుఁ బరీక్షింప వణిగ్వేషంబున వచ్చినవాఁడను నేన. తదానీత లింగస్వరూపంబు నాయదియ. ఈనాట్య మండపంబునఁ జిచ్చుపెట్టి యుండేనచొచ్చి నీపాతివ్రత్య ధర్మానుష్ఠానంబునకు మెచ్చి యిప్పుడిట్లు బయటికి వచ్చినవాఁడనుమ్మీ. క్రిచ్చుటి నీయిచ్చ వచ్చినయది కోరుమేనిచ్చెద. చెప్పుము. నీవు కాంక్షించునది దీర్ఘాయువా? యారోగ్యమా? యైశ్వర్యమా? యే' దనవుడు నారోవెలంది యివ్విధంబున నర్థించె: "ఓహో! చంద్రకళాధరా! మహాప్రసాదము. స్వర్గమర్త్యపాతాళంబులందలి యేభోగంబులనిఁకఁగోరను. నాకీసంసారబంధం బుడిపి పునరావృత్తిరహితంబగు సాయుజ్యంబుఁ బ్రసాదింపవలయు ననుచుఁ గేల్మోడ్చె. అందులకు సానందుండగు నావ్యోమకేశుండు తద్భవబంధంబు విచ్ఛిన్నం బొనర్చి యన్నారీమణిం గ్రిన్ననఁ గైలాస నగంబునకుం గొంపోయె.

రాజా! వింటివా? అల్లనాట్యమంటపంబున సాక్షులై యగ్గిలో మ్రగ్గిన మర్కటకుక్కుటంబులే తత్పుణ్యఫలంబుగా నిపుడీ కుమారరత్నములై జన్మించిరి. పూర్వసంస్కారవశమున నే జ్ఞానసంపత్తిఁగన్న శివభక్తులైరి. పురాకృత రుద్రాక్ష ధారణంబున నే రాజతనూజాతానోజ కలిగె. తత్సంస్కారంబుననే యిప్పుడును రుద్రాక్షధారణంబిట్లు కావించుచున్నారు సుమ్మీ. వీరల

పుణ్యం బింతయంత యనఁజాల' నన్నంత నామన్నీఁడు తన్మునీంద్రునకు దోసిలియొగ్గి యింకేమేమో యడిగి తెలిసికోఁ దొడఁగె నని శ్రీగురుండాసాధ్వీమణికిఁ దెలిపె.

'నామధారకా! తదనంతర కథావిధానంబు సావధానుండవై యాకర్ణించెదవుగాత' మని సిద్ధుండు పలికె.

### కర్మకాండము — ౧౦ దళము.

నామధారకునకు సిద్ధుండిట్లు పలుకుచున్నాఁడు: 'శ్రీగురుం డాదంపతులకింక బోధించినదేమన, మునిశేఖరుం డమ్మనుజాధిపునకుఁ దత్కుమార పూర్వజన్మ చారిత్రం బెఱింగించుట రుద్రాక్ష మాహాత్మ్యంబు వేద్యంబుఁ గావించినంత నయ్యనంతాకాంతుం డత్యంత సంతుష్టాంతరంగుండై పరాశర చరణారవిందంబులకు మ్రొక్కి యాతని నిట్లుపృచ్ఛసేసె: 'స్వామీ! యీబిడ్డలు పూర్వభవమున నజ్ఞానమున నే రుద్రాక్షలు ధరించినందుల కిట్లు రాజపుత్త్రులై యుదయించి రంటిరి. ఇపుడో యందఱి శ్రద్ధాభక్తులతో ధరించుచున్నారుగదా. ఇందులకో భావిఫలంబు త్రికాలజ్ఞులరగు మీకు విదితంబకాన దయచేసి సెలవీయరే' యని వేఁడెను.

పరాశరులదివిని యించుక యోజించి నిట్టూర్పువిడిచి, 'రాజా! దుఃఖకరం బైనది నుడువనొల్ల' ననెను. భూజాని కేలొగ్గి యిట్లు మరలఁ బ్రార్థించె: 'మునీంద్రా! యెల్లందెల్లంబుఁ గావింపుఁడు. దుఃఖ ప్రతీకారంబును మీవల్ల నయ్యెడు' నన నాజడదారి యిటువచించె: 'భూపా! నీపుత్త్రుల యాయుఃపరిమితి పంద్రెండేండ్లే. తచ్ఛేషం బిఁక నేడుదినాలే. నేఁటి కెనిమిదవనాఁటఁ దత్పరిణామంబు దైవనిర్ణీతం' బనువాక్కు విన్నంతనే నేలంగూలిన యానేలయేలికయు నదికాంచి రోదనము సేయుచున్న తన్నారీమణియుం గొంతవడికిఁ దెప్పిఱి తన్మునీంద్రాంఘ్రికంజంబులంబడి 'ముప్పువాయు నుపాయంబుఁ దెల్పుమీరేది'క్కని మ్రొక్కఁదొడఁగిరి. అంతం గృపాంభోధియా నామునీంద్రుం డవ్వారి నాశ్వాసించి "భయముడిగి జగద్గురుండా సాంబసదాశివమూర్తి నారా

ఖింపఁ డాతండ శరణ్యుండు. సాధారణముగాఁ గాలగతిమార్ప నేరికిం గానిదైనను దానిని జయించునుపాయం బొక్కండు లేక పోలేదు. అదెద్దియనఁ జెప్పెదవినుండు. త్రిలోకైకారాధ్యుండు సచ్చిదానందస్వరూపుండు భగవానుండు శివుండొక్కండె. ఆతండు రజోమూర్తిగ బ్రహ్మనునిర్మించి యాతనికి సృష్టిజ్ఞానోద్బోధనం బగునట్లు వేదచతుష్టయంబుం బ్రసాదించె. అందాభక్తవత్సలుండు సారభూతంబులుగాఁ గలిపిన వేదశిరంబులం దాత్మతత్త్వ సంగ్రహ ప్రతిపాదకంబు రుద్రాఖ్యం బొందుగలదు. అందలి శివ పరతత్త్వం బగ్రిగణ్యంబు. పూర్వాది ముఖద్వారంబుల వెలువడిన వేదంబులందు దక్షిణముఖోదిత యజుశ్శాఖాంతర్గతం బీరుద్రాధ్యాయంబు. అయ్యది యామ్నాయంబులతోడ మరీచ్యాదులు దేవర్షులకును దద్ద్వారమున మునివరులకును దచ్ఛాత్రులకును గ్రమముగా నధ్యాపితంబయ్యె. ఇట్లు లోకంబున రుద్రంబు ప్రవృత్తంబయి శీఘ్రసిద్ధిప్రదంబుం జతుర్వర్గ సంధాయకంబును సర్వాఘహారకంబును బరమపద ప్రదంబునై యొప్పుచుండెంగా. మఱియు విధాతృనిర్మితం బద్భుత ఫలదంబు రుద్రతీర్థంబునుంగలదు. తజ్జలంబుల స్నాతులౌవారు పూతులయ్యెదరు. అందుస్నానింగి శ్రీగురూదిత విధానంబునం బ్రవర్తించిన దుష్కర్మనాశంబయి మోక్షంబు లభించెడి.

పురాకృతంబులై బీజభూతంబులైన సుకృత దుష్కృతంబుల ననుసరించిన ఫలానుభూతి జగంబున జనంబుల కొచుండుం గదా. మున్ను సృష్టిప్రవృత్తికై నిజవక్షస్థలంబునుండి ధర్మంబును బృష్ఠభాగంబున నధర్మంబున్నిర్మించినవాఁడయ్యె. అందు ధర్మమును ననుసరించువారి కిహపరంబుల సౌఖ్యమబ్బెడి. అధర్మానుసారులిందునందుఁ గుందునొందుదురు. కామాదిషట్కము తత్ప్రత్రివర్గమ వారు పరులకు నరకప్రాపకు లగుచుందురు. గురుతల్పగమనాది జారకర్మంబులం దవిలెడువారు కామసంతతి. మాతృపుత్రీ విప్రహంతకులు క్రోధసముద్భూతులు. పరధన

కనకాపహారులుం గన్యావిక్రేతలు మున్నగువారు లోభసంజాతులు. ఈకామక్రోధాదులకుం బరేతరాజు మున్ను తానిట్లు లానబెట్టె: ‘ఓరోరీ! మీరు భూలోకంబునకుం జని యందలిజనులను వశపఱచికొని మీమీగానంబులం గలుపుఁడు. మీకుఁ దోడుగాఁ బాపోపహాక భృత్యానీకంబుం గొనిపొం'డని ప్రోత్సహించి యవనికి డించె. వారట్లు కావింతుమని ధారుణినిడిగ్గి యట రుద్రజపంబు శ్రుతిపుట గోచరంబైనంతనే వెఱఁగంది పిఱుతివిసి మఱలి ద్రుతగతిం గృతాంతుసన్నిధి కరిగి యిట్టుల మొఱ్ఱవెట్టఁ జొచ్చిరి: ‘ధర్మరాజా! యేలినవారి సెలవంది యీనేలకేగి యట రుద్రాగ్నిలో భస్మమైపోకుండ నెట్టులో ప్రాణాలుదక్కి యీవలఁ బడితిమి. ఇఁకమే మాచాయలకుఁ బోలేము. ముందుమాగతి నిరూపింప వేఁడుచున్నారము. స్వామీ! మీకిదె నమస్కారము. ఏగ్రామంబున రుద్రజపంబు జరుగుచుండు నాయూరివంకఁ జూడనైన మాకలవిగాదు. జీవనదీతీరంబులందుం బుణ్యక్షేత్రంబులందును దేవళంబులందుంగూడ మాకింత సందు దొరకకపోదు. కాని రుద్రజపంబు సలుపువారి దరికేనిఁ జేరఁజాలము. ప్రాయశ్చిత్త సహాస్రంబులం దొలంగని దోసంగులు దానవడంగును. జన్మమెత్తిన వెనుక నేయొక్కమాఱైన రుద్రపఠనంబుఁ గావించువాఁడు ఘోరపాపంబులెల్ల వడంగి పుణ్యవంతుం డయ్యెడినే. అట్టి రుద్రపఠితలకంచల మేమిల సంచరించుటెట్లు? రుద్రమహాత్త్వంబు మాపాలిటఁ గాలకూటవిషతుల్యంబుగా నున్నది. తచ్ఛాంతిఁ గావించి మమ్ము రక్షింపుఁ'డని పెద్దపెట్టున మొఱ్ఱవెట్టిన నాప్రొద్దుచూలి యించుక తలపంకించి యూహించి దరికేగి సవినయంబుగా నిట్లు మనవి యొనరించె: ‘ఓహో, చతురాననా! మీసన్నిధికిం బ్రపన్నుండనై వచ్చినవాఁడను. మీసెలవుప్రకారము పాపాత్ములనాయానారకంబుల నందించు చుండుంగదా. వారిం గొనితెమ్మని నాభృత్యుల నంపఁగా రుద్రాధ్యాయంబువల్లఁ బరాభూతులై వచ్చినారఁట. ఎంతటిపాతకం బొనరించినవాఁడును రుద్రపూతుండై

స్వర్లోకానీతుం డౌచున్నాఁడు. దాన నరకంబులెల్ల శూన్యంబు లైనవి. ఇఁక నారాజ్యంబు నిరర్థకంబుగాఁ దోఁచుచున్నది. ఎల్లరుఁ గైవల్యంబు నందెదరేని ముందు మీసృష్టిరచనంబు సాగుటెట్లు? నరులింకలోఁగుటెట్లు? ఇట్టి రుద్రనిధానం బామర్త్యులకుం బ్రసాదించితేమిటికి? ప్రతిమర్త్యుండు నేమాత్రమో రుద్రానుష్ఠానంబుఁ గావించి యమర్త్యుండు గాకుండెడినే? దానఁ బాపమను నదే మృగ్యమయి పోవుచున్నదే' యని పితృపతి యార్తిం దెల్పఁ బితామహుండించుక యోజించి యిట్లనియె: 'దండధరా! దుర్మదులుం దామసులు న్భక్తివిహీనులు నౌవార లెవ్వరున్న వారినే దండింపవలయుంగాని మఱొండుగాదు. భక్తితోఁ గూర్చుండి రుద్రపారాయణం బొనరించు పుణ్యాత్ముల తెరువున కెన్నఁడుం బోఁ దగదని నీ దూతలకు రూఢిగా బోధింపుము. అల్పాయువులౌవారు రుద్రజపంబువల్లఁ బురాకృత దుష్కృత నిష్కృతిఁ గావించికొని సౌఖ్యంబు నందఁగల్గుదురు. పెక్కేల? ఎట్టిపాపాత్ములైనను భక్తితోఁ దజ్జపంబు సల్పినంతనే దీర్ఘాయువు రారోగ్యైశ్వర్యాహ్లాదంబు లొదవి జ్ఞానతేజోవర్చో బలసంపత్తులు పెంపొందెడి. రుద్రాభిషిక్తతీర్థస్నానంబునఁ బావనత్వంబు చేకుఱు. రుద్రాభిమంత్రిత జలస్నాతుం గనిన నీవు భీతుండవౌదు వనుట నిక్కువంబు. శతరుద్రీయార్చనంబున శతాయువబ్బెడి. అట్టి మహాభక్తులు ముక్తులని నీసేవకుల కెఱింగించి వారలు జాగరూకులై మెలంగునట్లు లానవెట్టు' మని శమనునకుఁ దెల్పి యాతని ధాత శమింపఁజేసి యంపివైచెను. అంత నానమవర్తియు నట్ల నిజదూతల కాదేశించె.

రాజా! నీకొమరుల కిఁక నాయుర్వృద్ధి యౌట కిదె యుపాయంబుఁ దెల్పుచున్నాఁడను. భక్తితో శివుని రుద్రయుత క్షీరధారాభిషేకంబుఁ గావింపుము. దాన నీపుత్త్రులు ప్రవృద్ధాయువులై పదివేల యేండ్లీధాత్రితలంబున సుస్థిరులై దేవేంద్ర తుల్యంబుగాఁ బరిపాలింపఁ గలుగుదురు. ఏనాఁటికి నట్టివారి సంపదలు

నశింపవు. కావునఁ గ్రోధ లోభ వర్జితులును జ్ఞాన నిష్ఠులును స్వధర్మనిరతులు నగు విద్వద్విప్రుల రావించి సంభారముల సేకరించి విధివిహితంబుగా రుద్రాభిషేకంబుఁ గావింపఁజేయు' మని ముని యనియె. ఆబోధశిరమున వహించి నరపాలుండు వెనువెంటనే శతకలశంబులతోడ నఖండేక్షురసధార యేరుపడఁగా శివాభిషేకం బొనర్పించినవాఁడయ్యె. అంతం దదభిషిక్తజలంబున నిజపుత్త్రిల స్నాతులఁ గావించుచు నీశ్వరారాధనంబుతోడ నేడు దినాలుకడపెను. కడపటిదినమున సాయంతనవేళను వారుభయులు మూర్ఛితులై నేలంగూలిరి. అపుడు వారి నీడ్చుకొనిపోవ నదృశ్యరూపంబులతోడ యమదూతలు సమాగతులై పాశంబుల సంధించుచుండిరి. ఆ సమయంబున రుద్రజాపకు లాకుమార ద్వితయంబుపై మంత్రాక్షతలం జల్లిరి. వెనువెంటనె వచ్చి యట వ్రాలిన శివదూతలం బొడఁగనినంతనే యాదండహస్తులు పలాయితులయిరి. వారిం బ్రమథగణంబులు తఱుముచు వెంబడించిరి. ఇట్లా రాజకుమారులు శ్రుతిమంత్రరక్షితులయిరి. వేదవిప్రులాశీస్సులఁబల్కిరి. రాజపుత్త్రిలు స్థిరమనస్సులనొప్పిరి. ఆ భూజానియు నానందపూర్ణచేతస్కుండయి మహోత్సవంబుఁ బ్రవర్తిల్లఁ జేసె. అంతా భూజానిపురందరుం డామహాని సింధురు ముందుగఁ బూజించి యా[illegible]ట ధరణీసురుల భోజనతాంబూల భూరిదక్షిణాదికంబులందన్పెను. పిదప నాపరాశరుల సింహాసనోపవిష్టులం గావించి యితరులు యథోచితాసనాసీనులు కాఁగా తేఁదుందానుపవిష్టుండై యుండ నయ్యెడను నారదుం డేగుదెంచె. భూపతి ససంభ్రమంబుగ లేచి యెదురేగి యర్ఘ్యపాద్యాది విధుల నెఱపి యాతని కేలఁగొని స్వాగతంబిడి సుఖాసనోపవిష్టుంగావించి మెల్లఁగ నిట్టులడిగెను. 'ఓ మహా దేవర్షి శేఖరా! యీరలు త్రిలోకసంచారులరుగదా. తామందందెఱింగిన యపూర్వ విషయంబుల మాకు బోధింపరే' యని వేఁడిన నవ్విధాత్మ మనస్సంభవుండు పల్కు: 'రాజేంద్రా!

నేనిప్పుడు కైలాసమునుండి రాక త్రోవలో నేఁ జూచినదిది. యమదూతలు నీకొమరులఁ గొనిపోవచ్చి శివదూతలవల్లఁ బరాభూతులై నిజాధిపుం జేరి జరిగినదెల్ల మొఱ్ఱవెట్టికోఁగా నందులకుం గుపితుండౌ యముండు తత్క్షణంబున వీరభద్రుఁ డాయఁబోయి యాతనితో నిట్లనియె: 'భవసంభవా! పురాకృత కర్మవశమున గతాయువులౌ రాజతనూభవులం గొని తెచ్చుటకయి పోయిన మా సేవకులను మీ దూతలు పరిమార్ప రానేమిటికయ్యా?' యనవుడు నందులకుం గుపితుండౌ భద్రుండిట్లు ప్రత్యుత్తరంబిడెను: 'అంతకా! చాలుఁ జాలు. అయుతాయువులౌ వారిపొంతకు మీవారి నంపుటయుం బైఁగ నదివారించిన మావారి నంచుటయునా? చిత్రగుప్తులవల్ల సరిగాఁ దెలిసికోక దూతలనంపఁదగునా?' యని మందలించె. అంత నా పితృపతి యా వివర మారయఁబోయెను. చిత్రగుప్తుండు పట్టలిఖితంబు నదివె. అందు వారికిఁ బండ్రెండవయేట నపమృత్యుభయంబు మాత్రమె యుదవి యది దాఁటిన వెనుక నయుతాబ్ద పరిమితాయువుండెడినని యచ్చో లిఖింపఁబడి యుండెను. అది కని వెఱఁగువడిన యాపరేతరాజు వీరభద్రుని దెసకుఁ దిరిగి కేల్మోడ్చి తన యపరాధంబును సైరింపఁ బ్రార్థించియరిగె. నేనిపుడిదెల్ల నా కన్నులారఁ జూచివచ్చితి. పరాశరులవల్ల బోధితుండవై రుద్రానుష్ఠానంబుఁ గావించుట నీపుత్త్రులు మిత్తిన త్తిని మొత్తఁజాలి'రని తెలిపి నారదుండు వెనువెంటనే యచ్చటువాసె. అంతం బరాశరుండును ఱేనిం బుత్త్రుల దీవించి నిజాశ్రమంబునకుం బోయెను. రుద్రమహిమం బిట్టిది. కావునఁ దత్పఠనం బొనరించుచు మృత్యుంజయారాధనంబుఁ గావించువాఁడు జితమృత్యుండయ్యెడి'నని శ్రీగురుం డాదంపతులకు రుద్రమాహాత్మ్యంబు సవిస్తరంబుగా బోధించె. శ్రీగురుమూర్తికి రుద్రాధ్యాయంబునం దమిత ప్రీతి యని యెఱుంగునది. నామధారకా! రుద్రాభిషేక పూర్వకం

బుగా నిత్యంబు శ్రీగుర్వారాధనంబుఁ గావింపుమోయీ' యని
సిద్ధుండుద్బోధించెను.

కర్మకాండము — ౧౧ దళము.

నామధారకుండు ప్రణతుండై యిట్లనుః 'సిద్ధమునీంద్రా! శ్రీగురూక్తరుద్రమహాత్త్వం బెఱింగించితిరి. మఱి గురుకథాక్రమంబున నవ్వలి వృత్తంబు వినఁగుతూహలపడువాఁడ'ననఁగా సిద్ధుండు నుడివెడిః 'నాయనా! చెప్పెద వినుము. ఆ పతివ్రతామణియగు సావిత్రి గురులకు బత్తిజొత్తిల్ల మ్రొక్కి యిట్లభ్యర్థించెః 'స్వామీ! ఎల్లప్పుడు నీపాదంబులే సంస్మరించుచుండఁ దగునట్లు నాకొక మంత్రంబుపదేశింపవలయు'నన విని శ్రీగురుండిట్లు బదులిడెనుః 'అమ్మా! స్త్రీలకుఁ దమపతుల సేవించుటకంటె మోక్షసాధనంబు వేఱొండులేదు. మీకు మంత్రోపదేశంబుఁగావింపఁజనదు. మున్ను శుక్రాచార్యునకు దీన ముప్పుసంఘటిల్లె' నన విని యాయమయిట్లడిగెః 'గురూత్తమా! స్త్రీలకు మంత్రమేల యుపదేశింపరాదు? శుక్రునకొదవిన యాపదయేమి? కృపమీఱ సాకల్యంబుగాఁ దెలుపఁగోరెద'నని సవినయంబుగా నడుగుటయు గురుండు వల్కెః 'బిడ్డా! ఆ పూర్వగాథఁ జెప్పెద నాకర్ణింపుము. అది దేవాసుర యుద్ధంబునాఁటిది. అయ్యెడ వజ్రినిహత దైత్య సైన్యంబుల నసురగురుండు సంజీవనీ మంత్రోచ్చారణమాత్రంబునఁ బునరుజ్జీవితంబులఁ గావించి సంగర రంగంబున నిల్పుచుంట నెంతకాలమునకు నసురవర్గంబున కోటమివాటిల్లకుండె. ఒకనాఁడింద్రుండు శివసవిధంబున కరిగి యసురాచార్యువల్లఁ దమకౌచున్న యొగ్గును గూర్చి మొఱ్ఱవెట్టె. అందులకుం గుపితుండై పశుపతి నందీశ్వరుంబిలిచి పరుగునఁబోయి భార్గవునోటఁ గఱచికొని రమ్మని యానవెట్టె. ఆనందియు నట్లయని కుప్పించుచుంబోయి ధ్యాననిష్ఠుండై కూర్చుండి యున్నవాని నాకవింగని నోటఁగొనివచ్చి శివునెదుట డించెను. అంభోధిని గుంభసంభవునట్ల కాలకాలుండు కబళించి నిజకంఠస్థిత హాలాహలంబున సితుని భసితుంగావించు

నోయని దైత్యజాలంబునఁ గోలాహలంబొదవెను. ఏమైన నా వామదేవ్రుం డుశనగ్రసనంబొనర్చి నిజోదరంబునఁ గొంతకాలము వఱకు డాఁచియుంచె. ఒక్కెడ నాశిరస్సుదారుండు పరాకువడ నాజఠరస్థితుండు తన్మూత్రద్వారంబున నీవలికివచ్చె. అందొదవిన శుక్రసంపర్కంబునన శుక్రాభిధానుండుగానయ్యె. అపుడాతఁడు పరుగుపరుగున నిజశిష్యవారంబుం జేరి మరల మృతుల నెల్లర బ్రతికింపఁదొడంగెను. అదికని పురందరుండు చింతాకులిత మానసుండై సురాచార్యుదెసంజూచి యిట్లనియె: 'ఆర్యవర్యా! దైత్యగురుండరివర్గంబున మృతుల నెల్ల లబ్ధజీవితులఁగావించి వారిం బోరంబ్రేరేపించుచున్నాఁడు. మీరాతని మించిన బుద్ధిశాలురైయు మాకట్లు తోడ్పడకున్నారు. మీ రుపేక్షించుటలేదా? మతిమంతులరని పేర్మిఁగన్నవారలౌట ముందుగతి యాలోచించి సెలవిండు. మహానుభావులరగు మీకు మామీద సంపూర్ణానుగ్రహమున్న నాసురుఁడు గురుఁడు మమ్మేమియుం జేయఁజాలఁడు. మీరేడ? ఆ కపాలభృన్మూత్ర ద్వారోదితుండేడ?' ననుచుఁ బొగడొందిన యాధిషణుండు సంతుష్టుండయి 'పురందరా! ఉపాయంబుఁ జెప్పెద వినుము. మంత్రము షట్కర్ణగంబయినంత నద్దానిసత్త్వంబడంగు. ఇపుడెవఁడైన మానసకానిని విద్యార్థి స్వరూపమునఁ జేరనంపి యాతని పూనికకు విఘ్నముఁ గలిగింపనౌను. మా వాఁడు కచుఁడందులకుఁదగ్గవాఁడే. వాఁడు మంత్రసారంబు హరింపఁగలఁడు. సందేహములేదని బృహస్పతి వల్కి కచుంబిలిచి యిట్లాదేశించె: 'ఓరీ! నీవు విద్యార్థివేషమున శుక్రుని డాయఁబోయి యాతని యెదుట నన్నునిందించి తత్పాదసేవైక నిరతుండవై యుండుచు ట్లాతనికి నమ్మకముఁగలుగఁజేసి యెట్టులయిన నాతనివల్ల నాసంజీవనీవిద్య గ్రహించి రావలయు' నని యాజ్ఞాపించెను. అందుల కింద్రాదులామోద మగపఱచిరి.

కచుండట్లుపోయి భార్గవచరణంబులకెఱఁగి లేచి చేతులు కట్టుకొని నమ్రుండయి యాతనియెదుట నిలిచెను. అట్లు నిలిచిన

వానింగని యాతం 'డీ వెవ్వండ విట కిప్పుడు రానేమిటి'కని యడుగఁ
గచుండిట్లు మనవియొనర్చె: 'నేను విప్రకుమారుఁడను. స్వచ్ఛం
బగు భవద్యశంబు దశదిశల మ్రోఁగఁగా నాచెవుల సోఁకినందున
మీపాదసేవను విద్యాభ్యాసంబుఁ గావింప వచ్చినవాఁడను.
మీరలు భక్తచింతామణులరుగదా. ఈదీనుని మొఱాలించి పాలిం
పరే' యని సకరుణంబుగాఁ బల్కఁదొడఁగె. అపుడా చిన్నవానిం
గన్న శుక్రునికన్నకొమరిత దేవయాని వానిలావణ్యంబునకు
మురిసి తనజనకుని దరిసి కేల్మోడ్చి యివ్విధంబునం బల్కె:
'నాన్నగారూ! యీవిప్రకుమారుండు మారుంగేరుశుభాకారుండు.
మీరీతనియెడ నతిమాత్రంబగు ప్రేమఁగొని ఛాత్రునింగాఁ బరి
గ్రహింపవలయు' నని సాభిలాషంబుగా వేఁడఁజొచ్చె. కావ్యుండు
ప్రియతనయ పలుకులు త్రోసిపుచ్చుట భావ్యముకాదని యెంచి
యాకచుం బరిగ్రహించె. క్రమముగా వానిసతీర్థ్యులు వాఁడు శాత్రవ
పక్షపాతియా కపటవేషధారి యనియుఁ దానిట నేర్చిన విద్యారహ
స్యంబుల నాసురలకెఱింగించినఁ దమకుఁ జేటుమూఁడెడి ననియు
నూహించి వానింబరిమార్చుటయే కార్యంబుగా నెంచిరి. ఒకనాఁడా
గురుపుత్త్రుండీ నూతన గురువుగారికి సమిత్తులం గొని తెచ్చుటకయి
వనమున కేగెను. వారును వాని ననుసరించి వానినట మట్టుపెట్టి
నెట్టనఁ గట్టెలఁ గొనివచ్చిరి. కచుండెంతసేపటికిని రామికి వగచిన
దేవయాని తండ్రితోఁ 'గచునినెట కంపితిరి? ఇంకరాఁడయ్యెనే!
ఆతనివిడిచి నేను భుజింపనొల్ల' ననియె. అంతఁ దత్పిత దివ్యదృష్టిం
బరికించి కచుండు గతప్రాణుండయ్యెనని తెలిసికొనియెను. అపుడు
శుక్రాచార్యుఁడు సంజీవనీ మంత్రోచ్చారణం బొనర్చి కచుని లబ్ధ
జీవితుఁ గావించి రప్పించె. కొంతకాలము కడచె. వీనిమనికికి
లోలోనఁ గ్రాఁగుచుండిన యచ్చోటి రక్కసులు మరల నొక్కెడ
నక్కచునిఁ గాననసీమకనుగమించిన వారై వానినటఁ బొలియించి
నిజాచార్యునిచే లబ్ధప్రాణుండు గాకుండుటకై వానిదేహంబు భస్మీ
భూతంబుఁగావించి పలుదెసల విరియఁజిమ్మి యెవరియిండ్లకు వారు

పోయిరి. నాఁడు సంజవడినవెనుక దేవయాని తనతండ్రిగారి సన్నిధి కేగి తనప్రాణసఖుం డింక నిలుసేరఁడయ్యె నేమోయని దిగులు పడి పొగులఁజొచ్చె. ఆచార్యుండు తనబుద్ధిని సారించి దైత్య కృత్యంబు గుర్తించి రూపుమాపఁ బడినను నిజమంత్రబలంబునఁ గచుని సంప్రాప్త పూర్వాకారునిఁ గావించి రావించె. అందుల కచ్చెరువడిన యామచ్చరులా దుశ్చరితులు పాశ్చ్యముగా వానిం దుంచి బూడిదఁ గావించి పానీయంబున మిశ్రీకరించి యాచార్యు లకే సమర్పించి త్రావించి మిన్నకుండిరి. వానింగానమి దేవయాని యాక్రందించుచు 'నాతని నగవులువకున్నఁ దాను విసంబుఁగ్రోలి యసువు లుడిగెద' నని ప్రతినసేసె. అదివిని తత్పితృపాదులు యథాపూర్వంబుగ ధ్యానించిరి. కాని యాఘాతుక్రిం డెందుంగాన రాఁడయ్యె. అంత జ్ఞానదృష్టి నారించి నిజోదరగతుం గచుం గనుంగొనియె. అపుడు సుతవంకఁ జూచి 'అమ్మా! దితిజాధములు నన్ను మోసపుచ్చి వాఁడు మత్కుక్షిం జొచ్చునట్లొనరించిరి. వానినీవలికి రప్పింప నాకే ముప్పువాటిల్లునాయె. ఏమిసేయుదును? పోని'మ్మనియె. తండ్రి పల్కులు తనచెవులకు ములుకులుకాఁగా నాయాని కుమారి కన్నీరు కాల్వలుగా రోదనము సేయుచు నిట్టు లనియె: 'అయ్యో, యెంతదుర్గతి ప్రాపించె! నేనాతని చెట్టపట్టి సుఖించుచుండ మీరలు కనిపట్టి యుండుదురుగదా' యని గంపె డాస పెట్టుకొని యుంటిని. ఇట్లు నిరాశ యయిన నేనింక బ్రదుకు దెద?' నన విని తజ్జనకుం డిట్లను: 'బిడ్డా! నన్నేమి సేయుమందు వమ్మా! నాకుఁ బ్రాణాపాయము కలుగుట సహింతువా?' యన నాదుహిత యిట్లడిగెడి: 'నాన్నగారూ! ముందదెట్లు సంభవమో నాకుఁ దోఁచకున్నది. సర్వప్రాణదాతలరైన మీకేడ? మరణ భయంబేడ?' నని యచ్చెరువుదోఁపఁ బృచ్ఛసేసె. అంత సుక్కు రుం డక్కుమారి కిక్కరణి వక్కాణించె: 'ఈసంజీవని నేనుదక్క నింకొక్కం డెఱుంగఁడు. తన్మంత్రిం బారులకుపదేశింపఁ జనదు. షట్కర్ణగంబగునప్పటికిఁ గ్రమముగా మంత్రబలంబుడిందు. కావున

నీకచుని బ్రతికింపఁ బోవుట నామృతికే సుమీ' యనెను. అందుల కాకన్నియ తనకది బోధించినఁ దజ్జనకుని వెనువెంటనె మనఁ జేసెదఁగాదే యన, నాతండను: 'అమ్మా! నారీమణులకు భర్తృపాదసేవయే విధివిహితము. మంత్రజపంబు తగదు. దానంగల్గు దోసంగులు పెక్కులు. మీఁదు మిక్కిలి యుపదేష్టకు మంత్రహాని యగు'నని పలికె. అందులకుం గినిసిన తత్తనయ, 'పోనిండు. మీ మంత్రపటిమంబు దొలంగకుండ మీరు సుఖంబుండుఁడు. నేనే ప్రాణత్యాగంబుఁ గావించుదాన' ననుచు మూర్ఛిల్లి నేలకు వ్రాలె. కన్యావత్సలుండాకవి తనపట్టిం దేర్చి యూరార్చి యప్పుడు మంత్రోపదేశంబుఁ గావించి తానా కచుని మనికై జపమునలిపె. కచుండును భార్గవోదరంబును విదారించి నిర్గతుండయ్యె.

క. మృతపితసితు బ్రతికించెను
సుతమంత్రము దేవయాని ♦ నోటనన బృహ
స్పతి పుత్త్రుఁడు ముమ్మార్విని
మతిమంతుఁడు నేర్చెఁ గచుఁ ♦ డమరపతి పొంగన్.

ఇట్టుల నెట్టకేలకు నుద్దిష్టకార్యంబు సిద్ధింప సంతుష్టిఁగొన్న తచ్ఛాత్త్రుండు శుక్రాచార్యులకుఁ బాదాక్రాంతుండయి, 'అయ్యగారూ! రాత్రించరులింకిట నను మననీయరు. మీదయవల్ల విద్దెలెల్ల నేర్చితి. కోరికలు దీరె. మీరింక నాకు సెలవీయరే' యని వేఁడెను. ఆచార్యుండు తద్వినయోక్తుల కలరి సెలవొసంగె. అట్లనుజ్ఞాతుండై చనువాని నాయాని తానుత్తరీయంబుఁ జేతఁ బట్టుకొని యిట్టు లడిగె:

'క. ననువీడి పోవనాయము?
నినుఁ జేర్చినదానఁ గాన ♦ నీకిడ విద్దెల్।
జనకుల వేఁడఁగలేదే?
మనిచితినే మూడుసార్లు ♦ మనువవన్వు వడన్?'

అను సాభిప్రాయోక్తుల కభ్యస్తనయవచుండు కచుండిటుల బదులు వలికెః

తే. గురుకుమారివి కావె? సో ♦ దరివి నాకుఁ।
ప్రాణదానంబు సన్మాత ♦ వైతివమ్మ।
నట్టినిన్నేడఁ? బరిణయ ♦ మాడుటెడఁ?।
చెల్లి! పోనిమ్ము సైరింపఁ ♦ దగుదుతల్లి॥'

యనిన వానిం దనయెడఁ గృతఘ్నునిఁగా నెంచి కోపించి,

తే. కూలఁద్రోసియుదె? నాయాస ♦ కూటచిత్త।
పడ్డశ్రమమెల్ల నీకును ♦ భగ్నమగుతఁ।
చదువుచదువెల్ల మఱచిపో ♦ వుదువుగాత।
మనుచు శపియించెనా దేవ ♦ యానివాని॥

అంతట, గురుపుత్త్రుండు నిజగురుపుత్త్రికిట్లు ప్రతిశాపంబు పెట్టె.

తే. వ్యర్థముగ శాపమిడుటను ♦ బ్రాహ్మణేత।
రకరపీడితవాఁడు శు ♦ క్రప్రసూతి।
విహితమెఱిఁగియు మంత్రంబు ♦ దుహితకిడుట।
నీదుపితకింక సంజీవ ♦ నియునడంగు॥'

అని పలుకుచు క్షణమాత్రం బట నిలువక కచుండేలుసేరె. నాఁటినుండి దితిజు లగలరుమైరి. ఆతనివల్ల సిద్ధార్థసిద్ధిఁ గన్న సుపర్వాణులెల్లరు హృష్టులైరి. ఇట్లు పాత్రాపాత్రంబున సుగురుం డశాస్త్రమంత్రసారం బయోగ్యునకని యెఱింగియు నింకే బుద్ధిమంతులు మంత్రుల నింతులకుపదేశింతురు? స్త్రీలకు భర్తృసేవగాక నన్యంబు శరణ్యంబె? కాదే నేదేని వ్రతంబు తదనుమతింగార్యం' బనియె. తద్గురు బోధితార్థంబుల గ్రహించిన యా సాధ్వీమణి కేలొగ్గి యగ్గురూత్తములతో నిట్లు విన్నవించెః 'స్వామీ! మీరేమన్న నదియే మాకుఁ బ్రమాణము. భవత్పాద సేవనంబు గాక మాకింకే వ్రతము లేల? అయినను భక్తి తాత్పర్యంబు చెదరకయుండ మదికిం గుది

రిక చిక్కినదే యనుగ్రహింతురే నేమది యాచరింతు' మనుచుఁ దదంఘ్రులనంటె.

అంతం గురుండంతయు సంతసించి యాయింతికి సౌభాగ్య స్థైర్యాభివృద్ధి కరంబును దత్పతికి నృపతిత్వ సౌఖ్యప్రదంబునగు వ్రతంబొక్కండు నుడివెదననియె. గురుకృపాప్లావితు లాదంపతు లందుల కలరి యిట్లనిరి: దేవా! దేవరవారి యాజ్ఞకు బద్ధులము. గురువాక్యముల నుల్లంఘించువారికి నారకంబే సంఘటించెడిఁగాదే. కావున దయచేసి సెలవిండు. మేమట్లు కావించువార' మనుచు సాఁగిలఁబడిరి. నామధారకా! కృపాంభోధియగు శ్రీగురుండు ప్రేమ మీఱ నవ్వారికి విశ్వతారకం బొకవ్రతం బిట్లుపదేశించె: రోమ హర్షణిచే శౌనకాదులకు స్త్రీపురుషోభయాచరణీయంబుగ నొక్కటి కథితంబయ్యె. అయ్యది పావనంబు. స్వచ్ఛందమూర్తియుఁ బూర్ణానంద నిలయుండును నిరామయుండునౌ నీశుని భజించు వానికి సర్వేష్టంబు లొనగూడు. రాగియైనను విరాగియైనను దన్నె వ్వండు భజించు నవ్వానిదెసం బరమేశ్వరుండు కటాక్షంబు ప్రసరింపఁ జేసెడి. అట్టి భవప్రీతికరంబును భవాబ్ధి తారకంబు నౌనది సోమవారవ్రతంబు. అభవార్చన రూపంబభిలేష్టదం బీవ్రతం బన్నిట నుత్తమంబు. పురుషులం దెయ్యాశ్రమంబు నాశ్రయించిన వారు గాని స్త్రీల న్సుమంగలులు స్వతంత్రులునుగాని యెందు వాసరంబులఁ బవలెల్ల నుపవసించి రాత్రిభుజించి యింద్రియ నిగ్రహంబుఁ గలిగి మెలంగునది. దాననౌ ఫలంబు సుబోధం బౌటకు స్కాందోక్తం బైతిహ్యం బిటవివరింతు. సావధాన మనంబులతో నాకర్ణించునది.

ఆర్యావర్తంబున మున్ను ధార్మికవరుండు సద్ధర్మాచార శీలుండు సత్పుణ్యాత్ముండు చిత్రవర్మాఖ్యుండు రాజై యేలు చుండె. అతండు పరాక్రమము మీఱ దుశ్శాత్రవుల నడంచి సర్వ సంపత్సమృద్ధి గలిగి వెలుఁగుచుండె. అతండు సంతానార్థియై శివా

రాధనంబుఁ గావింపఁ దత్కృపాప్తిని రూపలావణ్య సంపన్నురాలౌ కాంతిమతి యొకపుత్త్రిక బ్రభవించె. అబిడ్డ జాతకవిశేషంబులం దెలియ దైవజ్ఞుల రావింప వారిట్లనిరిః 'రాజేంద్రా! యీసల్లక్షణ లక్షితాంగియౌ సుకుమారి ని సీమంతిని యనునామంబునఁ బిలుచునది.

తే. మంగళతగౌరి సత్కీర్తి ♦ గంగయునన ।
ప్రాజ్ఞతనదితి రూపశో ♦ భ దమయంతి ।
గానమునన్సరి సాధ్వీత్వ ♦ మున ననుసీత ।
శాంతినాచందు నీపట్టి ♦ కాంతిద్యుమణి ॥

ఈభాగ్యశాలిని దీర్ఘాయుష్మతియై యయుతవత్సర పరిమిత కాలంబు తన భర్తతోడ రాజ్యభోగంబు లనుభవింపఁ జాలెడి' ననిరి. శుభోదర్కంబులగు నాదైవజ్ఞుల పలుకుల కలరిన నరపతి వారిని బహూకరించి యంపె.

కొంతకాలము కడచిన వెనుక నొకానొక సాముద్రికశాస్త్రజ్ఞుండు రాజసందర్శనార్థమేగుదెంచె. అతఁడు సీమంతిని చేతంగల రేఖలం బరికించి 'యీయువ సులక్షణాన్విత యైనను బాపము! పదునాలవ యేటనే భర్తృవియోగంబుఁ గనన్నై యున్న దిసుమీ' యనెను. పిడుగువంటియానుడి చెవిం బడినంతనే యొడయఁడుకడుపు పగుల నేలంబడి మూర్ఛిల్లె. ఆజ్యోతిషికుఁ డదికని విభ్రాంతిఁగొని లేచిపోయె. అమాత్యప్రభృతు లాశ్వాసింపఁ గొంతవడికిఁ దెప్పిఱిన యాభూకాంతుండు నిట్టూర్పు విడిచి సర్వమీశ్వరాధీనము. 'తానున్నది కాకయున్న కమలజు డైన' ననికొని కాలము పుచ్చుచుండె. సీమంతిని అష్టమవర్షము ప్రవేశించె. ఆచిన్నారి పొన్నారి తల్లి యొకనాఁడు ముంగిటఁ జెలికత్తెలఁ గూడి యాడుకొనుచుండఁ దజ్జననీజనకులు కుమారీ పాణిగ్రహణంబుంగూర్చి యోజించుచు ననతికాలంబున నాముద్దుబిడ్డకు సంప్రాప్తవ్యమై యున్న వైధవ్యంబుంగూర్చి తలపోసి దుఃఖింపఁ దొడఁగిరి. వారి

మాటలు విన్న యాకన్నెమిన్నయు నెన్నరానిచింత నక్తందివం
బులు పుచ్చుచుండె. అట్టియెడ నొకనాఁడు యాజ్ఞ వల్క్య మహ
ర్షుల యిల్లాలు మైత్రేయి యను సాధ్వీమతల్లి చిత్రవర్మ హర్మ్యాం
గణంబున న్నిలిచె. సీమంతిని యాయమం గని సబహుమానంబుగ
లోనికిం గొనివచ్చి తన్నిర్మల చరణారవిందంబు లంటి యిట్టుల వేఁడఁ
దొడఁగె: 'అమ్మా! నాపాలిటి పార్వతీదేవివై దర్శనం బొసంగిన
దానవు. నాకు సౌభాగ్యస్థైర్యోపాయం బెఱింగింపవలయు. రానున్న
యాపన్నతకై నామనం బెంతయు ఖిన్నమైయున్నది సుమ్మా'
యను నాబంగారుబొమ్మ యుమ్మలికవాయ నాయమ్మ యిమ్మాడ్కిఁ
బోధించె: 'సీమంతినీకుమారీ! సోమేశ్వరారాధనంబున నారాటంబు
వాసి నీసౌభాగ్యంబు సుస్థిరంబయ్యెడు' ననియె. అదివిని యాకన్యా
మణి తత్ప్రకారం బెఱింగింపుమని వేఁడిన మైత్రేయి యిట్లు
బోధింపసాగె: 'బాలామణీ! ప్రతిసోమవారమును బరిశుభ్ర
ముగానుండి భక్తితో గౌరీశ్వరులం బూజింపవలయు. అభిషేకంబు
వల్లఁ బాపనాశంబగు. పీఠార్చనంబున సామ్రాజ్యపదము లభించు.
సుగంధ పుష్పాక్షతాద్యర్పణంబులవల్ల సౌభాగ్యసుఖంబు లబ్బె
డిని. ధూపంబువల్లసౌగంధ్యంబును దీపదానంబునఁ గాంతిమత్తయు
నైవేద్యంబువలన సకలోపభోగంబులును దాంబూల ప్రదానంబు
నం జతుర్విధపురుషార్థంబులును జేకుఱు. జపంబువల్ల నష్టైశ్వర్యం
బులును హోమంబునం గోశసంపూర్ణతయు స్తుతివల్ల సమృద్ధియు
విప్రభోజనంబున సర్వదేవతా సంతృప్తియు సమకూడెడిని. ఇట్లు
సోమవారవ్రతాచరణం బొనరించుటం బాపక్లేశభయ నాశం
బయ్యెడి' నని యుగ్గడించి యయ్యాజ్ఞవల్క్యాంగనామణి తన
త్రోవం బోయెను.

అంతటినుండి సీమంతిని యంతరంగంబున నెంతయు బత్తి
జొత్తిల్ల నత్తెఱంగున వ్రతాచరణంబునకుం గడంగె. ఆయమ
వ్రతనిష్ఠం గని తత్పితరులుం బొంగిరి. వెండియు భూమండలాధిపుం

జేసి యొప్పుండిన వ్వివాహయోగ్య వయస్కుఁడౌ తనకొమరుని నర్హానరవరు నరసి పరిణయంబు నేయుట కర్తవ్యంబుగా నిరూపించికొని రాష్ట్రాంతరంబుల వరాన్వేషణంబుఁ గావింపుమని యమాత్యశేఖరు న్నియోగించె. అతండరసి యరసి సలగోత్ర సంజాతు నింద్రసేన మహీపాల తనూభవుఁ జంద్రాంగద్వైభవుఁ జంద్రాంగదాంకితుం గొనితెచ్చె. వధూ జననీజనకులాతని గుణరూప సంపదల కలరి యనురూప దాంపత్యంబు కలిగెడినని మురిసిరి. కొలఁదిదినాలలోనె సుముహూర్తము నిశ్చయింపఁబడియె. దిగ్దేశ రాజన్య బంధునివహంబులెల్ల రాహూతులైరి. మిన్నగా నన్నిసన్నాహములు న్నెఱపఁబడెను. ఊరెల్ల నలంకరించిరి. పెక్కులు తౌర్యత్రికంబులతోడ దిక్కులు పిక్కటిల్లె. సీమంతినీ చంద్రాంగద రాట్కుమార వివాహమహోత్సవం బెంతయుం బరిఢవిల్లె.

సీ. వరునకు రమణీయ ♦ పారిబర్హంబు దా ♦
సీదాసజనమును ♦ జెందఁజేసె ।
సముపాగతానేక ♦ జననాథులకు నర్హ ♦
సన్మానములొసంగి ♦ సాగనంపె ।
వేదవేదాంగజ్ఞ ♦ భూదేవతావళి ♦
శిష్టార్థమృష్టాన్న ♦ తుష్టిఁగొలిపె ।
నిజరాష్ట్రగతజనా ♦ నీకంబునకు నెల్ల ♦
గాంగేయచేలము ♦ ల్కట్టనిచ్చెఁ ॥

గవివరేణ్యులనరసి రాం ♦ కవములొసఁగె ।
గాయకాళికిఁ దగురీతిఁ ♦ గానుకలిడెను ।
బంధువర్గంబు నానంద ♦ పఱచిపుచ్చెఁ ।
బుత్త్రికాపరిణయవేళఁ ♦ జిత్రవర్మ ॥

పిదపఁ దనగారాపుఁబట్టి నెడఁబాయనొల్లక యల్లు నిల్లటమున కొడఁబఱచె. అట్లా నవవధూవరులు రాచిల్కయు గోర్వంక

యున్నఁగాఁ బరస్పరానురాగలత లల్లిబిల్లిగ నల్లికొన సల్లలితంబుగా నటఁ గాఁపురంబు సేయుచుండిరి.

ఇట్లుండ నొకనాఁ డారాజపుత్త్రిండు జలక్రీడార్థము కాళిందీ తటంబున కేగె. ఆయేటి కీవల నావలను జతురంగ బలంబులు తీర్చియుండెను. చంద్రాంగదుం డాయమునా జలంబుల హర్షంబుతోడ నవ్వలిగట్టుచేర నీఁదఁదొడఁగె. అతం డట్టులో నెట్టుకొనిపోయి తుదకు నక్రోటమునిఁగె. 'అయ్యో! పట్టుకొనుఁడు పట్టుకొనుఁ' డని యిరుగట్టులనుండి రొదగా నెల్లరొక్కపెట్టునఁ గేకలు వేసిరి. సాహసులౌ ధీవరు లందుఱికి యగాధజలంబుల నిటునటు గాలించిరి. వెదకుడు వ్యర్థమయ్యె. సేవకులెల్ల రాదుర్వార్త తెనిఁగియుక పఱువ వెనుకంజ వేయఁజొచ్చిరి. తుదకొక్కఁ డట్లోపోయి నివేదించె. అదిచెవిసోఁకినంత నాయేలిక నేలంగూలి మూర్ఛిల్లెను. తత్పుత్త్రియు నదివిని యడలుచుఁ బ్రాణత్యాగంబుఁ గావించుకో సంసిద్ధురాలయ్యె. రేఁడు వెంటనే తెలివితెచ్చుకొని యాపె న్నివారింపించి యాకూఁతు న్నాతండోఁగొని యమునాతీరంబునకుఁ జనియె. యమునాతరంగములు పొంగి పొరలినట్లు సీమంతిని యంతరంగంబునుండి దుఃఖంబు పెల్లుగొన నాపె యిట్లనియె: 'కాలకాలా! పదునాలవయేట నిట్టిగతి పట్టనున్నదని యెన్నాళ్లనుండియో నీకాళ్లకు మ్రొక్కినదెల్లఁ దుదకిట్లేటఁబడనా? సోమేశ్వరా! నిన్నాశ్రయించిన సౌభాగ్యస్థైర్యంబు గల్గెడినను మైత్రేయివాక్కు రూఢిగ నమ్మి యర్చించితినే. శరణన్నదానను. చిన్నదానను. నన్నుపేక్షించితే! హర హరా!' యని విలపించుచు నేటిలోఁ బడఁబోయెను. చప్పునఁ దల్లిదండ్రు లామెం గవుఁగిలించికొని పొగులఁ జొచ్చిరి. మంత్రి పురోహితాదు లెల్లరుం జింతాక్రాంతులైరి. ఇంద్రసేనుని కీవార్త తెలిసె. పుత్త్రశోకార్తులౌ తల్లిదండ్రులు హాహాకారంబులు సేయుచు నటకువచ్చి తలలు బాఁదుకొనుచు 'గుణనిధీ! కుమారా! కుమారా!' యని నేలం గూలిరి. అటఁ

గల వేనవేలు పౌరులందుఁ గనులఁ దడిపెట్టనివారు లేరైరి. సీమంతిని, 'ప్రాణనాథా! నన్నుఁగొనిపోవవే' యని రోదనముసేసి తుదకేమైనం దాను భర్త్రనుగమనం బొనర్చితీరెద నని యందులకుం దలపడెను. ఆపెతండ్రి పురోహితు నది విహితమా యని యడిగె. ఆవిప్రుండు 'శవముగబడ నప్పుడు సహగమనం బెట్లు? ఇంతకు నాతఁడు మరణించెనో లేదో నిశ్చయము కాలేదయ్యెను. శవము దొరకువఱకు నిరీక్షింప వలసినదే' యని తెలిపె. నరేంద్రుండును విధియలంఘ్యమనుచు సుద్దులెన్నేనిఁ దద్దయు నాపెకు బోధించి యెట్లో బుద్ధి మఱలించి యింటికిం జేర్చె. ఇంద్రసేనుండు దుర్భర పుత్రశోకార్తుండై యెవరెన్ని చెప్పినను వినక సకలసుఖంబులుడిగి మతిచెడి యుండఁగ దాయాదు లాతని రాజ్యం బపహరించి పౌర మావిషాదమగ్న వృద్ధదంపతులం గారానిబద్ధులఁ గావించిరి. చిత్రవర్మ కాలవశమున నట్టి దౌర్భాగ్యంబు ప్రాపించిన తనయేక పుత్త్రిక నేఁడాది కడచిన వెనుక వైధవ్యాచారంబు యథావిధి నెఱపుదువు గావుతమని కంటికి ఱెప్పవైఁ జూచుకొనుచు నట్లో కాలక్షేపము సేయుచుండె. సీమంతిని మాత్రము శోకాకులిత మానస యయ్యు భర్తృనిరాఁకఁ దదేకదీక్షతో సోమవారవ్రతంబు నెఱపుచునే యుండెను.

ఇఁక నేటంబడిన యాచంద్రాంగదుం డేమయ్యెనో చెప్పెద వినుఁడు. అందుమునింగిమృతప్రాయుండై యున్నవాని నాతని నాగకన్యకలు సుధాసేకంబునం దేర్చి పాతాళలోకంబునకుం గొనిపోయిరి.

మ. అవనీనాథ కుమారకుండు కనన ♦ బ్జారిప్రభాభాసురం
బు విశాలోన్నత వప్రగోపురయుతం ♦ బున్నిర్మితానేక ర
త్నవితానోజ్జ్వల భర్మహర్మ్య మహిరా ♦ డ్ధామంబునందున్న భా
భవనాంచత్ఫణిరాజ రాజితమణి ♦ న్మధ్యస్థితుం దక్షుకున్.

తరుణీజ నానేక పరివేష్టితు నాపీతాంబరుం జంద్రాంగదుం దత్యాశ్చర్యంబు దీపింపంగని వినతుండయ్యెను.

అహా యతం డీశుభలక్షణాన్వితుం డెవ్వం డిటు రానేమిటికని యాతనిం గొనితెచ్చిన వారినడిగెను. వారాతని వంగడం బెఱుంగ మనియుఁ గాళిందీ జలంబులందు లభింపం దామటకుఁ గొనివచ్చిన వారమనియు మనవియొనర్చిరి. అంత నానాగేశ్వరుం డాతని యూరుం బేరును జననవృత్తాంతంబు నటకుం జేరిననిమిత్తంబును జెప్పు మనియె. అందులకాసుకుమార కుమారకుం డిట్లు బదులువలికె: 'నాగేంద్రా! పుణ్యశ్లోకుండు నిషధేశుండు నలుండెందుఁ గలిగ నం దుదయించిన యింద్రసేన నరేంద్రుతనూభవుండను. నన్నుఁ జంద్రాంగదుఁ డందురు. నేనత్తవారి యింటికేగి దైవయోగంబున యమునా జలంబుల మునింగితిని. అట్టి నన్ను వీరిటకుఁ దీసికొని వచ్చిరి. ఏమాయొ యేమి? నాజన్మమిట్లు నేఁటికి సఫలతఁ గాంచి నది. భవత్పాద దర్శనంబునం గృతార్థుండనైతి' ననుచు సాష్టాంగ ప్రణామంబు సేసె. అయ్యహిపుం డాతని కభయ ప్రదానంబు సేసి వెండియు నిట్లు పృచ్ఛ సేసె: 'రాట్కుమారా! నిన్నుం జూడ నిర్మల హృదయుండవుగా నగపడుచున్నాఁడవోయీ. మీయింట నేదేవునిఁ బూజించుచుందురో చెప్పుమా' యనెను. అందులకు నిషధేశాత్మజుం డిట్లు ప్రతివల్కె: 'భోగీశా! సర్వేశుండు సదా శివుం డాసోమేశుం గాకెవ్వరిని గొల్తుము?

చం. ఎవఁడు రజఃప్రకాశతని ♦ దెల్ల సృజింపఁగ స్రష్టయయ్యె స
త్త్వవిశదతన్ జగత్స్థితికిఁ ♦ దా హరియయ్యెఁ దమఃప్రచారమం
దు వెలసి రుద్రుఁడై తనకుఁ ♦ దోఁచిన భూతమయుండునా నన
క్షత్రవిమయుఁ డా నిరంజనునిఁ ♦ దక్షక కుండలుఁ గొల్తునక్షయున్.

అన విన్నంతనే యాపన్నగాధిపుం డన్నరేంద్రసూను నానందంబు మీఱ బుజ్జగించి, 'విశాలరాష్ట్రంబు నమూల్యరత్నంబులు నొసంగెద నిట సకలోరగ భోగంబు లనుభవించు చుండుము. ఈపాతాళరాజ్యం బనుపమంబు నకంటకంబు. ఇట్టిది భూలోకంబున దుర్లభంబు. ఇయ్యెడ నమృతంబు వాపీకూపతటాక పూర్ణంబు.

ఇటు రుజామృత్యు భయంబులు మృగ్యంబులు. ఇచ్చోట స్వప్నావస్థ యనునదే యెవ్వారు నెఱుంగరు. ఇయ్యెడ సుఖానుభవంబు నందు' మని పలుభంగుల బోధింప నందులకుఁ జంద్రాంగదుం డిట్లనియె: 'రసాతలేశ్వరా! మీయవ్యాజప్రేమ కమందానందంబు నొందుచున్నాను. కాని మాతల్లిదండ్రులు మదేకపుత్త్రులు. ప్రియురాలు పదునాలుగేండ్లది. సువ్రత. పిన్ననే చేపట్టితి. ఆప్రేయసి యందు నామనంబు లగ్నంబై యున్నది. పుత్త్రకోత్కార్త్తా పితరుల పాదంబులకు మ్రొక్కి వారిని దక్కించికోవలయు. ముదిమిచే వారును ముగుదతనమున సుదతియు నేను మరణించితి ననుకొని యసువులు వీడుదురేమో! మీపాద దర్శనంబున ధన్యతఁ గంటి. సంతసించాలును. వారింజేర సెలవీయఁ గోరువాఁడ' నని మ్రొక్కెను. తద్రాట్కుమారు నెడఁ గద్రూసుతుండు దయార్ద్రహృదయుండై యాతనినమృతంబుఁ ద్రావించి తత్పతికొఱకు సుధాపూర్ణఘటం బొసంగి యమూల్యరత్నాంబర భూషితుంగావించి నిజతనయునిఁ దోడిచ్చి తనను స్మరించినమాత్ర నెపుడైన నిష్టార్థసిద్ధి యొనగూర్తు' నని లాలించి మించిప్రేమించి మనోరయంబు న్నాయంబుం బూంచి యుంచె. చంద్రాంగదుండును గృతజ్ఞతాపూర్వక ప్రణామంబులతో సెలవుఁగొని నాగపుత్త్రునితోడ నయ్యశ్వంబుపై నధిరోహించినంత క్షణమాత్రంబునఁ గాళిందీతరంగిణీ నెటముఖంగ నటందెలె. నాఁడింధువాసరమయ్యె. తత్సతిమణి సీమంతిని వ్రతాచరణ నిర్వహణార్థము నదీజలంబుల నవగాహం బొనర్ప సఖీసహితంబుగాఁ దత్తటంబున కప్పుడ చేరెను. ఆయమ జలమధ్యంబునుండి నిర్గతుండౌవాని నాగకుమారద్వితీయు నద్వితీయ ప్రభావిభాసితు నపూర్వఘోటకారూఢుం గాంచి యాతండు మానుషరూపంబున నేతెంచిన పూర్వదేవుండో లేక మానవుండో నిరూపించికోఁజాలక మహాశ్చర్యంబు గదుర స్నిగ్ధప్రేక్షిత నిర్నిమేషంబుగఁ జూడఁదొడఁగె.

ఉ. ఈసొబగీవిలాసమిటు ♦ లెన్నఁడెఱుంగని సౌరభంబు భా
భాసుర భూషణాంబర వి ♦ భప్రతిపాదక లక్షణంబులే
మీసుకుమారవైఖరి స♦మీహితమూర్తిమనోహరుండయే
మోసరివారు లేరిఁకన♦ హో యనుచుందలపోసె నెంతయుఁ

ఉద్విభీతవారిణేక్షణ యెవ్వతయో యని యానాగలోకాగతుండును బరికింపఁజొచ్చె: ‘నాప్రియురాలు కాదుగదా. రత్నహారంబులుం గంఠసూత్రంబుం గానరావే. పసపుఁ గుంకుమను లేవే. చింతాక్రాంతస్వాంతగా నగపడుచున్నదే’ యనికొనుచుఁ దక్షకుం దలఁచి తననోరులు గుర్తింప కుండెదరు గావుతమనుచుఁ దీరంబునం జేరి యటడిగ్గి కూరుచుండి యింతలో నింత మార్పే మనుకొని సీమంతినిం బిలిచి యిట్లడిగె: ‘నీపేరేమి? నీజననీజనకు లెవ్వరు? నీవెవ్వరిదానవు? చిన్నతనమున నిట్లు ఖిన్నురాలవైయున్న దానవేమి? చెప్పుమా’ యనిన నాయమకువ్రీడాభయ విషాదాశ్చర్యంబులు పెనంగొన బదులాడ నోరాడమి సాభిప్రాయంబుగాఁ దానా సకియదెసం జూచినంత నాయింతి యాతని కిట్లు సర్వంబు నివేదించె: ‘ఈమె పేరు సీమంతిని. తండ్రిగారు చిత్రవర్మాభిధాన మహీపాలురు. ఈమె చేపట్టినది చంద్రాంగదాఖ్య నిషధేశుని. ఆతం డీయేటనే కొంతకాలము క్రిందటఁ బడిపోయె. అప్పటి నుండియు నీమె నిద్రాహారములు విడి కంటికిన్మంటికి నేక ధారగా నిట్లేడ్చుచుండును. లావణ్యంబుం గోల్పోయె’ ననవిని లోలోనఁ గుందుచుఁ బైకిఁ గరుణము మొలయునట్లు ‘పాపమీయమ యత్తమామ లేమైరి? ఈమె యిక్కడికి రానేల?’ యనియె. అందుల కాచెలియ ‘అయ్యో! పుట్టుదుఃఖముతోనే వారు మూలఁబడఁగ వారి పాపిష్ఠ దాయాదులు తుదకు వారిని బదభ్రష్టులం గూడఁ గావించి చెఱసాలలం ద్రోయించిరికాదే! నాఁటికిని నేఁటికిని మారాకుమారి యేమిమానినను దనసోమవార వ్రతాచరణంబును మాత్రము విడువక నెఱపుచున్నది. అందులకే స్నానార్థమిట రాక’ యని పలికె. అప్పుడు సీమంతిని సఖివంకఁ జూచుచు నిట్లను: ‘వీర

వ్వరో కామరూపులుగా నున్నారు. నరరూపంబున నిటదిగ్గిన గంధర్వులో, సిద్ధులో, దేవతలో కావలయు. వీరలుమనలనిన్ని ప్రశ్నము లడుగ నేమిటికో కదా! ఈయమ ప్రతచూడ స్వజనంబుగఁ దోఁచు. పోలించిన... 'యనుచు నర్థోక్తిలో నతిదీనముగా విలపించుచు నేలం గూలెను. అందనుక డెందంబునందలి కుందడంచికొన్నవాఁ డామందయాన చందంబుం దిలకించినంతనే యశ్రుబిందువులు చిందం గనులొత్తుకొని దరికేగి మెల్లగ నిట్లు చెవిలోఁజెప్పె: ఁచింతింపకుము. కొంచెమాగుము. నీపెనిమిటి సుఖముగానున్నాఁడు. సమీపమునసే యున్నాఁడు. నీవ్రతప్రభావమువల్లమూడవనాఁటికే వచ్చునులెమ్ము. ఇది రూఢిగా నమ్ముము. ఈశ్వర సాక్షికముగాఁ జెప్పుచున్నాను. ఆతం డొక్కటియు నేనొక్కటియుం గాదు. కావుననే యిట్లు చెప్పఁగలిగితిని. కాని యిది నీమనమునసే యుంచి కొమ్మను మృదువాక్కులు చెవిని సోఁకినంతనే యాపె యెద తెల్ల గగుర్పొడిచె. కనులఁ బ్రేమాశ్రువు లుప్పతిల్లె. అపుడాతని ముఖలక్షణంబు లుపలక్షించి తనలోఁ దానిట్లనుకొనును.

చ. ఇతనివచఃప్రచారముల ◆ హీన ముదావహము ల్ముఖంబు న
స్మితమరవిందసుందరతఁ ◆ జెన్నగు కన్నులఁ జిన్నెలన్నిటం
బతియగునే మొ! యెట్లగు? న ◆ భాగ్యత నబ్బునె యట్టియోగ్యత
ల్వితయుగుఁ గాకయూహలెట ◆ విందుమె మ్రందినవారినొందుటల్?

ఏమి యీభ్రాంతి! యిదికలగాదుగదా! గాకితం డేమానవ గాఁడో వేషధారియో కానువచ్చు. గాదుగాదు.

ఉ. ఏయెడ దుర్లభంబు కల ◆ దీ? పరమేశ్వర సత్కృపాప్తి ధ
ద్రాయుత మూర్తిమున్గువల ◆ యాస్యని యాత్రనడంచుకీర్తిలే
దేయిల నగ్నిదగ్ధబ్రిది ◆ కించె మదాలసఁగాదె యప్పు మై
తేఱియుపచించినట్టులఁ బ ◆ తివ్రతదుం డల సొంబుఁడిచ్చునో!

యని పరిపరివిధాల నాలోచించుచుండఁ జండాలగదుండు జననీజనకుల యిదుమలఁ బాపుట ప్రథమకర్తవ్యం బనియెంచి

యాయువు నటడించి తురగంబుపై నధిరోహించి నాగపుత్త్రి వెంటనుంచికొని నైషధాభిముఖుండయ్యె. వారు మనోవేగంబున నారాష్ట్రంబునం జేరిరి. ఇంద్రసేనాత్మజుండు దుర్నీతులౌ జ్ఞాతులకు నిజాగమనం బెఱింగించి దౌత్యంబు నెఱప నానాగపుత్త్రి నంపెను. ఆతండు పురోగామియై యాధూర్తులౌ శాత్రవుల నిర్వ్యాధిం దీవ్రంబుగా మందలించె: 'దుష్టులారా! ఇంద్రసేనుని కొడుకు కేటం బడి మడిసెంగదా యని స్వామిద్రోహంబుఁ గావించి రాజ్యం బప హరించి కులుకుచున్నారు కాఁబోలు. చాలుఁజాలు. చంద్రాంగ దుండు పాతాళలోకంబున కేగి యహిరా డ్దర్శనంబుఁ గావించి తిరిగి వచ్చినాఁడు. మిమ్ము మట్టుపెట్ట నున్నాఁడు. మీకుఁబ్రాణా లైన దక్కించుకొనిచ్చకలదే నిప్పటికైన వెను వెంటనె తత్పితను సింహాసనారూఢుంగావించి యాతని కెదురేగి శరణుఁజొచ్చుటయే కర్తవ్యంబు. లేదేనిఁ దత్సహాయార్థ మరుదెంచిన నేనే ముందు మిమ్ము మర్దించువాఁడ' నని యుద్ఘాటించెను. ఆక్రూరవాక్యం బులు విని విభ్రాంతిఁగొని యిట్లాతనికివారుబదులువల్కిరి: 'నాగ కుమారా! మాదిపొరపాటే. ఇదిగో శరణాగతుల మగుచున్నాము. మమ్మెట్లయిన మన్నించి విడుచునట్లు మీరు తోడ్పడుఁ' డనుచుఁ బదభ్రష్టులౌ నామదుసలులనప్పుడ సబహుమానంబుగాఁగొని తెచ్చి వారికిరాజ్యపదం బొసంగిరి.

అంతనా నాగపుత్త్రిం డావృద్ధరాజున కంజలి ఘటించి యిట్లులవిన్నవించె: 'రాజేంద్రా! శేషసందర్శ నార్థమరిగిన మీచం ద్రాంగదుండు పాతాళలోకంబునుండివచ్చియున్నవాఁ' డన్నంతనే యాతండు నిల్లాలును మూర్ఛిల్లిరి. అంత నానాగపుత్త్రిండువు శైత్యోపచారంబులు గావింపఁజేసి వారిందేర్చి, 'మీకష్టాలు గట్టెక్కినవి. మీపట్టిం జూచికొనుం'డనపుడుఁ బట్టరాని సంతోష ముతో వారూరెల్లనలంకరింప నానతియిచ్చి మంత్రిపురోహితాప్త బంధు పరివారసమేతముగా నెదురేగిరి.

సీ. అడుగడ్గునం దమ ♦ కౌదుకేడసేడ వం
చౌడయుఁడున్దెవెరి ♦ యడుగుచుండ।
మంత్రి ముఖ్యులిదేమి ♦ తాంత్రికంబంచునా
లోచించు చకార్యస్థఁ ♦ జూచుచుండ।
నేనేండ్లకనివోము ♦ నేకాదళగురుండ
టనుచుఁబురోహితు ♦ లానఁగొలుపఁ।
వచ్చినవాఁడంట ♦ వచ్చినాఁడుఁటవింత
యనుకొంచు నెందఱో ♦ యనుసరింపఁ॥
పెక్కుమంగళవాద్యము ♦ ల్పిక్కటిల్ల।
జయజయధ్వానముల్జను ♦ ల్పలుపుచుండ।
నశ్వమునుడిగ్గివచ్చి చం ♦ ద్రాంగదుండు।
పితరులపదంబులకు మ్రొక్కెఁ ♦ బ్రీతిమీఱ॥

వారాతనికానందబాష్పాక్షతలు శిరంబునవిడి ప్రేముడిం గౌఁగిలించుకొని మహానందాంభోధి వీచికా పరంపరల నవగాహ క్రీడలందేలిన కొంతసేపటికి గద్గద స్వనములతో, 'నాయనా! నీవులేని యెడ జీవచ్ఛవంబులమై యున్నమాకుఁ బ్రాణదానంబుఁ జేసినాఁడవోయీ' యన విని బాష్పపూరితాక్షుండా చంద్రాంగదుండిట్లనను: 'నేను మీకు శత్రుండనే కాని పుత్త్రుండనా? కాకున్న నేను రసాతలంబున సుఖానుభూతి నొందుచు నాకొఱకయి మిమ్మన్ని కష్టాలపాలు చేయఁదగునా? అమ్మా! మీహృదయ మెంతమృదులమో నాగుండె యంతబండయయ్యెఁ గదా. మాతృదుఃఖంబును గుర్తింపని పుత్త్రుండు కేవల మలప్రాయుండకాని వేఱుకాదు. మాతృఋణముం దీర్చికొనఁ జాలు జనుం డిలనుండునే? భవాని యన్నం గన్నతల్లిగాక వేఱొకతె యున్నదా? కావుననే కదా 'నోమాతుః పరాదేవతా' యని శ్రుతు లుద్ఘోషించుచున్నవి. అట్టితల్లి నేడిపించినవాఁడు సంతతి లేనివాఁడై యేడు జన్మాల దరిద్రుఁడై దుర్గతులపాలై పోవునను పెద్దలైన వాక్కులతో నాతండు మాతృపితల యెడం దనకుఁ

గల బత్తి వెల్లివిరియఁ జేయుచుండెను. ఇట్లుండ బంధు ప్రముఖులు నింకంగల పౌరవర్గంబులుం జూడవచ్చిరి. వారినందఱి నాతండు సాదర వాక్యంబులం బరామరిసించిన మీఁదట నెల్లరకు నయనోత్సవంబుగాఁగా నగరంబునం బ్రవేశించె. అంత నాప్త సంప్రశ్నంబున వారికిఁదాఁజూచిన నాగలోక విశేషాలు నిచటి మూఁడేండ్లు తనకట మూఁడుదినాలుగా మాత్రమె కడచిన విధమును దానట నందిన యాదరణము మున్నగాఁగల ముచ్చటలతో నెచ్చరికఁ గొలిపి వారివారిని యథోచిత వస్త్రభూషణాది సత్కారంబులం దన్పి యంపెను. నాగపుత్త్రినిఁగూడ నర్హారీతిని సత్కరించి పీఁడ్కొల్పె. పిదపఁ దానహిలోకంబునం బడసిన వానిఁ బితృపాదుల కర్పించి నమస్కరించె. అపుడింద్రసేనుం డిట్టులనను: « ఇంతకును మనసీమంతిని దైవశాలిని. తచ్ఛివారాధనంబునన యివ్విధంబున నాపెసౌభాగ్యంబు దక్కెఁగాని వేఱు కాదు. కావుననీకల్పవృక్షఫలాదికంబుల నమ్మందుమాకొదలికందింప వలయు'ననుచుఁ బుత్త్రిగమన శుభవార్త చిత్రవర్మకెఱింగింప దూతలనంపె. వారు నొక్కగంతునంబోయి యా భూకాంతునకుం దెలిపిరి. ఆ ధారుణీశుండు నవ్వారి కవ్వారిగా వస్త్రభూషణాది సత్కారంబులఁ గావించి వెనువెంటనే యింద్రసేను సపుత్త్రి కళత్ర మిత్ర బాంధవంబుగా మహోత్సాహంబున రావించి బహూకరించెను. అయ్యెడఁ దననోముపంట యగు నాదంటుంగని ముఱియుచుఁ గృతప్రణామయా సీమంతినీ సతీమణికిఁ నింద్రసేనుండు పితాజ్ఞను దాఁగొనితెచ్చిన యమూల్య వస్తు జాలంబెల్ల నొసంగి యమృతంబు సేవింపఁజేసెను. అట్లు పీతపీయూషయు దివ్య వస్త్రాలంకార భూషితయు నానారూపామణి రతీసమ ప్రభావతియై భాసించె. ఆదివ్య సుందర విగ్రహుల కొండొరులందు మున్నుండిన ప్రేమ యిప్పుడు కోటిగుణమ్మయ్యె. వారంతట నిమథరాజ్యాభిషిక్తులునై యయుతవర్షపరిమితముగా సకలోక భోగంబు లనుభవించిరి.

సోమవారంబులందు గౌరీశారాధనంబుఁ గావించుటవల్లనే కదా యల్ల సీమంతిని కిష్టార్థంబు లబ్ధంబైనదనుచు శ్రీగురుండు తననుపదేశింపఁగోరిన దంపతుల సంబోధించి యాసోమవారవ్రతం బాచరించిన యెడల సకల సౌభాగ్యాఖండశ్రీ పుత్రపౌత్రాది సంపత్తు లొనగూడెడి' నని బోధించె. అపుడాశ్రోతలు యతి నేత నిట్లు పృచ్ఛచేసిరి: 'స్వామీ! సకలార్తి హారకంబును భవాబ్ధితారకంబునగు భవత్పాదసేవ చాలదా? వేఱవ్రతంబు లేల? త్రిమూర్తి స్వరూపులరై తిరి. ఆమరణంబు నిరంతరము భవచ్చరణ స్మరణం బొనరించునట్లు దీవింపరాదా?' యనవిని శ్రీగురువు లిట్లునుడివిరి: 'నాయాజ్ఞయిది. వ్రతముసేయుండు. అట్లొనరించుటవల్లఁగాని మీసేవ నాకందనేరదు. కావున నట్లాచ రింపుఁడు. పొం'డని యాయాజ్ఞగల నివ్వడొక్కల్పుచుండె.

అప్పటికిఁ దమపుత్త్రీఁడు దత్తాత్రేయుఁడు గురుకృప నారోగ్యముఁ గన్నవార్త విన్న గోపీనాథుండు దారసహితుండై యటకుఁజేరె. ఆవృద్ధదంపతులును నిజపుత్త్రి ప్రాణదాతలా నారసింహుల పాదంబులఁ బూజించి మహోత్సాహంబుతోడ సహస్రబ్రాహ్మణ సమారాధనంబుఁ గావించిరి. పిమ్మట గురు వులసెలవొంది వారెల్లరు స్వపురంబున కరిగిరి. సావిత్రీ దత్తాత్రేయులు గురూక్తవిధిని వ్రతంబాచరింప వారికిఁగాలక్రమంబున నేవురు సుతులుపుట్టి పూర్ణాయువులై వర్ధిల్లిరి.

దీన శ్రీగురు యశశ్చంద్రిక దిక్కులకెక్కె. చక్కెరకంటె నిక్కథను నిక్కముగా నెక్కువ రుచికలదు. కొలిచిన సద్యః ఫలదాతనుగదా కొలువవలయు. శ్రీగురుం డట్టిఁడు. తచ్చరిత్రంబు పవిత్రంబు. తద్భజనం బచిరాఖిలార్థదంబు.

తే. ఎదుటఁగనుదానికుపమాన ♦ మేటికయ్య!
వినవెం ముంజేతి కంకణ ♦ మునకు నద్ద

మిన్నుచందానసద్వానుభ ♦ వైకవేద్య।
మమృతపానంబువైదీన? నబ్బు సుఖము॥

అని సిద్ధుండు నామధారకునకు బోధించెను.

కర్మకాండము — ౧౨వ శము

నామధారకుండు నమః పూర్వకంబుగా నిట్లుపల్కె:
‘అజ్ఞానధ్వాంత భాస్కరా! నేను గాఢనిద్రం జెందియున్నను చిన్మయులరగు మీవల్లఁ బ్రబోధితుండనైతి. నష్టేటఁబడి కొట్టుకొనిపోవుచున్నవాని నన్ను గురుకథాబోధాప్లవంబున గట్టునఁ జేర్చితిరి. కృపమీఱఁ దదనంతర కథామృతంబుం బ్రసాదించి స్థైర్యం బొదవింపుఁడయ్యా!’ యనుచు సిద్ధపాదంబులం బడినంత నాతండును సంతుష్టుండయి పైగాథ యిట్టులఁ జెప్పనుపక్రమించెను:

‘బిడ్డా! వినుము. ఏకాగ్రచిత్తంబున వించేని జ్ఞానంబుఁ గందు. ఇంక నాపైన ననేక చిత్రకథలు నడచె. గ్రంథవిస్తరమున కోర్చినను విష్ణ్వవతారకథయేమి, సామాన్య మానవుం డెవ్వండుగాని సంపూర్ణముగాఁ జెప్పఁగల్గుటేమి? కావున ముఖ్యము లగువానిలోఁ గొన్నిటినిట దిజ్మాత్రంబుగ నుడువువాఁడ.

ఒక బీదబాఁపఁడుండె. అతఁడు కర్మమార్గజ్ఞుండు న్వివరక్తుండు. సత్యసంధత నగ్రగణ్యుండు. పరాన్న భోజనం బాసింపనివాఁడు. ప్రతిగ్రహ మొల్లఁడు. యాయావరవృత్తి నాశ్రయించి దొరకినదానికే తనిసి కాలక్షేపము సేయుచుండె. అట్లయ్యు యథాశక్తి నతిథిపూజనసలుప మానఁడయ్యె. కాని గయ్యాళి యగు నాతని యిల్లాలి యాతని నట్లుమెలంగనియ్యకొనదయ్యె. అపుడు తఱచుగా బ్రాహ్మణ సమారాధనములు జరుగుచుండెడివి. అట మెక్కి వచ్చినవారింగని దుఃఖించి కానిట్లనుచుండెడిది:
‘హరి హరీ! యట్టి మృష్టాన్నమెన్నఁడెఱుఁగనే. నాపూర్వ

కర్మమును బట్టి యీదరిద్రుఁడు మగఁడై నాపాలఁబడుట నాకెప్పు డును గష్టాలె యేచుచున్నవి. తమపెనిమిట్లతోఁ బాటుగ సత్రా లలోఁ జేరలతో నేయి బొట్టివచ్చు నీముత్తైదువులెల్ల యేమినోములు నోఁచిరోకదా. అదేమి దురదృష్టమోకాని మాయాయన నవ రైనఁ బిలిచినను బోనందురాయె. నారాయణ, నారాయణ, యేమి చేయుదు' ననుచుఁ జింతించుచుండెడిది.

ఒకనాఁడొక ధనసంపన్నుఁడు బ్రాహ్మణ సమారాధన మొనర్ప సంకల్పించి యందఱితోఁ బాటుగా నీదంపతులంగూడ నాహ్వానింపవచ్చెను. ఈమె తన పెనిమిటి లోపలఁ గర్మానుష్ఠా నంబున నుండ నాయనకడకుఁ బొంగుచుంబోయి యిట్లనియె: ‹ఏమండీ, యెవరో వచ్చినారు. పంచభక్ష్య పరమాన్నములు పెట్టి మంచిబట్టలును బాగుగా దక్షిణయు నిత్తురఁట. మిమ్ము నన్నును రమ్మన్నారు. నాకుఁ బోవుదమని యున్నది. ఏమందు' రనియె. పాపమా సాత్త్వికబ్రాహ్మణుని చెవుల కామాట లింపు గొలుపవయ్యె. అతండిట్లు బదులువలికె: ‹ఓసీ! కావలసి యున్నం బొమ్ము. నేనుమాత్రమెక్కడికి రా'ననెను. ఆకోపమున మోము చిట్లించుకొని ‹పోనిం'డనుచుఁ దిరిగి యీవలికి వచ్చి ‹మావారు రానన్నారు. నేను వత్తునులెం'డని చెప్పెను. అందుల కాగేస్తు వల్కు: ‹కాదమ్మా. నేను సంకల్పించుకొన్నది దంపతిపూజలు సేయవలయుననికాని ముత్తైదువులకు మాత్రము పెట్టుకొనుట కాదు. కాఁబట్టి మీభర్తగారు రానప్పుడు మీరుమాత్రమె వచ్చినఁ బ్రయోజనము లే'దని తిరిగిపోయెను. అందుల కామె కన్నెరావై, ‹అయ్యో! ప్రారబ్ధమా! యిట్లయ్యెనే. ఈఘాందసపు మగనిమూలాన నాకుఁగూడఁ బప్పన్నము లేకపోయెనే' యని చింతించుచు శ్రీగురువరు లున్నతావున కరిగి వారికెఱఁగి యిట్లు వేఁడుకొనెను: ‹బాబూ! మీకుఁ బున్నెముండును. మా మగ వారి నెక్కడికైన సన్నప్రదానము జరుగుచోటికి దేవకార్యమునకుఁ బొమ్మని మీరు మందలింపవలెను. అదేమి కర్మమో యాయనకుఁ

బరాన్నమన్న సైఁపఁడు. కావున దయచేసి మీరు గట్టిగఁ జెప్పక తప్పదు. ఇప్పుడే యొకపిలుపుకూడ వచ్చియున్నది. అక్కడికిఁ బోయిన యెడలనాయనకు దోవతులచాపును నాకు మంచిచీరెయవికయుంగూడ దొరకు'ననఁగా సరస్వతులు విని నవ్వి యామె భర్తకు వర్తమానమంపి యాతండు రాఁగా నిట్లుబోధించిరి: 'ద్విజోత్తమా! నా మాటవిని నీవు పిలిచినచోటికి భోజనమునకుఁ బోవుచుండుము. మీ యాబిడకుఁ బరాన్న భోజనాపేక్ష మెండుగా నున్నది. పతి యగువాఁడు తన సతికోర్కె తీర్చుచుండవలయు. కులస్త్రీల మనసు లెన్నఁడు నొప్పింపరా'దనెను. అందులకా విప్రుండిట్లనెను: 'స్వామీ! యేమైనను బరాన్నంబునకుఁ బోఁగూడదని నానియమము. కాని గురువుల సెలవు ప్రకారము నడవక తప్పదు. కాకున్న నరకము ప్రాప్తించునాయె. కాఁబట్టి మీ యాన శిరమునఁ దాల్చి యట్లు పోవువాఁడను లెండు. సెలవిం'డని వెడలి పోయెను. ఆతని యిల్లాలు నుల్లంబుననెంతయు సంతసిల్లె.

అంత నాదంపతు లుదయము పిలిచిపోయిన వారియింటికిఁ బోయిరి. యజమానుఁడు సంకల్పించిన బ్రాహ్మణ సమారాధనము కొఱకుఁ బెక్కు పక్వాన్న శాక భక్ష్యాదులు సిద్ధపఱిపించె. స్త్రీలుం బురుషులు వందలకొలఁదిగావచ్చి బారులుతీర్చి కూర్చుండిరి. ఇదివఱకు సత్రాల మొగమెఱుఁగని యీ మన గయ్యాళి తల్లి మహానసంబు చేరువ నొకపీట చూచుకొని కూర్చుండి యిటు నటు పరికించుచుండె. అన్ని పదార్థములెల్ల వడ్డించిరి. భోజనాలు ప్రారంభమయ్యె. ఇట్లుండ నాప్రక్కదడిలోనుండి యొక కుక్క దూఱివచ్చి యటనున్న యన్నపురాశిని స్పృశించెను. ఎవ్వరో దాని నవ్వలికిఁ దోలి వడ్డన సాగింపఁ జొచ్చిరి. అది కన్నంతనే యాయమ్మ నిర్విణ్ణురాలై యాయన్నము వడ్డింపఁబడిన విస్తరి ముందఱినుండి లేచి యెల్లరుం దెల్లవోవ బిగ్గరగా నిట్లంటు వడ్డనని కేకలువేసి తన పెనిమిటి వంకఁజూచి 'యేమయ్యా, యింక లేవక యీకుక్కముట్టుకొన్నకూడు మెక్కవలెననియా యే'మని

గర్జించెను. ఆతండు తన నత్తినిఁ బాదుకొని ‘యేమి చేయుమందువు? నీ మూలాననేకదా నా గృహాచారముకూడ నిట్లు కాలిన’ దని యాయన్నము వదలి యుత్తరాపోశనముఁగొని యావలికి వచ్చెను. కోపముతో వారిద్దరు గురుసవిధంబున కరిగిరి. వారందా బ్రాహ్మణి దెసఁజూచి ‘యేమమ్మా, పరాన్నసుఖ మనుభవించి మనోరథంబుఁ దీర్చికొని వచ్చితివా?’ యని యడిగిరి.

ఆమె సిగ్గునఁ దలవంచికొని ‘స్వామీ! నా తప్పు సైరింపవలయు. నా బుద్ధిహీనతవల్లనే మా వారినిగూడ నీకుక్కకూటికి బలవంతాన నీడిచితి’ ననియె. ఆవిప్రుండు కంటఁ దడిపెట్టుకొని ‘మహానుభావా! యేమి చేయుదును? వ్రతభంగమాయె. పరాన్నంబునకుఁ బోరాదను నియమముతోఁ గాలము పుచ్చుచున్న వాఁడనైయు నేఁటికి నా పాలిటి శత్రురాలీ దౌర్భాగ్యురాలి మూలానఁ బోయి కుక్కకూటికి సిద్ధపడితినాయె. ఎన్నో దోషాలు చుట్టుకొన్న’ వనుచు ననుతప్తుండగువాని నా యమాయికుని గురువరుండాశ్వాసించి యిట్లు బోధింపఁ దొడఁగెః ‘పోనిమ్ము. ఏమైనను మీయాబిడ మనసుతీరినదికదా. ఇఁక నామె నిన్ను బాధింపదు లెమ్ము. ఇంత మాత్రాన నీకేదోషంబుఁ బొసఁగ లేదులే. నీవు నియమ భంగమును ఘటింపవు. విచారింపఁ బని లేదు. ఇపుడు జరిగిన దానిలో ధర్మవిరుద్ధ మేమియు లేదు. ఎపుడైన దైవపితృకార్యములందు బ్రాహ్మణాభావ మగుతఱి నాహూతుండై మొట్టకే నేగినందువల్ల దోషంబనఁ జెల్లు’ దనవచ్చు విప్రుఁ డడుగుచున్నాఁడు: స్వామీ! యెవ్వ రెవ్వరివల్ల నెక్కడెక్కడఁ దినఁదగదో యెప్పుడు దోషమౌనో వివరింపుఁడీ’ యన స్వాములు బోధించుచున్నారు: ‘సరే. చెప్పెద. సావధానత నాకర్ణింపుము. గురులు మేనమామలు వేదవిదులౌ వైదికాచారపరులు నత్తమామలుం దోఁబుట్టువులుం బెట్టినఁ దినఁదగును. కర్మలోపం బొందిన విప్రునింట భుజించువాఁడు గాయత్రీ జపానుష్ఠానమ్ము వలన శుచియౌను. మఱియుఁ దల్లిదండ్రులవల్ల సేవనుగొను

వాఁడును బెండ్లమును బిడ్డల నేడిపించి మెఱమెచ్చులదానాలు చేయు
వాఁడును శస్త్రోపజీవియుఁ బోఁగరుఁబోతును గలహప్రియుండును
బహిష్కృతుండును బాచకుండును వైశ్వదేవము సేయనివాఁడును
డబ్బుపుచ్చుకొని యపాత్రులకు మంత్రా లుపదేశించువాఁడును
క్రోధవంతుండును బ్రహ్మద్వేషియు భార్యను వదలినవాఁడును
దాసుండును గ్రూరుండును గృపణుండును దురాచారుండును
వెండిబంగారములతో నగలుసేయు బ్రాహ్మణుండును స్త్రీజితుం
డును దస్కరుండును బరదారగామియు గుఱ్ఱాల వ్యాపార మొనర్చు
వాఁడును జూదరియు దుర్భాష లాడువాఁడును స్నాన మొనర్పక
మెక్కువాఁడును భగవన్నామ స్మరణంబునందు శ్రద్ధాభక్తులు లేని
వాఁడును దుదకు సంధ్యావందనమైనం జేయనివాఁడును వీడఁదగు
దురు. తల్లిదండ్రుల తద్దినాలు పెట్టనివాఁడును ధనముఁగొనియు
దాంభికముగను జపాలొనర్చువారును వడ్డివల్ల జీవించువారును
విశ్వాసఘాతుకులును స్త్రీహంతలును బక్షపాతులు నన్యాయ
వాదులు స్వధర్మాలు విడిచి పరధర్మావలంబకు లౌవారును
స్వాన్నదూషకులై పరాన్నస్తుతిఁ జేయువారును సాధుద్వేషులును
గురునిందకులును గులదేవతా త్యాగులును దురాశాపిశాచ గ్రస్తు
లును ద్యాజ్యులుగాన నిట్టివారి యిండులకుఁ దిండికిఁ బోరాదు.
ఇంక నన్నిజాతుల వారితోఁ గలిసి యన్నిపాళ్ళుఁ గుడుచువారు
చండాలు రౌదురు. కావున నట్టివారిసొత్తు బొత్తిగాఁదగదు. తన
కూఁతు నల్లుని బాధించువాఁడును బుత్రహీనుఁడును నౌపాసన
మొనర్పనివాఁడును ననుదినముఁ బరాన్నమే యాసించువాఁడును
కేవలాద్వైతవాదియుఁ బొట్టకూటికై కపటముగాఁ బ్రవర్తించు
వాఁడును గర్హ్యులు. అట్టివారివల్ల నాతిథ్యముఁగొన్నఁ గన్నులు
పోయి యాయువు క్షీణించు. లేదా మతియు ధృతియు నడఁగి
చెవుడేర్పడును. ప్రతిదినము నొరుని యింటం దినుటవల్లఁ దన
పుణ్యము పోవ దాతృపాప సంగ్రహం బొనరించువాఁ డయ్యెడిని.
ఎప్పుడు నితరుల యిండ్లనే యాశ్రయించి కొనియున్న లక్ష్మీనాశక

మాను. దర్శయగుతఱి నొరునింటఁ గుడిచినవాని కానెల దినాలలోఁ జేసిన పుణ్యకర్మముల ఫలమును బోవుడిని. ఎచ్చోటఁగాని యజమానునకాదద రోఁదవిసందక్కు లేదేని బిలువనివాఁడం బోరాదు. అట్లుగా శవఁడేని సేవకుని ద్వారమునఁ బిలిపించినను బోరాదు. మనుమఁడు జన్మించుదనుక నల్లునింట భుజింపఁజనదు.

ఇఁక గోభూ స్వర్ణాది ప్రతిగ్రహం బంత దోషభాజకంబు కాదు. కాని సూర్యాది గ్రహణ వేళలయందును సూతకంబులతోని దీర్థములదరిని దానాలు గ్రహించుటవల్ల దోసఁగు లొదవెడిని. మఱియు ఖలులయు రాజభృత్యులయు రజకులయు లోహకార స్వర్ణకారులయు వృషలీమద్యపాయులయు దానంబు లగ్రాహ్యంబులు.

ఇట్టి కుదువరాని కూళ్ళకుఁబోని స్వధర్మాచరణైక తత్పరులకు దైన్యముండెడినే? వారికెల్లెడ సౌఖ్యమేయగు. ఎల్లదేవతలు వారికధీనులై యుందురు. సర్వసిద్ధులుం గామధేనువును వారిముంగిటనే యుండెడిని. మదాంధులై వారు తమతమ యాచార ధర్మంబు లుడిగి క్రమముగా సిరులెల్లఁ గోల్పోవుదురని శ్రీగురుస్వామి యుపన్యసించెను.

అప్పుడా విప్రుఁడు దోసిలియొగ్గి 'ఓ మహాత్మా! కృప మీఱ స్వాచారంబులం దెలుపవలయు' ననివేఁడిన గురువరుండు పూర్వమహర్షి ప్రోక్తాచార ధర్మంబు లిట్లు వివరింపం గడంగె: 'ఓయీ! ఒక్కెడ నైమిశారణ్యంబునకుఁ బరాశరుం డేతెంచె. అచ్చోటి ఋషులాతనికి సాభివాదంబుగా నిట్లు పల్కిరి: 'మహామునీంద్రా! స్వాచారానుష్ఠానంబున మాకు గడుగడను సంశయా లొదవుచున్నవి. ఆచారంబును మంత్రంబును గురువల్లఁ గాని గ్రహింపఁ దగదాయె. సద్గురువులరు మీరు మాకు లభించితిరి. కాన స్వాచారంబుం గఱపుఁడన నాతండు వల్కె: 'ఋషులారా! ఆచారంబు సర్వసిద్ధిదంబు. చెప్పెద వినుండు. బ్రాహ్మణుండు బ్రాహ్మముహూర్తంబున నిద్దురనుండి మేలుకొనఁగని బుత్తి

మోాఱ మూర్తులను నవగ్రహంబులను సనకాది సిద్ధులను పితృదేవతలను సప్తసముద్రాలను చతుర్దశ భువనాలను సప్తద్వీపములను సప్తర్షులను క్రమముగా స్మరించునది. అంత గోవునకు మ్రొక్క యాచమనముఁ గావించి పిదప మూత్రోత్సర్గ మొనరించునది. అంత శుచియై విధి విహితాచమనంబు నెఱపునది. ఏలన స్నానభోజనాది కృత్యంబులందును విణ్మూత్రోత్సర్గాది కంబులందును ముందును వెనుకనుగూడఁ దాఁగూర్చుండి యాచమనముఁ గావించుట శిష్టాచారంబుగా నెఱుంగునది. సుదర్శన దుశ్శబ్దోచ్చారంబులను దత్తత్కార్యాద్యంతంబులను రెండేసి యాచమనములు చేయవలెను. జలములభింపనిచో దక్షిణకర్ణ స్పర్శంబైనం గావించునది. ఏలన నందగ్గియు నాపస్సు వరుణుండు నర్కుండు నిందుండు వాయువు నింకెల్లదేవతలు నుండురుగాన నద్దాన నాచమన ఫలంబుదక్కు. అంతట మానసిక స్నాన పరిపూతుండై యరుణోదయ పర్యంతము గాయత్రి తప్ప మిగిలిన యీ వేదభాగములో ప్రార్థనాశ్లోకాలో పఠింపవచ్చును. పిమ్మట యూరికి నైరృతి దిక్కునఁగల బహిర్దేశంబున దేవళములుం బవిత్ర తరువులు లేనిచోట బాటకు నీటిపట్టునకును దూరముగా నాకలములు గడ్డిగాదములు లేనితావున మలవిసర్జన మొనరింపఁదగును. అట్టియెడ జందెము పేరుగా వేసికొని యంగవస్త్రము తలకుఁజుట్టుకొని యుండవలయును. ఇటునటు నాకసము దెసం జూడరాదు. పగటివేళనైన నుత్తర దిక్కునకును రాత్రివేళనైన దక్షిణదిక్కునకు నభిముఖముగా నుండునది. గోఁచి తీయకయుం గూర్చుండకయు మలమూత్రోత్సర్గంబుఁ గావింపఁజనదు. శుద్ధుఁడౌవఱకాగోఁచి ధరింపనుగూడదు. శౌచంబుతటిని వాపీకూప తటాకంబులలోని మృత్తుఁగొనవలెను. క్షేత్రతీర్థ దేవాలయ ప్రావరణంబులనుండియుం బుట్టలనుండియు మృత్తుగ్రహింపఁగూడదు. ఎటనేని జలముదరినిలేనివాఁడు మంటిగడ్డలతోనే శౌచంబు నెఱపికొనునది. మఱియుఁ దానెట్లయిన శుద్ధుండౌవఱకుఁ బానభోజ

నాదికంబు లొనర్పరాదు. అంతటఁ జేయవలసిన గండూషములు బ్రహ్మక్షత్రియాదులకుఁ గ్రమముగా నెనిమిదాఱు నాల్గు రెండు నని విధింపఁబడియున్నవి. ఆచమనానంతరమునఁ గులదైవతమును స్మరించునది. ద్విజుని కుడిచేత నడుమ నగ్నితీర్థము మొదట బ్రాహ్మముఁ జూపుడుబొట్టనవ్రేళ్ల మధ్యమందుఁ బిత్ర్యము వ్రేలి కొనను దైవమును జిటికెనవ్రేలికిఁ గ్రింద నార్షమునుండును. కాన నాయాయి కర్మంబుల నయ్యైతీర్థంబుల గ్రహించునది. ఎట్లనినఁ గేశవాది నామత్రయోచ్చారణంబున ముమ్మాఱుదకము లోనికి గ్రహించి 'గోవింద, విష్ణు' నామాలఁ జేతులఁగడిగికొని మధుసూదన త్రివిక్రమ నామసంస్మరణంబొనరించుచు నంగుష్ఠమూలంబు తోడఁ బెదవులం దుడుచుకొని వామన శ్రీధర నామోచ్చారణంబున శిరమున మార్జనమొనర్చికొని హృషీకేశ స్మరణంబున నెడమచేతను బద్మనాభస్మృతిం బాదంబుల దామోదరుస్మరించుచు శిరమునను బ్రోక్షించుకొని 'సంకర్షణ' యనుచు ముడిచిన వ్రేళ్ళ మూలంబులతోడ నాస్యంబంటుటయు వాసుదేవ ప్రద్యుమ్నాఖ్యలం దలంచుచుఁ జూపుడు బొట్టనవ్రేళ్ళతో ముక్కులందాఁకుటయు ననిరుద్ధ పురుషోత్తమాధోక్షజ నారసింహ నామంబుల నంగుష్ఠానామికలతోఁ గన్నులం జెవుల నంటుటయు నచ్యుతోచ్చారణమున నయ్యంగుష్ఠ కనిష్ఠికల బొడ్డునఁ జేర్చుటయు 'జనార్దన' యనుచు నరచేతిని హృదయమున నానుచుటయు నుపేంద్ర గ్రహణంబున నన్ని వ్రేళ్ళ కొనలతో నడునెత్తి నూన్చుటయుం గడపటి రెంట మాఱుఁబడిన చేతితో భుజమూలంబుల నంటుకొనుటయు సంధ్యావందన హోమాది కర్మంబుల నడపవలసిన యాచమనవిధి. (ఈకేశవాది నామము లిరువదినాల్గగుట గాయత్రీ మంత్రవర్ణ సూచకము. ఇందుఁ 'గేశవ, నారాయణ, మాధవ' యనునవి స్వాహాకార యుక్తములగుటచే నాధ్యాత్మికాధిదైవి కాధిభౌతిక బాధావినోదకంబులనియుఁ దక్కుఁగల జ్ఞానేంద్రియము లైదును గర్మేంద్రియము లైదును బ్రాణము

లైదును నుపప్రాణము లయిదును నంతఃకరణము నను వానిశుద్ధికి సాధకంబు లనియు గ్రహించునది. ఇట్లు వారత్రియ జలపాన పూర్వ శాష్టాంగ స్పర్శరూ పాచమనవిధి సక్రమముగా నెఱపఁ జాలనప్పుడు ముమ్మాఱు జలము లోనికిఁగొని రెండుచేతులుఁ గడిగికొని చెవిని దాఁకవలెను. శూద్రాది స్పర్శ కల్గినెడలను స్నానవేళను వమనమైన వెనుకను దనకాళ్ళను నోరులపాదములం గడిగిన తరువాతను ద్విరాచమనము కర్తవ్యము. విధివిహితంబుగా శ్రద్ధాభక్తులతో నాచమన మొనర్చువాఁడు పూతుండయ్యెడిని. అట్లొనరించిన వానికి దైన్యముండదు.

ఇంక నోటికంపు వోవ దంతధావనము. ఇది పర్వంబులందును బాడ్యమిని షష్ఠి నవమీ ద్వాదశీ తిథులందును నాది మంగళవారంబులందును శ్రాద్ధదినంబునను జేయఁగూడదు. ఖర్జూర కేతకీ నారికేళ కాష్ఠంబులతోఁ బండ్లు తోముకోరాదు. చంద్రమేడి మఱ్ఱి యుత్తరేను కానుగు జిల్లేడు పుల్లలలో నేదియైన గ్రాహ్యము. వర్ణక్రమంబునఁ బండ్రెండుఁ దొమ్మిదియు నెనిమిదియు నాలు నంగుళాలు పొడవుగల వానితో దంతశుద్ధి యొనరించికోవలెనందురు. 'ఆయుర్బల' మను మంత్రము నుచ్చరించుచుఁ గాష్ఠంబులఁ జీల్చి 'ముఖ దుర్గంధి' యనుచు దంతధావనము చేసినపిదప నద్దానిని నైరృతి దిశను బరిహరించునది. అంతం బండ్రెండుసార్లు పుక్కిలించి యుమిసినవెనుక నాచమన మొనర్చునది. పైన స్నానము సర్వసిద్ధిదము. దానఁ దేజస్సు బలము నాయువుఁ బ్రజ్ఞయుఁ బెంపొందు. అది దుస్స్వప్న దోషాపహంబును శోక దారిద్ర్య నాశకంబునై దేవతలెల్లర వశపఱచి సుఖపుష్టి సమ్మోద సౌభాగ్య ప్రదంబయ్యెడు. అట్టి ప్రాతస్స్నానంబనుదినమున నొనరించునది. బ్రహ్మచారు లొక్కసారియు గృహస్థులుదయమధ్యాహ్నములందును వానప్రస్థులుయతులువ్రతులుం ద్రికాలంబుల స్నాతులుగావలయు. సంకటమునను జలము దొరక నప్పుడును వ్యాధిగ్రస్తత నశక్తత 'నాపోహిష్ఠామయో

భువః' యనుమొదలైన మంత్రము లుచ్చరించుచు ముమ్మారు మార్జన మొనర్చుకొన్న మంత్రస్నానమగును. మృత్తికతోడ నైన భౌమము. ఎండవానల వల్లనైన దివ్యంబు నన నగును. విష్ణుధ్యానంబున మానసికస్నానము. గురుదర్శనం బొనర్చుటను దల్లిదండ్రుల పాదోదకంబును దేహంబునను శిరంబునను దాల్చుటను దీర్ఘస్నానమగును. ఇవిగౌణములు. అంత్యజాదు స్పృశించునెడ జలావగాహన మొనర్చితీరవలయు. శూద్రాది స్పర్శంబున దేహదార్ఢ్యానుసారముగాఁ బ్రవర్తించునది. అశక్తు లుష్ణోదక స్నానమైనం గావింపఁదగ్గది. జలముస్వభావ పూతము. అట్టిదానికి నగ్నిస్పర్శంబునఁ బవిత్రతయధికమగును. గృహస్థుని కిదిముఖ్యము. కాని యింట వేడినీళ్లు మజ్జనమాడువానికి సంకల్పము నాచమనము మార్జనము నఘమర్షణము తర్పణము నాదిగాఁగలవి పనులు వలనుపడదు. కాన శీతోదక మొక్కింబుఁగావించి గాయత్రి తోడ నభిమంత్రించి తుదకు మార్జనంబుఁ గావించుకొనవలెను. ఏమైనను బురుడు మైలలందును శ్రాద్ధదినములను వ్రతదినములం బర్వంబుల నుష్ణోదకస్నానము తగదు. వివాహాది శుభకార్యముల వల్ల శీతోదకస్నానము కూడదు. ఏట మునుంగునెడఁ బ్రవాహాభిముఖముగను నితరస్థలంబులందైనఁ బ్రాఙ్ముఖంబుగను బవిత్రము ధరించి జుట్టు ముడివేసికొని యొరులతో మాట్లాడకుండ స్నానంబుఁగావించునది. అందు ముందుగ మార్జనము నంత నఘమర్షణ మంత్రోచ్చారణంబు నాపైనఁ దర్పణాదికంబు నొనర్చి పిండిన బట్టనుగట్టుకొని 'అపవిత్రః పవిత్రోవా' యనుమంత్రముతో విష్ణుస్మరణంబుఁ గావించునది. ఆదివారమునాఁ డభ్యంగ స్నాన మొనర్ప రుజాభయము, సోమవారమునైనఁ గాంతిహాని, మంగళవారమున మృత్యుభయము బుధవారమైన శ్రీలాభము, గురుశుక్ర వారంబులనైన నపత్యనాశనమునగు. శనివారపుఁ దలంటువల్ల సంపత్తులొదవును. సుమంగలి నిత్యశిరస్స్నానంబు సేయరాదు. శక్తిలేనప్పుడు గంగను సంస్మరించి తడిగుడ్డతో నొడ

తెల్లఁ దుడిచికొన్నను స్నానఫలంబు గల్గును. ఇఁక రంగుబట్టలు ముఱికివి చినిగినవి కాలినవియు ధరింపరాదు ఉపవస్త్రములేక కట్టుబట్టతోడనే యుండువాని సుకృతము రాకాసులపాలగు. బ్రాహ్మణునకుఁ దెల్లవలువయు నుత్తరీయమును ధార్యములు. అన్యవర్ణములవారు రక్తాది వర్ణంబులవైనను గట్టవచ్చును. బట్ట కట్టుకొన్న తరువాత ద్వారవతీ గంగామృత్తులతోఁగాని భస్మముతోడఁగాని యూర్ధ్వపుండ్రము ధరించునది. పుష్టిఁ గోరువా రంగుష్ఠమునను నాయుష్కాములు మధ్యమమునను నన్నకాము లనామికతోడను మోక్షాపేక్షకులు తర్జనితోడను విష్ణుసాయుజ్యంబుఁ జేకూర్పఁ జాలెడి యామృత్తును ధరింపవలయు. గోళ్లతో ధరించినఁ బాపమగును ఆరేఖలు పదియంగుళాలు పొడవుఁ గలిగియున్న నుత్తమము. ఎనిమిదైన మధ్యమము. ఆఱంగుళాలు మాత్రమైన నధమము నగును. శుక్లపక్షమందుఁ గేశవాది నామోచ్చారణంబుతోడను కృష్ణపక్షమందు సంకర్షణాదిగను నుదుటను బొడ్డునవక్షమునఁ గంఠదేశంబునను కుడిప్రక్కను కుడిచేతం గుడిచెవియందు నెడమప్రక్కను నెడమచేత నెడమచెవిని వీపున శిరమునను గ్రమముగా ధరించునది. అట్లే భస్మముంగొని తిర్యక్పుండ్రములను ధరింపవలయును. వీనివలన హరిహరతుష్టి యొదవి భుక్తిముక్తిహేతువయ్యెడిని. శ్రాద్ధాదులగు నశుభంబులందును వివాహాది శుభకార్యముల పట్టులందును దలంటుకొన్నవాఁడును బూదిఁ బూసికొనరాదు. సూతకములందు మృత్తుకూడదు. మఱియుఁ బితృతర్పణాది వేళలందు దర్భతోఁ గట్టిన పవిత్రమును జేతనుంచుకొనునది. ఈదర్భలు కుశ కాశ యవోశీర గోధూమ వ్రీహి కుందర తృణ మౌంజ దూర్వాభిధములు పదివిధములు. వీనిని శ్రావణమున మాత్రము ప్రత్యహము నితరంబుల దర్భయాతఱిని గోసి తెచ్చుకొవలెను. పవిత్రితకై దర్భల బ్రాహ్మణుఁడు నాల్గు క్షత్రియుఁడు మూడు వైశ్యుఁడు రెండును శూద్రుం డొక్కటియుఁ గాఁ జేత నుంచుకొవలయును. వీని మొదళ్ల రుద్రుండును నడుమ

విష్ణువును గొనల బ్రహ్మయు నుండురు. కావునఁ బవిత్రధారియు కాలవజ్రధారులునువారివారికతుల్యులనువలెనేయువిపాపసంహారం బొనరింపఁ జాలెడిని. యజ్ఞాది కర్మంబులం దుక్తవిధిని ముడివేయఁ బడినదియు భోజనాది కంబులందు గ్రంథిహీనం బొనదియు ధార్య ములుగాఁ దెలియవలెను. ఈలోడికెడు గట్టిపోఁచలే సర్వాఘ తృణరాసులకు సర్వభక్షక సదృశంబులు కాఁగలిగడిని. ఇఁక జపదాన హోమాదులందు దర్భముడిగల బంగరువెండి యుంగ రాలను ధరింపవచ్చును. దేవతా ప్రీత్యర్థ స్వర్ణమయ మగువాని ననామికలందును వెండివానిని దర్జనులందును ఖడ్గముద్రాంకితము లం గనిష్ఠికలందు నలంకరించికోఁ దగును. ఎవఁడైనను దనతండ్రి జీవించి యున్నంతవఱకిట్టివి ధరింపఁగూడదు. అంగుళీయకము నవరత్న ఖచితమైనను లేదే నేకరత్నాంకితమైనను బ్రశస్తము.

ఇఁక సంధ్యావందనము ప్రాతఃకాలమున రిక్కలు పోవక మున్న చేయుట యుత్తమము. చుక్కలు పోయి యరుణుండు రాని మొడనైన మధ్యమము. సూర్యోదయానంతరమునఁ జేసిన దధ మము నగును. సాయం సంధ్యావందనమో భాస్కరోపేతమే యుత్తమము. అస్తమయానంతరమున వార్చినది మధ్యమము. తారకోపేతమూలఁటి నొనర్చిన నది యధమముగాఁ బరిగణింపఁ బడ వలసినదే. మఱి మధ్యాహ్న సంధ్యావందనమన్న నయ్యది విహితకాలమునఁగాక మఱెప్పుడు చేసినను నిష్ఫలము. అయ్యది ద్విజుఁడు జుట్టు ముడివేసికొని పవిత్రధారియై యాచమనానంత రమున బ్రహ్మచర్యమం దల్పానామి కాంగుష్ఠములతోడను గార్హ స్థ్యమున నైదువ్రేళ్ల కొనలతో నిడామార్గంబున వాయువును బంధించి ప్రణవసహిత సప్తవ్యాహృతులుగ శిరస్సహిత గాయత్రీ మంత్రము ముమ్మాఱు జపించి తిరిగి పింగళామార్గంబున విడుచు నది. మార్జన మొనర్చుకొనునప్పుడు జలపాత్రి నెడమచేత నుంచు కొనవలెను. ఆపాత్రము భిన్నము ద్విముఖమునుగాని మృణ్మ యముగాని యైయుండరాదు. మార్జనవిధి వినునది: 'ఆపోహి'

ప్రభృతులందలి 'వకారరేఫాంత' ములతో శిరస్సున 'నకారము' తుదినున్నవాని నుచ్చరించునెడలఁ బదంబులను 'సధాంతముల'తో హృదయదేశంబునం బూతంబు గావించుకొనునది. పిదప నుదయమున 'సూర్యశ్చ' మధ్యాహ్నవేళ 'ఆపఃపునన్తు' సాయంతనమున 'అగ్నిశ్చ' యనను మంత్రంబులవల్లఁ బరిపూతంబులైన జలంబుల లోనికి గ్రహించునది. అంతఁ బూర్వపరాచమనంబులతో నఘమర్షణ మైనవెనుక సూర్యునకు నర్ఘ్యప్రదానము ముమ్మాఱు గాయత్రీ మంత్రోచ్చారణ పూర్వకంబుగఁ గావింపవలయు. కాలాతిక్రమమగునెడఁ దద్దోష హారణార్థ మింకొక్కయర్ఘ్య మొసంగునది. ప్రాత రర్ఘ్యప్రదానవేళను దోసిట నుదకము గ్రహించి యడుగెత్తున లేచి మఱి విడువవలెను. మధ్యాహ్నార్ఘ్యము 'హంస' యను మంత్ర ముచ్చరించుచు వంగి యొక్కపర్యాయమే విడుచునది. సాయంకాలమునఁ గూర్చుండియే గాయత్రీపూర్వ కార్ఘ్యదానముఁ గావింపవలయు.

సూర్యుని కీయర్ఘ్యం బేమిటి కందేనిఁ జెప్పెదను వినుము. మందేహులనఁబడు రాక్షసులు ముప్పదిమూడు కోట్లుగలరు. వీరు భానూదయంబునకు విఘ్నకారులు. ఆకర్మసాక్షి లేనిది కర్మమింకెక్కడిది? కర్మలోపమైన దేవతలనోట గడ్డయగును. దాన జగానకెల్ల నష్టమియగు. ఇఁక నీ గాయత్రీమంత్ర పూతంబులౌ జలంబులు వజ్రాయుధ సదృశంబులై యయ్యసురుల యసువులం గొనఁజాలెడిని. ఇట్లు లోకమునకు దైన్యనాశకము కాఁగలదు. కాని దీన బ్రహ్మకులజులకు హత్యాదోష మొదవెడిని. తన్నివారణార్థమై 'అసావాదిత్యోబ్రహ్మ' యను మంత్ర ముచ్చరించుచు సభక్తికముగా నాత్మప్రదక్షిణముఁగావించిన నాప్రదక్షిణ ఫలంబు దక్కి కిల్బిషంబును స్రుక్కఁజేసెడి. సాయం సంధ్యావందన మింటిలోఁ జేయుకంటె వెలుపల నొనర్చినఁ బదిరెట్లు ఫలముదక్కును. నదీతీరమున కేగిన నదే శతగుణమును బుష్కరాదుల సహస్రగుణము నయ్యెడిని. గంగా తీరంబుననైన నమితఫలము చేకుఱు.

సంధ్యావందనము సకాలమున బయటఁ గూర్చుండి వార్చుటవల్ల సురాపానాసత్యప్రలాపాదికర్మములవల్లఁ గల్గిన పాపాలెల్లఁ దుడుచుకొని పోవును. ఇఁక జపమో యింటిలోఁ గూర్చుండి చేసికొన్న దానికంటె నేటిదరిని మూఁడురెట్లెక్కువఫలము దక్కెడిని. మఱియు వనమునందుఁగాని గోవులుండు తావునఁగాని చేసినఁ బదంతలు ఫలము. అగ్నిశాలలోనైన నూఱురెట్లు. మహాక్షేత్రంబులందో వేయిమడుంగులు. హరిహర సన్నిధానమున ననంతఫలముండును. ఇఁకఁ దపంబు సేయుతఱిఁ బీటమీఁదఁ గూర్చుండుటవల్ల దుఃఖము నపకీర్తియు ఋణమునగు. చిగురుటాకుల మీఁదనైన దారిద్ర్యమును ఱాతిమీఁదనైన రోగమునేర్పడును. కుశాసనాసీనుండౌవానికో రోగముపోయి పాపమడంగి ప్రతిభయు నాయువును బెంపొంది చిత్తవశీకరణశక్తి యేర్పడును. బూదిదలోఁ గూర్చున్న నారోగ్యము మాత్రమబ్బెడి. ఉన్నితోఁ జేయఁబడిన చిత్రాసనంబునఁ గూర్చుండు నెడ సౌఖ్యమొదవెడి. కృష్ణాజినంబువల్ల జ్ఞానసిద్ధి. వ్యాఘ్రచర్మంబువల్ల సిరియు మోక్షముం బ్రాప్తించెడి. జపానుష్ఠానంబునకుంగడంగు నెడఁ బ్రాఙ్ముఖంబుగఁ గూర్చుండి ప్రణవోచ్చారణంబు సేసి భూప్రార్థన మొనర్చి భూతములం దొలఁగించుకొని ఋషులను దైవతములను వేదములను స్మరించుచు నంగన్యాస కరన్యాసంబులుసేసి తత్త్వముద్రాప్రదర్శన పూర్వకంబుగా వరదాత్రియగు నుపాస్యదైవతమును ధ్యానించి మంత్రార్థంబును మనంబున ననుసంధించికొని ప్రణవసహితంబుగ గాయత్రీ మంత్రంబు నేకాగ్రచిత్తంబుతోడ నాసాగ్రదృష్టి యొప్ప వస్త్రాచ్ఛన్న మాలాపరిగణనం బొనర్చుచు జపించునది. పిదప హృదాది న్యాసంబుసేయునది. పాడినవారిని గాపాడునదిగాన గాయత్రియయ్యె. మనమునకు స్థైర్యంబును జిక్కించునది గావుననదిమంత్రమండ్రు. జన్మంబుఁ బాపి పాపం బడంచుట జపంబునాఁబడును. గాయత్రి వేదమూలంబౌటఁ దజ్జపంబువల్ల వేదపాఠ ఫలంబొదవి యిష్టప్రాప్తియగును. అట్టి

గాయత్రిని జపింపని ద్విజుండు సూకరప్రాయుం డయ్యెడిని. జలమునందు జపంబు సేత ప్రజ్ఞాహానికరము. ఏలయన నందు దక్షిణాగ్నియు గార్హపత్యము నాహవనీయము నను నగ్నిత్రితయ మంతర్భూతము గానుండెడినని శ్రుతులవల్లఁ దెలియఁగలము. అట్టి జలంబున మంత్రజపం బొనర్చునెడ మంత్రతేజంబు దగ్ధం బౌను. ఇంక జపమాల యుదయవేళ నాభిదేశంబునను మధ్యాహ్నమందు హృదయ స్థానంబునను సాయంసమయమున ముఖ సమీపమందును ధరింపవలయు. మఱియుఁ బ్రాతర్జపము నిలుచుండియో కూర్చుండియో చేయఁదగు. మాధ్యాహ్నిక జపమున్ముఖంబుగ నెఱపునది. సాయంకాలికము వృక్షాగ్రంబుల దెసం జూచుచునో నాసాగ్రదృష్టితోనే కూరుచుండియే నిర్వర్తింపవలయును. గేస్తులు త్రికాలముల నష్టోత్తర శతసంఖ్యకం బెఁ దక్కువకాకుండ జపంబు సలుపునది. వానప్రస్థులు యతులును మాత్రము వేయేసి జపింపవలయు. జపము మానసికమైన నుత్తమము. ఏకాంతజపము మధ్యమము. ఒరులు విననట్లుచ్చరించున దధమము. మంత్రమునందలి ప్రతిపాదాంతమున విరమించుచుఁ బ్రణవసహిత వ్యాహృతితోడి గాయత్రీ జపమొనర్చుటవల్ల బ్రహ్మహత్యాద్యఖిల మహానాశంబై యనంతపుణ్యంబు చేకుఱును. జపసంఖ్యా పరిగణనమున వ్రేళ్లనందలి పర్వములు శంఖమణులు పగడాలు పటికపుఁబూసలు ముత్తెములుఁ బద్మాక్షములు స్వర్ణమణులు రుద్రాక్షలును గ్రాహ్యములు. క్రమముగా నిందొకటి కొకటి పదిరెట్లధిక ఫలము నిచ్చెడిని దర్భముళ్ల మాలికయు బహుపుణ్యదాయిని యగు. జపమెప్పుడును నిశ్శబ్దముగాఁ గావింపవలయునే కాని మాలను ద్రిప్పుటలోఁ జప్పుడు కాఁగాదు. జపమాల నంగుష్ఠ మధ్యమంబులతోడఁ ద్రిప్పునది. అందెప్పుడును మేరువుపూసను దాఁటిపోరాదు. పొరపాటున నపుడే నట్టులైన ముమ్మాఱు ప్రాణాయామము లొనరించునది. మూఁడు దినముల నియమముతోడ నెవఁడేని గాయత్ర్యనుష్ఠానంబు నెఱపునేని త్రివిధ పాపలయంబు

కానయ్యెడు. ఉక్తకాలంబు నతిక్రమించి చేయుజపంబువల్లలఘు పాప నాశంబైనను గాకయుండదు. గాయత్రీసహస్ర జపంబు వలన నుపపాతకంబు లడంగును. కోటిజపమున మహాపాపంబులెల్లఁ దీఱి యిష్టార్థసిద్ధి యయ్యెడిని. డబ్బుఁగొనిచేయు జపమువల్లను చండాలత్వము ప్రాప్తించును. శూద్రాదులకుఁ జేరువగా జపానుష్ఠానంబుఁ జేయరాదు. జపవేళను గోకికొనుటయు నొరులతో మాట్లాడుటయుం గూడదు. అజ్ఞానకృతము లేవైనఁ గలిగినవెంటనే కర్ణంబు స్పృశించి విష్ణుస్మరణంబుఁ గావించునది. జపమధ్యమందుఁ జండాల దర్శనంబైన ద్విరాచమనము కర్తవ్యము. అపుడు ద్విజుఁడితరులతో సంభాషించిన స్నాతుండైననేకాని పూతుండుగాఁడు. కావున మౌనము వహించి జపించునది. స్వజాతీయులతోడి సంభాషణము కలిగినఁ 'దద్విష్ణో' యనుమంత్రము స్మరించినం జాలును. అయ్యెడ నిదురవట్టిన నావులించిన నధోవాయుగమనంబైనను గోపమువచ్చినను దోషియౌఁగాన దన్నివారణార్థము దక్షిణకర్ణస్పర్శన మొనరించి భానునివంకం గాని ధేనువుదెసం గాని చూచి 'ఇదంవిష్ణు ర్విచక్రమే' యనుమంత్రంబుం బఠించునది. గాయత్రీజపానంతరమునఁ బ్రాతఃకాలమున మైత్రమంత్రములను మధ్యాహ్నమందు సౌరముల సాయంతనమందు వారుణంబుల నుపస్థానంబు సేయునది. తత్తత్స్వసూక్తోక్త మంత్రపఠనంబైన వెనుక దిగీశ్వరనమస్కారంబు సేసి గోత్రప్రవరాభిధాన పూర్వకంబుగా గుర్వభివాదంబుఁ గావించునది.

ఇట్లు సంధ్యావందన మొనరించిన వెనుక గృహస్థుఁ డుదితానుదితహోమానుసారుఁడై సాయంతనమందు నుదయమున నౌపాసనంబు సేయవలయు. పుట్టలందు నేలను హోమాదికంబనుచితము. విధివిహితంబుగా నేర్పఱుపఁబడిన కుండముననో లేక దర్భలచే సంస్కరింపఁబడిన భూమియందో యగ్నిని బ్రతిష్ఠించి సూర్యుఁడస్తమింపక ముందు నుదయింపకుండఁగాను వెదురుగొట్టముతోఁగాని విసనకఱ్ఱతోఁగాని ప్రజ్వలింపఁ జేయవలెను. అట్లుకాక చేటతోనో

యాకుతోనో చేతితోనో విసరియు నోటితో నూఁదియు మండు నట్లుచేసిన ధననాశనము వ్యాధిపీడయుంగలిగి తుద కాయువు క్షీణించును. సమిత్తులుఁ బుష్పములును దర్భలు మున్నగునవి శూద్రులవల్లఁ దెప్పించికొనుటయుం గొనుటయు ననుచితములు. నీవారములు శాలిధాన్యము తండులములు గోధుమలు యవలు జొన్నలును గోరసమును హోమార్హద్రవ్యములని యెఱుంగునది. ప్రజ్వలితాగ్నియందు సమిత్తులుంచి పిండితోడనో పూర్వోక్త ధాన్యాదులతోడనో పూర్వాహుతి నమర్పించి యంత ద్వితీయా హుతియు నొసంగునది. అవుసేయి దొరకనియెడ నువ్వులనూనెను నూవులనైనను హోమ్యద్రవ్యములుగా సేకరించునది. ఔపస్థానాది కంబొనరించి ముగించిన వెనుక బ్రహ్మయజ్ఞంబుఁ గావించునది. ఒక్కొడ నిది మాధ్యాహ్నిక సంధ్యావందనా నంతరమున వైశ్య దేవానంతరమున నైనను నొనర్పనగును. బ్రహ్మయజ్ఞము జలా శయ సమీపమునఁ గావించుట మేలు. అట స్నాతుండై ప్రాణా యామంబు సేసి సపవిత్రాంజలిని గుడిమోకాలిపైనూనిచి భూమ్యా కాశ సంధిప్రదేశమున దృష్టినిలిపి ఓంకార వ్యాహృతులతో యథాశక్తిగసాంగ వేద పాఠంబుగావించునది. అనధ్యయనమైన సూక్తమో ఋక్కొ-జపించి 'నమోబ్రహ్మణె' యని ముమ్మాఱు వల్కు-నది. అంత 'వృష్టిరసి' యనునది పఠించి తర్పణ మిడ వలయు. దాన వసు రుద్రాదిత్య దేవర్షి పితృతృప్తియగును. బ్రహ్మ యజ్ఞ మెప్పుడును బవలే చేయవలయు. సంకట మొదవునెడ ముమ్మాఱు గాయత్రీమంత్రము జపించు మాత్రమున వేదపాఠ ఫలంబు దక్కు-ను. పిదప యవలుం గుశయు నుదకముంగొని దేవ తర్పణ మొనర్పవలెను. అంతం దిలోదకాలతోఁ బితృతర్పణము సేయునది. కాని పాత్రమునను జలమునందును భూమిమీఁదం జేయరాదు. నేలను దర్భలు పఱచి యటఁ జేయవలయు. తర్పణ మెప్పుడును భక్తితో నామగోత్రోచ్చారణ పూర్వకంబుగ నొన రింపవలయును. తిలతర్పణ మేనాఁడు నింటఁ జేయఁగూడదు.

ఖాతినేలను గట్టులమీఁదను వెంట్రుకలమీఁదను నూతులలోను బడ్డ తిలలు పురుషులకుం దుల్యములౌట నందందుఁ బితృతర్పణము కూడదని గ్రహించునది. నూవులు తెల్లనివి దేవతలకు ధూమ్ర వర్ణముగలవి ఋషులకు నల్లనివి పితరులకును బ్రీతికరములని తెలియ నగును. దేవకార్యములం దుపవీతము ఋష్యర్థమునివీతమును బితృ తృప్తికిఁ బ్రాచీనావీతము నుక్తములు. తర్పణమున నుదకము దేవ తల కొక్కదోసెడు ఋషులకు రెండుదోసిళ్లు మాతాపితలకు మూడేసి సవతితల్లికి గురువునకు భార్యకు రెండేసియుమిగిలినవారి కొక టొక్కటియుఁగా వదలునది. దేవతలకు యవలును బితరులకుఁ దిలలును దృప్తిదములు. ఆది మంగళ శుక్రవారములందునునందా తిథి యుగాతిథిని మఘానక్షత్రమందును జన్మనక్షత్రము వచ్చు నెడను దిలతర్పణము చేయరాదు. పితృ పితామహ ప్రపితామహ సపిండా దుల నైమిత్తికములందుఁ దక్క వివాహమైనవెనుక నొక సంవ త్సరము వఱకు నుపనయనానంతర మాఱు నెలలవఱకును జౌలము నెఱపిన తరువాత మూఁడు నెలలదాఁకను దిలతర్పణమును వర్జించు నది. అట్టియెడల దర్భపవిత్రము చేతనిడికొని యుదకము వద లినఁ జాలును. శ్రాద్ధాదులందో పాదప్రక్షాళనము లేని స్నానమును దిలలు లేనితర్పణమును దక్షిణ లేనితాంబూలమును నిష్ఫలములు. దీపావళినాఁడు సవ్యముగఁగాని యపసవ్యముగాఁగాని యమునికి ధర్మరాజునకు మృత్యువునకు నంతకునకు వైవస్వతునకుఁ గాలునికి సర్వ భూతక్షయునికి నౌదుంబరునికి దధ్నునికి నీలునికిఁ బరమేష్ఠికి వృకోదరునకుఁ జిత్రునికి చిత్రగుప్తునికిని మూఁడేసి దోసిళ్ల నీళ్లు వదలవలయు. అట్లొనర్చినవారికిఁ బాపపీడయు రోగబాధయు శనివేధయు నపమృత్యుభయము నంటఁబోవు. మఱి మాఘ శుక్లాష్టమి నాఁడును భీష్మతర్పణ మొనర్చినవారి కాయేఁడాదిలోఁ జేసిన పాపాలెల్లఁ దుడిచికొనిపోవుచుండును. ఇట్లు బ్రహ్మయజ్ఞ పితృతర్పణంబు లొనర్చి విధివిహిత మాధ్యాహ్నిక సంధ్యావంద

నముఁ గావించుచుండవలె, నని శ్రీగురుండా విప్రోత్తమునకు బోధించె'నని సిద్ధుండు వలికెను.

కర్మకాండము — ౧౩ దశము.

**నామధారకుం** 'డింక గురూక్త ధర్మంబులెల్ల నెఱింగింపుఁ' డన విని సిద్ధుండిట్లు వివరింపఁజొచ్చె: 'శిష్యా! సాక్షాన్నారాయణుండా సర్వజ్ఞుండు శ్రీగురూత్తముండు కృపామతియై యింక నన్నేని బోధించె. అంత్యజు నిచ్ఛామాత్రంబున విప్రునిఁజేసి వేదాలు వల్కించిన మహానుభావుఁడు ధర్మంబు లుగ్గడించు టొక లెక్కయా? ఆభక్తకల్పద్రుమ మోక్తంబుల నుడివెద నాకర్ణింపుమోయీ: ప్రతి గృహస్థుండు వరణియు సాలగ్రామమును గోఘృతమును జందనమును గృష్ణాజినమును నూవులు మున్నగువాని నెవ్వండు నింట జాగ్రత్త గలిచికోవలెను. శుక్లపక్షమందు మాత్రము బెగ్గురుపిట్టను సర్వకాలములందుఁ బాపసంహారిణియగుగోవును సంరక్షించుచుండవలెను. అనుదినమును గోమయముతో దనిల్లలికించి నియత దేవతారాధనాదికముఁ గావించుచుండునది. సమ్మార్జన సమయమునఁ దమకుఁగల సంపదకొలఁది బంగారపుదో వెండిదో రాగిదో తుదకు మంటిదో యొక పాత్రము నుపయోగించుకొవచ్చునేకాని యేనాఁడును గంచుచెంబును మాత్ర మందులకు గ్రహింపరాదు. కన్యలచేతను వహోఘలచేతను శూద్రులచేత నలికింపఁగూడదు. కుశిచేత నేకాని యెడమచేత నలుకరాదు. రాత్రివేళ నుగూడదు. చావిడికి నైరృతిమూలనుండి యలుకుటకుఁ బ్రారంభింపవలెను. దేవతామందిరముకడ ముగ్గులు దిద్దించి దర్భాదికపూర్వోక్త పవిత్రాసనాసీనుఁడై త్రిసంధ్యము దేవతారాధనముఁ గావించుచుండునది. అందులకు శక్తిలేనియెడ మధ్యాహ్నము తాను భుజింపక ముందు పంచోపచారములతోనైన దేవపూజ నెఱపవలయు. సాయంతనము నీరాజన మిడుచుండునది. దాన ఘోరనారకంబులెల్ల నడంగి యమదండనము తప్పును. జలము నర్కునగ్ని నారాధించుటవల్ల నారాయణప్రీతి యగును. స్వర్గాపవర్గదమా

మానసపూజ ప్రశస్తము. స్థండిలపూజ మధ్యమము. ప్రతిమా రాధన మధమము. గోబ్రాహ్మణ పూజనమున నింక విశేషము కలదు. ఇంక శ్రీ గురుపాదసమర్చనంబునను మూర్తిత్రయ సంప్రీతియుం బురుషార్థ సిద్ధియు నభీష్టప్రాప్తియు నని యెఱుంగునది. కలిలో నరులకు మనస్స్థైర్యమరుదు. కావున వ్యాసుడు. కేశవుం దట్టివారికి సదుపాయంబుఁ గల్పించెను. చక్రాంకితంబును ద్వారవతీ సముద్భవంబును సాలగ్రామంబు నర్చించినఁ దత్పూజ తనకుఁ జేసి నట్లనుచెఁ. సాలగ్రామ తీర్థపానంబునఁ బాపక్షయంబు నయ్యెడి. తత్పూజాక్రమంబు గురుముఖంబునం దెలిసి వేదమంత్రములతో భక్తియుతి నారాధించునది. స్త్రీలకు శూద్రులకును వేదమంత్రోచ్చారణాధికారంబు లేదుగాన వారు విప్రోక్త పౌరాణిక మంత్రములతోఁ బ్రతిమారాధనంబుఁ గావింపవలయు. శ్రీగుర్వాజ్ఞను భక్తితో నర్చించినయెడలఁ గొయ్యలును ఱాలును దేవతాత్వంబు నందనయ్యెడిని.

అర్చనంబునకుం గూర్చుండుటకుఁ బ్రాణాయామంబు సేసి 'యేభ్యోమాత' యని మనుష్యగంధంబుఁ దొలఁగించుకొనియాత్మను శోధించి పూజకు సంకల్పించియుంగన్యాసాదికంబైన వెనుక దేవతా దక్షిణభాగంబున సోదక కలశంబును గంటయు వామభాగమున శంఖమును బూజాద్రవ్యములసమర్పునది. అంతశంఖమునుగంటను బూజసేసి శంఖనిక్షిప్త జలమును బూజాద్రవ్యములపైన దేవుని పైనఁ దనపైనను బ్రోక్షించికొనునది. మఱియు ముంగల నిర్మాల్యంబుఁదీసి నైర్ఋతిదిశను బడవేసి ధౌతవస్త్రంబును గ్రిందఁబఱచి దీపారాధనముఁ గావించునది. అంతం బ్రకరణసిద్ధిగా గురువులకు నమస్కరించి పీఠపూజయు ద్వారపూజయుఁ గావింపవలయు. ఆపైనఁ బురుషసూక్తవిధానంబున ధ్యానావాహనాది షోడశోపచార పూజలును జరుపునది. ఎట్లన్న స్వాత్మస్థచిత్కళయే యెదుటనున్న దేవస్వరూపముగా ధ్యానించి యావాహనముసర్పియాసనమునుసమర్పించునది. పిదపఁ బాద్యార్ఘ్యాచమనస్నానములుక్రమముగా జరుపు

నది. స్నానము నెడ యథాసంభవముగాఁ బంచామృతములతో వేఱు వేఱుగా నాయాయి మంత్రములతోడ నెఱపునది. అప్పొడఁ బురుష సూక్త విధానానుసారముగా రుద్రాభిషేకంబు నొనర్చి యాచమనం బొసంగి పీఠమున దేవతాస్థాపనంబుఁ గావించునది. వెండియు వస్త్ర యుగ్మ యజ్ఞోపవీతము లొసంగుచుఁ బ్రత్యేకాచమనములు నర్పించునది. పైన గంధాక్షతలిడి పుష్పపూజ సల్పునది. పూవులు తోఁటలోఁ గోసి తెచ్చినవి ప్రశస్తములు. అడవిపూలు మధ్యమములు కొన్నవి యధమములు. అందును దెల్లనిపూవులు శ్రేష్ఠతమములు. ఇఁక నెఱ్ఱనివియుం బచ్చనివియు మధ్యమములు. నల్లనివియుం జిత్రవర్ణములవియు నధమములు. ఇఁక వాడినవియుఁ దునిఁగినవియు నేలను రాలినవియుం బూజార్హములు కావు. తామరలు తేకులాడినను దులసీబిల్వము లెండినను గంగోదకమువలెనే పర్యుషితములుగా నెంచఁదగదు. ఈ పుష్పజాతులందుఁ దామరలుఁ బొగడలు సంపెఁగలు నాగకేసరాలుఁ బాటలములు మల్లెలు జాజులుం గలువలు గన్నేరుపూవులును సర్వదేవతాప్రీతికరములు. ఇఁక సాలగ్రామముపై జిల్లేడుపూలఁ బెట్టిన నాత్మనాశనమును మ్మెత్తలుంచుట వల్లఁ బ్రజ్ఞాధననాశనమును దింటెన పూవులంటించిననే కులనాశనమును వాఁకుడు పూవులపూజవల్ల శోకమునగును. కొండమల్లెల పూజవల్లను దుఃఖమే. బూరుగు పూవులవలన రోగము సంభవించును గాన నరసి మఱి హరికిఁ బుష్పంబు లర్పించుచుండవలయును. మఱి శివునకు వెలగపూవులు మొగలిపువ్వులుఁ గానుగులు లొద్దుగులు నారెలు వేఁపలు గురివెందలుం బొగడలు నింకే కృష్ణరక్తవర్ణ పుష్పాదికంబులుఁ గానిపూజింపరాదు. అతనికి శ్వేతములే ప్రీతిదములు. గణపతికిఁ దులసియు నంబికకు గఱికయు నర్పింపరాదు. ఇట్టులఁ బరికించి పూజించినఁ బురుషార్థంబులు చేకుఱు. ఇఁక నేకాదశోపచారము సుధూపాఘ్రాణము. పైది దీపారాధనము నాపైన నైవేద్యము. తరువాతఁ దాంబూల ఫల దక్షిణార్పణము. పదేనవది నీరాజనము. కడపటిది మంత్రపుష్పము. ఇట్లు షోడశోప

చార పూజలొనర్చిన వెనుక నమస్కారము. బ్రాహ్మణోత్తమా! అదెట్లో చెప్పెదవినుము. ఎప్పుడును దేవుని కభిముఖముగాఁగాని వెనుకతట్టునఁగాని సాఁగిలఁ బడరాదు. మఱియు గర్భాలయంబు నను దగదు. కేలోడ్చి యాత్మప్రదక్షిణ మొనర్చి పిదప సాష్టాంగ దండప్రణామంబుఁ గావించునది. దేవతాభివాదనానంతరమందుఁ దన తలిదండ్రుల పాదాలకు మ్రొక్కి యంతం బురోహితునికి వందనము సేయవలెను. కడపటఁ దానును దన సహధర్మచారిణియు నొక్కమాఱు తత్రత్యులౌ సదస్యుల దెసకుఁ దిరిగి యంజలి ఘటించునది. జననీజనకులకు గురువులకు నెఱఁగు తెఱఁగిది: ముందు రెండుచేతులతోఁ దన రెండు చెవులను స్పృశించికొన్న పిదప వారల మోకాళ్లవద్దనుండి పాదములవఱకుఁ బిసికి మఱిప్రణమిల్లునది. అట్టి సాష్టాంగ ప్రణామము నందఁదగు పెద్దలెవరెవరన్న మాతయుం బితయుమంత్రదాతయు విద్యాదాతయు నన్నప్రదాతయు భయహర్తయు సవతితల్లియు నన్నయుం బినతండ్రియుం బురోహితుఁడును వయోవృద్ధులౌ నాప్తులును జ్ఞానవృద్ధులౌ బంధుగులునని తెలియుము. అభివందనానర్హులన్ననో తనకన్నఁ జిన్న వాండ్రినజ్ఞానులునింకనశుచులునమిత్త్రులుంబుష్పములుం గుశలును జేతఁగలవారునుస్నానమొనర్చుచున్నవారుఁ బరుగెత్తుకొని పోవు వారుఁ గ్రోధవంతులు గర్వితులు గతప్రాణులు మొఱకులు హీనులునని గ్రహింపుము. మఱియు బ్రాహ్మణుని కెన్నఁడు నొక్కచేతితో నమస్కారము చేయకుండెదవుగాక. ఇంక దేవతా నమస్కారానంతరమందు గీతవాద్యంబుల దేవతా సంతుష్టిఁగొలిపి భక్తిమీఱ స్తోత్రంబులుగావించి సనకాద్యభ్యర్చనానంతరమున మంత్రజపంబు సేయునది. కడపట నుత్తరపూజ సేసి దేవుని నిజ హృదయపీఠంబునం జేర నుద్వాసన మొనరుచునది. ఇట్టి దేవతార్చనమువల్లభుక్తియుమ్ముక్తియుంగలుగును. వెండియు వైశ్వదేవంబు కార్యంబు. దానఁ బంచసూనా దోషనాశంబు నాత్మసంస్కారంబు నన్నసంస్కారంబు నయ్యెడిని. అందులకు సంకల్పించియగ్ని

కుండమున జ్వాలయగునట్లు విసరిన మీఁదట నన్నము నాజ్యప్లుత మును మంత్ర సంస్కృతమును గావించి యైదు భాగాలుసేసి యందు విధివిహితముగాఁబ్రథమభాగమున నాహుతులర్పించునది. రెండవది బలిహరణంబునకును మూడవది పితృదానంబునకును నాలవది కుక్కలకుంగాకులకు నైదవది సనకాదులకు నర్పించునది. అన్నము లేనియెడను బారుగూరి లేగినప్పుడును నేయియు బియ్య ముం గలిపియో కండ్లతోనో వైశ్వదేవంబుసేయునది.

వైశ్వదేవ కాలంబున కతిథియైవచ్చినవాఁ డంత్యజుఁడైనం గాదన కన్నము పెట్టితీఱవలెను. ఏలన యముఁడు తనదూతల కిట్లుచెప్పెను: 'ఏయింట వైశ్వదేవము నాతిథ్యము నుండవో యట్టి వారినే మనము తీసికొనివచ్చి దండింప వలయునని శ్రీహరియాన. కావునఁ బితృహంతకులైనను శ్వపచులైనం బాటింప కాతిథ్య మొసంగుచుండునది. విప్రుల నూరుఁబేరు విచారింప 'కభ్యాగతి స్స్వయంవిష్ణుః' అనియెంచిభక్తితో భోజనమిడునది. అతిథిని వెడలఁ గొట్టినఁ బితృదేవతలు కుపితులయ్యెదరు. మఱియు వైశ్వదేవము కాకముందే వచ్చినయతికి భిక్షంబిడుటవల్ల వైశ్వదేవఫలంబుదక్కుడి. బలిహరణమున కిడిన యన్నమును దా నావలఁ బరిహరింపరాదు. ఒరులచేఁ బాఱవేయించునది. బలివిసర్జనముఁ గావింపకుండఁగా భుజింపనురాదు. కాదేనిఁ దద్దోష పరిహారార్థము షట్ప్రాణాయామాచరణంబు విహితంబు. ఇంటిముంగిట బలిదానంబుసేసి గోవు లకు గ్రాసంబిడునది. పిదప నిత్యనైమిత్తికాదులను నెఱపునది. నిత్యశ్రాద్ధంబు పిండదానాగ్నౌకరణాది రహితంబు. అందు దక్షిణ యనవసరము. మఱియు నిత్యశ్రాద్ధ నిర్వహణంబునకు బ్రహ్మ చర్యంబు ననావశ్యకము. అతిథ్యభ్యాగతులు లభింపనినాఁడు వైశ్వదేవానంతరమందొక యావుపాలుపిదుకుట కగునంత కాలము వఱకు ముంగిటఁ గూర్చుండి యెయ్యెడ నెవఁడైననాబాటన్నడచిన నాతనిం బిలిచి సేదఁదేర్చి భక్తితోఁ బూజించి యన్నంబిడునది.

అతండు శ్రీగురు స్వరూపుండుగా నెంచి యారాధించినఁ దద్ద్వారమున నగ్నిముఖ్యాఖిలదేవతా సంతుష్టియయ్యెడి. అభ్యాగతి పాదాలు తాఁగడిగినఁ బితరులకు బ్రహ్మాది దేవతలకును సంతృప్తిగలుగును. బ్రహ్మచారియైనను యతియైనను మాధుకరాన్నమునకై వచ్చునెడ భక్తిశ్రద్ధలతో నిడిన మహాఫలంబుసుమ్ము. తానిడునది తనకుఁ దృణప్రాయమైన నది మేరువుగా ఫలించెడిని. అండాద్యంతంబులనిడు నర్ఘ్యజల మత్యల్పమైనదియే యక్షీనమానమై ఫలదంబయ్యెడిని. అతిథిని నిరాకరించి యంపినవాఁడు మఱుజన్మమందుఁ గుక్కయో గాడిదయో యైపుట్టెడి. పంచయజ్ఞలోపంబైనఁ జాంద్రాయణంబుఁ గావింపవలసియుండును. అతిథిపూజానంతరమందుఁ బవలును రాత్రియు నింటంగల బాలురు వృద్ధులును భుజింపవలయు. అందుఁ బంక్తిభేదంబు దోషభాజనము.

ఇఁక గేస్తుల భోజనక్రమం బుపదేశించువాఁడను: ముందుగఁ గాలుసేతులును మోమునుగడిగికొని బొట్టుఁబెట్టుకొని పీటమీఁద బాసికబొట్టుగాఁ దూర్పుదిక్కునకుఁ దిరిగి కూర్చుండి యొరులతో మాట్లాడకుండ భుజింపవలయు. ప్రత్యఙ్ముఖముగ నాసీనుఁడై కుడుచుట మధ్యమము. దక్షిణముఖం బగార్యంబు. పితృకార్యంబులం దుదఙ్ముఖాసీనుండు గావలయు. ఇందేదియుం గాని దిక్కుమాలిన తిండితినరాదు. మఱియు నెదుటఁ బాత్రిం బిడుటకుఁ బూర్వము భస్మముతోడ మండలంబు లేర్పఱుపవలెను. విప్రులకుఁ జతుష్కోణము వైశ్యులకు వర్తులము. శూద్రుల కర్ధచంద్రాకారము నని తెలియునది. అట్టి మండలంబులలోనికి వసురుద్రాదిత్య బ్రహ్మాది దేవతల నెల్లర నావాహనము సేయునది. బ్రహ్మాదులౌ దేవతలెల్లగు మండలోపజీవులు కావున మండలము రచింపనిది భుజింపరాదు. లేదేని నిశాచర పిశాచాదివర్గములు పిపీలికాది రూపంబుల నన్నరసంబు నపహరించెదరు. కావున నట్టి మండలంబులందు స్వర్ణరజితపాత్రములో పద్మపలాశాది పత్రములో యుంచుకొనునది. గృహస్థునికిఁ దామ్రపాత్రము

వర్జ్యము. యతులు రాగి గాజు కొయ్యలతోడను మంటితోడను జేయఁబడిన పాత్రముల నుపయోగించుకోఁదగును. ఇఁకఁ గదళీ గర్భపత్త్రి పలాశమధ్యపత్త్రి వల్లీపలాశ పత్త్రింబులందు భుజించినవారికిఁ జాంద్రాయణం బుక్తము. రావి మఱ్ఱి జిల్లేడు చెట్ల యాకులు నట్లవర్జ్యంబులు. మఱియు గృహస్థు లినుప మూఁకుళ్ల లోను మృణ్మయ పాత్రలలోను తాటిగుంటలలోను గుడ్డలఁబఱచి కొనియు నెపుడు మెక్కరాదు. గేస్తులు కంచు పాత్రిలందు భుజించిన బలాయుర్యశః ప్రజ్ఞావృద్ధియగును. పూర్వసువాసినులకు వ్రతులకు యతులకును మాత్రము కాంస్యపాత్రి భోజనాభ్యంగ తాంబూలాలుకూడవు. ఆముదపాకును జిల్లేకంచమును దూష్యములు. సంజవేళలందును బతితుల పంక్తిని దినరాదు. చిన్న పిల్లలను దమపాత్రమునందుఁ గలిసి భుజింపనీయరాదు. శ్రాద్ధ దినాలందు ద్వితీయభోజనము తగదు. శూద్రులకిడఁగా మిగిలిన యన్నమును దినఁగూడదు. ఆపోశనమొరులవల్ల గ్రహించుట విహితము. ఎవరికివారు మండలములు రచించుకొన్న నాయువు క్షీణించును. తనకుఁదాను దలంటుకొన్న బుద్ధి మందగించును. పరివేషణకాలంబున నమస్కార పూర్వకముగాఁ బాయసాది సూపాంతముగా నభిఘరింపవలెను. పిదప గాయత్రీ మంత్రోచ్చారణముతో నన్నమును బ్రోక్షించి పవలు 'సత్యంత్వర్తేన' యనియు రేయిని 'ఋతంత్వా సత్యేన' యనియు మంత్రోచ్చారణముఁ గావించుచు నుదకము విస్తరిచుట్టునట్లు త్రిప్పి కుడివైపునఁ జిత్రిగుప్తాదులకు బలులిడి విసర్జించి హస్తప్రక్షాళనముఁ గావించుకొనునది. పిదప నెడమచేతి చూపుడు వ్రేలును నడిమి వ్రేలును జోడించి భోజన పాత్రింబుపై నూఁదిపట్టి యొరులిడు నాపోశనము సమంత్రికముగా లోనికింగొనునది. ఒకమాఱిడిన యాపోశనమును వదలి మఱి గ్రహింపరాదు. ఆపోశనానంతరమందుభోజనమావఱకు నొరులకు నమస్కరింపరాదు. భుజించువానికితరులును మ్రొక్కరాదు. అపుడాశీస్సువల్కిన దోషభాజకమగు. పరా

కున నాపోశనముఁ గొనక భుజించిన నాఁడష్టోత్తర శతగాయత్రీ జపముసేసి శుద్ధుండు కావచ్చును.

ద్విజోత్తమా! ఇంక శ్రుత్యుక్త ప్రాణాహుతి విధానంబుపదేశింతు. పాపంబులెల్లఁ బ్రాణాగ్నిహోత్ర దగ్ధంబులయ్యెడి. కావునఁ బ్రాణాహుతి విధానంబు చతుర్వర్గ ప్రదంబు. వినుము. 'అమృత' మస్తని యాపోశనము గ్రహించిన వెనుకఁ దన కుడి చేతితో నన్నమును స్పృశించి సమాహిత చిత్తుండై.

'శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా । ప్రాణినాం దేహమాశ్రితః।
ప్రాణాపాన సమాయుక్తః । పచామ్యన్నం చతుర్విధం॥'

'శ్లో॥ అన్నం బ్రహ్మరసో విష్ణు । ర్భోక్తా దేవో మహేశ్వరః ।
ఏవంధ్యాత్వైవ యో భుంక్తే । సోన్నదోషాన్న లిప్యతే॥'

యను శ్లోకాల యర్థము ధ్యానించి 'అగ్నిరస్మి' యనిజపించిన వారికన్నదోష ముండదు. తర్జన్యంగుష్ఠ మధ్యమములతోఁ బ్రాణాహుతియు మధ్యమానామి కాంగుష్ఠములతో నపానాహుతియుఁ గనిష్ఠానామి కాంగుష్ఠములతో వ్యానాహుతియుఁ దర్జనీ కనిష్ఠాంగుష్ఠములతో నుదానాహుతియు నన్ని వ్రేళ్ల కొనలతోడను సమానాహుతియుఁ బండ్లకుఁ దవులకుండజిహ్వతో గ్రహించునది. స్నానవేళ మాట్లాడినఁ దత్ఫలంబు వరుణునికి దక్కెడి. హోమసమయంబున మానంబువీడిన సిరులుమాసెడి. భోజనంబులతఱిని మానంబువహింపమిన నపమృత్యుభయంబొదవెడి. తుదకుఁ బ్రాణాహుతులైనను గ్రహించువఱకైననుదప్పక మానంబు వహించునది. తండ్రిగాని యన్నగాని యున్నవారికీమౌననియమ మనావశ్యకము. కాని యట్టివారికిని శ్రాద్ధభోజనంబున మౌన ధారణ ముక్తము. ముందుగ మధురాహారంబును నడుమను బులుసును బిదపఁ జేదుపియుం దుదకుఁ బలుచని యాహారమును భుజించునది. ఇందులకు వ్యత్యయమైన బలహాని యగును. గోవు జలముఁ గ్రోలునంత సేపులో భోజనము సేయఁగల్గిన నదియారోగ్య ప్రదమయ్యెడు. మఱియు నుసిరిక కాయలంత కబళము లెనిమిది

మాత్రమే యతులును బదాఱు వానప్రస్థులును ముప్పదిరెండు గృహస్థులును యథేష్టముగా బ్రహ్మచారులును భుజింపనౌను. భోజనపాత్రమున నుచ్ఛిష్టపదార్థము పడునెడ నది దుష్టమయి పోవును. ఏకపాత్రయం దితరులం గూడి మెసవరాదు. పసిపిల్లల కందిడినను దోసంగు పోసంగదు. పాయసము నాజ్యము లవణము మాత్రము పరిహరింపక మిగిలినవానిలో నేకొంతయో వదలుచుండునది. మూతి కడిగికొనక ముందు తాఁదిన్న పాత్రఁ దానెత్తికొనిపోరాదు. చెప్పులెదుటఁ బెట్టుకొని తినరాదు. తలకు గుడ్డను జుట్టుకొనియు నెడమ పాదముపైనఁ జేతి నిడుకొనియుం గుడువరాదు. అట్లు భుజించినఁ దదన్నరసంబు రాకాసులపాలై రోగమేర్పడును. ప్రసృతాంగుళిగా మ్రింగిన దోషమౌను. ఏనుఁగుపైనను గుఱ్ఱముమీఁద నెక్కి మెక్కరాదు. దేవాలయమునను శ్మశానవాటిని బడకటింటను భోజనము నిషిద్ధము. తడిగుడ్డఁ గట్టుకొనియుఁ గాలుసేతులు సాఁచుకొనియుం దినఁగూడదు. భుజించుతఱి నుపవీతియై యుండునది. ముద్దలు ముక్కలు లోనగునవి సగము కొఱికి భోజనపాత్రమునఁ బెట్టుచుండరాదు. స్నానము లేకుండఁ దిన్నతిండి పురువులతోడిదే. విస్తళ్లను బోరగిలవేసికొనరాదు. రాత్రులందు దీపముదగ్గఱనే కాని చీఁకటిలో నట్లో యాఁకలితీర్చికోఁజూడరాదు. తిండివేళ దిక్కులు సూచుటయుఁ గథలు చెప్పుకొనుటయుం దగదు. కేశస్పృష్టాన్నము త్యాజ్యము. ఎవఁడుగాని తనభార్యకన్నము విడువకుండఁ దానేతిన్న దోషియగునౌను. దేవపురోభాగమునను బాడుకొంపలోను నీటిపట్టులకుఁ జేరువను భుజించిన దోసమౌను. వైవాహికంబులం గాకెప్పుడుగాని తన భార్యయుందాను నొక్కసారిగ మెక్కరాదు. ఒరుల యెంగిలినీళ్లు త్రావినమద్యపానీయములగు. గుడ్డపిడుపునీళ్లు త్రాగినఁ గుక్కయగు. నీరముం గోరులు నెడను బరమాన్నము మున్నగునవి జుఱ్ఱునెడను నడియుడుగవలెను. అట్లే మంచినీళ్లను నిలువఁబడియు జలమధ్యమున నుండియుం ద్రావఁగూడదు. పాత్రమెడమచేతితో

మాత్రమే పట్టుకొనియు జలము దోసిటఁగొనియుఁ బలుపురితోఁ
జేరిన యేకాసనమునందియును సభామధ్యమందును నుదకపాన
మొనర్చిన దోషమగును. కడనున్న యింటిని గడజాతి వానిని
శ్వానమును గన్నను దచ్ఛబ్దంబేని విన్నను నన్నంబు విడవలయు.
లోకటిపోటును బోరాటమును దిట్లను జెవులఁబడుచుండ నశనం
బుంగొనఁజనదు. బంతిలో నెఱుఁగనివారు కూరుచున్నయెడ
ద్వారమార్గభస్మాదులచేత విడివడి యుండనగును. పంక్తిభేదమున
దోషములేదు. నల్లకోకనుగాని గూడకట్టునుగాని కట్టిన యాఁడు
దాని పెట్టుగిట్టదు. మనీషులు పూర్వోక్త దోష దూషితముగాని
భోజనము సేయునది. పిదప 'వికిరిదవిలోహిత' యనుచు నుచ్ఛి
ష్టాన్న శేషము నావలికిఁద్రోసి యుత్తరాపోశనము గ్రహించి
'రౌరవే పూయనిలయే' యను మంత్రము నుచ్చరించి చేత శేషిం
చిన జలమును భూమిపై విసర్జించిన యుచ్ఛిష్టాన్నమున విడువ
వలెను. అవ్వలికేగి యాఱుసార్లు గండూష మొనర్చిన తరువాతఁ
జేయియు మూతియుం గడుగుకొనవలెను. తర్జనితో ముఖశోధ
నము కూడదు. బాగుగాఁ బుక్కిలించి యుమిసి శుద్ధుండైన వెనుకఁ
జేతనున్న పవిత్రముందీసి నైరృతిదిశ నునిచి పాదప్రక్షాళనముఁ
గావించికొన్న పిదప నాచమనము సేసి 'అంగుష్ఠ'యని జపించి కర
ముల నంటియున్న జలమును గనులకొనల నుంచుకొనునది.
లేకున్న నేత్రవ్యాధికలుగును. అంతద్విరాచమనంబు సేసి 'ఆయంగౌ'
యనునదియు 'ద్రుపదాది' యనునదియు 'ప్రాణానాంగ్రంథి'
యన్నదియును జపించి యుపవిష్టుండై నాభ్యాలంభనంబుఁ జేసి
పునరాచమనానంతరమున నగస్త్యుఁడు కుంభకర్ణుఁడు బడబానలంబు
వాతాపియు శర్యాతియు మున్నుగాఁగలవారిని సంస్మరించిన వెనుక
నిప్పుమీఁదఁ గాఁచుకొనియో గుడ్డనద్దుకొనియో చేతులారఁజేసి
కొనుచు గురునిం గులదైవతమును సంస్మరించునది. ఇది బ్రాహ్మ
ణులకుక్తమైన భోజన విధాన'మని యవిప్రునికి శ్రీగురుండు విపు
లంబుగాఁ దెలిపెను. అంత నాద్విజుండు వారినిట్లు పృచ్ఛసేసె:

స్వామీ! భోజన విధి తెలిసె. మఱి నిషిద్ధాన్నం బేదేదియో
బోధింపవలయు'నని గురుండిట్లు చెప్పఁదొడంగె: ఓయీ! అవై
శ్వదేవాన్నము బహుక్షారలవణ యుక్తాన్నము గణాన్నమును
త్యాజ్యములు. తెల్లనీరువంగ వెల్లుల్లి కొత్తిమిరియు వర్జ్యములు.
క్రొత్తనీళ్ళు మూన్నాళ్ళవఱకుం గ్రోలఁదగదు. ఆవులును గేదె
లును మేఁకలు నీనిన పది దినాలవఱకు వాని వాని క్షీర దధ్యా
దుల నుపయోగింపఁగూడదు. మాడిన కూడును గోళ్లతోను వెం
డ్రుకలతోను గలిసి యుడికిన యన్నమును బందికొక్కులు పిల్లులు
కోళ్లు మున్నగునవి కళ్లగించిన మెదుకులు నెంగిలియంటినకూడును
మెక్కఁదగనివి. మఱియు గరిటతో వేయవలసిన పదార్థము
చేతితోనో చేతులతో వడ్డింపఁదగ్గది గరిటతోనో వేసినను నొక్క
చేతితోనే పడవేసినను గుడువరాదు. చలిదికూటికిఁ బోరాదు.
బ్రాహ్మణులమ్మిన నేతినిగొనరాదు. సాపొద్వహ్నిపక్వాన్నము
నభ్యవహారార్హముకాదు. లాడుమున్నగు పిండివంటలును మాషా
న్నాదికములును వడియాలు నప్పడాలును బర్యుషితములుగా
నెంచరాదు. నూవుపొడి కలిసిన యన్నమును బవలే భక్షించునది.
పాడ్యమినాఁడు పొట్లకాయ కూరయు బూడిదగుమ్మడి వడియాలు
నుసిరిక పచ్చడియు వాడఁదగనివి. స్వర్గకాము లష్టమినాఁడు
మేడియు రాత్రివేళలను సప్తమీ భానువాసరంబులయందు నుసిరి
కయు వర్జింపఁదగు. శుక్రవారమునాఁడు మారేడును శనివా
రము జమ్మియు నుడుగునది.

భోజనానంతరమునఁ దాంబూలములు విప్రులకిచ్చి మఱి
తాను వేసికొనవలెను. అట్లిచ్చు తాంబూలమున నొక్కపోకచెక్క
యుంచిన సుఖదము. మూఁడైన భాగ్యదము. అయిదైనఁ బ్రజ్ఞా
సంపత్ప్రదమ్ములు నయ్యెడిని. రెండువక్కలుపెట్టి యిచ్చిన నిష్ఫ
లము. నాలుగుంచిన మొదల దుఃఖదము. ఆఱిడుటను మృత్యుసం
పాదకముం గానయ్యెడుంజూవె. తమలపాకు తొడిమ నమలిన
రోగమువచ్చును. కొన తినినఁ బాపమగును. ఆకు నలుగఁగొట్టుట

వల్ల కాని. ఈనెలతో మ్రింగిన బుద్ధి తక్కువయగును. రెండాకులు మాత్రము నమలిన నైశ్వర్య నాశనమగును. ఆకులేకుండ వక్క మాత్రము నమలి మ్రింగిన దుఃఖము దారిద్ర్యము నజ్ఞానమును ప్రాప్తించెడి. సన్యాసులు బ్రహ్మచారులు వితంతువులుఁగడ నున్న యింతులుం దాంబూల చర్వణ మొనర్చిన మధుమాంస నిషేవణ ప్రాయంబ యని యెఱుంగునది.

పూర్వోక్త సదాచార సంపన్నుండగు బ్రాహ్మణుండు పిదపఁ బురాణశ్రవణ కథనాదులతోఁ గాలవడియున్న పగటి భాగముఁ గడపి యుక్తవిధిని సాయం సంధ్యావందనంబు సకాలంబున నెఱపునది. అంత నౌపాసనంబు సేసికొని యథానుకూలముగా క్షీరమిశ్రాన్నము నెట్లయిన నిశీథవేళకుంబు ముందుగా భుజింప నౌను. సద్ద్విజుండెల్లెడ రాతిరి జాముపొద్దు పోవుదనుక వేద పాఠంబు సేయుచుండవలెను. అప్పటికిఁ దాఁజేసిన కర్మములనీశ్వ రార్పణంబుఁ జేసి శయనింపవలెను. మంచము రావి మేడి జువ్వి నేరేడు కఱ్ఱలతోఁ జేయఁబడ్డదియు గజదంతాస్థులన్నిర్మితమైన దియు నింద్యములు. కుక్కినైనదియుఁ గాలు విఱిగినదియుం బనికి మాలినదని వేఱచెప్పనక్కఱయే లేదుగదా. ఇంక భరణియు మృగశీర్షము ధనిష్ఠయుం గాకింకే శుభ నక్షత్రమునఁగాని సేయఁ బడినదయి గట్టిగానున్న శయ్యను నిద్రించుటమేలు. ఆదివారము నాఁడు సేయఁబడినది సంతానప్రదము. సోమవారమున సుఖదము. మంగళ బుధవారముల నేర్పడ్డది దుఃఖకరము. గురు శుక్రవారము లదియుం బుత్రప్రదము. శనివారమునాఁడు సేసిన మంచముపైఁ బరున్నవానికి మరణము కలుగును. మఱియు స్వగృహంబునం దూర్పుదిశకుఁ దలయుంచి శయనించునది. అత్తింట నుత్తరదిక్కునకుఁ బాదంబు లుంచునది. ప్రవాసమందుఁ దూర్పునకుఁ గాళ్లుండునట్లు పరుండునది. కాని యుత్తరదిశకు శిరమును దక్షిణమునకుఁ బాదాలునుంచి మాత్రమే నాఁడు నెక్కడను శయనింపఁ గూడదుసుమ్మీ. ఏదిక్కునకుం గానివడుకయు నడుగఁ దగ్గదే.

ఇఁక శయనింపఁ బోవుతటి జలపాత్రమును దలవైపునఁ బెట్టుకొని రాత్రిసూక్తమును బఠించి యగస్త్యుని మాధవుని ముచకుందాస్తీక కపిలులను సంస్మరించి సర్పస్తుతిసేసి జందెము పేరుగా వేసికొని సెజ్జపై నొరగునది. శిథిలమైన కొంపలోను జెట్టుక్రిందను దేవళంబు నను బలువురు నడచుత్రోవ కడ్డముగను బన్నుండరాదు. మఱి యుం దలిదండ్రులును గురువులును శయనించుతావునను దాను జేరఁగూడదు. ఇంకం బుట్టలుందు శ్మశానములందు నీటిపట్టుల ప్రక్క గట్టులందును ఘోరస్థలంబున నట్టులే రుచ్యపదార్థ సమీపంబు నను ధాన్యరాశిపైని నుప్పుండా టపాయకరము. మఱియు వస్త్ర హీనుండైకాని యార్ద్రవస్త్రధారియైకాని తలకు గుడ్డ చుట్టకుండఁ గాని పరుండనే కూడదు. వైకల్యాలేని తావువఁ బండరాదు. రాత్రి మొదటి తుదిజాములందును నిదురకూడదు. రజస్వలయా నింతికి నాలవదినము వఱకు దూరాన నుండవలెను. ఉపవీతియై నిదురించిన నాయువు క్షయమవును. కూటమిని దీపమువల్లనట్లే నీలవస్త్రధారిణి పొందువల్లఁ జండాలసమ దుస్సంతతి కలిగెడిని. కావున గౌరవస్త్రము ధార్యము. రజోదర్శనము కానియెడఁ గార్యంబకార్యంబు. గొడ్రాలు వృద్ధురాలు బహుసంతానవతియు నైనందప్ప నెప్పుడు ధర్మపత్ని యెడ బుత్వతిక్రమంబయిన భ్రూణ హత్యాదోషంబు వాటిల్లెడిని. నాలవనాఁడా గర్భంబువల్ల నుద యించువాఁడు పుత్త్రుండయ్యు నల్పాయువయ్యెడిని. పిదపఁ బదా ఱవనాఁటిలోపల బేసిదినాలనైన స్త్రీసంతతియు సరిదినాలంబురుష సంతానమును గలుగనయ్యెడు. అది చంద్రబలానుసారముగను గానయ్యెడు. పగటివేళను మూలమఘారేవతీ పర్వంబులందును బొంపఁదగదు. గర్భోత్పత్తియాతటిఁ గోపంబూన కానందంబుఁ గన్న దాన మహాఫలంబుప శ్కుఁడు'' వను మొదలగు ధర్మమర్మంబు లొప్పు స్వాచారంబును బరాశరుం డయ్యెడనుపదేశించె. తదా చరణంబువల్ల నింకదైన్యంబేటిది? శిష్టాచార సంపన్నుల యిండు లందు సిరియు వేల్పుగిడ్డియుం దిరంబుగనుందురు. అట్టి ద్విజుఁడు

పుత్త్రపౌత్త్రాభివృద్ధితో నూతేండ్లు మనుసనుట కబ్బురమే? దాన జ్ఞానివై సర్వలోకైక వంద్యుండు గానయ్యెదు. బ్రాహ్మణోత్తమా! వెఱవనేమిటికయ్యా? నీవు నిట్లాచరింతేని సౌభాగ్యత గందు'వని గురుండువల్క నవ్విప్రుండు సాంజలియై యిట్లు:

తే. పుణ్యమూర్తివి గురుమూర్తి ♦ భూతలమున।
నవతరించితివైతి భ ♦ క్తాంధకార।
భానుమూర్తివి కర్మవి ♦ జ్ఞానదర్శ।
నాత్తకీర్తి! కృపాపూర్తి! ♦ యంజలియిదె।

యని సాష్టాంగప్రణామంబు సేసిన తత్ప్రవరాన్వుండవిప్రు శ్రద్ధాభక్తులకు సంతుష్టిఁగొన్న శ్రీగురుండిట్లనిసున్నవల్కె:

తే. ఇంక సదాచారవర్తివై ♦ సుకముఁగనుము।
ధరదయాసత్యశౌచము ♦ ధర్మనిరతి।
నెప్పు గోబ్రాహ్మణహితంబు ♦ నెనఁగుదాన।
సర్వజనముల కిష్టాప్తి ♦ యుర్వినగుత॥'

అటపడి రిత్తవోవునే? నామధారకా! అట్టి శ్రీగురువర చారిత్రం బెట్టిమూఢునైనజ్ఞానిం జేయఁజాలెడిఁగాదే' యనిసిద్ధుండువల్కె.

తే. నిర్మలామృత రుచిర పా ♦ నీయశాల।
'కర్మకాండాఖ్య' మీకథ ♦ ఘనతరంబు।
సకల పురుషార్థదంబిద్ది ♦ యతి సులభము।
పురుషోత్తమ సంప్రీతిఁ ♦ బొల్చుఁగాత॥'

శా. జ్ఞానంబబ్బు సరస్వతీ కథితము ♦ న్సద్గ్రంథము న్వ్యాసుదే
వాఖందు ల్గురు సంహితాఖ్యమును గీ ♦ ర్వాణంబునం బల్కఁ బ్రి
హ్మానంద ప్రతిపాద్యమయ్యె నిటులే ♦ నాంధ్రీకరింపఁ, గురు
ధ్యానాప్తింబురుషోత్తమ ప్రియముగా ♦ న్స్వార్థంబు చేకూరఁగాన్॥

శ్రీపాదులు, శ్రీదత్త శ్రీ। పాద నృసింహాఖ్య
లనిలఁ ♦ బరఁగి శ్రీమూర్తుల్, ప్రోది
యొనర్చిన కథ తగు। నాదెళ్లకులీన
దక్షి ♦ ణామూర్తి కృతిన్।

శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః.

# శ్రీ గురుదత్త సరస్వతీయము.

కం. గురులకుఁ బురుషోత్తములకు
సరస్వతికి వాసుదేవ - సంయమికి న్శ్రీ
గురుదత్త శ్రీ పాదులు
నరసింహ యతులకు దక్షి - ణామూర్తి నతుల్॥

భక్తికాండము — ౧దశము.

శ్రీగురు సంహితావధరణంబునఁ గర్మ మర్మంబులెల్ల నెఱింగిన నామధారకుండు సిద్ధాంఘ్రి నీరజంబులకు మ్రొక్కి వినయావనత వదనుండై యిట్లు విన్నవించెః 'మహాత్మా! మీరో గురుకథా సుధానిధులరు. నేనో మీవాగమృతమెంత యాస్వాదించినం దనివి నొనక యున్నవాఁడను. ఉత్తరకథా శ్రవణంబునంగాని యస్మచ్చిత్తంబునందలి తత్తఱపాటత్తమిల్లదు,' నావుడు నాసాధక బోధకోత్తముండిట్లు నుడువందొడంగెః 'ఛాత్ర చూడామణీ! నీకుతూహలంబు నాకెంతయు సంతోషదాయకంబు. రసవంతంబగు గురుగాథ నీమూలానఁగదా నేనిప్పుడు స్మృతికిఁదెచ్చుకోఁ గలుగుచున్నది. మేలు మేలు. తదనంతర చరిత్రకథ వక్కాణింతు వినుము.

గంధర్వనగరంబునకు గురుభక్తియుక్తులౌ సంపన్నులం పెక్కండ్రు వచ్చుచుండెడివారు. వారు శ్రీగురు భిక్షసేసి తత్ప్రీత్యర్థమట బ్రాహ్మణ సమారాధనంబు లొనర్చుచుండెడువారు. ఇట్లుండ నొక్కట నచ్చోటికిఁ గాశ్యపాన్వయ సంభవుండు భాస్కరాహ్వయుండొక దీనభక్తుండేగుదెంచెను. అతండు మువ్వురికి సరి

పప్పుతండులాదికమ్ముల మూటఁగట్టుకొనివచ్చి గురుపాదంబులకు మ్రొక్కెను. అతండటఁజేరిననాఁడొరులొనర్చు సమారాధనమున కాహూతుండై తాఁదెచ్చుకొన్న సామగ్రి తన్మఠంబునం దొకమూలను డాఁచి భోజనానికిఁబోయెను. అభ్యవహారానంతరమున సాయంసమయమునఁ గృతాహ్నికుండయి యట విశ్రమించె. అట్లే యనుదినము నెవ్వరో పిలుచుచుండుటయు నితఁడటకేగి భుజించివచ్చుచుండుటయు జరుగుచుండెను. ఇవ్విధంబున మూడుమాసాలు గడచెను. ఈతని తెలంగ్యుఁజూచినయచ్చోటి విప్రులిట్లనఁజొచ్చిరి: ఏమయ్యా, బాఁపఁడా! నీవువచ్చినదెందులకు? చేయుచున్నదేమి ? నీభిక్షకింక మూహూర్తము కుదరలేదు గాఁబోలును. ఏమైన నేమిలే. వచ్చినప్పటికంటె నిత్య పరాన్నభోజనాల వల్ల నివ్వాడు బలిసియున్నావు. ఇంటికంటె గుడి పదిలమనుకొన్నావు గాఁబోలు. నీమొగానికి సిగ్గైన లేదఁటయ్యా' యనియెంద ఱెన్ని విధాల పరిహాస్యములు సేసినను బావ మా భాస్కరశర్మ తనను గాదన్నట్లు మిన్నకుండి యట్లే కాలక్షేపము సేయుచుండెను. పలువురాతని ననుచుండ నొక్కట స్వాములవారి చెవులం బడె. వారది సైఁపక భాస్కరయ్యను దయతో దగ్గరకుఁ బిలిచి 'నీవు ఱేపికడనే స్వయంపాకము నొనర్చి మాకు భిక్షసేయు'మనిరి. ఆతఁడు 'బహుసంతోషము' మని మఱునాట పలువాతలేది దధిఘృతశాకాదికంబుల నమర్చుకొని స్నాతుండై తాఁదెచ్చుకొన్న తండులాదికంబులతోఁ బాకంబును బొనరించుచుండెను.

అట్టియెడ వేఱొక భక్తుఁడేగుదెంచి తానానాఁడు గురారాధనం బొనర్పవలెనని కోన్నన్నము మున్నుగాఁగల వెన్నిన్నియో సిద్ధపఱిచితిననుచు నాహ్వానింపవచ్చె. గురుస్వామానాఁడు భాస్కరభిక్షఁ గొందుమనియు మఱునాఁట దదారాధనంబు సేసికొమ్మనియుఁ బ్రత్యాఖ్యానంబొనర్చిరి. అది విని యాతఁడిట్లనఁ జొచ్చె: 'అయ్యో! యిపుడీ దరిద్రుఁడెక్కడినుండి దాపరించె. నేఁ

డెవ్వరికిని మెదుకు దొరకదు కాఁబోలు. ఎవరి కొంపలకు వారు
పోవలసినదే' యనుకొనుచు వెనుదిరుగ గురుండది విని యాతనికి
నటఁగల వారందఱకుంగూడ నిట్లు సెప్పె: 'మీ రెవ్వరుం బోఁగూ
డదు. మీ రెల్లరు సపుత్త్ర కళత్ర మిత్త్రంబుగ నేఁడీ మఠంబునన
భుజింపవలయు. స్నానాలు చేసిరం'డనిరి. వారొండొరుల మోములు
చూచుకొని నవ్వుచు 'ఈదరిద్రుఁడు తెచ్చిన సోలెడు బియ్యపు
మూట యెఱుఁగనివా రెవరు? ఇందఱకు మఠమున సామగ్రి
యెక్కడిది?' దనుకొనుచుం బోయిరి. అంత నారసింహ యతీంద్రు
లా భాస్కర శర్మను బిలిచి 'త్వరగాఁ గానిమ్ముగులును రాఁగల'
రనియె. ఆతండు 'నిదిగో యౌచున్న'దని మఱొక పొయికూడ
రాజఁ జేసి గడియలో వంటకంబులు సిద్ధపఱచి గురుస్వాములకు
మనవి చేసెను. స్వామి గంగాతీరంబునంగల బ్రాహ్మణులందఱ నాహ్వా
నింపుమనియెను. భాస్కరుఁడు నదరక గురువులపైనే భారంబిడి
పోయి వారికిట్లనియె: 'అయ్యా! వంటలైనవి. మడులు కట్టుకొని
రమ్మని గురువు లాజ్ఞయిచ్చినా'రన విని వారు పకపకనవ్వి 'ఓయీ!
నీవు పెట్టుటయు మేము తినుటయు నైనట్లే. ఏరాత్రివేళకో
యింటిపట్టులనే కలిగిన మాత్రములో భుజింతుములే. గురువు
గారికైనఁ గడుపునిండ నీవు పెట్టఁగలిగిన నంతయే చాలుఁ బొ'మ్మ
నిరి. భాస్కరయ్య తిరిగివచ్చి యయ్యగారితో వారు రామని తన్న
పహసించినట్టి తెఱంగు నెఱింగించె. గురుండు బ్రాహ్మణ సహ
భోజనమే కావలయుఁగాని తానొక్కండ భిక్షసేయ నొల్లననియె.
శ్రీగురుం డవతారమూర్తిగాఁ దానేమన్న నది నగ్గించికొఁ
జాలెడినను మనోనిరూఢి గలిగిన యాబాఁపండిట్లను: 'స్వామీ!
నన్నేమి చేయుమందురు? నేను మీయాన శిరమునఁ దాల్చి యెంత
బలవంతానఁ బిలిచినను రాకనన్నుఁ బరిహాసించుచు నున్నారా'యె'
ననిపల్కె. అప్పుడు వారు మఱొక శిష్యుని ద్రుతగతింజని వారి
నెల్లర వెంటఁగొని రమ్మని యానపెట్టిరి. ఆతండు పరుగునఁ బోయి
గుర్వాజ్ఞా ప్రకారం బెల్లరకుం జాటినమీఁదట వారు సంప్రదించి

కాని యయ్యది యనుల్లంఘ్యంబుగా నెంచి కృతస్నానులై మఠం బునకుఁ జేరిరి. గురుస్వాములు వచ్చినవారికిట్లనిరి: "బ్రాహ్మణో త్తములారా! తలకొక నాల్గు విస్తళ్లు కుట్టుకొనుండి. మీ మీ పెండ్లాల బిడ్డలఁ దీసికొని రావలయు. నేఁడిక్కడనే నాల్గువేల మందికి సమారాధనము జరుగవలె'నని భాస్కరమూర్తి దెసఁజూచి 'ఏమోయీ! చూచెదవేమి? వీరినందఱఁ బ్రత్యుత్థాన పూర్వ కముగా నాహ్వానింపు'మనెను. అతండును వెంటనే లేచి చేతులు జోడించి వారందఱి సకుటుంబ బంధుమిత్రముగాఁ దాఁజేయఁ బోవు నారాధనమునకు దయచేసి తన్నుం గృతార్థుఁ జేయుండని యభ్యర్థించెను. అతనినోట నామాటలు రాఁగనే చిన్న చిన్న వాండ్రందుఁ గొందఱు నవ్వి, 'ఓయి వెఱ్ఱిబాఁపనయ్యా! సిగ్గులేక తగుదునని నీవును బిలువ వచ్చితివఁటయ్యా! నీచేసిన ప్రయత్న మందఱకుఁ దలకొక మెతుకుచొప్పుననైన సరిపోవునా?' యనుచు గేలిసేయఁదొడఁగిరి. అందుం బెద్దలౌవారు వారల వారించి 'తప్పు. నిందావాక్యములు మానుఁడు. అతని దోషమేమియు లేదు. మన గురువుల యాజ్ఞచొప్పుననే మెలఁగువాఁ'డని మందలించి భోజ నార్థము భాజనంబు లమర్చికొనుచుండిరి. దీన భాస్కరుఁడు భక్త్యధీనుఁడై త్రిమూర్తి భావంబున శ్రీగురుపాదధ్యానావాహనా ద్యుపచారంబులు నెఱపి నీరాజనంబిడిన వెనుక గుర్వాజ్ఞను బం తులు తీరిచి విస్తళ్ళు వేసెను. అంత వారి సెలవు చొప్పున వండిన పదార్థములను దెచ్చి గురుపాద సవిధంబున నునిచె. వారిచ్చిన వస్త్రంబు నావంటకంబులపైఁ గప్పెను. అపుడు వారభిమంత్రించిన కమండలూదకంబు నద్దానిపైఁ బ్రోక్షించి భాస్కరు దెసంజూచి పాత్రాంతరంబులతో నందులోనుండి పదార్థములు సేకరించి వడ్డన సేయుమని యానవెట్టిరి. అతఁడట్టులఁ జేయఁదొడఁగె. ఇతరు లును గుర్వాదేశంబునఁ బళ్లెములతో మరల మరలఁ గొనిపోయి వడ్డించుచుండిరి. శాకసూపాన్నాదికంబులు తీసినకొలఁది వచ్చు చునే యుండెను. ఆజ్యమున్ని జారీలు నింపినను దఱుఁగకుండెను.

ఆయాశ్చర్యరసపాటున నెల్లరు విస్మితులైరి. స్వాములవారి విస్తరి మొదలుగానన్నియుం బరివిష్టములయ్యె. ముందుగ గురువులుం బిదప నెల్లరు నాపోశనములం గొనిరి. భోజనాలు ప్రారంభమాయెను. భాస్కరశర్మ నేయివడ్డించుచు నెమ్మదిగాఁ గూర్చుండి కావలసినవి యడిగి యథేష్టముగా భుజింపుఁడని యందఱకుం బేరు పేరువరుసను జెప్పుచుండెను.

సీ. పప్పుకూరను ముందు ♦ భక్షించి మొదలిడి
పప్పువాళికనేయి ♦ జుట్టువారు
నూపాన్నములేర్చి ♦ స్తూపంబుగాఁ జేసి
చేరలార ఘృతంబుఁ ♦ గోరువారు
శాకంబులెల్లను ♦ బాకానఁబడనంచుఁ
గొనరుచు వేయించు ♦ కొనెడివారు
దప్పళం బీసుచి ♦ నెప్పుడుఁ గనలేదు
శ్రేషని లొట్టలు ♦ వేయువారు॥
తే. భక్ష్య పరమాన్నములఁ దృప్తి ♦ వడెడువారు
దధిని గల కమ్మఁదనమునఁ ♦ దనియువారు
హరహర మహాదేవ ♦ యనెడువారు
కూడి విప్రులు గోవింద ♦ కొట్టినారు॥

వారెల్లరకుం దాంబూలాలిప్పించిన వెనుక రెండవ బంతికి వచ్చినవారి నవ్వారి యిల్లాండ్రకుం బిల్లలకుం గొల్లగాఁ బెట్టి యంపిరి. పిదప శూద్ర సమారాధనంబును జరిగెను. గురుండంత వారసి యంత్యజాలంగూడ నాలుబిడ్డలతోడ రావించి కడుపారఁ గుడిపించి యంచె. కడపట నెవ్వరు నా కొన్నవారు లేరుగదా యని యారయ మనఁ దానట్లు కావించి యట్టివారెవ్వరును లేరని తెలిసిన వెనుక గుర్వాజ్ఞఁగొని భాస్కరార్యుండు గురుప్రసాద స్వీకరణంబునం గృతార్థతఁగనియెను. అపుడాతండు పరికించితాఁ దొల్లిటఁ బక్వంబొనర్చినంత మిగిలియున్నది యని స్వాములవారితో మనవిసేయుడు వారద్దానిని జలచరాదికంబుల కిడుమనిరి.

అట్లానాఁడు సర్వభూత తృప్తియయ్యెను. కొలఁది యన్నము తోనే వేలకొలఁది జనంబులకైన యానాఁటి భూరిసమారాధనంబువల్ల నెల్లరకు నల్లగురు మహత్వంబు సువ్యక్తంబయ్యెను.

సీ. ఎవ్వాని దయమీఱ ♦ నట్టిరోగము లైనఁ
బాసి యారోగ్యంబుఁ ♦ బడయఁజేయు
నెవ్వాని వీక్షణా ♦ మృతసేక మదిగత
ప్రాణులౌ మర్త్యుల ♦ బ్రదుకఁజేయు
నెవ్వాని సత్కృప ♦ హీనునేనియు సాంగ
వేదపాఠమొనర్చు ♦ విప్రుఁజేయు
నెవ్వాని ప్రేమయే ♦ యెల్ల తీర్థంబుల
గట్టుల క్షణములో ♦ మెట్టఁజేయు॥
తే. నెవఁడు కవనాన వంధ్యామ ♦ హిషి సదుగ్ధ
యెవఁడు విశ్వరూపంబుఁ జూ ♦ పింపఁజాలు
నట్టి గురువరు సాటిగా ♦ నెట్టి సురలు
తరమె యెన్నంగ మానవునే ♦ తన్మహిమము॥

మ. ఎదలోనమ్మినవారిఁ బ్రోచెడిఁగదా ♦ యీశుండు దుర్వాసుఁడా
పదఁగాన న్నిసిడాయ శిష్యయుతుఁడై ♦ పాణ్డ్వాశ్రమంబోజ, ద్రౌ
పది కృష్ణుందలపోసె నాతఁడు కృపా ♦ వారాశియై తెంచి, య
న్నదుఁడయ్యె న్వనఁగాన నయ్యెనిటవి ♦ న్నాణంబువిన్నాణలోన॥

ఇన్నారసింహులుం డన్నపూర్ణసుంధ" కిన్నగేశాప్లుండ కాని నరమాత్రుండు గాఁడని కన్నవారు విన్నవారు నెన్నఁదొడఁగిరి. గురుండంత భాస్కరశర్మకు వరప్రదానంబుఁ జేసి పీడ్కొల్పెను. నాఁటినుండి శ్రీగురుప్రభావంబు దేశదేశంబులకుఁ బ్రాఁకినకొలఁది వేనవేలుగ లోకులెల్ల రాఁగరుణాకరు పాదారవిందంబుల నులిందంబులై చేరుచుండిరి.

'నామధారకా! గురుకృపా ప్రసారంబు తత్తచ్ఛాత్ర భక్తిశ్రద్ధానుసారంబై యుండెడి నని తెలియు'మని సిద్ధుండు పలికెను.

భక్తికాండము — ౨దళము.

సిద్ధుండు నామధారకున కవ్వలికథ వినుచువాఁడై యిట్లు పశ్నించెః ఓయీ! యిపుడు నీకు మఱొక వింతగాథఁ జెప్పుచున్నాఁడ. ఆలకింపుము. శ్రీగురు కరుణా ప్రసారంబువల్ల నఱువదేండ్ల గొడ్రాలికి కిరువురుసుతు లుదయించిరన్నదద్భుతంబుకాదే?

అయ్యెడ నాపస్తంబ శాఖీయులందలి కాశ్యప గోత్రజుండు సోమనాథాభిధానుం డొక్క విప్రోత్తముండుండెను. అతం డెల్లెడ శ్రుతిస్మృతివిహిత కర్మాచరణైక తత్పరుండై యుండెడివాఁడు. తత్సహ ధర్మచారిణి గుణగణకదంబ గంగాంబ. ఆమెకు షష్టిపూర్తి యయ్యెను. సంతు లేదు. వారికాఁపురము గంధర్వ నగరము. ఆయమ యన్వహము శ్రీగురు దర్శనార్థమేగి తత్పాదార్చనంబుఁ గావించి నీరాజనంబిడి సాష్టాంగ ప్రణామంబు సేసి యింటికి మరలుచుండెడిది. ఇట్లేండ్ల కాలఁదిగఁ దదేకదీక్షతో నడచిన వెనుక నొకనాఁడు స్వామివారు మందహాసముతో నాపతివ్రతామణి నిట్లనిరి: 'అమ్మా! యిన్నాళ్ళనుండి సేవించుచున్నదానవు. నీయభీష్టంబేమో తెలుపవైతివే? ఇపుడైనఁ జెప్పుదేని గౌరీనాథ కృపవల్ల నీకోరినట్లు కానయ్యెడు' ననుచు గురుండను ప్రసాద వాక్యంబుల న్వని యొంతయు నలరిన యా సాధ్వీమణి దోసిలి యొగ్గి కన్నీరు గార్చుచు నిట్టుల విన్నవింపఁ దొడఁగె:

'ఉ. పుత్త్రులఁ గాంచనింపగును ♦ బుత్త్రులపల్కులు వీనువిందిపుం।
బుత్త్రులనెత్తమై సుకము ♦ పుత్త్రులముద్దు రుచించు నోటికిం।
బుత్త్రులవల్ల సౌఖ్యమిలఁ ♦ బుత్త్రులవల్లఁ బరానుభూతియౌఁ।
బుత్త్రులఁ గన్న మెప్పగును ♦ బుత్త్రులు లేమి నిదెప్పరంబగున్॥'

'స్వామీ! పుత్త్రులు లేనివారికి గతులే లేవయ్యె. వంధ్యాత్వ మహాదోషం బొదవిన పాపిష్ఠురాల నని లోకులు నన్నేవగించుచున్నారు. ఏమైనను గడుపునఁ గాయకాయని దానిజన్మము వ్యర్థమే. పితరులును దమ కాలమున నేలలనామణి యైన నొక్క తనయునిఁ గనినఁ దమకుఁ దిలోదకాలు దొరకునని వేచియుండు

రాదె. పుత్త్రహీనమైనది గహనముగాని గృహముగాదు. చంకను బిడ్డనెత్తుకొను భాగ్యశాలినిం జూడ ముచ్చటగా నుండును. నేనందులకు నోఁచనైతిఁగా! ఎత్తునం బొత్తునం బెంచుకొందమన్న నాకుఁ బుత్త్రిలా? పుత్త్రికలా? షష్టిపూర్తిగూడ నాదె, ఇట్లైహిక సుఖాలు లేని వ్యర్థపు బ్రతుకు బ్రతికితిని. 'అపుత్త్రస్య గతిర్నాస్తి' యన్నారు. దానఁ బున్నామ నరకంబునం బడిపోవలసినదే కాన నాముష్మికంబును సున్నయాయె. మాపితరులకు దీపవధఃపతనమును దప్పదాయెను. ఏమి సేయుదును? అయినదయినది. ముందు జన్మమునన్నైన నొక్కతొడిమ నాకడుపునఁ బడునట్లు వరదానంబు సేయుం డంతయే చాలు'నని గురుపాదంబులం బడియెను.

అంత నాకృపాళుండు నవ్వుచు నిట్లువల్కెఁ: 'ఓసీ పిచ్చితల్లీ! ఏమి కోరికను గోరితివమ్మా! ఎప్పుడో రాఁబోవు జన్మపుముచ్చట యిప్పుడెందులకు? అప్పుడు నాయీవరమే ఫలించి యయ్యెనని నీకెట్లు తెలియఁగలదు? నీవల్ల నిత్యనీరాజనం బందుటన్నాడెందం బమందానంబు నొందియున్నది. కాన నీకోరిన దిప్పుడె యానట్లు వరం బిచ్చుచున్నాను. మఱియుఁ బుత్త్రుఁడేకా దనతికాలముననే పుత్త్రీపుత్త్రులుభయులు శుభయుతు లుదయింతురుగాత' మని దీవించెను. అపుడా సతీమణి కొంగున ముడివేసికొని బద్ధాంజలియై యిట్లను: 'మహాత్మా! కోపింపకుఁడు.

కం. ఎట్లానో యీవరంబిది ।
చెట్లకు గట్టులకు బ్రొక్కి ♦ చెందని భాగ్యం ।
బిట్టీర లన్నమాత్రన ।
ముట్లుడిగిన యిట్టినాకుఁ ♦ బోలునె కలుగన్ ?

బిడ్డలకొఱకయి యేనుమెట్టనిగట్టును మునుంగనితీర్థంబును లేవమ్మ. లోకులశ్వత్థ ప్రదక్షిణాలు సేసిన గర్భంబు ధరింపఁ గల్గుదుమన నదివిశ్వసించి యగపడ్డ రావిమొక్కలకెల్ల నిండను

మొక్కి మొక్కి వేసరితిని. ఇఁక నిరాశచేసికొని రాఁగలభవంబున నైన సుఖానుభవంబుఁ గలిగింప దిక్కు మీరని నమ్మి యిక్కరణిని సేవించుచున్నదానను. ఇట్టినా కీముదిమిని వేఁకటితన మెట్టబ్బెడినో యని యబ్బురపాటు నొందవుచున్నది. మఱి సాక్షాన్నరసింహమూర్తులరా మీవాకెట్టుల నసత్యంబు గాఁగల్గునాయని యేలినవారి నిబ్బరికంబున నిబ్బరంబును బ్రబ్బియుండకపోలేదు. మీరు తలఁచినదుర్ఘటంబుండదన్న నిరూఢివల్లనే యిట్లు ముడివేసికొంటిని. సరికాని నాయీ సందియము మాత్రము తీర్పఁగోరుదాన. నేను భావిజన్మంబునఁ బుత్త్రలాభం బపేక్షింప నిప్పుడప్రసాదింతుమందురేముటికి ? మఱి యిన్నాళ్లనుండి కాళ్లునొప్పులుపెట్టఁగా మార్థ్యముకొలఁది సేఁజేసిన యశ్వత్థ ప్రదక్షిణాలవల్లనైన బ్రయోజనమే' మని యడిగెను. శ్రీగురుండందులకు నగి యాయమకిట్లు బోధించెడి: 'సువ్రతా! నీకావించిన యశ్వత్థసేవవల్లనే మహత్తర సుకృతంబు గణించినదానవు. అట్టి నీవిపు డద్దానిని నిందించి తత్ఫలంబెల్లఁ గోల్పోవకుము. నీకుఁ గొడుకుం గూఁతురు నుదయించెదరు లెమ్ము. అట్లగుంగదాయని ప్రదక్షిణాలు మాత్రము మానకుము. నామాటవిని యింతటినుండి నాతోఁబాటుగ నీభీమామరజా సంగమ స్థితాశ్వత్థావనీ రుహంబునకు ననవ్హంబు నర్చనంబుఁగావించుచుండుము. తన్మాహాత్మ్యంబు పురాణప్రథితంబు. నేనందెప్పుడు నుందును. కావుననే యశ్వత్థనారాయణమూర్తి యని లోకప్రసిద్ధి'యను గురూక్తు లాలకించు నాయిల్లా లిట్లడిగెను: 'మహానుభావా! దేవరవారి దయవల్లఁ దన్మాహాత్మ్యం బింకఁదెలిసికొని దృఢమతితో నట్టులనె భజించుచుండుదాన. సెలవిం'డనియె. వెండియు గురుండిట్లుద్బోధింపఁ గడంగెను: 'ఇంతీ! శాంతముగా నాలకింతేనిఁ జెప్పెదవినుము. అశ్వత్థంబున సర్వదేవతా నిలయంబు సుమ్ము. తన్మాహాత్మ్యంబు నారదోక్తంబైన తెలుంగున బ్రహ్మాండ పురాణంబునం గలదు. భువనత్రయ సంచారియగు నారదుం డొక్కెడ బుష్యాశ్రమంబున కేగెను. అచ్చోటివారెల్ల రమ్మౌని

శేఖరునకుఁ బాద్యాదు లర్పించి యాతని నశ్వత్థమహత్త్వం బెఱిం
గింపుమని కోరిరి. విధాతృపుత్త్రుం డవ్వారి కివ్విధంబునఁ జెప్పం
దొడంగెః ఓ సనక ఋషిప్రవరులారా! నేనిప్పుడు సత్యలోకంబు
నుండి రాక, అచ్చోట నీయుచ్చటయే వచ్చెను. అశ్వత్థమే నారా
యణ స్వరూపమందు రద్దాని మహత్త్వం బెట్టిదని యడుగఁ బర
మేష్ఠి యిట్లుపన్యసించెః తన్మూలంబునం దేనును మధ్యమున
మాధవుండు నగ్రంబున నుగ్రుండు నుండుట "శ్లో. మూలతో బ్రహ్మ
రూపాయ। మధ్యతో విష్ణురూపిణే। అగ్రతశ్శివరూపాయ। వృక్ష
రాజాయ తేనమః" యని యద్దాని నారాధింపఁగాఁ ద్రిమూర్తి
పూజాఫలంబు దక్కెడిని. మఱియుఁ దద్దక్షిణ పశ్చిమోత్తరశాఖ
లందు మామావిహారంబు లూహించునది. తూర్పువైపుననున్న
కొమ్మలం దింద్రాదులుందురు. వసు రుద్రాదిత్యాదులకు నది
యిక్క. తన్మూలాంకురాదికంబులం దయ్యై మహర్షులును గోబ్రా
హ్మణ ప్రముఖులును జతుర్వేదంబులు నెల్లయజ్ఞంబులు నున్నట్లు
తెన్నవలయు. అఖిల సరిద్వరంబులు సాగరసంఘంబును బూర్వ
శాఖాశ్రితంబులుగాఁ బరిగణించునది. మూలంబం దకారమును
స్కంధంబున నుకారము ఫలాదికంబుల మకారంబునైన ప్రణవాకా
రం బయ్యదియని భావించునది. అవ్విటపి శ్రేష్ఠపు మాహాత్మ్యం
బభివర్ణింప నేరికిఁ దరమౌను? ఈదృశాభీష్టప్రదాయకం బింకొ
క్కటి పేర్కొనఁ గానరాదని బమ్మవల్కన దెల్లఁ దన్మానస
పుత్త్రుం డచ్చోటి ఋషుల కెఱింగింప వారాతని నిట్లుపృచ్ఛచేసిరి.
ఓ సర్వవేదీ! తత్సేవా విధానంబు మున్ను ధర్మశాస్త్రంబ యైనను
బ్రహ్మర్షులరా మీవల్ల మరల వినఁగోరువార' మనవుడు సనార
దుం డింకనిట్లు బోధింపఁజొచ్చెను: ఓ విమలులారా! కమలసంభ
వోక్తం బెట్టులట్లువచింతు. సావధానుల రగుఁడు. అశ్వత్థప్రదక్షి
ణాలు చైత్రాషాఢపుష్య మాసంబులందును గురుశుక్రమౌఢ్యము
లందును క్షీణచంద్రుండౌ నెడలందు నారంభింపఁ దలంపఁగూడదు.
తారాచంద్రబలాది యుక్తంబగు శుభముహూర్తంబున స్నానాది

కృత్యంబులవల్ల శుచియై యుపవసించి మఱి ప్రారంభింపవలయును. ఆదిసోమశుక్ర వారంబులను సంక్రమణ వేళలను బర్వదినంబులను వ్యతీపాతవైధృతి యోగంబులందును శూన్యతిథుల రాత్రివేళల మేఘచ్ఛన్నాహ్నంబుల నపరాహ్ణంబుల రావిసేవారు స్సేవింపఁ బోవఁదగదు. ఆరాధకులు సాధకులు ముందుగ నాత్మస్తుతి పర నిందలను వితండవాదంబులను నుడుగవలయు. దుర్వ్యాతకర్మంబు నసృతవాక్యంబులు న్మానవలయు. అంతం బ్రివాహోదకంబున సచేలస్నానంబుసేసి ధౌతవస్త్రంబుఁదాల్చి గణనాథు నర్చించిన పిదప గంగాయమునా జలకలశంబు లుంచి యభ్యర్చించి పుణ్యా హంబు వల్కి తా నద్దికోరు నద్దానిసే సంకల్పించి యశ్వత్థంబును గలశోదకంబులతో భక్తిమై సప్తవారాభిషేచనంబుఁ గావించునది. వెండియుఁ బునస్స్నానంబు సేసి దేవమయంబా నావిటపి శ్రేష్ఠం బును బుంసూక్త విధానంబున షోడశోపచార విధులతో నారా ధించునది.

చ. కరముల శంఖచక్రములు ♦ శార్ఙ్గక బాణకృపాణఖేటముల్
వరద భయాపహంబులుగ ♦ బాహువులెన్మిదిగల్గు రూపమై
సురుచిర పీతవస్త్రమున ♦ శోభిలు నవ్యయ పవ్యదివ్య సుం
దరుఁ బురుషోత్తమున్సిరిని ♦ దాల్చినవాని నెదం దలంపుఁడీ॥

ఇట్లు త్రికరణ శుద్ధిగా నెంచి ధ్యానించుచు సహస్రనామో చ్చారణం బొనరించుచుంగాని మౌనంబున నేనిఁ బూర్ణకుంభ యుతయై గర్భవతిమై మందగతితోడ నాదిమధ్యావసాన నమః ప్రియుక్త ప్రదక్షిణంబు లశ్వత్థంబున కొనరించుట శ్రేయో దాయకమౌను. అట్టి ప్రదక్షిణాలం దడుగడుగునకు యజ్ఞఫలంబు దక్కుచుండును. ఏరావిచెట్టునకైన ద్విలక్ష ప్రదక్షిణాబు లొనర్చిన బ్రహ్మహత్యా దోషంబైన నాశంబొందెడిని. ఇఁక నీత్రిమూర్తినా సాశ్వత్థసేవనంబో గురుతల్పాద్యఖిలాఘౌఘతూల దావానలంబై జన్మవ్యాధి జరామృత్యు భయాక్రాంత సంసార పారావార తార కంబై ధర్మార్థకామమోక్ష సాధకం బౌనసుట కబ్బురంబే?

పుత్రకాముండై మనోవాక్కాయకర్మంబుల నందే లక్ష్యంబిడి దీక్షం బ్రదక్షిణాలు సేసినం దత్క్షణం బక్షీణ ఫలాప్తిం గందుర్. శనివారము నాఁ డశ్వత్థంబును స్పృశించి మృత్యుంజయ జపంబు సల్పిన నకాల మృత్యు భయంబు వాసి పూర్ణాయుష్యంబుఁ బొంద వడిని. ద్వాదశ జన్మంబులందు మంగళ మున్నీడ నశ్వత్థసేవనంబుఁ గావించి "శ్లో. కోణస్థః పింగళో బభ్రుః । కృష్ణో రౌద్రోంతకో యమః । సౌరిః శనైశ్చరో మందః । పిప్పలాదేన సంస్తుతః ॥" అని శ్రద్ధావిశ్వాసంబుతోడ జపంబు సేసినం దద్దోషాపనోదనంబు యిష్టార్థసిద్ధి యయ్యెడిని. గురువారము నమవసయుం గూడినయెడఁ ద్రిమూర్తివాసాశ్వత్థచ్ఛాయా జలస్నానంబు సేసినఁ బ్రహ్మహత్యాద్యఘ నాశంబయ్యెడిని. అచ్చోట నొక్క వేదవిప్రునికి మృష్టాన్నం బిడిన బ్రాహ్మణకోటి సమారాధన మహాఫలంబు చేకూరెడిని. అట గాయత్రీ మంత్రజపంబునను చతుర్వేద పాఠఫలంబు దక్కును. ఒక్కరావిమొక్కను స్థాపించుట వల్ల నది పెంచినవారి పూర్వులు నలువదిరెండు తరాలవారు స్వర్గలోకంబున వసింపఁ గందురు. అట్టి దానిని ద్రుంచుటవల్ల నెల్లపితరులతో నారకంబులపాలు గావలసి నదే. తదశ్వత్థంబు దరిం గూరుచుండి యెవ్వండు పంచయజ్ఞానుష్ఠానంబు సేయు నాతం డక్షయ సుకృతంబు నంది సత్వరంబుగఁ బుత్రసంతానంబుఁ గాంచెడిని. ఇంకఁ దన్వ్రతోద్యాపన క్రమం బెట్లన్నఁ జెప్పెద వినుండు: ప్రదక్షిణాలెన్నయిన నందు దశాంశము హోమంబుం దద్దశాంశంబు బ్రాహ్మణ సమారాధనంబుం గర్తవ్యంబు. ఎవ్వారు బ్రహ్మచర్యంబు నూని యీ వ్రతంబు నెరపుదు రవ్వారుద్యాపనాంతంబున సోపస్కరాశ్వత్థంబును సాలంకృత సవత్సక ధేను శ్రేష్ఠంబును వస్త్రచ్ఛన్న తిలరాశిని భూరిదక్షిణలతో సచ్ఛీలురుం గుటుంబికులు నగు వేద విప్రులకు దానంబు లొసంగిన నభీష్టంబు లచిరంబ సంప్రాప్తంబు లయ్యెడి ' నని బమ్మ యమ్మునికిం దెల్ప నమ్మహాత్మ్యం బెల్ల నారదుం డవ్వారి కవ్వారిగాఁ దెల్పెను. అవ్విధంబున నెవ్వం డాచరించు నవ్వాని కవ్వి కోరిన

నవ్వి చేకుఱు. కావున నోవంధ్యా! అశ్వత్థ మహాత్త్వం బిష్టయినఁ
దెలిసెఁ గాన నద్దాని నీక నిందింపక నిస్సంశయంబుగా నుక్తరీతి
ననుష్ఠింపుము. తత్సంగమస్థి తాశ్వత్థంబు కల్పద్రుమంబు నన్ను
న్నిలయంబుగా నెఱిఁగినమ్మి గుఱిఁ జెదర కారాధించితేనిఁ ద్వరలోఁ
గొమరుండుం గొమిరెయు నమరుదు' రని గురుండాఱెంగించెను. అం
దుల నావృద్ధనారి నమస్కార పూర్వకంబుగా నిట్లు బదులు వల్కెఁ:
«స్వామీ! అఱువదేండ్లు నిండినదానను జాతివంధ్యను నేనేడ ?
నాకింకను బుత్త్రిం డేడ ? కానిండు. ప్రత్యక్షంబుగా మీపాదం
బులే యుండ నాకిం కేయశ్వత్థంబు లేమిటికి ? ఉక్తరీతిని భవ
త్పాదసేవనముఁ గావించినవారి కేరావిచెట్టులేల ? ఏమైనఁ గామ
ధేను ప్రాయంబుగా మీమాటలు తోసిపుచ్చను. చెచ్చెర
నేఁబోయి యచ్చో నిచ్చలు నర్చించుచుండుదాన' నని పనివిని మట్టాల
తీర్థావగాహంబు సేసి యమ్మానిని శ్రీగురూక్త విధానంబున నశ్వత్థ
సంసేవనం బొనర్పం దొడంగెను. అట్లు బత్తిమీఱ నారాధించు
చుండ మూఁడవనాఁటి రాత్రివేళ నాయమకు స్వప్నంబున నొక
విప్రుండు కానుపించి యభయహస్తంబిడి

“చ. లలనరో! నీమనంబు సర◆ళంబగుటన్గురుభక్తియుక్తి నీ
తలఁపులగుం గురూత్తముఁబ్ర◆దక్షిణమూర నమస్కరించి ని
శ్చలమతిఁ దత్ప్రసాదితల ◆ సత్ఫలముల్గొని యారగించినం
గలిగెదు సత్వరంబుగను ◆ గాంక్షిత సంతతి చింతవాసెడున్॥”

అని ప్రబోధించి నట్టుల మదికిఁ బొడకట్టె. అంత నా
కాంతామణి మాతనంబున నెంతయు సంతసంబొదవనువ్విళ్లూరుచు
వేఁకువాతలేచి యథావిధి నాకల్పద్రుమంబును మున్నుగొందు సేవిం
చినవెనుక గంధర్వ పురంబునందు నరహరి గురువర చరణారవింద
మకరందేందిందిరం బైనప్రాతె. ఆకరుణామయుండుం బ్రసన్నవదనుండై
ఫలద్వితయంబు నాబత్తురాలిచేతనిడి పారణానంతరమున భక్షింప
నాజ్ఞాపించె. తన్నారీవతంసంబును యథోక్తంబుగా నెఱపినంత
నెల్లరకెంతయు వింతతోఁగ న్నిమ్మలయగా నాయమ యప్పాడ

రజస్వలయై యేనవనాఁడు గర్భంబు ధరింపఁగలిగె. తన్నాథుండు సోమనాథుం డనంత సంతోషాక్రాంత స్వాంతుండై తొలుతఁ బుంసవనాదికంబు నష్టమ మాసంబున సీమంతోన్నయంబు న్నున్నఁగాఁగల కర్మంబులెల్ల యథావిధిం బ్రవర్తిల్లఁ జేసెను. పేఁకటియా నాఁడందుము కైదువ నిండు వేడుకతో గుర్వాజ్ఞానుసారంబుగా వాయనదానంబులు నాతొమదలఁ జేయనాయెను.

సీ. పెదకిన నొకనల్ల ♦ పెండ్లికేనియు లేని
యిల్లాలు ప్రేఁకటి ♦ యేమిదంచుఁ
బండ్లాడియన్నిటం ♦ బట్టు తప్పినపుట్టు
గొడ్రాలికా కద్పు ♦ కూడనంచుఁ
పెద్ద తనాన నీ ♦ పెకు గర్భమెట్లను?
బిల్లకా దదిరోఁదో ♦ బల్లయుంచు
సోమయ్య పెండ్లపుఁ ♦ జాలాలి చందము
నిక్కమే యౌనో యు ♦ మ్మక్కయుంచు॥

తే. ముక్కలను పేళ్లతో బాఁప ♦ నక్కలాడ
శ్రితజన త్రాతనరహరి సేవసేఁతఁ
బోపఁడ త్రిమూర్తి యతఁడన ♦ దోషవరదుఁడు
గురుకృపంగానిదే?' యని ♦ కొందఱనిరి॥

మాసపూర్తి యయిన వెనుక నొక శుభముహూర్తంబున నామెకుం గుమార్త వుట్టె. దైవజ్ఞులు జాతకంబు నూచి 'శుభలక్షణాన్వితయా నాపట్టివల్లఁ గులవృద్ధి గాఁగల'దని తెలిపిరి. సోమనాథశర్మ మనంబునం బొంగి వారికి వస్త్రంబులర్పించి యంపెను. పిదపఁ బురుడు వెళ్లఁగానె నడికట్టు కట్టిన యా ముదుక బాలెంతరాలు బిడ్డనెత్తుకొని యాడుకోఁడన వెన్నెటి తోడరాఁగా శ్రీ నృసింహ సరస్వతుల సన్నిధికరిగి తచ్చరణ సరసిజంబులదరి నాబురుకనిడి సాష్టాంగ దండ ప్రణామంబు సేసెను. స్వామి సాదరంబుగఁ 'బుత్రీవతీ! లౌ' మ్మనవుడు నా

యమలేచి 'యిది పుత్రిక, పుత్రుండు కాఁడే' యను నాయమం
గని నవ్వ 'యింక సందియమేమిటికి? కొడుకనిం గందువులెమ్మ
నిరి. ఇట్లనుచు నవ్వరదు లాకసుగందునందుకొని యివ్విధంబున
దీవించిరి: 'ఈ నీ బిడ్డ దీర్ఘాయుష్మతియు సౌభాగ్యవతియునై ధర్మ
రతయు సచ్ఛీలయుఁనా సతీమతల్లియన ధాత్రిం బ్రఖ్యాతివడసి
బహుపుత్రపౌత్ర సంపత్తిమీఱి నభివృద్ధిం గాంచెడిని. ఈలోకైక
సన్నుత దివ్యచారిత్రను సందర్శింప నొక్క దక్షిణదేశావనీశుండు
రానున్నాఁడు. మీకు దొరకెడి యల్లుఁడు నిగ
మాగమాంత విశారదుండును మహైశ్వర్య సంపన్నుండు నయ్యె
డిని. మఱి మీకొ తనయుం డెట్టివాఁడు గావలయు? మూర్ఖుఁడైనను
శతాయుష్యుఁగా నుండుటమేలా? లేకల్పాయువైనను విద్వాంసుఁడే
కావలెనందువా? చెప్పు' మనంగా నాగంగాంబ 'చదురా చదు
వరిని గానములపోవు నేవురు తనయులఁ గనువానిం బ్రసాదింపుఁ'
డని మ్రొక్కె. ఆభక్త చింతామణి యాకాంతామణి కోరినట్ల
యౌఁగావుతమని దీవించి వారినంపివైచెను. అంత నొక యేఁడా
దిలోఁ దద్గురువర ప్రసాదలబ్ధ తనూజాతుం డుద్భవించె. వాఁడు
కాలక్రమంబునఁ బెరిఁగి చతుర్దశ విద్యలం దారితేరి నైదుగురు
బిడ్డలతండ్రియై వంశదీపకుండుగఁ గలిగెను. గంగాసోమనాథప్రథమ
ప్రసూతియు సరస్వత్యభిధానయై యథాసక్తి శుభోదయంబుఁ
గనియె. ఆయమ పెనిమిటి దీక్షితుండై దిగంత విశ్రుత కీర్తియై
విలసిల్లెను.

నామధారకా! శ్రీగురుకృప యన్న నెట్టిదో చూచితే!
ఎట్టి యసాధ్యంబులు నిట్లు సుసాధ్యంబు లయ్యెడింగాదే! కావున
వారియెడ దృఢవిశ్వాసముఁగలిగి భక్తితో సేవింపఁదగినదని సిద్ధుం
డుపదేశించెను.

## భక్తికాండము—3 దశము.

సిద్ధుండు నామధారకున కిట్లనియె: 'ప్రియశిష్య రత్నమా!
నీ కిపుడు శ్రీగురుమహాత్త్వ ప్రబోధకంబౌ నపూర్వకథ చెప్పఁ

ఇంతలో నెవ్వఁడో ముదిరిన యొండు మేడికఱ్ఱ నొక్కదానిం జేతఁ గొని యక్కడికివచ్చి యతివరు లాశాఖంబుదెసఁ జూపుచు నాకుష్ఠ ద్విజున కిట్లనిరి: 'ఓయీ! నీకీ మేడికఱ్ఱ నిప్పింతును. నీవిది తీసికొనిపోయి నామాటయందు దృఢవిశ్వాసముంచి నేఁజెప్పినట్లు చేయుము. ఇద్దానిని భీమాతటంబున సంగమంబునకుం దూర్పు వైపున మొక్కను నాటినట్లు భూమిలో నాటుము. అంతం గృత స్నానుండవై యశ్వత్థ వృక్షంబునకుఁ బ్రదక్షిణంబుఁ జేసి పునః కృతావగాహుండవై రెండుచేతుల రెండుకుండలు నిండ నుదకంబుం గొనివచ్చి ప్రతిష్ఠిత శాఖాభిషేచనంబుఁ గావించుచుండుము. ఇట్లు చేయంజేయ నేనాఁటి కది చిగిరించు నానాఁటికి నీ పాపం బడంగి నీయొడలు బాగౌను. పొమ్మని యాన వెట్టిన నే యాతండును విశ్వాసంబుతోడ నాకట్టెను దన నెత్తిపైఁ బెట్టుకొని పోయి గురుం డెట్టులఁ జేయుమనె నట్టులనే యద్దానికి నిత్యాభిషేచనంబుఁ గావింపఁ దొడంగెను. ఆకుష్ఠద్విజుండు తచ్ఛుష్కశాఖంబు నాఁటి యాలవాలంబుసేసి తదేకదీక్ష న్నీటితో నదినింపుచుంటం గన్న యచ్చోటివా రెల్లరు నవ్వి, 'ఓవెఱ్ఱి బాఁపఁడా! నీకు మతిపోయె నేమి? నీవెన్నాళ్లెన్ని నీళ్ళు పోసిన నెండుపుల్ల చిగుర్చునటోయీ. చాలుఁజాలు. ఆగురుమూర్తికి నీయెడఁ గృపయే కల్గెనే నిదంతయు నేమిటికి? ఆమహాత్ముఁడు తలఁచిన మాత్రమునఁ గానిదేది? నీకీ జన్మాన నీరోగము కుదురఁదగిన యోగము లేకపోఁ బట్టియే నీమొగాన నీకట్టె పడవేయ నాయనకు బుద్ధిపుట్టెను. పైఁగా నీవిట్టి వృథా ప్రయాసముఁ గూడ నందనేమిటి?' కనుచు నెందఱొందఱు తనను నిరుత్సాహపఱచి మఱలింపఁ జూచిన నాతఁడు దృఢ విశ్వాసము చెదరనీయక యట్లె యారాధించుచు వారి కిట్లనుచుండె:

తే. భువి మహాత్ములువల్కిన • మోఘముగద।
సత్యసంకల్పగురువాక్య • సత్యమౌనె? ।

మృతులఁ దల్పఁగ నెందఱో • బ్రతికియుండ।
నెందు కష్టాలు చిగిరించు • నేమి వింత ?

శ్రీగురూత్తములయాన శిరమునఁ దాల్చి యిటఁ 'ప్రాణాలైన విడుతును గాని నా పూనిన కర్జంబు మాన' ననుచు పట్టు కావించుచుండెను. ఆతని మూఢవిశ్వాసమున కబ్బురపడనివారు లేరైరి. అందుఁ గొందఱు పోయి గురువుల కివార్త నిట్లు నివేదించిరి: 'స్వామీ! మీరా నాఁడా కుష్ఠపీడితున కా యెండు కట్టె పుల్లను జేతఁ బెట్టించి యెందుల కేమి చెప్పితిరో కాని యా కట్టె బాఁపనయ్య యా ముక్క పట్టుకొని యీ వారముదినాలనుండి యుద్ధరిణెడు నీళ్ళయిన గొంతులోఁ బోసికొనకుండ నదే పనిగా 'నా పాడుకట్టెకే మొక్కుచుఁ గూర్చున్నాఁడు. 'వృథా దేహాయాస మేమిటికి? మాను' మని యెందఱెన్ని విధాలఁ జెప్పినను వినఁడు. వాని పిచ్చియే వానికానంద మన్నట్లున్నది. పైఁగ నడిగినవారి కల్లర 'కీకట్టె యెట్టిదైన నేమి? గురువు లేమి చెప్పిన నట్లు చేయుటయే నా పని.' వారన్నది వారి నగ్గించి కొందరు 'లెం' డనుచుఁ దన మనోనిరూఢి చెదరక యిప్పటి కేడు లంఘనాలు చేసినాఁ' డని చెప్పిరి.

వారినుడువు లాలించి గురువు లిట్లు పల్కిరి:

తే. ధరను గురువాక్యమాత్రమె • తారకంబు।
గురులపల్కుల గుఱికల్గిఁ • గోరవదగు।
నందు లక్ష్యము లేకున్న • వ్యర్థతఁ గను।
నెవఁడు భావించు నట్లు ఫ • లించు నట్టు॥

ఇందులకు స్కాందోక్త మొకగాథ కలదది నుడివెద వినుండు: ఒక్కెడ శౌనకాదుల సంప్రశ్నంబున రామహర్షణి గురుభక్తి ప్రకారం బిట్లు తెలిపెను:

తే. గురుఁడు నరుఁడని దోసఁగులఁ • గూడదెన్న।
బ్రహ్మభావనఁ గనఁ బాపు • భవ మథవుఁడు।

దేవమంత్ర భిషగ్విప్ర ♦ తీర్థగురుల।
యాదృశంబగు భావన ♦ తాదృశాప్తి।

మఱియు భవాంభోధి నిస్తారకంబులందెల్ల దృఢభక్తియుక్తి గురుసేవనంబ సులభతమంబౌ సాధనంబు. గురుండే పరమేశ్వరుం డని భావించి సేవించువానికి సద్యఃఫలాప్తి యగుననుట కొక్క నిదర్శనంబుఁ జూపెద:

మున్ను పాంచాలదేశంబున సింహకేతు మహీపాలుం డేలుచుండెను. ఆతని తనూభవుండు ధనంజయుండు ధార్మికుండని ప్రఖ్యాతి వడసియుండె. ఒక్కయెడ నీరాజపుత్త్రుండు మృగయావిహారార్థమై పోయిపోయి వన్యమృగానేక సంకులంబౌ నిర్జనారణ్యంబుసొచ్చె. అచ్చోటు నిర్జలంబు నయ్యె. వేఁటలాటం గొంత వడి కాలంబు మిగులఁడస్సి యెంతయు దప్పిఁగొనియె. అంత నొక్క బోయవాఁడు త్రోవఁజూప రాకొమరుం డొక్క జలాశయంబుం జేరి దాహశాంతిఁ గావించుకొని తత్పరిసరంబునం గానుపించిన దేవళంబు కడకేగి యటసేదఁ దీర్చికొనుచుండె. అచ్చోఁ బెక్కు లింగంబు లెటఁజూచినం గానుపించె. తదనుచర శబరుం డందొక్క లింగంబుం జేతఁగొని యయ్యది కడురమణీయముగా నున్నదనియె. రాజపుత్త్రుం డదికాంచి దానిని 'ఓరీ! యెన్నోలింగా లుండఁగా నిది నీ కెందులకి' కని యడుగఁగా వాఁడు 'రాజకుమారా! యిది పూజనీయంబగు ప్రశస్తలింగంబుగా నామదికిఁ బొడకట్టినందున దీని గైకొంటి' ననుచు బదులు పలికె. ధనంజయుండును జిఱునవ్వుతో 'మేలుమేలిది ప్రశస్తమైనది. కావున నట్లె భక్తితో నారాధింపు'మని బోధించె. వాఁడదివిని యాతని కిట్లనియె: 'అయ్యా! నేనడవిం బడియుండు మూఢుఁడను బోయవాఁడను గదా. లింగార్చనం బెఱుంగను. నాయందుఁ గరుణించి యది యెట్టో విదితంబుసేయరే! మీరే గురువుల' రనవుడు నారాజపుత్త్రుం డివ్విధంబునఁ గఱపఁ దొడఁగెను: 'ఓయీ! చెప్పెద వినుము. ఈలింగంబుం గొనిపోయి మీయింట మడిచోట నుంచి యయ్యదియె

శివస్వరూపంబుగా నెంచి శ్రద్ధాభక్తులతో ధర్మపత్నీ సమేతుండవై గంధపుష్పాక్షతాదులం బూజించి ధూపదీపంబు లర్పించునది. మఱియుఁ బ్రతిదినము శ్మశానంబునుండి చితాభస్మంబుం గొని వచ్చి యయ్యదియు సమర్పింపవలయు. పిదప నీవు భుజించున దెల్ల ముందీశ్వరార్పణంబుగా నివేదించిన వెనుకఁ దత్ప్రసాదంబుగా సతి దారతో నారగింపవలయు ' నని యుద్బోధించెను. అయ్యాటవికుం డును ధనంజయ బోధితార్థంబు మదిన్నిల్పి యట్లు కావించు చుండు నని పనివిని తల్లింగంబు న్నిజాగారంబునకుఁగొంపోయి సాక్షాద్భవుం డట్లు ప్రసన్నుం డయ్యెనని తనవారికిం దెల్పి యుపదిష్ట ప్రక్రియ నద్దాని న్సమర్పించుచుండె.

ఇట్లుండ నొక్కనాఁ డెన్నిత్రావులు గాలించినను వానికిఁ జితా భస్మంబు లభింపదయ్యె. వాఁ డెంతయు ఖిన్నుండై యిలుసేరి యిల్లాలితో నిట్లనియె. అయ్యో! నేఁడు లింగపూజ కాలేదు. గురువు లుపదేశించిన తెఱఁగుననే పూజింపవలెఁగాని వేఱొక విధమునఁ జేసిన నది వృథయగును. గురువుల వాక్యముల కడుగు దాఁటినయెడఁ బాపంబును నరకంబును దారిద్ర్యంబును సంప్రాప్తము లయ్యెడు. గురువాక్యాచరణంబువల్లనే పుట్టువు లుడిగి గట్టున వొట్టఁగం దుము. అట్లని నేనన్నన్ని త్రావులకుఁ బోయి వెదకినను నేఁడు భస్మంబు లభింపలేదు. ఇంకేమి సేయుదు? నా ప్రాణాలు విడుతు' నని దుఃఖించువానిని శబరు నోదార్చుచు శబరి యిట్లనియె: 'ఇందుల కింత చింతింప నేల? మనయింట నెన్నికట్టెలు లేవు? వానితో నన్ను దగ్ధముఁగావించి యాబూడిద శివున కర్పింప రాదా? భయములేదు. వ్రతభంగముఁ గావించుకోవలదు. నేను నాదేహం బిందులకై సంతోషపూర్వకముగా నర్పించుదానను. ఈదేహ మేనాఁటికైన నశింపవలసినదే కాని స్థిరమైనది కాదుగదా. అట్టిదీనిని శివకార్యంబుకొఱ కర్పించుటకంటెఁ గావలసిన దేమి?' యని ధైర్యంబుగొనఁ బలికెను. ఆమాటలు విని బద్ధుంతనే యెం తయు ఖిన్నానసుండై నాశబరుండు తనదానికిట్లు బదులుపల్కె:

‘ ప్రాణేశ్వరీ! నీవు వయసునఁ బిన్నదానవు. రూపంబుననో మిఁన్నవు. సంసార సుఖంబైనఁ దిన్నఁగా నెఱుంగవు. ఒక్కబిడ్డనైనం గన్నదానవుగావు. నిన్నుఁ గన్నవారు నాచేతఁబెట్టిరి. సూర్యచంద్రులు సాక్షులుగా నిన్నుఁ బరిపాలించుకొందునని బాసచేసిన నేనేమి! నిన్నుఁ జేతులారఁ జంపుటేమి! నిన్ను దహింపఁ జేసిన నాకుఁ బాపంబు చుట్టుకొనును. ఎల్లరు స్త్రీహంతననినన్ను దూషింతురు. అంతటి దుష్కర్మం బొనరింప శివుండు మాత్రము సహించునా? పైఁగ మీతల్లి దండ్రులు నన్నుఁదిట్టిపోయుదురాయె. కాకున్నను బెక్కువ్రతంబు లింక నెఱపఁ దగ్గదానవు. చెక్కు చెదరని చక్కందనమ్మున కిక్కవై చొక్కించుచక్కరతిండివి.నిన్ను దక్కించుకొక వెక్కసెక్కంచి నుగ్గుక్కఁజేయ నోర్తునే?’ యను పలికిం దత్సతి వినతమై యిట్లు ప్రతివల్కె: ‘నాథా! యేమి మీయజ్ఞానము? ఇదెల్ల మాయవల్లనైన మోహము గాదేమి? ఈమనబ్రతుకులు స్వప్నప్రాయములు కావే? బుద్బుద సదృశములౌ మనయీదేహాలు సుస్థిరములా? పుట్టుట గిట్టుటకొఱకే కాదా? ఇంతకు మాతలిదండ్రులు మీచేతఁబెట్టినందున మీకర్ధాంగినిగా లేదా? ఇక నే నన్యురాలనా? అట్టిన న్నగ్గిని బ్రమ్గించుటయు స్వార్ధ దేహదానంబ కాదే? దాన మీయర్ధాంగంబు శివార్పణం బగుంగావ నందెవ్విధంబునను దోషంబు గానుపింపదు. ప్రాణేశ్వరా! నశ్వరంబౌ నీనాదేహంబున కివ్విధంబున సాఫల్యం బొదవింపుఁడీ. పరమేశ్వరు నిట్లు ప్రార్థనన్నుం గావించుకొనుండీ,’ యని యెంతసేపో చెప్పఁగాఁ జెప్పఁగా నాపెనిమిటి గత్యంతరము లేక యందుల కొప్పుకొనియె.

అంత నాశబరి లోనికిఁబోయి కొంపకుఁ జిచ్చుపెట్టుమనియె. శబరుండును గవాటంబును బంధించి యట్లకావించె. పిదపఁ దద్భస్మంబుఁ దానర్పించు లింగంబున కెంతయుభక్తి జొత్తిల్ల నప్పనంబుసేసి కృతార్థుండనైతినని యమందానంద భరితుండయ్యె. అయ్యెడఁ దన నెయ్యపుటాలిం గోలుపోయితినను స్మృతిలేనివాఁడై

యథాపూర్వంబుగాఁ బ్రసాదగ్రహణంబు సేయుదము రాకే'యని తనయిల్లాలిం బిలిచెను. అహా! యేమి చెప్పుదు! అమృత్యుంజయు ప్రసాదంబున దగ్ధ శబరి పునరుద్ధరింపఁబడినదై నడచివచ్చె. ఆదంపతు లప్పుడు శివప్రసాదంబు భుజించిరి. అంతవారు వెనుదిరిగి చూచునంతలో వారికొంపయు నశింపక ట్లయుండెను. అప్పుడా శబరుండు విస్మితుండై, సుందరీ! నిన్నే నిందు మ్రిందించితినే! మరల నెట్లు రాఁగలిగితి?' వని నిజసతి నడిగె. ఆమె భర్తకిట్లుటంకించె: 'ప్రాణనాథా! ఇల్లు నలుదెసల నంటుకొని భగ్గున మండుచుండ నదియేమి చిత్రమోకాని నాకు నెక్కడనులేని చలియుఁ గలిగె. అందు నేను ముడుచుకొని పరుండఁగా నాకు గాఢనిద్ర పట్టెను. తరువాత నద్ది యేమైనదియు నాకుఁ దెలియదు. మీపిలుపువల్ల మెలఁకువఁగని లేచి వచ్చినదానను. అహా! యేమి యీ యీశ్వరలీల!' యను నంతలో సాంబుండా దంపతులకుఁ బ్రత్యక్షదర్శనం బొసంగెను. వారు సాష్టాంగ దండ ప్రణామంబు సేయఁగా వివాహంబున నఖండ సుఖంబును బిదపఁ గోటివర్ష పరిమిత స్వర్లోకవాసానందంబుం బ్రసాదించి శంభుండంతర్హితుండయ్యె'నని సూతుండు శౌనకాదులకుఁ దెలిపెను. దీన మనము తెలిసికోఁదగ్గదేమన నెంతైనఁబూర్వవిశ్వాసంబు గలదేని ఫలంబ చిరంబ కలిగెడు. కాఁబట్టి యా కుష్ఠద్విజుండు శుష్కకాష్ఠంబు నేని విశ్వాసంబు చెదరక సేవించినందువల్ల ఫలంబు నందకపోదు. ఎవరికైన నెట్టిభావనమున్న నట్టులే ఫలించుచున్నది నిక్కువం' బని గురుం డెఱుంగఁ జేసెను.

పదపడి స్వామి సంగమంబునకు స్నానార్థమరిగి యట నిజానుష్ఠానం బైనవెనుక నాకుష్ఠవ్యాధి బాధితుని దరిసెను. ఆతండు తానువిన్న చందంబున నే యట నారాధించు చుంటంగని గురుండు నిజకమండలూదకంబు నాకాష్ఠంబునం బ్రోక్షించెను. తత్క్షణంబయ్యది పల్లవితంబయ్యె. ఎల్లర బ్బురపడుచుండ నాశుష్కకాష్ఠం బప్పుడ యభివృద్ధింగని యుదుంబర వృక్షంబు కానయ్యె.

అద్విప్రుండును విగతరోగియయ్యె. అతని దేహంబు సువర్ణచ్ఛా
యతో దీపింపఁజొచ్చె. అతండు గురుపాద వనజాతంబుల కయ్యెడ
భక్తితో మ్రొక్కి హర్షాశ్రువులు చింద నిట్టుల సంస్తుతించెః

పద్మనాభ వృత్తము

స్వామీ! జగత్కల్ప వాదిత్రమా! భక్త ♦
సంత్రాణదీక్షా! సురద్విడ్విపక్షా!
కామాది మత్తేభ హర్యక్ష! యోగాప్త ♦
కజ్ఞాన శిక్షా! కృపాశ్రృత్వదృక్షా!
శ్రీమా మహామాని హృద్వర్తివానంద ♦
విస్ఫూర్తిన ర్తిల్లదోహాహాతా ర్తీ!
యామన్ని కాలింగ్యపాపూర్తిజన్మించి ♦
తుర్వీన్నుకీర్తి! బుధేడ్య త్రిమూర్తీ॥

మాలినీవృత్తము

అవితథ వరదాతా ♦ యవ్య యా! దివ్యనేతా!
ప్రవిమల గుణపూతా ♦ పాలితధ్యాతృజాతా!
భవహర సుచరిత్రా ♦ భస్మలిప్తాచ్ఛగాత్రా
రవి శశధరనేత్రా ♦ రాజ సంస్తోత్రపాత్రా॥

అని యాద్విజుండు పెక్కుభంగుల సంస్తుతించి శ్రీగురు
పాదాబ్జంబులకు సాష్టాంగ ప్రణామంబుసేసె. స్వాములును
దత్కృతస్తోత్రంబునకు సంతుష్టింగని యాతని కథయంబు వల్కిరి.
ఆనంద బాష్పంబుల గురులకుఁబాద్యం బొసంగుటం దనివిసనక
తచ్చరణంబులు విడువక పడియున్నవానిం గృతజ్ఞు నా ప్రజ్ఞానిధి,
జ్ఞానరాశి! లెమ్ము లె' మ్మని కృపమీఱఁ జేయూఁత యొసంగి
యుద్ధరించి మించి యాశ్వాసించె. తమ్మకాష్ఠంబు పల్లవితం
బౌటయుం గుష్ఠరోగి యంతలో నపేతామయుం డౌటయుం గాం
చిన తత్రత్యులు గురుమహత్త్వంబున కాశ్చర్య సంభ్రమంబులు
పెనంగొన వివశులై యుగ్గురూత్తము నెంతయు నగ్గించిరి. పెం
పియు శ్రీగురుం డా భూసురుఁ బిలుంద నిడికొని నిజాశ్రవాసిక

పరివృతుండై మఠంబునకుం జేరె. ఇదెల్లం గాంచినవారు వివరించిన మీఁద నాలకించిన గంధర్వ నగర వాసులందఱు నబ్బురపడి గురుభక్తిప్రభ నవ్వారికి నీరాజనంబిడిరి. వారెల్లర విప్రవృందము భూరి సమారాధనంబుఁ గావించె. అంత సరస్వతులాతనితోడఁ బ్రీతిమీఱ దగ్గఱకుఁ బిల్చి యిట్లనుగ్రహించిరి: 'వత్సా! మద్భక్తు లందఱిలో నీయందు నాకమితప్రేమ యుండునది. నీవు గవాశ్వాది సంపత్తిమీఱ నైహికానందంబుఁ గందువు. నీవంశజు లెల్లరు వేదశాస్త్రవేత్త లయ్యెదరు. నీవు దారపుత్త్రులతో నిడుసుఖంబుండుము. నీకింక నాముష్మికఫలంబును సుకరంబయ్యెడు' ననుచు విధివిహితంబుగ విద్యాసరస్వతీ మంత్రోపదేశంబుఁ గావించి యోగీశ్వరాభిధానం బొసంగె.

నామధారకా! శ్రీగురుప్రసాదంబున నావిప్రునికి ముప్వురు కులదీపకులు సత్పుత్త్రు లుదయించి గురుభక్తిమీఱ నభివృద్ధిఁ గనిరి. ఇమ్మహి నమ్మినవారి కెమ్మెయి నమ్మహానీయుం డాదరువయ్యెడినో చూచితే యని సిద్ధుండు వలికె.

భక్తికాండము — రదశము.

నామధారకుండు కృతప్రణాముండై సిద్ధున కిట్లువిన్నవించు: 'యోగివరేణ్యా! నానాధర్మాన్వితంబగు శ్రీగురుచారిత్రం బుపదేశించితిరి. దాన మామకీన హృదయగహ్వరంబు నందలి యంధకారంబువాసె. జ్ఞానదీపిక ప్రజ్వలితంబయ్యె. ధన్యుండనైతి. ఇప్పుడు గురుస్మరణం బన్న నానంద బ్రహ్మకల్పంబుగా నున్నది. అట్టిగురువరు సాన్నిధ్యంబు నందఁగల్గిన మహాజ్ఞానివి. సిద్ధపూరుషుండవు. నీపాదంబు లిప్పుడ సేవించు భాగ్యంబు నాకబ్బెఁ గాన నొక్కయంశంబుఁ దెలియఁ గోరుచున్నాఁడ. మాపూర్వులు సద్గురు సేవనం బెట్లుగావింపఁగల్గిరో తెలియఁగోరుదు' ననవుడుఁ దద్గురుసమీప స్థాశ్రివోత్తముండు సిద్ధసత్తముం డివ్విధంబునఁ బల్కుందొడంగె: 'బిడ్డా! సావధానమతితో నాలకింపుమోయీ. మున్ను గౌతమీతటంబున సాయందేవుం డనఁబరఁగిన మీవంశో

ద్ధారకుం డాకనువ్రతుండు శ్రీగుర్వారాధనైక పరుండయ్యె. అతని యెడ గురుపాదుల కమితప్రేమ కలిగెను. సాయందేవుండు శ్రీనృసింహ సరస్వతుల మహత్త్వంబు బహుముఖంబుల విని యొక్కెడఁ దద్దర్శనార్థియై యపరిమిత భక్తిభావంబుతోడ గంధర్వపురం జేరనేఁగనుచుఁ జూడఁబోరెను. ఆయూరు దూరానఁ బొడకట్టినది మొదలుగా నందలి శ్రీగురుమఠంబుం జేరులోపల నడుగడుగున బత్తిమీఱఁ బడుచు లేచుచు నాతం డట్టకేలకుఁ గట్టెదుట నావిశ్రుతకీర్తిని సాక్షాత్పరబ్రహ్మమూర్తిని గనులారఁ జూడఁగలిగె. అయ్యెడ మీఱాత రోమాంచితదేహుండు సానందాశ్రుక్లిన్నాననుండునై శ్రీగురు పదాంభోజాత ద్విరేఫంబుగా నిజకేశంబులం దల్లగ్నరజంబూడ్చి కేల్మోడ్చి గద్గదస్వనంబున నివ్విధంబున సంస్తుతింపఁదొడఁగె:

కుమార లలితావృత్తము.

లసన్నిగమసద్మా । ప్రసన్నముఖపద్మా!
విసృష్ట జనతాపా । నృసింహ యతిరూపా ॥

సీ. నీకమండలుజలం ♦ బేకాఁగనమృతంబు
బ్రతికింప మృతులను ♦ బమ్మవగుదు
నీచేతిదండంబు ♦ నిర్జింప భయమెల్ల
శరణాగతులఁబ్రోచు ♦ శౌరివగుదు
భస్మాక్షమాలిక ♦ ల్వ్యాఘ్రాజినముఁ దాల్చి
పాపాపహారివి ♦ భవుఁడవగుదు
ధరఁ జరణంపవి ♦ త్రిమ్మని కీర్తింప
నార్తనిబాపఁ ద్రి ♦ మూర్తివగుదు॥

తే. కానిదెయ్యది నీకటా ♦ క్షంబుగలుగఁ
గట్టెదిగిరించు గొడ్డ్రాలు ♦ కనుసుతులను
వారుపితరులు నేను ధ ♦ న్యతనుబడయఁ
ద్వత్పదాబ్జాతదర్శన ♦ ప్రాప్తియొదవె॥

సీ. అకలంకనాదబిం ♦ దు కలాస్వరూపాయ
భావగమ్యాయతు ♦ భ్యంనమోస్తు
లంబసృష్టిస్థితి ♦ లయహేతుభూతాయ
మహిమాన్వితాయతు ♦ భ్యంనమోస్తు
ఆదిమధ్యాంత శూ ♦ న్యాయసుస్థిరపర
మాత్మ సంజ్ఞాయతు ♦ భ్యంనమోస్తు
సచ్చిదానంద భా ♦ స్వద్విగ్రహాయమా
యాతమోర్కాయ తు ♦ భ్యంనమోస్తు॥

తే. యావృతజగత్త్రయాయ తు ♦ భ్యంనమోస్తు
ఆగమాంత వేద్యాయ తు ♦ భ్యంనమోస్తు
మౌనికులతిలకాయ తు ♦ భ్యంనమోస్తు
వర్ణ్యసచ్చరితాయ తు ♦ భ్యంనమయన॥

అప్పుడా శ్రీగురుమూర్తి కృపాపూర్ణుడై సాయందేవు నాశ్వాసించి సాదరంబుగ నతనిశిరంబునం గరంబూంచి యీతె ఱంగునఁ బ్రీతిఁబలికెను: 'ఓయీ! నీవునాకుఁ బరమభక్తుండవు. నీవంశజులుం గలకాలము నన్నారాధించుచుండుదురు. ముందీవు సంగమంబున స్నానింగి యయ్యశ్వత్థావనీరుహంబు సేవఁగావించి వేగము రమ్ము. పొమ్ము. పిదప మాతోడ నీడఁ బ్రసాదంబు సేకరింప నయ్యెడు' నన నాదేవుండు నట్లె వేవేగము గావించి వచ్చి గురుపూజ సలిపె. అట్టియెడ నాకృపామతి కుతుకంబున నీనూత నాగతు నాశ్రితుఁ దనయెదుటఁ గూర్చుండి భుజింపుమని చెప్పి యొడఁబఱచె. వారు షడ్రసోపేత భోజన మొనర్చిన వెనుక మాగురుండు మీసాయందేవునిఁ దనడగ్గఱకుఁ బిలిచి! 'నాయనా! నీనివాస మెక్కడనోయీ? నీదారపుత్త్రు లెయ్యెడ నున్నారు? అందఱును క్షేమమా?' యని కృపమీఱఁ బరామర్శించిరి. అందుల కాతండిట్లు బదులువలికె: 'ఓహో సర్వజ్ఞమూర్తీ! మీరెఱుంగని దేమియున్నది? మీదయవల్ల నంతయుఁ సేమము.

కూఁతులం గొడుకులమా యుత్తరకించిలో డించి మీసామీప్య ముంగాంచి భవచ్చరణాబ్జంబుల సేవించుచుండెదం గావుతమని నిశ్చయించుకొని యిటకుం జేరినాఁడను. నన్నింక మీదాసునింగాఁ జేకొనవలయు' నని బ్రొక్కెను. గురుండదివిని నవ్వి 'యేమనుకొనుచున్నావో! నన్ను సంతతము సేవింతమన్న నంత సులభసాధ్యముకాదు సుమీ. నేనొక్కట నుండువాఁడనుగాను. ఒకప్పు డూరను వేఱొకప్పు డడవిలోను వసించువాఁడను. నాతోడి సహవాసమువల్లఁ బెక్కుకష్టాలు గల'వని తెలిపెను.

సాయందేవుఁ డేమయినం బాఁబట్టినపట్టు వీడ కిట్టు మొఱవెట్టఁ దొడఁగె: 'స్వామీ! శరణాగతు నన్నుం దోసిపుచ్చకుఁడు.

సీ. గురువులదరిఁ జేర్చు ♦ చరణముల్చరణముల్
గురుపాదములనంటు ♦ శిరము శిరము
గురుపూజ సలిపెడి ♦ కరములు కరములు
గురుల వర్ణించెడి ♦ గొంతు గొంతు
గురునామ మయమైన ♦ మొరపంబు మొరపంబు
గురుసేవఁ బడసిన ♦ కుదురు కుదురు
గురుభక్తి శిష్టమా ♦ కూరంబు కూరంబు
గురువు లొసంగిన ♦ వరము వరము
తే॥ కలదె గురుకృపకంటె సు ♦ ఖ ప్రదంబు
కాలభయహర మఖిల దుః ♦ ఖాపహంబు
నిలను ధర్మార్థకామ మో ♦ క్షైక మార్గ
మట్టి గురుసేవకొఱకు జో ♦ హారు లివ్వె॥

అని పరిపరి విధముల నంగలార్చిన మీఁదట శ్రీగురుండాతని భక్తి నిశ్చలమైయుండు నెడనంగీకరింతుననిదరిఁ జేర్చికొనియె. మూఁడుమాసములు కడచినవెనుక నొకనాఁటి సాయంసమయమున స్వామి స్నానార్థము సంగమంబునకుఁ బోవుచు సాయందేవు నొక్కనిఁ దన వెంటఁ గొంపోయెను. అయ్యెడ, శ్రీగురుండాతని

మనోనిష్ఠను బరీక్షింపనై యొకవింతకథ నడపిరి. అదెట్లనిన, వార శ్వత్థమూలంబున నున్నట్లుండి సూర్యాస్తమయానంతరమున నాకస్మికముగా ఝంఝానిలం బుత్థితం బొనట్లు చేసిరి. దాని నేమి చెప్పుదు!

సీ. ఎక్కడెక్కడిపక్కు ♦ లొక్కుమ్మడిని రేఁగి
దిక్కులెల్లను మ్రోయఁ ♦ బిక్కటిల్లె
నిట్టులట్టులనూఁగి ♦ చెట్టులెన్నియొ నేల
గట్టుమిట్టలుకను ♦ బట్టుకుండె
నామూలనీమూల ♦ జీమూతపటలంబు
కారుకొంచునుమూఁగి ♦ క్రమ్ముకొనియె
భళ్లు భళ్లునను రో ♦ కళ్లపెల్లగుధారఁ
గుంభవృష్టిగనాడఁ ♦ గుమ్మరించె॥
తే. నులికి పడఁజేయునులివున ♦ నుఱుమఁ జొచ్చెఁ
గనులు మిఱుమిట్లుగొల్పెడి ♦ కరఁగె మెఱసెఁ
జడిముడిపడంగ నెడఁదలు ♦ వడఁ బిడుగులు
ఇడికొనంగను నడురేయి ♦ జడివడియెను॥

అట్టియెడ సాయందేవుండు గాలితాఁకునకు వానదెబ్బకు నోర్వనోర్చుకొని నిజోపరి వస్త్రంబును గురులపైఁ గప్పి తానట్ల నిలిచి యుండె. ఇట్లు రెండుజాములవఱకుఁ గురిసికురిసి నిశీథవేళ కావచ్చు తగ్గినమీఁదటఁ జలిగాలి వీవఁదొడఁగె. అపుడు గురులు తాము వలిగొనకుండఁ జలిఁగాచుకొనుటకుఁ దమమఠమునుండి కుంపటిని దెచ్చిపెట్టుమని యాసేవకుని కానతిచ్చిరి. బత్తుండును జిత్తమని వెడలిపోవునెడ నాతని నిటునటు చూడక వేగము పోయి రమ్మని వారు తిరిగి సెలవిచ్చిరి.

సాయందేవుఁ డట్లు గురుని పురాభిముఖుండై నడవఁదొడఁగె. ఎట్లెన నడుగిడినఁ దొడబంటియు ముమ్ముబంటియుఁగా జలమయం బయ్యె. పైనఁ గనులు పొడిచికొన్నను గానఁబడని గాఢాంధకారమయ్యె. ఒకప్రక్కను గూలఁద్రోసెడి ఝంఝావాతావళి

యయ్యెను. ఏమైనను గురుపాదంబుల నెమ్మదిన్నిల్పి తడవికొనుచు మెఱపుల వెలుఁగున వెలుగు నలుఁగుం దెలియుచు నాతం డెట్టకేలకు నగరద్వారంబుం జేరఁగలిగె. అచ్చోసుప్తులై యున్నవారి దౌవారికుల మేల్కొల్పి యవ్వారికి నిజగురువృత్తం బెల్లం దెల్పి వారివల్ల నౌకనివ్వల కుంపటిని చోదన యందుకొని తానువచ్చిన త్రోవనే నిర్గతుండుగాఁ జొచ్చెను. అతం డట్లు మరలునెడ నిటునటు చూడకుండ రమ్మని గురుం డనియుండె నేమిటికో యనుకొనుచుఁ దనకుడిప్రక్కకు దృష్టి సారించి యచ్చోఁ బంచమహాఫణాంచద్భీకర దర్వీకరంబుం గాంచి వెఱఁగుపడి త్రోవఁదప్పి దవ్వేగెను. ఆదివ్య నదమ్ము ప్రక్కం జూడ నట్ల వేఱొక్కచిలువ తనమీఁదికి వచ్చుచున్నట్లాతనికిఁ గనుపట్టె. ఒకదెస నదియు వేఱొక్కదెస నిదియుం గానుపించినంత నాతండదరి మదిచెదరి మిట్టపల్లాలు పాటింప కెట్టులో పాఱఁజొచ్చెను. పాప మీదేవుం డెటుపోయినం దన్ను నా రెండును దయ్యాలవలె వెంటనంటి తఱుముచున్నట్లే యుండెను. ఆతనికి గుండె దడపుట్టె. తుదకాతం డడఁదచెడి యొక్కయడవిలోఁ బడియె. అపుడాతఁ డెటుపోవఁ దెన్నుఁగానక తన్ననుగమించుచున్న పన్నగంబులకుం జిక్కితినోయను వెక్కసపాటునఁ గ్రిక్కిఱిల్లుచు శ్రీగురు నదన్నకొలిపి యుక్కాలాపుల బారినుండి దక్కింప దిక్కెవ్వరని ప్రొక్కఁగ భీతిదక్కి యొక్కటఁ జక్కనిబాట చిక్కెను. ఆత్రోవఁ ద్రొక్కి యొక్కింత నడచినంతఁ గొంతదవ్వున నాసంగమదేశంబు నచ్చోటి యశ్వత్థంబును గానవచ్చె. ఆప్రదేశంబు వేలకొలఁది దీపాలతో దేదీప్యమానంబుగా వెలుంగుచున్నట్లు గోచరించెను. మఱియు నాదెసనుండి శ్రుతివాక్యంబులుం బ్రస్ఫుటంబులై శ్రుతిగోచరంబు లయ్యెను. దాన నచ్చెరువడి ససంభ్రమంబుగా సాయందేవుం డాగమ్యప్రదేశంబు డాయఁబోఁగా నేమిచెప్పుదు నాకసమునుండి భూమిమీఁదికి దిగ్గిన సోముండో యనఁ బ్రకాశించువాఁడై శ్రీగురుమూర్తి యొక్కరుండ యాతనికిఁ గానుపించె. చకితాత్ముండాతండు పరుగు

పరుగున వచ్చి యాసర్పద్వయంబు తఱుముకొని వచ్చుచున్నది రక్షింపుఁడు రక్షింపుఁడని తత్పాదంబులం బడియె. ఆసర్పంబులు సద్యోద యవనతఫణంబులై గురుల సెలవంది మఱలె. అప్పటికిఁ బ్రాణాలుచేర నాసేవకుం డానీతంబైన యగ్గిబరగిల్లి గురువులదరి నుంచినమీఁదట వారాతని కిట్లనిరి: "ఓయీ! నీవాపాము లేమను కొంటివో కాని వాని నీకాపదఁ బాప నేనపంపితిని. చూచితివా? హేమైన నాసేవయున్న నిట్టు లమితకష్ట భయముత్పన్నముసుమ్ము. అయిన నెవ్వండేని మదిచెదరని కుదిరికతో ననుఁగొల్చునేని వానికిఁ గలిభయంబును గాలభయంబును వీడిపోవుట నిక్క-మ్మను సమ్మహాత్ముని వాక్కులు విని శిష్యుండు గురువుల కెఱఁగి యిట్లు మనవి యొనరించె: "స్వామీ! నేనేమియు నెఱుంగనివాఁడఁ గానఁ గృపమీఱ గురుభక్తి ప్రకారంబు వివరింతురేని దాన నామనంబున స్థైర్యంబుఁ జిక్కించుకొని మీపాదాల దగ్గఱఁ బడి యుండువాఁడ" ననియెను.

అంత శ్రీగురుండిట్లు లాతనికి బోధింపఁదొడంగె: "ఓయీ! అట్లయిన బ్రాహ్మముహూర్తమువఱకుఁ గాలక్షేపమునఁ గాఁగలదు. రసవంతమైన యొక్కకథను జెప్పెదవినుము. మున్నొక్కెడఁ బార్వతీదేవి పరమేశ్వరుని గురుభక్తి ప్రకారం బెఱిఁగింపుఁడని వేఁడఁగా నాసాంబమూర్తి తనయర్ధాంగి కిట్లు తెలిపె: "గిరిజా! గురునికంటె నీశ్వరుఁడు వేఱుగా లేఁడని దృఢమతితో భజించుట వల్ల సర్వసిద్ధులు నొనగూడెడి. గురుభక్తివల్లఁ గలుగుఫలము తపోనుష్ఠానాదికంబుల వల్ల నెట్లు పెద్దకాలమువఱకుఁ గాని సిద్ధింపనిది కాదు. మఱియు వ్రతాదులు నిర్వహించుటవల్లను ఫలము లేకపోదుగాని "శ్రేయాంసి బహువిఘ్నాని" యున్నట్లందుఁ బెక్కులంతరాయములు కలుగవచ్చును గాన నెట్టయిన నింతసులభ సాధ్యమని మాత్రమనవీలులేదు. ఇఁక యథావిధిగా గురుభక్తిని బచరించువానికి యజ్ఞాది కర్మాచరణంబు లేమి నెట్టిలోటును గలుగఁ బోదు. కావున గురుకులవాసంబుసేసి తత్సేవఁగావింప నవారా

షంబుగా నఖిలపుమర్థంబులుం గరతలామలకంబు లయ్యెడింజెప్పె.
ఇందులకుం దార్కాణగా నొకవిచిత్రమైనకథ నుడివెద నాకర్ణిం
పుము. పూర్వము త్వష్టయని లోకవిశ్రుతిఁ గాంచినవాఁ డొక
బ్రహ్మవంశ సముద్భూతుం డుండెడివాఁడు. అతఁడు రూపలావణ్య
సంపన్నుండును సర్వకర్మకుశలుండు నయియుండెను. అతఁ డుప
నీతుండై బ్రహ్మచర్యంబు నెఱపుచు గురుకులంబున విద్యాభ్యా
సం బొనరింపఁబోయి యట బత్తిమీఱఁ దత్సేవఁగావించు చుం
డెను. ఇట్లుండ నొకనాఁడు సాగిన గాలివానవల్ల నాగురువుగారి
పాతపూరిగొంబ యేరికిఁ దలదాఁచుకొన వీలులేకుండ నంతయు
జలమయంబయ్యె. అయ్యెడ నాయొజ్జ తన యంతేవాసికిట్లాజ్ఞా
పించెః 'నాయనా! యేఁటేట నీకొంపకుఁ దాఁటియాకులఁ గుట్టించి
కోలేక యిట్లుచిక్కులపాలౌచున్నాము. సర్వకర్మనిర్మాణ చాతుర్య
ధుర్యుండవౌ ఛాత్రవర్యుండవు నేఁటికి నాకు లభించితివిగావున
నిట్టి యిడుములువాయ నెప్పటికిం గ్రొత్తదిగానే యగపడుచుండఁ
దగినట్లొక చక్కని కట్టియింటిని గట్టిపెట్టుమీ' యని యడిగెను.
గురుపత్నియుఁ దనకు సరిపడఁదగిన విచిత్రమైన క్రొత్తరవిక
యొక్కటి కావలయుననియె. తత్పుత్త్రుండు తానునడచునెడల
బురద యంటనివియు నీటఁ దడవనివియు వేగవేగముగానడకసాగఁ
దగినవియుఁ దనకాళ్లకు సరిపడునవియునౌ పాదుక లమర్చియిమ్మని
కోరెను. 'సరే' యని పోవువాని నాతనిఁ దద్గురుపుత్త్రి యుత్త
రీయపుఁ జెఱఁగువట్టి యాపి యిట్లువేఁడెను: 'అన్నయ్యా! నాకుఁ
జెవులకుఁ బ్రకాశమానమైన రవలదుద్దుల జతయు నాడుకొను
టకు దంతముతోఁ జేయఁబడిన యొంటికంబపు మేడగా నుండెడి
చెక్కుచెదరని చక్కని బొమ్మరింటిని జేసిపెట్టవలెను. నా బొమ్మ
రిల్లు నేనలకవగా నా యిచ్చవచ్చినచోటికిఁ జేతఁగొనిపోఁదగిన
ట్లొకపీటయు నుండవలెను. ఇంక గుజ్జనగూళ్లకొఱకగు వంటలో
మసియంటకుండను వంటకంబుల వెచ్చఁదనమాఱకుండనుండఁదగు
గాజగిన్నెలుకూడఁ దెచ్చిపెట్టవలెను. ఇవన్నియుఁ దెచ్చిపెట్టుదు

దారసిలితిరి. మహాత్మా! యీ నిర్జనారణ్యంబునఁ దామెక్కడి నుండి దయచేసితిరో తమనామ మెయ్యదో కాని నాయెడఁగృపాపూర్ణులరై యవతరించిన గురుమూర్తులరే మీరలుగాఁ దోఁచుచున్నది. కావుననే యదేమోకాని తత్తఱపడ్డచిత్తం బిప్పుడు స్వాయత్తం బౌచున్నయది. ఓహో భక్తవత్సలా! అథముశుభము నెఱుంగని యర్భకుఁడను నీకు దాసుఁడ'ననుచు నా యవధూత పాదాబ్జాతంబులఁ బట్టుకొని పీడకుండె. అపుడాతఁడుమందహాసంబుతో నా బాలుం దనకేలూనిచి లేవఁదీసి వానిఁ దనదరిని గూర్చుండఁజేసి తత్పూర్వోత్తర వృత్తం బెల్లనారసెను. త్వష్టయు నిజదేశ క్షేమంబు నెఱుఁగ బానెదనందు కష్టంబులంగూర్చి స్పష్టముగాఁదెల్పి తనునట్టిస్థితినుండి యెట్టయిన గట్టెక్కింపవలయునని వేఁడెను. అంత నాయవధూత వాని కభయప్రదానంబు సేయుచు నిట్లనియె: 'బిడ్డా! హితంబుఁబల్కెదు. దాన నీకుఁ గావలసిన దెల్ల సిద్ధించెడి. అదేదనఁ జెప్పెద నాలకింపుము. సకలాభీష్టప్రదం బగు మహాస్థలంబు శ్రీకాశీపురంబు. నీవటకుఁబోయి యచ్చో విశ్వనాథు నారాధింపుము. పంచశతకోటి యోజన విస్తృతంబౌ నీభూవలయంబునందెల్ల విశేషమహిమాఢ్యంబౌ నా జగత్పద్మంబున బ్రహ్మాదులును మున్నిష్టార్థంబులెల్లఁబడసిరి. జగమ్ముసృజింప బమ్మయుఁ బాలింప నమ్మాధవుండును వరమ్ము లమ్మహింనందిరి సుమ్మా. విశ్వేశ్వర దర్శనంబుననే సర్వసిద్ధులు నొనగూడెడి. కావున వేగమ నీవట కేగుము. అట ధర్మార్థ కామమోక్షంబులం బడసి విశ్వసంభావ్యకర్ముండవౌ విశ్వకర్ముండవు కాఁగలిగెదవు. ఆనందకాననస్థితుం డాసచ్చిదానందమయుండు గ్రుక్కెడుపాలకై వచ్చినవారికిఁ గ్రిచ్చులఁ బాల్కడలినే మచ్చికనిచ్చి పుచ్చునంతటి దయాళుండు. ఇఁకఁ గాశియో ధర్మరాశియే. కాశీవాసులఁ జూచినంతకే సర్వదోష నాశంబయ్యెడి వన్నచచ్చోటఁ జిరంబుగా నుండువారి మహత్త్వ మిట్టిదని చెప్పఁ బరమాశి అట్టి మోక్షస్థానంబునన్నెట్టిన వెనుక నీకింకఁ జింతయుం

డడినే? కాశీమహాత్మ్యంబు సంపూర్ణంబుగా గుర్తింప నేరికయ్యె డిని? అచ్చోటి యత్యతీర్థంబుల సందర్శింప నేగిన నడుగడుగున నశ్వమేధఫలంబు దక్కెడిఁ జూవె. పెక్కేల? నీవెట్లయిన నను మోసముడిగి యానందవన ప్రాంతంబుం దాఁటకుండఁగనుము. నీవు నంబున్నెడ యానందమయుం బయిపోయెదవె' యన్నను నమ్మహా ముహుఁ బోధకుబ్బిన యబ్బాలకుండు కేలో మోడ్చి యిట్లు ప్రశ్నించెః 'దయానిధీ! మీరు సెలవిచ్చిన యానందవనంబు స్వర్గమర్త్య పాతాళ లోకంబులం దేకడఁ గానుపించునో తెలియఁజెప్పరే! నాకింక భవాంభోధితారకుల రిరలేయని నమ్మదిన్నమ్మి యిట్లు ప్రార్థించువాఁడ. మీరుగాక నాకిపుడింకెయ్యండయు లేనివాఁడను. మీకధీనుఁడ. తమ సెలవెట్లో యట్లు నడచువాఁడ' ననుచుఁ దదంఘ్రిద్వితయంబునం బడియెను. అవంధారు సుందరార్భకు డందంబునందలి భక్తికి నమందానందంబు నొందిన సంయమీం దుం డిట్లనెః 'పోనిమ్ము. నీయంతనిష్టుఁ బొమ్మనుకంటె నేనే వెంటఁగొని పోవుదులెమ్ము. ఇంతకంటె నంతన మహాభాగ్యం బింకేముండెడిని? నీమూలాన నాకును విశ్వనాథు దర్శింపనయ్యెడి. ఆవారాణసిలోఁ గొంతకాలమైనఁ గడపని జన్మము వ్యర్థము. పోవుదము. రమ్మని యాయవధూత మనయూత్వమ్ముం గొనిపోయె. ఆమహానుభావుఁ డష్టసిద్ధులు నందిన యనల్పమహిమాన్వితుం డౌట నిచ్ఛామాత్రంబున వటుసహితుండై యటఁజేరఁగలిగె. వారు గమ్యస్థానంబుం బ్రాపించినంతనే యాయతివరుం డర్భకునిఁక యాత్రఁగావించుకొమ్మనవుడు నాడింభకుం 'డాయాత్రావిధానం బుం దెల్పరే'యని వేఁడఁగా వినుమని యాతండప్పుడు కాశీయాత్రా విధినిగూర్చి బోధింపఁదొడఁగెను! ఇట్లు సిద్ధుండు నామధారకు నకుం దెల్పెను.

భక్తికాండము — నదశము.

సిద్ధపదాంభోజ భ్రమరాయమానుండౌ నామధారకుండు తమకులవృద్ధునికి మున్నల శ్రీగురుం డొసంగించిన తెలుంగుమఁ

దత్తాపసోత్తమ ప్రబోధిత యాత్రాక్రమంబు సవిస్తరంబుగాఁ దెల్పు మనవుడు నాతం డట్లయని యిట్లువాక్రుచ్చెను: ‘విశ్వేశ్వర సందర్శనంబు నంతర్గృహయాత్రయు, దక్షిణోత్తర మానస యాత్రయుఁ, బంచక్రోశ యాత్రయు, స్నానదానార్చన శ్రాద్ధ యుక్తంబగు సర్వయాత్రయు, శుక్ల కృష్ణపక్ష యాత్రయు, నన్నపూర్ణా విశ్వేశ్వర బిందుమాధవ ఢుంఢిరాజ దండపాణి భైరవ గుహా కాశీ గంగా మణికర్ణికా సర్వదేవ సర్వలింగ దర్శనంబును దత్తత్సంపూజనంబును గ్రమంబున ననుష్ఠేయంబులనుచుఁ గాశీ ఖండంబునందు వివరింపఁబడిన వడువున నెల్లం దెల్లంబుఁ గావించె. కడపట స్వనామాంకిత లింగప్రతిష్ఠఁ గావించి విధివిహిత కాశీ యాత్రాపూర్తి నందించికొన్నంతనే వాసనాపూర్తి కాఁగలదు. గురుకృపవల్ల నీశ్వర సాక్షాత్కారంబు గాఁగలదు. కావున సందియము వాసి గురుచరణంబుల న్నిపావన సరసిజంబునం దిరంబుఁ గావించుకొమ్మని యుద్బోధించి తెప్పపాటున నమ్మహాత్ముం డంతర్హితుం డయ్యె. బాలుం డందులకు విస్మితింగని తనలో నిట్లనుకొనెను: ‘అహో! యీ మహామహుండు గురుకృపనాగతుం డా విశ్వేశ్వరుండ కావలయు. ఇంక సంశయింప నేమిటికి? నా కార్యంబు సిద్ధించితీఱెడి. తన్నారాధింపకమున్న ప్రసన్నుండా [illegible] సద్గురుల కైను బ్రసన్నుండనై యుండియుంటంగాదే? ఏ దైవతమేని నిజభక్తులవల్లఁ బుష్పమో ఫలమో తోయమో గ్రహించినమీఁదటఁ దత్తదభీష్టంబులం దీర్పనయ్యెడు నేమో కాని యిట్లే యాచనంబొప్పమిఁ జప్పన సాక్షాత్కరింపఁగల్గుటెల్ల గురుప్రసాదంబునంగాకమ తేమి? ఎన్నెన్ని జన్మంబులం దెంతెంత తపంబున నేయేదానంబులవల్లం బ్రసన్నుండు గానివాఁ డేమి! యప్రయత్నంబుగా నుపాగతుండౌటేమి? ఇదెల్ల గురుప్రసాదంబువల్లనే కాని వేఱు కాదిది నిక్కువంబు,’ యని నెమ్మనంబున స్నమ్మసపాఁడా బమ్మాసారియవధూతోక్త ప్రకారంబుగా యాత్రాపూర్తిఁ గావించికొని భక్తిమీఱ విశ్వేశ్వరుని సేవించెను. శంకరుండు ధ్యానమా

త్రంబున నాలింగంబున నప్పుడ ప్రాదుర్భవించి వరంబడుగుమనియె. హృష్టాత్ముండై యాత్వష్టాఖ్యుండును గురుప్రముఖేష్టార్థంబు లెల్లన్ని వేదించి యయ్యవి సమకూర్పుమని వేఁడెను. అప్పుడ యావిశ్వేశుం డిట్లనుగ్రహించెః 'బాలకా! నీనిష్ఠకేను సంతుష్టినందితి. ఇప్పుడ నీయిష్టంబు లెల్లను వేవేగ నొసఁగూర్తు. ఇంక నీవు సకలకళాకుశలుండవై విశ్వకర్మాభిధానంబునం బేర్మిఁ గనుము. నీగురుభక్తి ప్రభావంబున నీకుఁ బురుషార్థ చతుష్టయంబొనగూడుటయె కాక స్రష్టవై నింక సృష్టికర్తవును గాఁగలుగుదు'వని వరప్రదానంబుసేసి యంతర్హితుండయ్యెను.

అంత సంతుష్టాంతరంగుండైన యావిశ్వకర్మ విధివిహితంబుగాఁ దనపేరిట నటనొక లింగంబు స్థాపించి మరలి తనదేశికుండును దత్సతియుం బుత్త్రీపుత్త్రులును గోరిన వానినెల్లఁ గ్రమముగా నిర్మించి వారలకర్పించి సంతుష్టిఁ గొలుపఁగలిగెను. విశ్వేశ్వర సాక్షాత్కృతి నందినవానికి విశ్వంబున దుస్సాధ్యం బుండెడినే? అట్టి విశ్వకర్మ నిర్మితాపూర్వ మహోత్కృష్టతమంబుఁగని యబ్బురమందిన తద్గురూత్తముం డానంద పారవశ్యంబున వానిని దగ్గఱకుఁ బిలిచి యిట్లాశీర్వదించెః 'నాయనా! నీభక్తి నాచిత్తం బెంతయు నలరె. జ్ఞానరాశివై యాచంద్రతారంబిల వర్ధిల్లుమోయీ. నీ చాతుర్యంబింక భువనత్రయ ప్రసిద్ధంబయ్యెడు. నీకు రాని విద్యయు నేరని కలయు నిలనుండదు. అష్టసిద్ధులును నవనిధులు స్పష్టంబుగా నీకధీనంబులయ్యెడు. కష్టాలఁ బాసి నిశ్చింతగా మనుము.' పొమ్మనియెను. ఇట్లు నిజగురువరులవల్ల వరంబులంది యాతండట్లు వన్నెకెక్కె. గురుభక్తి మహిమ మిట్టిది. అభేదభావంబున గురుభజనంబు సల్పిన నభీష్టార్థ సిద్ధియౌననుట నిస్సంశయంబు. గురునియందను భవాబ్ధి నీఁదవచ్చు. తద్భక్తివల్ల మువ్వురు మూర్తుల స్వాధీనులఁ గావించికోవచ్చు. వేయేల? గురుఁడుగాకింక ధరఁ దరింపఁ జేయువాఁ డొకండు గానరాఁడనునది శ్రుతివిహితోక్తి సుమ్మని సదాశివుండు కాత్యాయని కెఱింగించిన

తెలియంగల్గ మా శ్రీగురుండు మీ సాయందేవునకు బోధఁజేసెను. అట్లజ్ఞానధ్వాంత భాస్కరుం డాతండు పల్కునెడ భాస్కరోదయంబునయ్యె. అప్పుడు శ్రీగురుమూర్తికి సాయందేవుండు ప్రాతర్వందనముసేసి యిట్లు విన్నవించె: 'ఓ కృపాబ్ధీ! నాకిపు డపూర్వదృశ్యంబు కనుపట్టె. అదెద్దియన నేమిచెప్పుదు! మీతోడ నేనును గాశిలోనుండి పూర్వోక్త యాత్రాచరిత్రం బెల్లఁ గన్నారఁ జూచినట్లయ్యె. ఇది జాగ్రదవస్థయో స్వప్నస్థితియో నిరూపించికోఁ జాలనంతటి విచిత్రముగా నున్నదిసుండీ' యని గురుపాదంబుల సాఁగిలఁబడి యానంద పారవశ్యంబున డగ్గుత్తికపడ నిట్టులగ్గింపఁ జొచ్చె: 'స్వామీ! భక్తమానస హంసలరు. పరమహంసలరు. అవాఙ్మానసగోచరంబౌ మీ మహత్త్వంబెంచ నత్యల్పుండ నగు నే నెంతటివాఁడను?

ఉ. ఎంచననాదిమై వెలసి ♦ యేకముగా బహుళాప్తి నిచ్చ నీ
క్షించి విరించిఁగాంచి పరి ♦ కించి యిల స్సగుణధర్మయుక్తిఁ గా
వించి లగించి మించి ప్రభ ♦ వించి యడంచితి దుష్టసంచయం
బంచిత పాదపద్మ! నతు ♦ లయ్య నృసింహ సరస్వతీ యతీ॥

చ. కలి కలుషంబు న జ్జనులు ♦ కర్మముల న్విడనాడఁగా హవి
స్సులుకఱవైసురల్వగులసూరుఁడు ధ్వాంతమునట్లమోహముం
బెలుచఁగ్రసించుచుండ్రిధిమఁ ♦ బెంచి కృశించిన ధర్మసేతు వి
య్యెల నిలుపంగనైతి, నతు ♦ లివ్వె నృసింహ సరస్వతీయతీ॥

ఉ. ఇంతయు నత్త్వమూర్తివి గ్ర ♦ హించితి తుర్యము పావనాశ్రమం
బందఱ నుద్ధరింప గల ♦ నంధత దృష్టిని వాక్కుమూకత
న్వంధుర భర్తృహీనతను ♦ భర్తను బుత్త్రుల వంధ్యతాప్తినీ
వందఁగఁ జేసి వందనము ♦ లందు నృసింహ సరస్వతీ యతీ॥

ఉ. ముక్తులకాటపట్టవును ♦ ముక్తుజనాళికిఁ గల్పకంబవౌ।
సక్తులవేల్పుగిడ్డి వహు ♦ జాయువవేమొడ నార్తిజార్తివై।

రిక్తతఁ బాపి భక్తులఁ ద♦రింపఁగఁ జేయు దయాగ్రసాధ్యనే।
వ్యక్తకథా! సదా కొలుతు ♦ నో నరసింహ సరస్వతీ యతీ॥

ఉ. పావనముద్గిరోగిజన ♦ వంద్యము తీర్థసమాశ్రయంబు స।
జ్జీవన మర్థిగమ్యము ని ♦ షేవ్యము భవ్యమగణ్య పుణ్య సం।
భావిత దివ్యదేశము భ ♦ వత్పద యుగ్మము శ్రీవిహార నా।
నావిధ వాద్యమద్ధి శర ♦ ణంబు నృసింహసరస్వతీ యతీ॥

ఓహో! ఓంకారరూపా! అష్టమూర్తివై జగద్వ్యాప్తిఁ గాంచిన పరమపురుషుండవు. నిన్నెంచ నేరికిఁ దగును? సచ్చిదానంద మయంబగు మీ శాంతాకారం బస్మద్దృదయ పీఠంబునం దిరంబయ్యెడుఁ గావుత’ మనుచు శ్రీ ధీ కీర్తి వర్చో బలాయుః ప్రదంబును మోక్షప్రతిపాదకంబు నైనట్లు సంస్తుతించి సాయం దేవుండు శ్రీగురు పాదాంభోజ బంభరాయమానుండై యొడ లెల్ల రోమాంచ మొదవ గద్గదస్వరంబున నిట్లు మనవి యొనరింపఁ జొచ్చెను. ఓహో! త్రిమూర్త్యవతారా! జగద్గురూ! మిమ్మెఱుంగఁ జాలని మూఢులకు మీరు నరమాత్రులుగాఁ గానుపించు సాక్షాద్విశ్వేశ్వరులరు గాదే? మీ గేహమున్నదు రాదనే కాశి యగుఁ గాదే? మహాత్మా! భవదంఘ్రి సంసేవనంబే నాకఖిల పురుషార్థ ప్రతిపాదకం బనుచుఁ దత్పదంబు లొత్తుచు నాతనిభక్తి కెంతయు సంతుష్టిఁగొన్న యన్నరసింహ సరస్వతీ స్వాములవారు ప్రేమమీఱ నాతనికిట్లనిరి: ‘భక్తాగ్రణీ! కాశీక్షేత్రంబు నీకన్నులఁ గట్టినట్లు లోనరించితి. ఇఁక నీవుం గడపిన యిరువదియొక్క తరములవారు సమ్యక్ఫలం బొందుదురు. నీవు పరమార్థజ్ఞుండవు గాన నింకొక్కెడ నా పాదసేవకుండవై యుండఁగవలదు. నాకెన్నె దెచ్చఁగొన్న నీకింక స్వేచ్ఛాసేవ కైవల్యము నీకును నీ దారపుత్త్రులకు సిద్ధముంగాని రమ్మని యానతిచ్చి వారు నిజమఠంబునకుం జనిరి.

సాయందేవుండును వెనువెంట నేఁగి తోడ యాలుబిడ్డల వెంటఁబెట్టుకొని యొకభాద్రపద శుద్ధ చతుర్థినాఁటికిఁ దిరిగి గురువుల దరిం జేరి యిట్లు మ్రొక్కె:

## శిఖరిణీవృత్తము.

నమోయంచు న్నిన్నే నిటఁగొలుతుఁ జం ♦ ద్రార్ధమకుటా।
ప్రమోదం బయ్యెం దాపితనతజన ♦ ప్రీకట కుటా।
త్రిమూర్తీ! చందు న్వెన్నల పులుఁగుభా ♦ తింగన సదా।
నమస్తాఘుం బాఱిన్బరుసపుట యు ♦ న్సంగతికదా॥

ఆ. మాలకాకి మునిఁగి ♦ మానససరమున
రాజహంసమగుచుఁ ♦ గ్రాలుపగిదిఁ
జపుడు జంబువునను ♦ జాంబవంబో భంగిఁ
గన్నమాత్రనిన్నుఁ ♦ గలుషమడఁగు॥

తే. కలుషమిఁకఁబాపఁ జాలెడి ♦ గాంగజలము
తాపమాపెడి విధుని సు ♦ ధాకిరణము
దైన్యమును నె యడంచెడిఁ గల్ప ♦ తరువుశాఖ
కలుష తాప దైన్యహారము ♦ గదనినుఁగన॥

ఓహో! గురూత్తమా! మీరు సద్యోవృషపార్థదుల రని శ్రుతిగోచరమై యున్నది. నాకిప్డనుభూతంబు నాయె ననుచు నొడలు మఱది గంతులు వేయుచు నిట్లు కలస్వనంబున మనోహరంబుగాఁ బాడఁదొడఁగె:

మత్తకోకిల. స్తోత్రపాత్ర జగత్త్రయాత్మక ♦ సోమశేఖర శంకరా।
ధాత్రిసద్గురుమూర్తిగా భవ ♦ తారకాకరుణాకరా।
యాత్రిపుత్త్రుఁడవై జనించితి ♦ వాశ్రితాబ్జదివాకరా।
శ్రోత్రపేయము నీచరిత్రము ♦ శోకనాశక శ్రీకరా॥

స్రగ్విణి. ఓయతీశాకృతీ ♦ ఓంకృతీ! డాయనా
స్థాయియే తత్త్వద ♦ స్పర్శఁగ్రాలానహా
మాయ ముక్తం దరిం ♦ పంగఁ జేయూతవై
చేయ సత్సంగముం ♦ జేర్పు మిష్టాప్తికై॥

అని ప్రేమలక్షణ భక్తియుక్తి స్సంస్తుతించిన ప్రియభక్తుని గురుం డాశ్వాసించి యాతనిం దత్పుత్త్రి కళత్రాదులం దనముందట

నాదటఁ గూర్చుండఁజేసి కన్నతల్లి తనబిడ్డలనట్లు వాత్సల్యంబు మీఱ సేవమూరను. సాయందేవుం డెల్ల న్ని వేదించి తామెల్లర మప్పటికి ధన్యతఁ బడసితి మనుచుఁ దనయిరువురు సుతులను గురువులవారి పాదంబులదరి సాఁగిలఁబడఁజేసెను. అథ క్తమందార మీవందారు సుందరార్భకులం దగ్రిజాతు శిరంబునం గరంబాద రంబు మెయిం గరంబుంజేరిచి సాయందేవుదెసంగాంచి యిట్లాశీర్వ దించె: 'నాయనా! యీమననాగనాథుండు పూర్ణాయుశ్శ్రీ యుక్తుండై మద్భక్తుండై వంశోద్ధారకుండు సత్కీర్తి సారుండుం గాఁగలఁడు. సౌభాగ్యవతియా నీయిల్లాలు సల్లలిత గుణాన్వితయా పతివ్రత. ఈయమ కింక పలువురు సుతులు జన్మింపఁగలరు. మ్లేచ్ఛ సేవ వల్ల హానియగుంగాన నింక నీవదివిడిచి నాకడ నుండదగు గావుత. ముందీవు సకుటుంబంబుగా సంగమంబున స్నానింగి యశ్వత్థ సేవనంబుఁ గావించుకొని రావలె' నని పుచ్చెను.

అతండాలుబిడ్డలం గొనిపోయి విధివిహితంబుగా స్నానాది కంబుఁ దీర్చికొనివచ్చె. నాఁడనంతపద్మనాభ చతుర్దశిగాటఁ జెక్క జేటి యొస్గున ననంతవ్రతము నెఱపికొని శ్రీగురుచరణం బులకు న్మ్రొక్కఁబోవలెనని వచ్చుచుండిరి. గురువులు సాయం దేవునితో 'నీవు ననంతవ్రతం బానరింపుమా' యనిరి. అందుల కీమహభక్తుం డిట్లు ప్రతివల్కు: 'స్వామీ! మాకింకే యనంతవ్రతం బేమిటికి? మీకంటెనా కనంతుండెవ్వడు? భవత్పద సంసేవ నమే నాకేయఁదగ్గ యనంతవ్రతముగా నెంతునన్న నంత నాదయా స్వాంతుం డాయంతేవాసి కిట్లు బోధింపంగడంగె: 'భక్తవరా! ఏమైనను నీవు నానుడువులాలించి యట్లుగావింపుమోయీ! మున్ను కౌండిణ్యుండను నొక్క ఋషిపుంగవుఁ డీవ్రతంబానరించి యఖిలేష్టంబులం బడసెనుమీ' నావుడు మనదేవుఁ డామొదట నిట్ల డిగె: 'గురువరేణ్యా! అట్లయిన నీమీ సెలవిచ్చిన వ్రత మెవరెవ రెట్లు గావించిరో దానననబ్బు పుణ్యం బెట్టిదో పొందనైలాభ మేమో దయచేసి వివరింపరే' యనుమనవి విని శ్రీగురుమూర్తి

నవిస్తరంబుగా నాతనికదెల్ల బోధసేసెనని సిద్ధుండు నామధారకునకుం దెలిపెను.

భక్తికాండము — ౬దశము.

నామధారకుండు గురుబోధితానంతవ్రత వివరణం బాకర్ణింపం గౌతూహలియైనంతనే సిద్ధయోగి యిట్లువచించె: 'నరహరి యతివరులెఱిఁగించిన తెఱఁగిది: చెప్పెదవినుము. అనంత వ్రతాచరణంబున నభీష్టంబులం బడసినవారనేకులు గలరు. అందు ధర్మజుం డిదిసలిపి తాఁగోల్పోయిన రాజ్యంబునే తిరిగి పడయఁగలిగె' నని వారనిరి. అంతనాశ్రోత, 'యాధర్మజుఁ డెవ్వఁడు? ఆతనికి రాజ్యంబేల పోవలసె? పోయినదితిరిగి యెట్లులభింపనయ్యె?' ననిపృచ్ఛ సేయుడు గురుండు దెల్పు: 'నేనన్న ధర్మజుఁడు పాండునందనుఁడు. ఆతని రాజ్యంబు కపటద్యూత మిషంబునఁ గౌరవాపహృతంబయ్యెను. అట్లాతఁడు పదచ్యుతింగని భీమార్జుననకుల సహదేవులను ననుజన్ములను దాము పరిణయమైన సహధర్మచారిణి ద్రౌపదిని వెంటఁగొని ఘోర కాంతార సీమలకేగి యటఁ గడునిడుములం గుడుచుచు శ్రీకృష్ణుఁడు తమ కేడుగడ కాఁగలఁడని నమ్మి యెట్లో కాలము పుచ్చుచుండిరి. దుర్యోధనాదులౌ కౌరవులీ తమ దాయాదుల సర్వస్వంబు హరించి పదభ్రష్టులం గావించి పరాభవించి వారిని వనమార్గంబునఁ బట్టించియు నింక విడువరైరి. కుడువఁగూడు దొరకక కల్లాడుచుండినవారి సత్త్వంబు హరింపదుర్వాసులనువారటకేగఁ బురికొల్పిరి. పాండవులన్ననో భక్తితో ననేక వ్రతంబు లాచరించుచుఁ బెక్కు తీర్థంబుల సేవించుచు ధర్మైకవర్తనులై యెన్ని కష్టనష్టాలకైన నోర్చియుండిరి. నమ్మినవారి నెమ్మియిసేనిమ్ములం బ్రోచు నమ్మహానీయుండు కృష్ణభగవానుండు పనిపడునెడ తానడాయవచ్చి యాదరువై హితంబు పల్కుచుండె: ఒక్కెడ నా ద్వారకానిలయుండు కౌంతేయ శరణ్యంబైన యరణ్యంబునకుం గారుణ్యంబు మీఱి రానయ్యె. అయ్యెడ ధర్మనందనుం డానందపారవశ్యంబు

వంది యానందనందనున కెదురేగి పాద్యాదు లర్పించి సాకార పరబ్రహ్మ భావంబునఁ దత్పాదాబ్జాతంబులకు మ్రొక్కి తత్సం దర్శనంబువల్లఁ దాఁ బరిపూతుండనైతినని యుప్పొంగి యిట్లు స్తుతి వాక్యంబు బలికె: 'అనంతా! భవాంతకా! శ్రీశా! హృషీ కేశా! పరమాత్మా! పరంజ్యోతీ!

మ. అణురూపంబుననుండఁజాలుదువు బ్ర♦హ్మాండంబులో నిండియుం
దృణకాష్ఠంబుల విశ్వమంతటను వ్యా♦పింగాంతు సృష్టిప్రజో
గుణయుక్తిన్లయముందనుంబుననునీ ♦ కుంతేయలీల ల్నారా
యణా! దుష్టాంతక! శిష్టపోష! సత్కృ♦ ష్ణా! భక్త చింతామణీ!

భూభారంబుం దొలఁగించుటకే యిట్లవతరించినవాఁడవు. భారభూతుల మమ్ముల నీభూతలంబున నిల్పనేమిటికో కదా! మమ్ము నీబహిఃప్రాణమ్ములనుచు నిక్కట్లపాలఁజిక్కి యీ దిక్కుమాలిన యడవిలో నక్కుపడియుండఁ జేయనేలకో! నీకృపాలేశంబు మాయెడం గలిగిన మాకీ కష్టాలేల? స్వామీ! ఇంతకాలము మమ్ముపేక్షింతువేలనండీ? నీవుగాక మా కష్టాలు వదలఁగొట్టఁ గాన వెవఁడుదిక్కు? నీవే మమ్ము పేక్షించిన మామనికి యింకేమిటి?' యనుచుఁ గన్నీరు గార్చెను. కౌంతేయు మధ్యముం 'డుపేక్ష గాకేమిది?' యనియె. పాండవ మధ్యముని దప్పుడు గురుభావంబున నా మురారి కెలఁగి యివ్విధంబునం బల్కెః 'ఓహో! దయానిధీ! భవదీయ కృపాప్రసారం బిందనుక మాపై లేదయ్యెఁగాక మాకీ కష్ట నష్టాలు గలిగియుండవనుట స్పష్టము. ఇంకనైన లోకవిఖ్యాతమైన మా పార్థప్రియత్వము సార్థకంబౌఁ గాత'మనుచు సవినయంబుగాఁ బలికె. గవ్వుడు ద్రౌపదియు నట్లు వినతులయ్యె దుఃఖభరంబున 'అయ్యో! మమ్మెవ్వరెడ దించి మా వైరులు పాలించు నగ్ని వరించుట పక్షపాతంబుగాదే! మావంటి మిత్రుల ప్రాపు నందఁదగియు దిగులుపడి పొగులవలసె. మాకిప్పటి కైన గట్టెక్కఁ దగ్గతోవఁ జూపవే' యని మ్రొక్కిపట్టున మొల్ల పెట్టుకోఁగా వారికార్తిహృదయుండై జనార్దనుండు తరణోపా

యుండంబయి యచిరంబ రాజ్యలాభం బొదవింపఁదగిన యుత్తమవ్రతం బనంతునిదనుచు నిట్లు బోధసేసె: “అనంతుండ నద్వయుండఁ బూర్ణాకృతిని సర్వవ్యాపి నేనసుండి. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు నాయంద యుందురు. ద్వాదశరాసులు నవగ్రహంబులును నాలోన నున్నవి. చతుర్దశ భువనంబుల కేనస్థానమ్ము. ఎల్ల లోకాలు నావల్లనునికి. కలా కాష్ఠా ముహూర్తాదులు న్బవలు రేయుం బక్షమాసాబ్ద యుగ కల్పాదులకేన కారణభూతుండ. భూత భవిష్యద్వర్తమానంబుల నల్లెడ వెల్గుచుందును. వసురుద్రాదిత్యులకేన నెలవు. అబ్ధి పర్వత తృణ వృక్షలతాగుల్మాదులన్నిటికేనఠావు. దిక్కులకు నేనిక్కను. అన్ని దెసల నాకపమునఁ బ్రకాస్తిఁ గనునదేన. నాకంటెఁ బరమాత్మ స్వరూపంబు భిన్నంబుగాదు. నిర్వికారుండ నవ్యయుండ నజుండ నేనసుండు. సర్వాంతర్యామి ననంతునిఁగా గుర్తించి విధివిహితంబుగా వ్రతంబు నెఱపుదురే నిష్టార్థంబులంగందురనియె. అదెల్ల నెదన్నలకొన్న యయ్యుధిష్ఠిరుండు తత్పదంబులంటి ముదంబునఁ దద్వ్రత విధానంబునం దేమేమి దానాలొనర్పవలెనో యెట్లు పూజింపనగునో యెయ్యెడఁ జేయఁదగినదో మున్నెవరెవరది కావించి యుండిరో సర్వము సవిస్తరంబుగా నెఱింగింపవలయునని వేఁడెను. మాధవుం డపుడిట్లు బోధించె: “అనంత వ్రతము భాద్రపదశుద్ధ చతుర్దశినాఁడు మధ్యాహ్నమందు భక్తితో నాచరింతేని నీరాజ్యపదము నీకు లభించెడినమ్ము.

పూర్వము కృతయుగమున వసిష్ఠ గోత్రజాతుఁడు సుమంతుండను నొక ఋషి యుండెను. ఆతని యిల్లాలు భృగు తనూజాత దీక్షాభిధానయౌ సాధ్వీమతల్లి. వారికి శీలయను నొకకూఁతురుద్భవించె. అంతం గొలఁదికాలమునకే దీక్ష దివంబుం జేరె. సుశీలయౌ నాశీల పితృగృహంబునం బెరుఁగుచుండెను. ఆమె సదాచారయై నిజాగారంబున గృహద్వారంబున నలంకారంబుగా రంగురంగుల తోరణంబులు సింగారించుటనువింతవింత రంగవల్లులు

బనిలో దన్నంత నాసుమంతుండిట్లను: ‘నాయనా! ఇఁకఁ బం
డ్రెండు దినాలైన నోపికపట్టి యిటనుండవలెను. ఈభాద్రపద
శుద్ధ త్రయోదశినాఁడు వెడలిపోవచ్చు’నని బతిమాలఁగాఁ గౌండి
ణ్యుం డట్లయని సర్వసిద్ధిదమగు నాసుముహూర్తంబుకొఱకు వేచి
యుండి యలనాఁడు భార్యాసహితుండై పయనము గాఁబోవు
చుండె. అట్టియెడఁ జింతాజడంబగు మోముతో సుమంతుఁడు
మటమట లాడుచున్న తన పెండ్లము దెసఁ జూచి యిట్లనియె: ‘ఓసీ!
అమ్మాయి వెళ్లుచున్నదిగదా. త్రోవబత్తెమునకే వరిపేలపిండియో
యింత కట్టియియ్యవలదా?’ యనెను. ఆక్రూరాత్మురాలు
మోమటు త్రిప్పుకొని చివ్వన లోనికిఁబోయి పెళ్లునఁదలుపుమూసి
కొని ‘నేనియ్యనుబో’మ్మని తలకట్టుకొని పండుకొనెను. సుమం
తుఁడు నెత్తినిబాదుకొని దుఃఖింపఁజొచ్చెను. శీల తండ్రినూరార్చి
‘పోయివచ్చెద’ ననియె. ఆతఁడు మిన్నకుండలేక దొడ్డిత్రోవను
బోయి వంటవసారలో మూలనొకవిస్తరిలోఁ గానుపించిన గోదుమ
పిండిని దెచ్చి పొట్లముకట్టి యిచ్చి వారిని బండిమీఁద నెక్కించి
సాగనంపెను. వారు కొంత దవ్వేగిరి. మఱునట నేటియొడ్డున
మాధ్యాహ్నికంబుఁ దీర్చికొనఁ గౌండిణ్యుం డుపవిష్టుండయ్యె.
అచ్చోఁ బెక్కురు రక్తాంబరధారిణులౌ సుందరీమణులు వేర్వేఱ
కలశంబులుంచి పూజించుచుంటంగాంచిన శీల వారిం జేరఁబోయి
‘అక్కలారా! మీరిక్కడఁ గావించుపూజయే’ మని యడిగెను.
వారు తామాచరించునది సర్వసిద్ధిదమౌ ననంతవ్రతమనిరి. అంత
నీయమ వారిం దద్వ్రతాచరణ విధానంబు సవిస్తరంబుగఁ దెల్ప
రాయని ప్రార్థింప నందొకముత్తైదువ ‘కూర్చుండుము. చెప్పెద’నని
యిట్లుబోధించె: ‘అమ్మా! ప్రతిభాద్రపదశుక్ల చతుర్దశినాఁడును
జతుర్దశగ్రంధి యుతంబౌ రక్తవర్ణపు సూత్రదోరకం బమర్చికొని
వచ్చి ప్రవాహోదక స్నానంబు విధివిహితంబుగా నాచరించి
యెఱ్ఱచీరను గట్టుకొని కుంకుమాద్యలంకారంబులం జేసికొనునది.
అంతఁ బంచపల్లవయుత జలపూర్ణ కలశంబొక్కట స్థాపించి పూజిం

ఇట్లుండ నొక్కనాఁడా కౌండిన్యుఁడు తన యిల్లాలిచేత నున్న దోరంబుం బరికించి 'యేమిది? నన్ను వశపఱచుకొనుటకా యిట్టి రక్తసూత్రమ్ము బంధించుకొంటి'వని పృచ్ఛ సేసె. తత్సాధ్వీమణి యయ్యది యనంతుని తోరమనియుఁ దత్కృపవల్లనే తా మనుభవించుచున్న యైశ్వర్యంబు తమకు లబ్ధంబయ్యెననియుం బలికెను. ఋషి యాందాలకుంగినిసి బలాత్కారముగా నాదోరకంబునుద్రెంచి, 'ఓసీ! యెంతమాట పలికితివి? ఆయనంతుఁడెవ్వఁడు? ఏది లభించినను నాతపోమహిమవల్లనే కాదే? నన్ను నీయధీనునిఁ జేసికొనుటకై నీవిట్లు కట్టుకొన్నావని గ్రహింపలేననుకొన్నావా?' యనుచు నద్దాని నగ్గిలోఁ బాఱవైచెను. శీల యది కని, 'అయ్యో! అనంతుని తోరము తగులఁబెట్టుదురా?' యని పరుగునఁ బోయి నిప్పులోనుండి యద్దాని నీవలికిఁ దీసి పాలలో నునిచె. ఏమైన ననతికాలంబున వారిసంపదలెల్లమాసె గోధనధాన్యాదులెల్లఁ జోరగ్రస్తంబులైపోయె. హితులెల్లరహితులైరి. తుదకిల్లుకూడఁ బరశురామప్రీతియై సర్వస్వమ్మును గోల్పోవవలసె. అప్పటికిఁ గౌండిన్యుండను తప్తచిత్తుండై యిట్లనుకొనును. 'ఆనాఁడు తొందరపాటున నేను జేసినయపచారమునఁ గావలయు సిరెల్లనిట్లుపోవఁగె. వృథాశోకంబూని మత్తుండనై యాతోరంబునగ్గిలోఁ బడవైచితిని. ఆయనంతుండందులకు నామీఁదఁ గ్రుద్ధుండై యిట్లు దీనత ప్రాప్తించెను. ఇఁక నిప్పటికైన బుద్ధి తెచ్చుకొని యాతని శరణుఁ జొచ్చెదఁగాక. శ్రీశుండౌ నాతని దర్శింపఁ గలుగువఱకు నేనిఁక భుజింపనొల్ల'నని కృతనిశ్చయుండై యాతనినే ధ్యానించుచు 'ననంతా! యనంతా!' యనుచు నితాంతంబెలుఁగెత్తి పిలుచుచు వనాంతంబుం జేరెను. అచ్చోఁ బుష్పఫలాకీర్ణంబౌ నొక్క పెద్ద మామిడిచెట్టును జూచెను. అదేమి చిత్రమో కాని తచ్చూత వృక్షంబునం బక్షిజాతంబునం దొక్కటియేని వ్రాలకుండెను. కౌండిన్యుఁడద్దానిదగ్గఱకుఁ బోయి 'నీవనంతు నేనాఁడైనం గాంచితే' యని యడిగెను అందులకామ్రం బిట్లను: 'నాకిఁకఁ దద్దర్శనంబు లభింపదయ్యె. నీకెటనే నగపడిన నీనా

గావే విష్ణువ! నన్ను నే నెఱుఁగ ధ ♦ న్యంబయ్యె జన్మంబిఁకం
గావంగా శరణన్న నాదోసఁగుల ♦ న్సైరింపు, నారాయణా!॥

అనుచు సాష్టాంగ దండ ప్రణామంబు సేయం దద్భక్తిస్నేహంబునకు హృష్టాంతరంగుండై యయ్యాశ్రితేష్టార్థ ప్రదుండాతని సంతుష్టి నందించు దారిద్ర్య విచ్ఛిత్తియు ధర్మాప్తియు శాశ్వత వైకుంఠప్రాప్తియు నొదవుతమని మూఁడువరాలొసఁగెను. అంతనితాంత సంతోషాక్రాంతస్వాంతుండైన కౌండిణ్యుండా నియంతయా ననంతస్వామి సన్నిధిని గేలొగ్గి తామార్గ మధ్యంబునం గాంచిన యామ్రవృక్షాదికంబులందలి యయ్యై వైచిత్ర్యంబులం గూర్చి యుగ్గడించి వానివాని కాయా స్థితిగతు లేల కలిగె నెఱింగింపవేయని ప్రార్థించెను.

అందులకనంతస్వామి యీవిధంబున వివరించెను: ఓయీ! చెప్పెద, వినుము. మున్నొక విప్రుండు విద్వాంసుండైయు వినయంబుఁగనక గర్వించి సర్వదా వివాదంబులతోఁ గాలంబు పుచ్చనేకాని తానేర్చిన దానిలో నావంతయే నెయొక్కనికిం గఱపినవాఁడు గాఁడయ్యె. తత్ఫలంబుగా నాద్విజుండ మఱుపుట్టువున నట్టిద్విజాస్పృష్టామ్రవనిజంబై యడవిపాలయ్యెసుమ్ము. ఇఁకఁ బూర్వభవమందుఁ జవిటినేల దాన మొనర్చినందులకు ఫలముత్తర జన్మమున నింతమేయని పసరమాటగా నెఱుంగుము. కలిమికలిగియు నొరుల కేనాఁడు నిడమిం దిననేరని యాఁబోతు గావలసె. ఇరువు రక్కసెల్లెండ్రు పరస్పరదానంబొనర్చికొంట నాకొలఁకులు జంటగానుంట. మఱికోధంబువల్ల గాడిద యాటయు మత్తత వలన నిభత్వమును సిద్ధింపనొటయుం దెలియుము. తుదకనుతాపంబువలన నీచిత్తంబు శుద్ధంబౌట నావృద్ధ బ్రాహ్మణాకృతితో నీకుం దారసిల్లినవాఁడనేన. ఏమైన నవెల్లం దమ్ముఁగూర్చి నాకుం దెల్పుమన్నందుననే వాని కాయాస్థితులఁ దొలఁగించి మంచి గతులను గల్పించుచున్నాఁడను. నీవో పునర్వసు ప్రాప్తిని నక్షత్రమండలంబున సంచరించుచుండెదు గావుత' మనియె. అంతటి

దొరకఁడు. వాఁడు నిత్యమును మూఁడు జాములగువఱకు నాయా గృహకృత్యములను నిర్వర్తించుకొని శ్రీ గురుమఠంబునకు వచ్చి యచ్చో ముంగిటనూడ్చి నీళ్లుచల్లి ముగ్గులువెట్టి దూరమునుండి దండప్రణామంబుఁ జేసి పోవుచుండెడివాఁడు. ఒకానొక శివరాత్రికి వాని చుట్టాలెల్లరు శ్రీశైలయాత్రకై వెడలిరి. వార్లు తంతుకునిఁ గూడఁ దమతో రమ్మనిరి. వాఁడువారికిట్లనియె: 'ఓవెఱ్ఱివాండ్రారా! శ్రీశైల మెక్కడనో యున్నదని కాళ్లీడ్చుకొనుచుఁ బోవనేల? శ్రీ గురుమఠంబుకంటె శ్రీశైలంబు వేఱొకటికలదా? మల్లికార్జు నుండన నీశ్రీగురుండుకాక వేఱొకండు కలఁడా? నే నింకెక్కడికిని రానుబొం'డనెను. వారీమూర్ఖున 'కేమి తెలియు'నని వానిం బరిహ సించుచుఁ దమత్రోవను దాము శ్రీగిరికేగిరి. అట్లే మఱికొందఱా యూరివారుం జనిరి. వారందఱనంపి తంతుకుండు గురుసేవార్థ మరుగఁగా స్వాములవారానాఁడు వానిం బలుకరించి, 'మీవాం డ్రెల్లరు శ్రీశైలమునకుఁబోఁగా నీవొక్కండ విక్కడ నుండనేల?' యని ప్రశ్నించిరి. తంతుకుఁ డందులకుం జేతులు కట్టుకొని యిట్టు బదులువలికె: 'మహాత్మా! మావారి మూర్ఖత కొలఁది నేదొఱాతిని జూడఁబోయిరే కాని మీ పాదాలయందు లేని క్షేత్ర తీర్థంబులేవి?'యని మ్రొక్కి నిత్యసేవఁ గావించి పోవుచుండెను.

మహాశివరాత్రినాఁడు వాఁడుపవసించి మధ్యాహ్నవేళ స్నానార్థము సంగమంబునకేగి మునిఁగివచ్చి గురులకు నమస్క రించిన తంతుకునెడ దయగొని వారిట్లనిరి: 'ఓరీ! పాపము, మీ యింట నందఱు శ్రీశైల మల్లికార్జున దర్శన కాబనర్పఁ బోఁగా నీవొక్కఁడ విక్కడ నున్నాఁడవు కాఁబోలును. నీవెన్నఁ డైన శ్రీగిరిఁజూచితివా లేదా?' యనఁగా, వాఁడు 'స్వామీ! యేలినవారి పాదాలుదప్ప నే నింకేదియు నెఱుంగను. అన్ని యాత్రలు నాకిందేయా'నని నిజమనోనిరూఢిని వెల్లడించెను. శ్రీగురుండు వాని నిబ్బరంబున కబ్బురపడి దయతో దరికిం బిలిచి వాని కిట్లనిరి: 'భక్తా! యిదిగో నీ కిప్పుడు శ్రీశైల మగపఱచెద.

లింగార్చన మొనర్చిన త్తమని దేవళంబునకుంబోయితి. నాకచ్చోట లింగమగపడకపోఁగాఁ దామే యందుండి యందఱు పూజనంబు లందుచున్నట్లు కానుపించెనే. కొండ తల్లక్రిందనుండ గులకరాలకై గాలించుమాదిరి దగ్గఱనున్న మిమ్ము విడిచి యింతదూరమునకు వీరెల్లరును రానేమిటికో నాకు బోధపడలేదు. మీరు నరాకృతి నందిన సాక్షాత్పరమేశ్వరులరకారే? నివురుగప్పిన నిప్పువైనుంట మీ మహిమ మందఱకు గోచరముకాకయున్నది. ఇంక మిమ్ము వీడి సేఁజేయునదేది? మీ పాదాలవద్దఁబడియున్న నన్నిమ్మెడకుఁ దీసికొనిరానేల?' యన స్వామి 'యట్లుకాదు. సర్వవ్యాపకుఁడౌ నీశ్వరుం డొక్కండ యైనను స్థానమహిమంబును లేకపోలే' దనెను. అంతం దంతుకుఁ డిట్లుపల్కె: సాక్షాత్పరబ్రహ్మస్వరూపులరా తామే యిట్లు సెలవిచ్చుచున్నారే. ఇందలి విశేషమేమో నాయం దనుగ్రహించి వివరింపవలయునని గురుపాదంబులకు మొక్కెను.

అందుపై స్కాందోక్తమొకగాథ యిట్టుల గురుబోధితం బయ్యెను: 'ఓయీ! మహాశివరాత్రినాఁ డీశ్రీశైలంబున నపార మహిమంబు కలదని తెలుపు నీగాథ వినుము: మున్ను కిరాతదేశంబునఁ బరాక్రమశాలియు శ్రీమంతుండును నా విమర్షణుండను నాతఁడు నేతయైయుండె. ఆ నరేశ్వరుఁ డీశ్వర భక్తుఁడేకాని గ్రాహ్యాగ్రాహ్య భక్ష్యాభక్ష్యాది వివేకంబులేక పరస్త్రీలంపటుండు గాను డెడివాఁడు. ఏమైనను నృత్యగీతాదికంబులతో నిత్య లింగార్చనంబు మాత్రము మానకుండువాఁడు. ఇంక శివరాత్రినాఁటి పూజావిశేషంబుం గూర్చి చెప్పనేల? అట్టిరాతని దేవేరి మహాగుణవతి. పేరఁగుముద్వతి. ఆమె తిన పతి మతి నతిభక్తిం బతిపతి నారాధించు వాఁడయ్యెం బరసతీకతుండౌటకుం గతం బారయఁ జాలక యాతని నొకనాఁడు పనయావనత యై యిట్లు ప్రశ్నించెను: 'నాథా! మీ రనుగ్రహించి నన్ను దురాత్మురాలినిగా నెంచక సహించెద రేని మీవల్ల నొక్క యంశము తెలిసికోవలెనని నాకుఁ

గుణాహాలము కలదు. ఆహారశయ్యాదులందు నియమం బేదియుం బాటింపని మీ యీశ్వర భక్తిమాత్ర మింత నిశ్చలముగా నుండుట కూడ నా కాశ్చర్య మగుచుండును. ఇదెట్లు సంభవించెనో దయతో నాకు బోధింపఁగోరెద' ననియెను. భూమీశ్వరుం డందులకు నవ్వుచు నిట్లు బదులుచెప్పఁదొడఁగె: 'ప్రాణేశ్వరీ! నీయడిగిన దానికేను గినియఁ దగినది కాదు. కాని నీసందియముఁ దీర్చుటకు ముందు నా పూర్వజన్మవృత్తము నీ కెఱిఁగింపవలసి యున్నది. కావునఁ జెప్పెద వినుము.

మున్ను నే నొక గొల్లవానివాకిట మందనుగాచు కుక్కనై యుంటిని. అపుడొక మాఘ మాసమున మహాశివరాత్రినాఁ డభిషేక పూజనాదికంబులు సేయుట కూరివారెల్ల నాయూరి శివాలయమునకుఁ బోయిరి. ఆనాఁడందఱు నుపవసింప వలసినకోట మా యజమానునింటఁ గూడువండుకొనను లేదు. నాకు వేయను లేదు. కాన నేను నందఱతోఁ బాటుగా నుపవసించిన దానవైతిని. నాఁడు ప్రదోషవేళ నాగోపాలు నింటినుండి యాబాలముగా దేవళంబునకుఁ బోవ నేనును వారివెంటఁ దోఁకాడించుకొనుచు సంగిలి యాకులకొఱకు గాలించుచుం బోయితిని. జనులెల్లరుం దలకొక దివ్వటిం జేతఁగొని శివ సంకీర్తనము సేయుచు నాలయ ప్రదక్షిణాలొసరించుచుండిరి. అపు డాఁకొనియున్న నే నాగద నా కొంచెమైనం గతుకఁదగ్గది దొరకునేమో యను నాసతో మెల్లఁగా గుడిలోఁ బ్రవేశించితిని. అన్నిమూలలం దిరిగిచూచుటలో నా శివలింగము కానంబడెను. గర్భాలయమునుండి పూజించుచున్న యర్చకుఁడు నన్నుఁ జూచినంతనే 'కుక్కను గొట్టుఁడు కొట్టుఁ'డని కేకలువేసెను. నేనవ్వలికిఁ బాఱిపోఁ జూచితిని. కాని సింహద్వారమునకడ నందఱో మూఁగినందున వారిలోనుండి సందుచేసికొని దాటిపోవుదమన్న నింతయేని వలనుపడలేదు. కొందఱు కఱ్ఱలు చేతఁగొని నన్ను కాఁదుటకై తలఁపఁగా వారిబారినుండి తప్పించుకొనుటకై ముమ్మాఱులు గుడిచుట్టు తిరిగితిని. తుదకొక

ఘాతంబువడ ద్వారదేశంబునం గూలితిని. ప్రాణాలు పోవ నం దెవ్వటో నన్నావలికీడ్చిరి. తిననేదియు దొరకమినా నుపవాస ఫలం బునను నాహారాన్వేషణంబున సంఘటించిన శివపూజా దర్శనంబు నను ప్రాణాలు దక్కించుకొనఁజేసిన జలపానంబునం బరువిడుటలోఁ బ్రదక్షిణాలైన పుణ్యంబునను ద్రోవకడ్డము నిల్చినవారి చేతుల లోని దివ్వెలుకంటెఁ బడుటనైన దీపమాలికా సందర్శనంబువల్లను దుదకు శివరాత్రినాఁ డాలయ ద్వారంబుననే మరణించుటను నాకు వెనువెంటనే యీమాత్రపు జ్ఞాన సంపత్తియు నృపతిత్వం బును సిద్ధింపఁగలిగెను. ఇంతయేకాని కుక్కబుద్ధిమాత్రము వదల లేదన్నది నిక్కువంబు. ఇఁక నీ విట్లడిగితివని కోపింపనేల? నావి దురాచారాలని నేనెఱింగియు మానలేకున్నాను. ఏలన, జీవుఁడు పూర్వ సంస్కారానుసారముగా నడవవలసినవాఁడే సుమ్మీ' యను భర్తృప్రోక్త తత్పూర్వ జన్మవృత్తం బత్యాశ్చర్యం బుతో నాలకించిన కుముద్వతీదేవి తత్పదంబులంటి యిట్టులఁ బ్రార్థించె: 'ప్రాణనాథా! ఏమో యనుకొంటి. నన్ను మన్నింపుఁడు. మీరు శైవాగ్రగణ్యులరు. సర్వజ్ఞులరు. మీ పూర్వ వృత్తం బెఱింగింప నామనంబునందలి తమకంబూఱ డిలుటలేదు. నాయందనుగ్రహించి నాతోంటిపుట్టువున నేనేమై యుంటినో యదియు వివరింపవేఁడెద' నన తేఁడు మందహాసం బుతో నిట్టులఁ జెప్పఁదొడంగె: 'ప్రేయసీ! అట్లయినఁ జెప్పెద వినుము. మున్నీవొక పావురమవై శ్రీశైల ప్రాంతారణ్యంబున నుంటివి. ఒక్కెడ నీవు పొట్టఁబోసికొనుట కడవిలో నొక చెట్టు మీఁదినుండి మఱొక చెట్టుమీఁది కెగురుచుఁజూచిచూచి యెటనో లభించిన మాంసశకలము న్నీ చంచూపుటంబునం గఱచికొనియెగిరి పోవుచుండఁగా నీనోట నామాంస గ్రాసంబుం గాంచిన యొక చీఁపరపిట్ట యద్దానిని నీవద్దనుండి లాగుకొనుటకై నిన్నుఁదఱుమఁ జొచ్చెను. నీవద్దాని కందకుండ నెట్లయినఁ బ్రాణాలు దక్కిం చుకొవలెనని శ్రీశైల మల్లికార్జునాలయ శిఖరముచుట్టు నల్లాడి

నుండి తాఁదెచ్చికొన్న ప్రసాదంబుఁ బుష్పాదికంబు నగపఱచెను. అందుఁ గొందఱు 'వీని మాటలకేమి? ఈమధ్యాహ్న వేళనుగూడ వీని నింటివద్దఁ జూచితిమే. వీఁడు పలికినవెల్ల నబద్ధాలు. పువ్వులెక్కడినుండియో తెచ్చినాఁడు' పొమ్మనిరి. మరలఁ దంతుకుఁడు 'కాదయ్యా, గురువులవారు నన్ను క్షణమాత్రంబున శ్రీశైలంబునకుం గొనిపోయి యాత్రచేయించికొని తీసికొనివచ్చినారు. ఇపుడువారు సంగమతీరంబుననున్నారు. మిమ్ముఁ బిలువు మన్నారు. కావలయు నన్న నింక వారి నడుగవచ్చు' ననంగా గురుభక్తియుక్తులౌ కొందఱమ్మహానీయుండు తలంచినఁ గానిదేది? వీఁడన్నది నిజమైయుండనోపు' ననుకొనుచుం బోయి ద్విగుణీకృత భక్తితో మహాశివరాత్రినాఁడా మల్లికార్జున దర్శనంబే తద్గ్రామంబునఁ దమ కయ్యెనని యెంచి సంస్తుతించిరి. అట్లు నమ్మినవారికి సద్గతియు నమ్మనివారికి దుర్గతియుం బ్రాప్తింపనయ్యెను. పిదపఁ బదేను దినాలకు శ్రీశైలయాత్రకేగిన తక్కుంగల వారలు తిరిగివచ్చి తంతుకుని శ్రీశైలంబునం దాము చూచితిమన్నంతనే యందనుక వానివి మిథ్యావాక్యాలుగాఁ బరిగణించినవారును ముక్కుల వ్రేళ్ళిడుకొని విస్మయంబుఁగనిరి. శ్రీగురు మాహాత్మ్యం బిట్లింత చెప్పవం దనిశీలఱదు.

ఆ. ఎల్లభ్రాంతులడఁగ ♦ నిటు పల్కె సిద్ధుండు
నామధారకునకుఁ ♦ బ్రేమమీఱ
గురుల మహిమ తెలియ ♦ గురుపరప్రీతిమై
విత్తిఁగూర్చు ముక్తి ♦ విన్న కొలఁది॥

భక్తికాండము—ాదశము

వక్తను శ్రోత ప్రీతిమై నభినందించువాఁడై యిట్లను: 'ఓహో, మహాత్మా! విబుధలోక దుర్లభంబును బ్రహ్మసాక్షాత్కార సంపాదకంబునౌ గురుకథా సుధాస్వాదనంబున నే నంతయు ధన్యుండనైతిని. నా దైన్యంబడంగి నెమ్మనంబున శాంతి రొదవె. తదనంతర వృత్తంబు శ్రవణపేయంబుఁ జేయింపవే'

యనం దద్దయు న్మోదంబుగదుర సిద్ధుండు పలుకు: అంతట మఱి యొక విచిత్రకథ నడచె. అది నుడివెద. చెవినిడుము: నందిశర్మ యనునొక కుష్ఠవ్యాధి బాధితుండుండెను. అతండు తనబాధ తొలఁగించుకొనుటకై తులజాఖ్య నగరమున కేగి కష్టికోర్చి మూఁన్నాళ్లుపవసించి యహోరాత్రములం దదేక దీక్షతోఁ గాళికోపాసనంబుఁ గావించెను. మూఁడవనాఁటి రాత్రి స్వప్నంబున నాజగదంబ దర్శనం బొసంగి చన్దలాపరమేశ్వరి నాశ్రయింపుమని చెప్పి యంతర్ధానంబు నొందెను. తదాజ్ఞ నాతండట్లుపోయి పురశ్చరణ విధానంబున నేడు మాసా లేక వారాశనదీక్షతో నాపరమేశ్వరి నర్చించె. అప్పటికా దేవి యాతనికిం గలలోఁగానుపించి గంధర్వపురంబున యతివేషంబుఁ దాల్చియున్న త్రిమూర్తిని నృసింహసరస్వతి నాశ్రయింప వలసిన దనిపోయెను. అంత మొలఁకునఁగన్నవాఁడై యానందయ్య యిట్లు చింతించె: 'అయ్యో, నెలలతరబడి నిన్నికష్టములకోర్చి యుపాసింపం దేలిన పర్యవసాన మిదియా? ఈమాట మొదటనే యేల చెప్పవైతివి? కాళికాజ్ఞ నిటకేతెంచిన వాఁడఁగాని నాయంతనేన రానైతిని. ఏమోయనుకొంటినే! నీదేవత్వ మింతటిదే? తుదకు నన్నొక నరునిదరికిఁ బొమ్మందువా? సాక్షాత్పరశక్తి ననిపించుకొనుచు నిన్ను భక్తితో నాశ్రయించినవాని నొక మనుష్యవ్యక్తికడకు నడువుమనుట [illegible]గమనిద్దమొన నెంచవైతివే. చాలుఁ జాలు. ఏడునెలల కాలముపవసించిన మీఁదటఁ దెలిసినదేదన నీ వశక్తవనియే కదా. నీ వల్లఁగాదన్నమాట మొదటనే తెలిపిన నాకీకష్టమునఁ దప్పియుండెడిదే' యని పలుభంగులం బొగిలి తుదకట్లు నిశ్చితాత్ముండై 'యేమైనను సరే. సత్తువయుల్లం గుర్రింగిన వెనుక నేనిం కెందుఁబోయెద? నిరంతర దీక్షంబూని యిందే పురశ్చరణంబు నెఱపెదఁగాక. నారోగంబు నిన్ను పోఁగొట్టకున్న నీపాదాలదగ్గఱనే ప్రాణత్యాగంబొనరం జేయుదునని ప్రాయోపవిష్టుండయ్యెను. ఆదేవి పునస్స్వప్నదృష్టయై వానిని [illegible] 'లేచిపొ'మ్మని యాయనపెట్టెను. అంతతోఁబోక యానతి [illegible] బట్టుల కేతని వెడలింప నాజ్ఞాపించెను. మఱునట పలువార్త వాకొల్లసిరి:

'నందయ్యగారూ! అమ్మవారి సెలవైనది. కాన మీరిక్కడ క్షణ మాత్రమైన నాగవలనుపడదు. లేకున్న మిమ్మావలికి నెట్టవలసి వచ్చును సుండీ,' యని బెదరించిరి. అప్పటికాతఁడు మతిమఱలించు కొని, 'సరే లేచిపోవుదు లెం'డని దేహపు టొఁగాపించి పారణంబు నెఱపి కొని గంధర్వ పురంబు త్రోవఁబట్టె.

అట్టి యాతండట్లు కేలవ గురుమఠంబును డాయవచ్చి 'యతీశ్వరులెక్కడ నున్నా'రని యచ్చోటి జనంబుల నడిగెను. వారు 'గురువులవారుపవసించి స్నానార్థము సంగమంబున కేగిరి. ఇప్పుడేవత్తు' రనుచుండఁగనే రానే వచ్చుచుండిరి. అప్పుడు తత్రిత్య లీకుష్ఠరోగిని దూరాన నిలుమని స్వామివారు మఠంబున నిజాసనోపవిష్టులయినంతనే కుష్ఠవ్యాప్త సర్వాంగుండవ్వాఁడో దర్శ నార్థము వచ్చియున్నాఁడని మనవిచేసిరి. అది విని శ్రీగురువులు 'వాఁడు సంశయాత్ముఁడు. అగుఁగాక యెదుటికి రమ్మను'డని సెల విచ్చిరి. అంత నందిశర్మ యాపయాతాంఘ్రిడై యడుగడుగున సాఁగిలఁ బడుచుంబోయి గురులయెదుట నిలిచెను. అప్పుడు సద్గురుస్వాములాతని దెసఁజూచి, "యేమోయీ! ముందు దేవతలనాశ్రయించినవాఁడవు 'విట్టి నరమాత్రునిఁ జేరనేమిటి' కనుకొనుచు నిటురానేల? యనిఁయడిగిరి." తననుగూర్చి యరయకమున్న తన మనోగతంబు గుర్తింపఁజాలుట నీతఁడు మహాత్ముఁడేయని నిశ్చయించుకొని స్మరింపనేయని సాష్టాంగ దండ ప్రణామంబుఁజేసి యుపవిధంబున మొఱపెట్టఁదొడఁగె: 'స్వామీ! నేనో తమోంధుఁడను. సత్త్వ మూర్తులరౌ మీదృష్టి ప్రసారంబువల్లఁ బవిత్రుండనైతి. పాపకర్ముండను మూఢుండ. నేనజ్ఞానవేష్టితుండనై యుంటను మాయాతీతులరౌ సాక్షాత్పర బ్రహ్మ స్వరూపులరు మిమ్ములఁ దెలిసికొనలేకపోయితిని. నేఁడు నాపాలిటి సుదినము. ఇఁక నాదుష్కృతములెల్లఁబోవును. భక్తాధారులరు. శరణాగత త్రాత లరు. భక్తచింతామణులరు. మీరు మున్ను సగరుల నుద్ధరింప భాగీరథియట్లు మమ్ముల నేనేల సరిమాపంబుసంగ్రాలుచున్నారు. ఇట్టి మీపాదంబులు దొరకసవెనుక మనోరథంబు లీడేరకుండెడినే?

తే॥ జారకర్మమువల్లఁ బా ♦ షాణమయ్యు
రామపదమానఁగ నహల్య ♦ రామ కాదె?
యెన్ని దుష్కృతములఁ బాన ♦ రింపనైనఁ
దుదభవత్పదమానఁ బూ ♦ తుండఁగానె?

నాస్థితి చెప్పెద వినుండు. పెండిలియైనది మొదలుగా నా పాదమస్తక వ్యాప్త కుష్ఠుండనౌటఁ జేపట్టినదికూడ నన్నువీడి దాని పుట్టినింటికిఁ బోవఁబట్టె. నన్నుఁగన్నవారుం దొలఁగిపొమ్మన దిక్కు మాలినవాఁడనై యీజగదంబ నాశ్రయించి యుసవసించితి. దాన నఘనాశంబుగాదయ్యెను. అప్పటికాయంబ చండలేశ్వరిని గొలిచిన రోగనివారణంబు గాఁగలదనఁగా గంపెడాసతోఁబోయి యచ్చోఁ గష్టనిష్ఠురములకోర్చి పురశ్చరణంబుఁ గావించితిని. తద్దేవతయు నన్ను గర్హించనేకాని సహించి గ్రహింప నియ్యకొనదయ్యె. నా మొగమువంకఁ జూచువారే లేనప్పుడీ మనుగడకంటెఁ బ్రాణా లుడుగుటే మేలనిపించుచున్నది. కడపటికీమీపాదాలు శరణ్యంబులని యిటుడాయవచ్చితిని. నా యీ దుర్భర రోగాస్తికాయు నుపాయంబుండునో లేదో వెంటనే చెప్పఁగోరెద. [illegible] నీకఁ బడియుండఁజాల. నాకు దేహాపేక్ష సన్నగిలినది. మీపాదాల దగ్గఱ నాప్రాణాలుగుడు విడువ వచ్చితి. మీదయ యెట్లో యట్లు కానిండు. [illegible] మీపాదాలఁ బట్టాడు. మిము నమ్మియున్నాఁడ [illegible] [illegible] గృపఁగొన్న యనన్యగతికుఁడను [illegible] శిష్యులఁజేరబిలిచి [illegible] [illegible] మంటిసను [illegible] ర్పించి యశ్వత్థ [illegible] నా [illegible] వస్త్రములతో [illegible] సారముగా [illegible] యేమిచెప్పుదు? ఒక్క మునుకతో [illegible] అశ్వత్థ [illegible] నాతిసమేము [illegible]

జాదుల నంత మాసవులందు శూద్రాదిజాతుల యథాక్రమంబుగాఁ బుట్టుచుం గిట్టుచుండు నీ జీవునికి మిమ్ము స్మరించు భాగ్యం బబ్బనేర్చునే? అగ్రజన్మముమాత్ర మందఱకు లభింపఁగలుగునే? రేతశ్శోణిత సంయోగంబున నేను దినాలకు బుద్బుదాకృతినంది పక్షమునకు గుడ్డయి మాసమునకుఁ బిండమై ద్వితీయమాసమున శీర్షాదులమరఁ దృతీయమున నన్యోయవయవంబులేర్పడఁ జతుర్థంబున నవరంధ్రాలు కలిగిన మీఁదటఁ బంచమ మాసంబునం గాని పంచభూతంబులుం జేరఁ బ్రాణావేశంబు గలుగనేరదు. అయ్యెయెడలమిమ్ము స్మరింపఁ గల్గుటెట్లు? ఇంకషష్ఠంబునఁ ద్వగ్రోమనఖ శ్వాసాదులును సప్తమంబున నింద్రియంబులు నష్టమంబునఁ జిత్తంబు నమరినంత సంస్కారంబు నందనిది గురుస్మరణం బెక్కడిది? ఇఁక నవమ మాసంబుననో మాతృగర్భకూపంబునం బడియుండ నాపె యిచ్చవచ్చినట్లు క్షారోష్ణాది పదార్థంబులం దినుచుండ నత్యంతవేదనంబునందు నప్పుడేమి? మిమ్ము స్మరింపఁ గల్గుటేమి? గూటిలోని గువ్వమై మావి చుట్టియుండ నెట్టో మాసపూర్తికాఁగాఁ గష్టానఁ జెఱవదలిన నానో నట నూతేండ్లాయువున్న నందునగము నిద్రావస్థతోనే కడచునాయెను. శేషించునది బాల్య యౌవనవార్థకంబులం బరాధీనతం బోవ మిమ్ము స్మరింపఁ గల్గుటున్నదో! శైశవంబునం బరాధీనతంబడ్డ కష్టాలేమి చెప్పుదు?

ద్విపద. మలమూత్రములయందుఁ ♦ బడియున్ననాఁడు।
తెలియమిని స్వవిష్ఠఁ ♦ దినియున్ననాఁడు।
బలవంతమునఁ దల్లి ♦ మందిచ్చునాఁడు।
మెలివేయఁ గడుపు పా ♦ ల్క్రింగించునాఁడు।
నాఁకొని యేడ్వ జో ♦ యనిపాడునాఁడు।
గాకపోర్వట్ట ర ♦ క్షను గట్టునాఁడు।
తేఁకువఁ గలిగింప ♦ దిగఁగీయునాఁడు।
సీకర్మమంచును ♦ నిందించునాఁడు।
తేలుకుట్టులుఁగక ♦ దీవించునాఁడు।

పాలుదాగ్రమి వీపు ♦ పైఁ గొట్టునాఁడు।
దోలఁదేలుననుంచి ♦ తూఁగించునాఁడు।
గోలవెట్టిన బాఁది ♦ కోపించునాఁడు।
మాయమ్మపాలు ల్లే ♦ ష్మముఁ బెంచునాఁడు।
నేయౌషధమొపోసి ♦ యిందించునాఁడు।
మాయఁగన్నం జనం ♦ బును బెట్టునాఁడు।
నాయువుపోవ ని ♦ న్నందు టేనాఁడు?॥

పసితనంబున మాటలు నేరమి నోరులఁ జేతులం బడ్డపాటు లెల్లన్నియో కాంగాఁ దలిసి తెలియని విస్మృతినొందు నంతలం బోతులం గొంతవోయె.

చ. తరుణతఁ గామపీడను బ ♦ తంగము దీపము మ్రింగఁబోవు మా।
దిరి వనితాసలంబున గ ♦ తింపఁగ నాయువు తల్లిదండ్రులన్।
న్గురులఁదిరస్కరించి యెటఁ ♦ గోమలిఁగాంచిన మోహపాశముద్వ్యదా।
త్పరత నకార్య వృత్తిఁ బర ♦ దారలఁగూడిన మత్తుఁడైతిఁగాఁడే॥

ఆ. ఋషభము లెఱుఁగనట్లొ ♦ విషయుంతో నెసట్లు।
కులముఁ గనక చేరు ♦ కుమతిసంగముఁడు।
బరధనాపహృతియు ♦ పరసాహసంబులుఁ।
జేయునాఁడు నీదు ♦ స్మృతి గలుగునె?॥

అనంగశరంబులకోడి యంతర్గ్రమై నంగాసంబులిడి పెద్దల నిందించి సాధువచనంబు నిరాకరించి సుర్యాగానగతి సంచరించిన దినంబుల నిన్నము స్మరించుటేడ? ఇప్పుడు దారపుత్త్రులకొఱ కర్థంబుఁ గూడబెట్టుటతోనే సరిపోవునాయె. ముందుంక వార్ధకంబునను నానామయంబులకులోనై శ్వాసపుట్టి కఫముపట్టి నట్టెంటికి నింకే తలఁపులును వట్టివేకదా.

చ. తల నరయ న్మొగంబు ముడు♦తల్వడ దంతము లూడిపోవఁగ।
న్నులమసకేర్పడం జెవుడు ♦ నొప్పులు తీపులు రొప్ప లొప్పఁగా।

ఘలు వడఁకాడఁగా నడుమ ♦ లోఁగల స్వాన్త నిర్లింగ సంగి యౌ|
ద్ధుల తడఁబాటు వాపికొనఁ ♦ గోలను గాంచు స్మరింప నేర్తునే?॥
ఉ. ఏమెడనేమియైనా దరి ♦ సింపఁగఁగల్గె జగమ్ముఁ బ్రోచునా|
రాయణ మూర్తివై గురువ ♦ రా! నరరూపముఁదాల్చినిన్ జగ|
ద్ధ్యేయపరాత్పరుం దెలియ ♦ నేమొయి కర్మ దివాంధమట్లు ద|
త్త్రాయ మహాత్మునే నమయి ♦ దమ్మును దీనుని నన్నుఁగావవే॥

యని మొక్కి యక్కడఁగల ప్రజలదిక్కుగు దిరుగుచు నిట్లనిరి: 'ఓహో మహాజనులారా! వినుండు. మీరిమున నిలిచిన వీఁడెంతయుఁ బాపకర్ముండు. తత్పాపఫలంబుగ దుర్భరరోగార్తితో నుండిన నారాకడ మీరు కనులారఁ జూచితిరి కాదే. ఇట్టి రోగమున్నను దన్నివారణంబునకై నడనిపోట్లను ప్రమొక్క నిద్ర నాతమును లేకుండె. ఆహాహా! యేమి చెప్పుదును? అనుమహానుభావుల సాక్షాత్పరబ్రహ్మ స్వరూపుల శ్రీగురుమూర్తుల పాదాలు దర్శింపఁగలిగిన మాత్రాన నా పాపాలెల్ల నగ్గిలో బ్రుగ్గి బుగ్గియై నగ్గానంబు మాదిరి రూపుమాసెను. వానితోడనే నారుజాక్లేశంబును నాశంబు నొందెం జూచితిరే! 'చరణం పవిత్ర'మ్మను శ్రుతివాక్యమ్ము మునుమ్మటికి నిందు సత్యమ్మసుండీ. ఇంక నీగురుమూర్తులకంటె వేఱు దైవమ్ము నిమ్మహింగానము. గురుపాదమ్ములే లోకైక శరణ్యమ్ములు. బమ్మ ఫాలమ్మునందెమ్మెయి లిఖించిన నిమ్నపంక్తిను పాపమ్ముల స్పర్శమ్ము గల్గి నంతనే దుష్టఫలమ్ములెల్ల నష్టమయి శుభమ్ము చేకూరుననుట నిక్కమ్ము. ఇట్టి పెన్నిధి దరినుండ నిటునటు పర్విడుచు నృథాశ్రమంబు లందుదు రేమిటికి?

వనమయూరము. నగుదును కేగినను ♦ నేమగు ఫలంబు|
ల్వాగమ్మృతపానమున ♦ భావిత సుఖంబు|
ర్లాగముల వీడఁగ ని ♦ రంతరముదంబుల్|
శ్రీగురు భజించుటను ♦ జెందుఁ డఖిలంబుల్॥

అని యా నందిశర్మయుపన్యసింప శ్రీగురుండానందంబునంది యాతనికిం గవీశ్వరాభిధానంబొసంగె. తదవశిష్ట కుష్ఠంబును నష్టం

అదేమిచిత్రమో యాతనికందుఁ గునుకు పట్టె. అట్టియెడ జరిగిన దింక విచిత్రము. అదేవన నందలి స్వప్నావస్థ. ఏమి చెప్పుదు? ఎదుటలింగ మదృశ్యమయ్యెను. అచ్చో శ్రీగురుమూర్తి కూర్చుండి 'కవితానర్హ్యా నరమాత్రుఁడు నీకిట్లెట్లు పూజార్హుఁడయ్యె'నని పరిహసించినట్టులా కవి మనంబునకుం బొడకట్టెను. ప్రేమసందాపీడక షోడశోపచారపూజ లాతని కర్పించినట్లు కలఁగనెను. అప్పటికిఁ గేసరి మేలుకొనఁగని విస్మితుఁడై కొంతసేపటికిఁ దెలివి తెచ్చుకొని తన మనమున నిట్లనుకొనెను: 'నేనిందనుకఁ బొరపడితిని. శ్రీనృసింహసరస్వతులను నెవ్వరో కారు. సాక్షాత్పరశివులే. భక్తోద్ధరణార్థమిద్ధారుణి నిట్లవతరించి రనుకోఁ దగదు. కాకున్న నిట్లు నావల్ల సమర్చనము నెట్లొందఁగలిగి యుండురు? నిస్సంశయముగా నాతండె త్రిమూర్తియై నాఁటి దత్తసందర్శనంబు కర్తవ్యం'బని నిశ్చితాత్ముండయ్యె. అంత నాతండు ప్రతి పద ప్రణిపాతంబులతో గురుపాదంబుల డాయఁబోయి,

'కం. చిరకీర్తిత హరమూర్తివి।
నరపూర్తి కృపాకృతార్తి! ♦ వచ్చితె? కల్లే
శ్వరభాసుర గురుదాసుఁడు।
**నరకేసరి** వందనంబు ♦ నరకేసరికిన్॥'

అనుచు సాష్టాంగ దండప్రణామంబాచరించి లేచి చేతులు గట్టుకొని యిట్టులు సంస్తుతింపఁ దొడంగెను.

మ. అసితా! భావిత సచ్చిదాకృతివి మా ♦ యావేష్టితాత్ముండనై।
కవిలోకైక శరణ్యమూర్తివని నినుం ♦ గల్లేశు సాక్షాత్సదా।
శివమూర్తి న్ననుతింప కుంటిని గృపా ♦ నీకంబునం దేర్చి పా।
దవనేజ భ్రమరాయమానుని మహా ♦ త్మా! నన్నుఁ బాలింపవే॥

మ. తనువుల్గాసిలఁ బెద్దకాలము తప ♦ స్తప్తుల్మునుల్ధ్యాన ని।
ష్ఠనుపాసించినఁ గానరాని జగదీ ♦ శా! నీవు సాక్షాత్కృతిం।
గనఁ గల్లేశ కృపాప్తిఁ గాఁడె యభవా! ♦ కల్లేశ్వరుండన్న నే।
ఆనికో నీవ మహానుభావ! గురుదే ♦ వా! నన్నుఁ బాలింపవే॥

కవిరాజ విరాజిత వృత్తము.

నరహరి! నిన్నుఁద♦నమ్మినవారిఁ గొ♦నం బ్రభవింపఁగ♦నద్దరలోన్।
దరిఁగననైన ని♦ధానమువీడి వృ♦థాటనమేల న♦దావనిలోన్।
శరణనినీపద ♦ సారసనన్నిధి ♦ సాఁగఁగృపామతి♦సద్గతికిన్ ।
వెరవిఁడిఁ జేరిన ♦ వేలుపుగిడ్డివి ♦ బీదనిఁ జేసన ♦ వేటిఁడికిన్॥

అని సంస్తుతింప స్వామి, 'ఓయీ! నన్నిందనుక నిందించుచుంటివే. ఇంతలో నీమంతనంబునం దింతమార్పు గల్గనేమిటికో తెల్పు' మనపుడుఁ గేసరి కేల్మోడ్చి యివ్విధంబున విన్నపంబొనరించె: 'స్వామీ! నేనజ్ఞానాంధకార మగ్నుండనైనను మీరు నాపాలిటి జ్యోతిస్స్వరూపులరైతిరి. శ్రీకల్లేశ్వరుల నర్చించుచుండిన ఫలంబున నే మీపాదంబుల సేవింపఁగంటిని. తత్పూజావేళ నటలింగమునకు బదులుగా మిమ్మేచూచితి. కలలోను మీపాదాబ్జములనే సందర్శింపఁ గలిగితి. అదృష్టవశమున నిప్పుడు ప్రత్యక్షముగా వీక్షింపఁగలిగి నాఁడ. నన్నునొక శిష్యపరమాణువునుగాఁ బరిగ్రహింపవలయు' ననుచు హృద్యపద్యంబులతోడ షోడశోపచారపూజలు సలిపెను. అప్పుడు గురుస్వాములు కలలోనితఁడు నన్నెట్లు పూజించె నట్టులనే భక్తియుక్తుండై యారాధించు చున్నాఁడని యాతనికిష్టార్థంబు లొసఁగూడునట్లు వరంబొసంగిరి. ఆ కేసరి యంతందా ననవరతము తచ్చరణంబులదరి నుండఁగోరుడు స్వామి కల్లేశుండు శ్రేష్ఠుండును దమకు సమ్మతుండునౌటఁ దాము నందుండుమనియు నటనే నిత్యపూజ యథాపూర్వంబుగా జరుపుచుండుమనియుం జెప్పిరి. కాని కవికేసరి తాను బ్రత్యక్షమున లీలగా నవతరించిన సాక్షాత్త్రిమూర్తుల దర్శింపఁగలిగిన వెనుక వేఱొక్కట నుపాసింపనొల్లదునే యని గురుపాదంబుల వీడకుండెను. ఆతని భక్తితాత్పర్యంబున కలరి గురువులును సమ్మతించిరి. అంతటనుండి యానరకేసరి కవికేసరియు గంధర్వపురంబున గురుపాదార్చనంబును దత్సంకీర్తనంబుం గావించుచుండెను. నామధారకా! చూచితే యివ్విధంబున నృసింహసరస్వతుల నాశ్రయించిన కృతిరచయితలౌ నభినవసరస్వతు లిరువురయిరి. ఇట్లు

వైన నెవరియింటికో నిశ్చయించుకొనఁజాలక సందిగ్ధమనంబున నందే యొక్కెడనుం గదలకయుండె. స్వామి తమ వద్దను బ్రహ్మజ్ఞులని యొక్కొక్కనిం జేరఁబిలిచి 'నీయింటికే వత్తు నింకెవ్వరికిం జెప్పకుమా' యని రహస్యముగాఁ జెప్పివంపిరి. వారెవరికివారు తమయింటికే గురువులు రానున్నారనుకొని మురియుచు నొరులకుఁ జెప్పకుండ నెవరి త్రోవల వారు పోయిరి.

కాని యీవార్త యెట్లో పొక్కెను. గురుస్వాములు పొరుగూరికేగుచున్నారని విన్న పౌరులు మఠంబునకువచ్చి తమ్ము వీడి పోవలదని బతిమాలఁదొడంగిరి. వారితో శ్రీగురు, 'ఇక్కడనే యుందుము. చింతింపవల'దని విశ్వాసముగఁ దెలిపిరి. పిదప నా ధనత్రయోదశినాఁటి సాయంసమయమున మంగళస్నానవేళ సపారమహిమాన్వితుండా నారాయణ స్వరూపుం డష్టరూపధారియై యష్టగ్రామంబులంగల భక్తుల యిండ్లయందును నిజమఠంబునను నేక కాలంబున నందఱిపూజల నందుకొనఁ గలిగెను. కాని యొకచోటి ముచ్చట మఱొక్కటఁ దెలియకుండఁ గొలఁదిదినాలు గూఢముగా నడచె. అంతంగార్తికంబున త్రిపురోత్సవముకొఱకందఱు మరల గంధర్వపురంబునం జేరిరి. గ్రామాంతరాగత భక్తులందఱుఁ గూడి తమ తమ యూళ్లలో నప్పటికిఁ బదిదినాలకిందట జరిగిన దీపావళి మహోత్సవమునుగూర్చి చెప్పఁబోఁగా నొకరిమాట లొకరికిఁ గల్లలు గాఁదోఁచెను. ఎవరికివారు 'గురుస్వామి మాయింట భిక్షచేసి' రన 'మాయింట భిక్షచేసి' రనుచుఁ దాము తాము సమర్పించిన కానికలం జూపుదుమని పంతాలుపల్కిరి. ఇంకొక గ్రామస్థులు వారినిగని నవ్వి మీకేమి వెఱ్ఱియా? దీపావళినాఁడేమి? స్వాములవారిక్కడికే వెళ్లుటేమి? మేముకాదా పూజించితి'మని మందలించిరి. ఇట్లు కూడఁ బలుకుకొన్న వెనుకఁ గూడను స్వామి యన్నిరూపుల నందఱిపూజల నొక్కటసందేఁగాఁబోలునని యూహించి శ్రీ గురుమూర్తియన సాక్షాన్నారాయణమూర్తియే యని గుర్తించి యిట్లు సంస్తుతించిరి;

హాలముమెండు. అయ్యెడ నొక పాదజుండు గురుపాదులసేవఁ గావించువాఁడయ్యెను. వానినిగూర్చి చెప్పుచున్నాను. అనుదినంబును సంగమంబున కనుష్ఠానంబు నెఱపికొన నరుగుచుండు గురుస్వాముల నాకృషీవలుండు సూచుచుండెడివాఁడు. ప్రతిదినమును వాఁడు కొంత దవ్వునఁగాంచి పరువిడివచ్చి స్వాములవారి చరణంబులదరి సాఁగిలఁబడి 'మాపొలమును జూచిపొం'డని తిరిగిపోవుచుండెను. ఇట్లు కొన్నిదినా లుదయ మధ్యాహ్నములం దనిపోవువానింగని నిలుమని హాసన్ముఖంబున స్వామి యొకనాఁడిట్లనిరి: 'ఓరీ! మొన్నాళ్ల నుండియో యిట్టె వచ్చి కాళ్లమీఁదఁబడి యేమోయని పోవుచుందువ దేదో సరిగాఁజెప్పు'మనిరి. వాఁడందులకుఁ జేతులుమోడ్చి 'బాబూ! నా పొలము దేవరవారు చిత్తగించిన బాగుగాఁబండునుగదా యని నా యాశ' యనియె. స్వామి విత్తనమేమిన వాఁడిట్లు మనవిచేసెను: 'అయ్యగారూ! జొన్న వేసినాను. రోజూగోజున మీకాళ్లకు మ్రొక్కి-పోఁగా సస్యము బాగుగాఁ బెరుఁగుచున్నది. ఇప్పుడిప్పుడే పాలు పోసికొనుచున్నది. ఏలినవారిదయవల్ల నెలగనాళ్లలోఁ గోఁతకు సిద్ధమౌను. కాఁబట్టి దయచేసి యొక్కసారి మీకంటితోఁ జూచితిరే నింత యన్నముపెట్టినవారగుదురు. 'ఎవఁడో శూద్రుఁడు పొ'మ్మని నామాటఁ ద్రోసివేయకుఁడు. మీరే రక్షకులు'రని ప్రార్థింపఁగా నల్లె యని శ్రీగురు లటునోయి యానందరసితో నిట్లనిరి: 'ఓయీ! నాయందు నీకు విశ్వాసముండి నేను జెప్పినట్లు వెంటనే చేయుదువందువేని జెప్పెదు'నన నాకాఁపు, 'తండ్రీ! మీమాట కడుగుదాఁటుట కూడనా? మీకంటె నాక్షేమముఁగోరి చెప్పఁదగ్గవారెవ్వరు? నాకు మఱొక్క తలంపులేదు. మీ గలుఁగని దేమున్న'దని విన్నవించెను. గురుఁడప్పట్లయినఁ దాను మధ్యాహ్నమునవచ్చునప్పటి కాచేనిలోని పైరెల్లఁగోసివేయుమని యానవెట్టి సంగమంబునకేగెను.

ఆర్తైకమైన స్వాములవారియాజ్ఞమీఱఁగూడదనునిశ్చయము గలవాఁడౌట నూరంగల క్షేత్రనాథునివద్దకేగి పీనబడిగె గతవత్సరపు టోర్పాటునఁ జెల్లించలాగున నాజ్ఞాపత్త్రి మొసంగఁగోరెను,

భూస్వామి యాయేటిపైరు హెచ్చుగానుండుట నట్టి యొడంబడిక కొప్పుకొనలేదు. బేరాలు జరిగెను. తుదకు మున్నిచ్చినదానికంటె రెట్టింపుగాఁ జెల్లఁగట్టఁదగునట్టి యొడంబడిక నడచె. ఆనిర్ణయముం దెలుపుకాగితములు నేర్పడెను. అంతట నాసేద్యగాఁ డాపత్త్రముఁ జేతఁగొని కోఁతకై జనులం బిలుచుకొనిపోయెను. ఇప్పుడే కోఁతయే మనుకొనుచు నేమైనం దమకూలి తమకువచ్చునుగదాయని వారు పోయి కోయ నారంభించిరి. అప్పుడు వాని పెండ్లమును బిడ్డలును వచ్చి మొఱ్ఱోయనుచు నడ్డుపడిరి. ఈగురుభక్తుఁడు వారి నవ్వలికిఁ బొమ్మని యెంతచెప్పినను వినమిఁ దుదకు వారిమీఁద ఱాలురువ్వి దవ్వులకుఁదోలెను. వారు వెఱఁగుపడి పాఱి న్యాయాధికారిదరి నిట్లు మొఱపెట్టుకొనిరి: 'మహాప్రభూ! మావానికి దయ్యముపట్టెనోయేమో కంక ముదురకముందే మొదలంట నఱకివేయించుచున్నాఁడు. వద్దని యడ్డుపోఁగా రాళ్లుపుచ్చుకొని మమ్ముఁగొట్టుచున్నాఁడు. ఏసన్నాసి మాటలోవిని మేపున నెదుగుచున్న పైరెల్లఁ బదడుచేయున్నాఁడు. బాబూ! నెలదినాలలోనందఁగలమనుకొన్న సిద్ధాన్నమిట్లువిచ్ఛిన్నమయి పోవుచున్న' దనిగోల్లుమనఁగా నాయధికారి 'మీక్షేత్రనాయకునితోఁ జెప్పుకొనుండు. చేయవలసిన చర్యయున్న నాతఁడుచేయు' నని చెప్పి యంపెను. అంతటవారా క్షేత్రపుని దరికేగి మొత్తుకొనఁగా నాతఁ డిట్టులఁ బ్రత్యుత్తరమిచ్చెను: 'వానియిష్టము వాఁడేమిచేసికొన్నను సరే. నా కెందులకు? కడచిన సంవత్సరముకంటె రెట్టిగా నాకట్టుబడి నాకిచ్చునట్లు గట్టిగా వ్రాయించుకొన్నాను. అయినను మీరింతగా ఘోషిల్లుచున్నారు గాన వానినివారింప నంపుదులెండు. పొం'డని యొకదూత నంపెను. అట్లు ప్రేషితుఁడైన దూత యాసేద్యగాని నడ్డు వెట్టఁబోఁగా వాఁడు కోపించి యిట్లనెను: 'ఏమయ్యా! మీరు నాతెరువునకు రానేమిటికి? మీయజమానుఁడు తాను వ్రాయించుకొన్న ప్రకారము నావల్ల ధాన్యముఁదీసికోవలసినవాఁడేకాని నేను జేయుపని కడ్డురాఁదగ్గవాఁడుకాఁడే. ఆయనకు పరిపక్వ ధాన్య మింటగాదెలో లేకపోలేదు. చాలవేమాయన్నఁ గావలసినన్నిఁ పశువులున్నవాయె.

ఇంక భయమేమయ్యా!' యని సాగనంపెను. క్షేత్రనాయకుఁ డా వార్తఁ దెలిసి, 'మారయితునింట నిరుటిధాన్యము చాల నిల్వ యున్నట్టు విన్నానై తిని. నాకెందులకుఁ బొమ్మని మిన్నకుండె. అయ్యంఘ్రిజుండును దనచేనిలోని పైరెల్లఁ గోయించి కొడవళ్లు కట్టఁ గట్టి యావలఁ బెట్టి శ్రీగురుధ్యానం బొనరించుచు సంగమసగంబునం గూరుచుండెను. కొంతసేపటికి కేగుదెంచిన గురుస్వాములఁ గొంపోయి కోయఁబడియున్న పైరును జూపెను. అది కాంచి వారిట్లనిరి: 'అయ్యో! వృథాగాఁ గోసివేసితివే. నేను సన్న్యాసి నేదో యన్న మాత్రాన నీవది సత్యమనుకొంటివటరా!' యన్నను నాకృషీకుఁ డింతయు సందేహింపక, 'స్వామీ! మీనోటవచ్చినది వట్టిమాట యౌనా?' యనియే పలికెను. వానిమనము చెదరమికి మురిసియుండి వారపుడిట్లనిరి: 'అవును దృఢవిశ్వాసమున్నఁడును నిష్ఫలముగానేరదు లెమ్ము. నిశ్చింతగానెయుండు' మని తమమఠంబునకుఁ బోయిరి. అగపడినవారెల్ల రాడిపోసికొన నాకాఁపింటికిఁ బోయెను. వానియాలు తమకూడు పాడై పోయెనేయని యింటిలోఁబడి హోరున నేడ్చుచుండెను. ఆనిశ్చలచిత్తుఁడా బత్తుఁడేమైనను హృది చదరనివాఁడై యిట్లు బోధించె: 'ఓసి వెఱ్ఱిదానా! యేడ్వరాదు. గురువాక్కు కామధేనువు సుమీ. వారిదయయున్న సుఖముగా బ్రదుకఁగలము. గురువులవారి మహత్త్వ మూఢులకేమి తెలియును? పండఁదగిన పంటకు వేయిరెట్లధికముగా వారిత్తురని నాకు నమ్మకము. మన కంతమాత్రమును హానికలుగదు. గురువులవారనంగా నరమాత్రులనుకొన్నావేమో. ఈరూపమున నగపడుచున్న శంకర భగవానులుగాక యన్యులా? ఎవ్వరియెడ వారికృపగలుగునో వారికింకేమిభయము? మనకుఁ బెన్నిధి దొరకిన దనుకొనఁదగ్గ' దనుచు నిశ్చింతగాఁ బలికి యూరార్చెను. వాని మాటలువిన్న యిరుగుపొరుగువారును జూడవచ్చినచుట్టాలును 'వీని మూఢ విశ్వాసమే' మనుకొనుచుం బోయిరి.

తరువాత నెనిమిది దినాలకు మిక్కిలి చలిగాలివీచెను. దాని వల్ల నాచుట్టుపట్టులనున్న చేలం దాలేర్పడెను. అంత నాపుష్యంబున

నకాలవర్షము కురిసెను. దాన లోకులెల్లరసంటయు బుగ్గియయ్యె. ఇంకమన భక్తకర్షకుని క్షేత్రంబునందు మున్ను కోయంబడిన యొక్కొక్క మోడునం బదేకండేసి చిగుళ్లుపుట్టె. అవి యేపునవెదిగి యపరిమితముగా ఫలించెను. లోకులెల్లర కదియచ్చెరువుంగొలిపె. ఇదెల్లఁగాంచి పరమానంద భరితురాలైన వానియంగన తనమగని కాళ్లమీఁదఁబడి మధురవాక్కులనిట్లుపలికె: "నేనెఱుఁగక చేసిన యాగమునుగూర్చి మీమనసున నుంచుకోవద్దు. తెలివితక్కువ యాట నేమేమో నోటికివచ్చినట్లన్నదానను. ఆ మహానుభావులను దూలనాడినాను. నాతప్పు నిప్పుడు తెలిసికొన్నాను. మన్నింపవలెనని ప్రార్థేయపడెను.

అపుడా యాల్మగలు క్షేత్రదేవతకుమ్రొక్కి గురుస్వామి దర్శనార్థమరిగి దోసిళ్లతోఁ దెచ్చిన పూవులను దత్పాదంబులందుంచి సాఁగిలఁబడిరి. వీరింగని స్వామి 'నిశ్శేమమేమి' యనిరి. అంతనీబంటు యాదంటు నిట్టులఁ గొనియాడ మొదలిడిరి:

హయప్రచారగగడ

"కలిగెసామి ♦ కామస్ఫూర్తి । నలముపోసె ♦ సత్యమూర్తి
కలదవేళ ♦ కామధేను । విలునునిన్ను ♦ యన్నగాను
నుధనుబోలు ♦ శాస్త్రవాక్కు । నిధినిగూర్చు ♦ సిమద్భక్కు
[illegible] ♦ పూతపాద । మధనుగమ్య ♦ సుప్రసాద !
మొఱఁగనన్ను ♦ డసినన్నుఁ । గరుణఁజూచి ♦ కాచవన్న !
శరణుఁగోరి ♦ సాఁగిమమ్ము । గురువరేణ్య ♦ కొల్వనిమ్ము."

అనుచు సీరాదనసో[illegible] సంతుష్టాంతరంగుడైన గురుసార్వభౌమ శ్రేష్ఠుండు వారి 'నఖండైశ్వర్యప్రాప్తి' యాశీర్వదించి [illegible]. అట్లు సెలవంది యాదంపతులింటికిఁ జనిగిపోయిరి. మరియేమి? వారికి గతవత్సరముకంటె నూఱురెట్లధికముగా ఫలించెను. [illegible] కుఁడు ధాన్యము రాసిఁజేసి భూస్వామింబిలిచి సంతోషముతో నిట్లు పలికె: 'అయ్యా! చూచితిరా? స్వామివారి దయవల్లఁ గావలసినంత పండినది. మీకందు సగపాలు కొలుతును. అసిరానిపొండు.

మనము వ్రాసికొన్న యేర్పాటునుబట్టి నిరుటికంటె రెట్టింపు మీకియ వలసి యున్నాను. నాకింతయెక్కువగా ఫలించినదిగానఁ జెటిసగముగాఁ దీసికొనుట న్యాయమని కోరుచున్నాను. మీపాలు మీరు కొలిపించుకొనిపొండు. సంశయింప నక్కఱలే'దని చెప్పెను. ఇంక నాక్షేత్ర నాథుండో ధనలోభంబున ధర్మహానికిఁ బాల్పడనివాఁడౌటఁ దనయొడంబడికను మించి గ్రహింపక గురుప్రసాదమువల్లఁ గలిగిన విశేషలాభమెల్లఁ దనరయితునే యనుభవింపుమని చెప్పెను. అంతట మనయీగురుభక్తుఁడు రాజగ్రాహ్యంబౌ ధాన్యభాగం బావలనుంచి యీయేఁడు పంటపోయి యల్లాడుచున్న గృహస్థుల బ్రాహ్మణోత్తములం బిలిచి కొల్లగా ధాన్యదానంబుఁ జేసి మిగిలినదెల్ల బళ్లమీఁద నింటికిఁ జేర్చుకొని యపరిమితానందభరితుండై కాలముఁ బుచ్చుఁ గలిగె. నామధారకా! గురుమాహాత్మ్యం బిట్టిది. గురుభక్తి సర్వాభీష్ట ప్రదమ్మను'మ్మని సిద్ధుండు వలికెను.

## భక్తికాండము — ౧౨దశము.

నామధారకుండు సిద్ధపదంబులంటి యిట్లనె: 'మహాత్మా! శ్రీగురుమహాత్మ్యవిద్యోతకంబౌ తద్గాథ విన్నకొలఁది నాతండు నర రూపంబుఁ దాల్చిన సాక్షాత్త్రిమూర్తియే యని రూఢమైనది. కాని భూమిమీఁదఁగల తీర్థంబులసంఖ్యాయంబులయియుండ సీసంగమ దేశంబుననే వారువసింపనేమికతనో బోధపడుటలేదు. కావునఁ దత్క్షేత్ర మాహాత్మ్యాది వివరణంబుంగావించితేని వినికృతార్థుండ నయ్యెద' ననవిని సంతుష్టాంతరంగుండైన యాయోగిపుంగవుండు పల్కె: 'శాస్త్రచూడామణీ! అట్లయినఁ జెప్పెద సమాహితచిత్తుండవై యాకర్ణింపుము:

ఈగంధర్వనామక క్షేత్రంబున నొక యాశ్వీజకృష్ణ చతుర్దశి నాఁడెల్లరు దీపోత్సవోత్సాహులై యుండఁగ మన శ్రీగురుశేఖరులు తమ శిష్యవర్గంబుం జేరఁబిలిచి 'త్రిస్థలీయాత్రఁ గావింత' మనిరి. వారు 'ప్రభోసబత్తమునకై మూటయు ముల్లెయు జాగ్రత్తపెట్టుకొందు' మనిరి. స్వామి యందులకు నవ్వి 'త్రిస్థలిచేరువనే యుండఁగా నంత

స్నానహామెందుల' కనుచు నందఱు సకుటుంబముగాఁ దమ్మనుసరింప వలయునని యాజ్ఞాపించిరి. అట్లు వారెల్లరు వెంటరాఁగా గురుమూర్తులు సంగమతీరంబున కేగి యచ్చోఁ గృతావగాహులైన వెనుక ననుచరవర్గంబునకు వారిట్లు బోధించిరి: "జనులారా! యీసంగమప్రదేశము ప్రయాగకుఁ దుల్యమయిన మహిమము కలదిసుండీ. షట్కాలతీర్థం బద్దానిని మించునదనియు నెంచఁదగినది. ఈభీమామరజా సంగమతీర్థము గంగా యమునా సంగమంబుకంటె నగ్రగణ్యము. ఇచ్చోట స్నానమొనర్చుటవల్లఁ గలుగుపుణ్య మింతయని చెప్పనలవుపడదు. ఉత్తరవాహినిలోని యవగాహమున నింకధికము. ఇటఁబావనములౌ నెనిమిదితీర్థములు గలవు. ఒక్కొక్కదానినే పేర్కొని యెంతని చెప్పుదు?'ననఁగా నందొక భక్తుఁ 'డయ్యమరజాఖ్య వాహిని యేల యేర్పడవలసె'నని యడుగఁగా మెచ్చి స్వామి యివ్విధంబున బోధింపఁజొచ్చెను:

మున్నొకక్కడ నమరులకు నసురులకును భీమసంగ్రామంబు జరిగెను. అందు జాలంధరుండను రాక్షసిచేత నందఱో దేవతలు మడియుచుండిరి. అప్పు డాదితేయేంద్రుండు మృత్యుంజయుని జాయఁబోయి తమకా గద్దురక్కసివల్లఁ గలుగునష్టమునిగూర్చి యిట్టుల మొఱ్ఱవెట్టుకొనియె: 'ఓహో కాలకాలా! మాపోరాటంబున నరులకుఁ జేటుగాక మాకే యోటమి వాటిల్లునట్లు పొడకట్టుచున్నది. అదేమి చిత్రమోకాని నేలఁగూలిన నీటడంగెడి యానిశాచరుల రక్తబిందువులనుండి వేనవేలుగఁ బూర్వదేవులు పుట్టి ముల్లోకాలందు వ్యాపించి మననిర్జరుల భక్షించుచున్నా'రను సురపతిమొఱఁ గాలించి యంతనే సురేంద్రుండు రుద్రుండును నిద్దఱు సర్వదర్గంబుగావింపనో యన్నట్లు దైత్యులఁ గసిమసఁగింప సన్నద్ధులైరి. అయ్యెడ సురేంద్ర ప్రార్థనంబున దేవసేనాసహాయంబుగా శివుండమృతఘటంబొసంగె. శచీధవుం డదికొనివచ్చి నిహతామరవ్రజ శరీరంబులం గలశామృత సేకంబుఁగావించె. అంత వారెల్లరు నిద్రనుండి మేల్కాంచినట్లు లేచిరి, ఇఁక నాఘటమందు శేషించిన పీయూషము

క్రిందికి నిష్యందంబునందె. ఇపుడీ మహాప్రవాహ రూపంబున నున్న దదియెసుండీ. అట్టి సంజీవనియగు నీయమునగంగ త్రివిధాఘ విధ్వంసిని యగుట కబ్బురంబే? ఇట భక్తితో స్నానమొనరించువారికి నపమృత్యు భయంబు గలుగంబోదు. ఇది సర్వవ్యాధిబాధాపహంబు నయ్యెడిని. బ్రహ్మహత్యాదులడంపంజాలు నీనదిప్పరంబు శ్రీమాసంగతమైనతా విది త్రివేణీసంగమంబు. ఇట వైశాఖ కార్తిక మాఘ మాసంబులం దుమఃకాలంబున భక్తిమీఱ యథావిధిఁ గృతావగాహుండైనవాఁ డిహంబున సుఖంబును బరంబున మోక్షంబును బడయఁగలఁడు. నిత్య స్నానావకాశంబు గలుగమి గ్రహణవేళల సంక్రమణ సమయంబులందును బర్వంబుల నేకాదసులందొక్కట నిందు మున్కఁ గాంచిన ననంతఫల సంపాదకంబు కానయ్యెడిని. నిత్యస్నానంబువల్ల దోషనాశమై శతాయువబ్బెడి. ఈయశ్వత్థ సమీపస్థ మనోహర తీర్థంబున స్నాతులైన మాత్రమునన మనోరథాలెల్ల సిద్ధించెడిని. కల్పద్రుమ ప్రాయంబో నశ్వత్థంబున్న తీవున సిద్ధింపనిదేది? ఏది కోరిన నది యొసంగునను సది నిక్కువంబు. ఏలన నీనశ్వత్థంబువసించు చుండును. భక్తితో నశ్వత్థసేవనంబుఁ గావించువారికిఁ గలికలుషం బంటక నాదర్శనంబబ్బెడి. అట్టి యీ కల్పద్రుమమును సంగమే శుండో సదాశివునిం బూజించి త్ర్యంబకమంత్రంబుఁ బఠించుసది. శ్రీశైలంబున మల్లికార్జునుసట్లు యీతఁ డీసంగమేశుండను సుస్థిరుండై యున్నవాఁడు. అట్టి శివునకుఁ బ్రదక్షిణము సేయవలసిన క్రమమిది: ముందు నందికేశున కెడఁగ నిడవఁ బుణ్యస్నానంబునఁ గేశోక్షిప్తి సవ్య ముగాఁదిరిగివచ్చి నందీశునకుఁ దిరిగి ప్రముఖ సోమసూత్రంబు దన కేగి చండీశుదర్శించి తిరిగి శివసన్నిధంబున కేగి సాష్టాంగంబడుచుండునది. ఇట్లు ముమ్మాఱును ప్రదక్షిణ సేసిన సౌమని వామహస్తంబున వృషాం డంబు స్పృశించుచుఁ గొమ్ముల నడుమగుండఁ దర్శనులంగలిగించు శిన్మయంబు నుండి యీసదాశివమూర్తిని సందర్శింపవలెను. ఇట్లు భక్తితోసేవ చిత్తముఁ గావించువారికి ధనధాన్యాది సమృద్ధియుఁ బుత్రపౌత్రాభి వృద్ధియుం గలుగనయ్యెడును. ఇంక నెదుటఁ గలదిమహాతీర్థము. అది

సాక్షాద్వారాణసి. నాగేశ్వరాఖ్యగ్రామంబునుండి యిట్లుద్గతంబయి నది. ఇందుంగూర్చిన యొక యుపాఖ్యానంబు గలదది వినుండు.

మున్ను భారద్వాజ సగోత్రికుండైన యొక్క విప్రోత్తముం డుండెను. ఆతఁడు నిరంతరేశ్వరారాధనంబున భక్తిమీఱ సర్వసంగ విరక్తినందినవాఁడు. ఆతనికీశ్వరసాక్షాత్కారంబు గల్గుచుండెడిది. అందందాతని డెందంబున నందనైన యానందపారవశ్యంబువల్ల నాతఁ డొడలుమఱచి సంచరించుచుండెడివాఁడు. అయ్యెయెడల నాతని వర్తనముంగన్న లోకులేదో దయ్యమాతని నాసించెఁగావలయు నను కొనుచుండెడివారు. ఒక్కెడ నీశ్వర పాండురంగాఖ్యులాతని సోద రులు కాశికేగసంకల్పించి మూటముల్లెయుంగట్టుకొని బ్రహ్మనిష్ఠుండౌ నీజ్యేష్ఠునిఁదమతో రమ్మనిరి. ఈతఁడునవ్వి కాశీవిశ్వేశ్వరుండు తన దరినుండ నెక్కడికో కాళ్ళుఱీడ్చుకొని పోనేలయనియె. వారట్లయినఁ జూపఁగల్గుదేయన 'నిదిగో చూపుచున్నాఁడ' ననుచు నిందుఁగృతా వగాహుండై సమాహితచిత్తంబున నీశ్వరుధ్యానించె. వెనువెం టనె శైవసాక్షాత్కారం బాతనికయ్యెను. అయ్యెడఁ దనయిష్ట దైవతమునకా భక్తాగ్రిగణ్యుండు కేలోడ్చియిట్లువేఁడె: 'వ్యోమ కేశా! ఇదే కాశిగాఁజేసి యీవింటు విశ్వేశాకృతి నందఱకు దర్శనం బీయవే' యన నాభక్తవత్సలుండౌ పశుపతి ప్రసన్నుండై వారణాసి నప్పిటనేర్పఱచె. ఈకుండమేమణికర్ణికయయ్యె. ఇందు విశ్వేశ్వర మూర్తి యావిర్భవించె. ఈగంగ యుత్తరవాహిని యానెడఁ గాశి పవిత్రాశితమైనది. అంత నీకుండంబునుండి జాహ్నవి పవిత్రవాహంబుమై జలంబు నిర్గతంబుగాఁదొడంగె. వెనువెంటనె కాశిలోని చిహ్నంబు లెల్ల నిందొదవెను. అపుడా యీశ్వరయ్యయుఁ బాండురంగయ్యయు నింకితరు లెల్లరు నచ్చెరువడి విధివిహితంబుగా నిట స్నాన దానంబు లంజేసి కృతార్థతఁగనిరి. నాఁటినుండి మునుతాము పిసాసిగానెంచిన యాతండు మహాజ్ఞానియని తెలిసికొని పూజింపఁదొడఁగిరి. క్రమ ముగా నాతని డాయవచ్చిన వారికాతండిది విశ్వేశప్రసాద లబ్ధంబైన కాశిగానెఱింగించి తాను గోస్వామియన నిట నభ్యర్చితుండయ్యె.

నుండి. "కావున నిదే పుణ్యరాశియగుకాశి" యను శ్రీగురూపన్యాసంబెల్ల నాలకించి స్నానాదికంబుల నతిభక్తినిగావించిరి.

అంత, స్వామి పాపవినాశతీర్థ మనఁబరఁగు దానము మునింగినమాత్ర నగ్నితృణరాశిన ట్లఘంబులన్నిటి నుగ్గుసేయఁజాలెడి దని నుడువఁదొడఁగిరి. ఇట్లుండ నటయతివరుల పూర్వాశ్రమ సహోదరి రత్నాంబ యాకస్మికంబుగా డాయవచ్చి గురుస్వాములకు సాష్టాంగ దండప్రణామంబుసేసె. గురుం డాపె దెసఁగాంచి 'అమ్మాయీ' ముస్నీవొనర్చి యున్న పాపాలనుగూర్చి యిన్నఁడైన యోచించియుంటివే?' యని యడిగిరి. ఆకె కేలు మోడ్చి యిట్లను: 'నేనబలను మూఢురాలనుగదా! నేనెంత ? నా తెలివియెంత ? నీవో, జ్ఞానదీపకుఁడవు విశ్వాత్మవు విశ్వసాక్షివి. నీవెఱుంగనిది లేదు. నాచరించిన పాపాలను గూర్చి చెప్పఁగదవే' యని వేఁడెను. అప్పుడు స్వామి యిట్లనుడివిరి: ముస్నొక పిల్లి యొకభాండంబునం దైదు కూనలఁ బెట్టెను. నీవు వానిఁగాంచక యాకుండనిండ నీళ్లువోసితివి. అవియం దూపిరియాడక నశించెను. దానఁ బంచమార్జారహత్యా మహాదోషంబు గలిగెను. ఇంకను గల' వని స్వామి యనునంతలో రత్నమ్మగుండెల్లఁ గుప్పాయత్తం బయిపోయెను. ఆపె వెఱఁగుపడి గురుపాదంబులం బడి డగ్గుత్తికపడ నిట్టులనియె: 'ఓ సహోదయాంభోనిధీ! గురునాథా ? దయఁగనుఁడు. పాపాలు పోఁగొట్టుకొన జనులెల్ల నాగాగాసి కేగుదురో యట్లు మీపాదాల నాశ్రయింప వచ్చినదానను. రక్షింపుము. రక్షింపు' మని ప్రార్థించెను. అప్పరమహంసులిట్లు పలికిరి: నీ వెన్నో పాపము లాచరించిన దానవు. వానిని జన్మాంతరంబున బాపికొనఁగలవు. ఇప్పుడే పోఁగొట్టుకొనఁ గుతూహలపడెదో నుడువు' మనిరి. ఆపె ప్రతివచించె: 'జనన మరణాత్మకంబును జరావ్యాధిక్లేశ భూయిష్ఠంబును నగు జన్మంబింకేమిటికి ? మోక్షాపేక్షతో వచ్చి మీపాదారవిందంబులఁ శరణుఁ జొచ్చినదానను. ఇప్పుడె నాయఘంబు లుడిగించి నను దేర్పవే' యని ప్రార్థించెను. అంత నగహారు లిట్లానవెట్టిరి: 'అట్లయిన నీ వీ పాపనాశతీర్థంబునం దనుదినంబును స్నానంబుఁ గావించుచుండుము,

ఇట స్నానమాత్రంబున వెనువెంటనే యేడుజన్మాలఁజేసిన ఘోరాఘ దోషంబెల్లం దుడుచుకొనిపోయెడి. ఇంకఁగుష్ఠంబుమాట చెప్పనేల?' యని తత్ప్రాశస్త్యంబుం దెల్పినంత నాభింబాధర తజ్జలంబుల స్నాన మొనరించెను. నామధారకా! యేమిచెప్పుదు? చూచువారెల్ల రద్భుతపడ నప్పుడ తద్దేహంబున నానహించిన కుష్ఠం బట్టిమాయమై పోయెను. నేను నది కన్నులారఁ జూచినవాఁడనేసుమిమ్మా. కావునఁ బాపనాశతీర్థంబు పూర్వోక్తమహిమాన్వితం బనుట కేనసాక్షిని. ఇంక నారత్నాసతీరత్నంబును దీర్ఘమాహాత్మ్యంబు గుర్తించి యటసేవసింప నెంచెను.

గురుస్వాము లాపైనఁగల కోటితీర్థంబుఁజూపి భక్తులకిట్లు బోధించిరి: 'చూచితిరా? యిందు జంబూద్వీపస్థాఖిల తీర్థంబులుం గలవు. ఇందు గ్రహణవేళలఁ బర్వంబులందు సంక్రమణసమయ ముల యందును స్నానమొనర్చిన మాత్రముననే సాలంకృత సవత్సక కోటిధేను దానఫలంబుగలిగెడిని. ఇచ్చోటి మాహాత్మ్యంబు వలన నిటనొనరింపనగు నేదానంబైనను గోటిగుణంబయి ఫలింపఁజాలెడి దగును. పైది రుద్రపాదతీర్థము. గయలోఁజేయు విధానమునఁ గర్మం బిట నెఱపఁదగ్గది. రుద్రపాదార్చనంబు కోటిజన్మార్జిత పాపనాశ కంబు. పిమ్మటఁ గేశవసాన్నిధ్యంబునఁ బుణ్యరాశియా చక్రతీర్థం బొప్పెడిని. హీనుండైన నిందు స్నానంబొనర్చినంతనే జ్ఞానంబు గలుగ నయ్యెడి. ఇంక గోకర్ణంబున మహాబలేశ్వరుం డెట్లట్లే యీయూరి తూర్పువీధిని గల్లేశ్వరుండు వెలయును. తత్సమీపస్థిత మన్మథతీర్థ మున స్నాతులై తదీశ్వరారాధనం బొనరించితిరేని మీకష్టైశ్వర్యంబు లొనగూడెడి. శ్రావణంబున నఖండాభిషేకంబుఁ గావించుటను గార్తికంబున దీపోత్సవంబు నెఱపుటను గల్లేశుండష్టసిద్ధులతోడి మోక్షంబుం బ్రసాదింపనయ్యెడు' నని యాపురుషోత్తముం డివ్విధంబున నష్టతీర్థమాహాత్మ్య వివరణంబుఁ గావింప నాలించిన భక్తు లెల్ల రానందంబున గురుసంస్తుతిఁ గావించి యిట్లనిరి: 'స్వామీ!

యీతీర్థంబులం దింతటిమహాత్మ్య కలదని యింతనుక మేము గుర్తింపనైతిమి. నేటికిఁ బ్రకాశితమైనది. భవదీయావ్యాజ కృపావిశేషంబున మేము పునీతులము గాఁగలుగుచున్నాము. ఇట్టి తీర్థరాజంబులు దరినుండ దూరమునకుఁ బోనేమిటికి?' అనుచు వారందరు స్నానదానాదులొనరించుటం గృతార్థతఁగనిరి. గురువులు మఠంబునకుఁ జేర నాఁడు చేసి భూరిసమారాధనంబు గావింపఁబడెను' అని సిద్ధుండువలికె.

### భ క్తి కాం డ ము — ౧౩ ద ళ ము .

ఉత్తర కథాశ్రవణోత్కలాలస మానసుండై సాగరనామునకుఁ గృతార్థీభూత శ్రోత్రయుఁ డాతపస్వి యివ్విధంబునం దెల్పె: మున్నొక్కెడ గురుసేవకుండై యుత్తరభవంబునఁ బ్రాభవంబునందు సుపాత్రవరుండైన నిర్ణేజకుండు వైదూర్యనగరంబున మ్లేచ్ఛభూజానియై యేలుచుండెను. ఆయేలిక గజతురగ పదాతిసైన్య సమృద్ధిగలిగి సర్వసంపత్తులం దులఁదూఁగుచు నిత్యసంతోష నిలయుండన వెలయుచుండె. అతఁడు ప్రాగ్జన్మ సంస్కారంబువలన దాన ధర్మరతుండును బ్రాహ్మణ భక్తుండునై తీర్థంబులకును దేవాలయంబులకును నెట్టి యుపద్రవమును గల్పింపనివాఁడయ్యెను. మ్లేచ్ఛమతగురువు లాతని కిట్లుపదేశించెడివారు: 'రాజా! మన కాదేవబ్రాహ్మణులు నింద్యులైరి. తద్భజనంబువల్లఁ బాతకమాయెను. విమతసహనంబొప్పునా? స్వమతధర్మానుష్ఠానంబే పుణ్యసంపాదకము గాదా? బాఁపనవాండ్రు మూఢులు మూర్ఖులుంగదా! కానున్నఁ గట్టెలను ఱాలను మ్రొక్కుదురా? వారికేది యగపడిన దానినే యుపాసింతురాయె. ఒకటా? ఆవు నిప్పు నీళ్లు నామండిపోవు సూర్యుఁడు నందఱు దేవతలా? నిరాకారుండౌ నీశ్వరుని సాకారునిఁగా నెంచువారిని గౌరవించుటవల్ల నధోగతి కాదా?' యనుచుఁ బరిపరి విధాల నెవరెవరు నూరిపోసినను బాటింపక పూర్వసంస్కారవశంబున ధార్మికచింతనము వీడకుండెను. అతఁడు వారికిట్లుపన్యసించుచుండెడివాఁడు. ఈశ్వరుఁడు లేనిదెయ్యెడ? తృణకాష్ఠంబులందు మాత్రము లేఁడనుకొన్నారా? తానే

స్థావర జంగమాది వికారంబులుగా నేర్పడి సర్వవ్యాపియై యుండెడిఁ గాదే? మాయామాత్రాగ్రహంబువల్ల భేదబుద్ధివల్లఁగాక మఱేమి? పంచభూతాత్మకంబై ధర్మమర్యాదా సహితంబైన జగంబు నడ తెగక నడపునీశ్వరుఁ డొక్కఁడె కాక వారికొక్కఁడు మనలకు మఱొక్కఁడునా? అటికలుఁ బ్రమిదలు దాకలు మున్నగురూపము లెన్నిటి నందిన నొక్కమృత్తికయొక్క కారణాత్మత నెట్లో యట్లే వికారము లేవైనను సత్త్వంబు వీడనేర్చునే? కనుపున నొదవులెన్ని వన్నెల నున్నను బిదికినపాలెల్లఁ దెల్లగా నుండుచందముననే యిందలిచిత్తు. నగలెన్ని రూపులొందిన బంగారము గాకుండునా? అట్లే విశ్వమెన్ని రూపముల నగపడిననేమి? ఘటములవల్ల నాకాశమునలెనే దేహము లెన్నియైన నాత్మ భేదింపదు. కడవలోపలి నీళ్లలోని ప్రతిబింబము నందు వికారమొదవినట్లు గానుపించినను చందురునం దేవైకృతమేని దృశ్యంబయ్యెడినే? ఆత్మయునట్టిద. ఏకైక జ్యోతివల్ల నభిన్న జ్యోతి సహస్రం బెట్లువెలిఁగింపఁ బడెడినో యట్లే యఖండైకరసంబును సచ్చిదానందమయంబు నద్వయంబునగు పరబ్రహ్మంబు జగత్కారణంబై ప్రకాశించుచున్నది. ఒక్కదారాన గ్రుచ్చఁబడిన పెక్కుపూసలవగిది నెన్నినామంబుల నెన్నెన్నిరూపంబుల నొప్పిన నేయొక్క సూత్రంబునందుఁ బ్రోతంబులయ్యెనో తదధీనంబులుగాక వేఱైన నలనువడునే? అట్లే యన్నిజాతుల జంతుకోటిని బాలించు దైవమొక్కఁడే యాకసమువలె దేనినంటక సాక్షియై యున్నాఁడు గాదె. అయ్యదిగుర్తింపఁ జిత్తశుద్ధి కలుగవలెను. అట్టినిర్గుణ బ్రహ్మనిష్ఠకు సాధనమే సగుణారాధనము. కావుననే ఱాలతోను గొయ్యలతోను జేయఁబడిన బొమ్మలను దైవములుగా భావింపవలెను. అల్పబుద్ధులకు నిర్గుణబ్రహ్మంబు ధ్యానగమ్యంబు గామిఁ బ్రతిమాపూజనం బావశ్యకం బనకతీఱదు. సమదర్శనులౌ పండితులకుఁగాని యాత్మ భావన యొదవనేరదు. నారాయణుండు విశ్వాత్మయౌట భక్తులు తమతమ మనములకు నిలుకడఁగలిగించికొన నేదో విగ్రహమునందు లక్ష్యంబు నిలుపుచుండు రందెల్లఁ బానుష్ఠవాఁడేయని యెన్నఁదగ

నది. ఎయ్యెడ నెవ్వని కేవిధమగు భావసమొనరెడి నయ్యెడ నవ్వాని కావిధముగా ఫలింపఁ గలిగెడిననుట నిక్కువము. కాఁబట్టి యెవరి మతము ననుసరించి వారు ధ్యానించుచుందురు. అదికని యొరులు వారియెడ ద్వేషమూని నిందింపఁగూడదను. ఎవరి కేపథము విహితమై యుండు నదియె యనుసరణీయ'మను తన నిశ్చయము వారికెఱింగించి యుంపి దేవబ్రాహ్మణ భక్తివిశ్వాసంబులు దీపింప ధర్మమార్గానుసారియై రాచఱికంబు నిర్వర్తించుచుండెను.

ఒక్కెడ దైవయోగమున నాతని యొంటిభాగమున రాజస్ఫోటక చిహ్నంబు కానుపించె. ఎందఱు వైద్యులద్దాని నెన్నెన్ని చికిత్సలఁ గావించినసది యుపశమింపదయ్యె. దాన నాతండెంతయుఁ గ్లేశంబునొందుచుండెను. ఇట్లుండ గంధర్వపురంబునందు శ్రీగురుండు తనలో నిట్లనుకొనెను: 'మ్లేచ్ఛాధిపుఁడిపు డిటకురానెను. ద్విజులు దానఁ బీడాకరముగా నెంచనగును. మాహాత్మ్యమా గుప్తంబలు భంగుల లోకులకు వ్యక్తమయ్యెను. ఇఁకనిట నుండఁగూడదు. ఖ్యాతి విశ్రుతంబౌటఁ గ్రమముగా నన్య మ్లేచ్ఛులును రాఁమొదలిడుదురు. కావున నింకనంతర్ధానంబుఁగను సూచితము. బహుధాన్యనామ సంవత్సరమున బృహస్పతి సింహరాశి గతుండవును. గౌతమీ పుష్కర సమయమౌటఁ దన్నదీస్నానంబు కర్తవ్యంబని యిటనుండి వెడలెదఁ గాత'మని నిశ్చయించికొనియె. అంత స్వాములవారు భక్తబృందంబు సేవించుతఱి నొక్కనాఁడిట్లనిరి: 'ప్రియశిష్యులారా! మ్లేచ్ఛభూపతి యిటకు రానున్నాఁడు. మీరెవరి నివాసములకు వారేగుఁడు. నేను గౌతమీ యాత్రకేగెద' నన్నంతనే వారెల్ల నేకకంఠ్యంబుగా నిట్లు బదులువల్కిరి: 'మహాత్మా! యే మ్లేచ్ఛులుగ్లేచ్ఛులిటకు వచ్చిన నిచ్ఛాధర్మహాని కలుగఁబోదు. సాక్షాద్దత్తమూర్తీ! శ్రీగురుమూర్తీ! మాకార్తి గలుగనీయకువే! నీయుండనుండ మాకేమి భయము? మీపాదాలువిడిచి మేమక్కడికిని బో'మనుచు నింతయు దలఁచినంత నటనేయుండిరి.

ఇట్లు బురాకృత సంస్కారంబున సన్మతియై యా నృపతి తన కేర్పడిన స్ఫోటకపీడఁ బాపుకొన నన్ని లేపంబులవల్లంగాని సదాచార సంపన్నులౌ విప్రులఁ బిలువనంపి రుజాపనోద నోపాయం బెఱింగింపుఁ డని వారినడిగె. వారాతనికిట్లు తెలిపిరి: 'నరేంద్రా! ప్రాగ్జన్మంబునఁ జేసియుండిన పాపంబిప్పుడు వ్యాధిరూపంబున బాధించుచుండెడిని. తచ్ఛాంతికై తీర్థాటనంబును దైవారాధనంబును దానాదికంబులుం గావింపవలసి యుండును. లేదేని సాధుదర్శనంబునను దద్భజనంబునం గూడ రుజాక్లేశంబు వోవనౌను. ఏలన మహాత్ముల వీక్షణంబున వ్రష్టి జన్మార్జితాఘంబు లడంగఁగలవు. ఇట్టి స్ఫోటకము మాను టొకలెక్కా?' యనవిని యాభూరమణుం డిట్లువారిని బతిమాలు కొనెను: 'బ్రాహ్మణోత్తములారా! వీఁడు తురకవాఁడని యుపేక్షింపకుఁడు. మీదాసునిఁగా నెంచుఁడు. ప్రాగ్జన్మంబున నేను గురుసేవఁజేసియుంట నాకిప్డీ రాజపద మబ్బినదిసుండీ. అంతను మున్నొనరించిన పాపఫలమునఁ గలిగిన దీమ్లేచ్ఛజన్మము. పండితులారా! మహానుభావుల దృష్టిసంప్రసారమాత్రముననే రుగ్మతవాయఁ గలదనుచున్నారుగదా. అందులకై దెనఁ దార్కాణకలదా? నాకందు విశ్వాసము కల్గుట కొక్కనిదర్శనము కావలయు' ననెను: అంతనాద్విజులొకరిమోమొకరు చూచుకొనిరి. అందొక్కండు సాహసించి యిట్లు తెలిపె: 'నృపాగ్రణీ! మీరడిగినది గోప్యార్థము. మేమో బ్రాహ్మణులము. అడిగినమీకో విమతస్థులరయితి' రన విని 'అయ్యో! నాదేజాతియైననేమి? బ్రాహ్మణపూజ సలుపువాని నన్నుద్ధరింపరే' యని వేఁడెను. దానినాతం డనుత్తమమానసుండని తెలిసికొనఁ గలిగిన ద్విజోత్తములు 'రాజా! నీవేదేని నిమిత్తము కల్పించుకొని యురుతెలుంగసుండ నొంటిగఁ బాపనాశతీర్థంబునకేగి యచ్చో స్నాతుండవై యుండేని నీకౌనదగు'నని యుపదేశించిరి. భూసుర వాక్యను దాశిరమునఁ దాల్చువాఁడై నిజసేవకులనుడించి తానొక్కండ తత్తీరంబునకేగి కృతావగాహుండై రహస్యముగా నట వసించుచుండెను.

పాలుని జ్యేష్ఠభార్యగర్భంబున జన్మింపనయ్యె. రాజు మహోత్సాహంబున జాతకర్మములు నెఱపెను. ఆతని రెండవభార్య తన సవతికిఁ గొడుకుఁగని సహింపలేనిదై మత్సరమూని వేఁకటియాతటి నాపకు గుప్తముగా సర్పగరళంబిప్పించెను. దాన నామె కొడలెఱుఁగని స్థితి సంభవించెను. వెంటనే తగుచికిత్సకావించి యది వెడలించుట నాగర్భిణికిఁగాని తద్గర్భస్థ పిండమునకుఁగాని ప్రాణాపాయము మాత్రము సంఘటింపలేదు. తుదకామెయెట్లో ప్రసవించె. కాని పుట్టిన శిశువున కాపాదమస్తకము వ్రణభూయిష్ఠమయ్యెను. వాఁడు గాత్రవ్రణంబవల్లనపరిమితబాధచే నిద్రలేక రోదనము సేయుచుండెడివాఁడు. ఱేఁడు విషకీలాదగ్ధ సర్వాంగుని నిసువును దత్ప్రయోగజర్జరితదేహసౌష్ఠవయగు నాప్రసువునుంగని చింతాక్రాంతస్వాంతుండై యిచ్ఛగా వెచ్చించి దిగ్దేశభిషఙ్మణుల రావించి యెన్నెన్ని చికిత్సలనో కావింపఁజేసెను. కాని దేనివల్లను దన్నివారణము కాకపోఁగాఁ దల్లికిం బిల్లగానికినొడలెల్లఁ బుర్వులువడెను. దాన వారత్యంత దుఃఖితులై స్నానపానాలుడిగి నానాఁటికి క్షీణింపఁజొచ్చిరి. తుదకా రాజు విసువొంది తనలో నిట్లనుకొనెను: ‘చీమును గబ్బునీరునుగాఱుచున్న యీ బీభత్సాకారులఁ జూడరోఁతపుట్టుచున్నది. లోకములోఁ గల మందులెల్ల వాడఁగా నిష్ప్రయోజనములయ్యెను. ఇఁక దేనివల్లను మానఁగలదను నాసయులేదు. వీరేవో మహాపాతకాలుచేసినవారై యుందురు. ఇట్టి పాపాత్ముల మొగములంజూడరాదు. వీండ్రవంకఁజూచినవారికిఁగూడ దుఃఖముగలుగుచుండును. ఎవరుచేసికొన్న పాపకర్మఫలము వారనుభవింపకతీఱదు. ఇతరులకుఁగూడ వీరివల్లఁ బాపాలుచుట్టుకొనకుండ నావలికి నెట్టుటమే’లని వితర్కించి సూతుం బిలిచి వారినుభయుల నిర్జనారణ్యంబునకుం గొంపోయి నిశ్శంకముగా వదలించి రావలయునని యాజ్ఞాపించెను. వాఁడేమనలేక తదాజ్ఞాబద్ధుఁడై రుజార్తుల నాతల్లిని బిల్లవానిని రథమున నెక్కించుకొని యూరుదాఁటించుకొని పోవుచుండెను. తద్బాంధవానీకంబును దాసీజనంబును గొల్లుమనిరి. పురాంగనలం గనులఁ దడివెట్టుకొనివారు

నితాంతము విత్రాసపడ్డ యాసతీమణి మతిం గలగుండువడి యొడలు మఱచి ముక్తకేశియై రోదనముసేయుచు నెటో పాఱంజొచ్చె. తుద కటునోసంబోవ నొక్కట దూరానఁ బసులు కసవుమెసవు జాడ కనుపట్టె. ఆయమ్మ గోనికాయమ్ము పొదకట్టినంతనే తావులు దప్పిన ప్రాణిసమ్మలు యథాస్థానమ్ములంజేర నెమ్మదిగా గోపాలుర డాయఁ బోయి దప్పింగొన్న బుడుతని పెదవులంబడుప నీళ్లెటదొరకునని యడిగెను. వారాచేరువనున్న యూరికి దారిఁజూపిరి. ఆయిల్లాలు మెల్లఁగా నాగ్రామముంజేరి యచ్చోఁ గానుపించిన నారీమణులం దొక్కెతం బిలిచి యిది యెవ్వరిరాజ్యమని యరసెను. ఆసుందరి యామందయానకిట్లు తెలిపె: 'అమ్మా! పుణ్యాత్ముండును దయాళువునౌ మహాఘనుండు పద్మాకరుండను వైశ్యరత్నమిటఁ బాలించుచున్నాఁడు. అతఁడు నిన్ను నీబిడ్డనిఁ బోషింపఁగలఁడనుచుండెను. ఇంతలో రాజధానీజనంబు లటువచ్చి యాపెవృత్తాంతమెల్ల నారసి తెలిసి తమయొడయని సన్నిధికాచానంగూనను గొంపోయిరి. పద్మాకరుండును వారిని సాదరంబుగా నంతఃపురాంగనలకడకుఁ జేర్పించి యన్నపానీయ విశుద్ధవస్త్రాదికంబు లిప్పించి సేదఁదేర్చెను. పిదప నాతఁడు రాణ్మహిషీద్వారంబునఁ దత్సాధ్వీవృత్తం బారసి తెలిసి మిక్కిలి జాలింగొని యాపెయెడ మాతృభావంబూదవ సగౌరవంబుగాఁ బోషించుచుండెను. ఆకృపాళువు నిజాస్థానంబునఁ గలవైద్యులతో యోజించి యౌషధాలు నిప్పించెను. ఏమైనను వారివ్రణబాధ పెరిఁగెనే కాని తఱుఁగదయ్యె. ఆపసికూన నానాఁటికిక్షీణించి తుదకట నసువులఁ గోల్పడె. తనప్రాణాలు వానిమీఁద నిలుపుకొని కాలక్షేపము సేయుచుండిన యాతల్లి దురంత చింతాక్రాంతయై మూర్ఛిల్లినేలకువ్రాలెను. ఆకిరాట రాట్పతీనివహం బెన్నోవిధాల నామెనోదార్పఁ జూచినను దనపూర్వస్థితిమతికిరాఁగాఁ బెల్లుకొనివచ్చు దుఃఖవీచికాపరంపరలలో నిట్లు వాపోవఁజొచ్చెను: 'నాకన్నతండ్రీ! రాజకులైకపూర్ణేందు బింబమా! నామీఁద నీకు దయదప్పెనా? కుమారా! నాకానందకందమవై నన్నుద్ధరింపఁగల వనుకొంటినే! నాయనా! నన్నువిడిచి నీవెక్కడికిఁ

పుట్టువులఁ జేయంబడు కర్మము ననుసరించి వారి వారి సుఖదుఃఖ ఫలానుభూతి కలుగుచున్నయది. కల్పాంత పరిమితాయుర్దాయము గలిగినవారైనను తుదకు మరణము నందితీరవలసియుండఁగా నించుకసల్పాయువులౌ నీమనుష్యమాత్రులమాట చెప్పనేల? కావుననే నీవింతో తెన్నఁడును బుత్త్రుఁడు పుట్టినందుల కానందమ్మునుగాని తన్నాశమ్ము వల్ల శోకమ్మునుగాని పొందరాదమ్మా. పుట్టుటతోడనే గిట్టుట యేర్పడెఁ గాదే. బాల్యముననో తారుణ్యముననో కాక వార్ధక్యమందో మిత్తి నెత్తినెక్కకమానునా? భూమిమీఁదఁ బడ్డది మొదలుగా నేర్పడెడి యీపుత్త్రాది సంబంధమున లోకులు మోహపాశంబులం జిక్కువడుచుందురే కాని విధిదాఁట నెవరివశము? అమ్మా! యస్థిరమగు నీకట్టెను బట్టుకొని యేడ్చుటకంటె నెట్టితన మున్నదా? ఇంతి కంటె నీశ్వరనామస్మరణ మొనర్చిన నిహపర సాధకముగాదా? కాని జీవులకుఁగల యన్యోన్యానుబంధము నీయుత్తమమందేని నీవు తొంటి పుట్టువున వీనికేమైయుంటివో చెప్పఁగలవా? పోనిమ్ము. నీవపుడెవ్వరి పట్టివో నినుఁ జేపట్టిన దెవ్వరో తెలియుదే? లేదే. ఇఁక నైన నామాటలు నీమనమున కెక్కించికొని యూఱడిల్లు మూఱడిల్లు' మను నాయతిబోధ నాలకించిన యాలలనామణి కేల్మోడ్చి యా జడదారి కిట్లనియెను: 'మహాత్మా! ఒకమహారాజును జేపట్టినదానఁ బుడమిఁగలిపిపట్టి. అడవులపాలైనను దలిదండ్రులఁ గోల్పోయినను బిడ్డనిపిడుగుపాటుకాదా నేనుభూమియందు మనుచుంటిని. అట్టి నాయీ బంగారు తండ్రిని గాను నేనింకేమందును? స్వామీ!' యనుచుఁ దద్యోగీంద్రు పాదంబులం బడెను.

అట్లు నిర్విణ్ణురాలై యున్న యాయన్నుమిన్న మొగం బరిసన్నుండైన యాముని శేఖరుండు ప్రేతమూర్ధంబున భస్మము చల్లి మంత్రించి యుంచెను. అహో! యేమి యాముని మహత్త్వము! కార్య కారణ రూపంబుల పంచభూతంబుల కందనుసంధాన మొనరె. గత ప్రాణుండైనవాఁ డప్పుడె లేచికూర్చుండెను. ఇంతలో నేమియా మార్పు? మున్నిహలోకస్మృతి నుండినవాఁ డప్పుడు దివ్యదేహంబుతో

వెలిచి ప్రతివలుకర్రి. తాను దద్దర్శనార్థినై వచ్చినవాఁడ నాతఁడేడ నేడనని యాస్థలోడ నాఁడేఁడు పృచ్ఛసేయుడు వారనుష్ఠానార్థము సంగమంబున కేగిరనియు మధ్యాహ్నమున మఠంబునకుఁ దిరిగి రాఁగల' రనియు బదులువలికిరి. మనుజాధిపుఁ డదివిన్నంతనే నిజ పరివారంబెల్ల నటడించి తానొక్కండ గురుదర్శనార్థము సంగమ తీరంబునకేగి దవ్వున స్వామినిగాంచి పాదచారియై డాయఁబోయి భక్తితోఁ జేతులుకట్టుకొని దూరముగా నిలువఁబడెను. గురుస్వాము లానృమునిఁ దెసఁ గన్నంతనే, 'ఓరీ, సేవకా! నిర్ణేజకా! ఇన్నాళ్లె క్కడ నున్నావు? చాలకాలమున కగపడితి' వనిరి. సమాగత భూనే తకుఁ దద్గురువాక్కులు శ్రుతిపుటగోచరము లయినంతనే పూర్వ జన్మస్మృతియబ్బె. ఆనందబాష్పములు వెల్లివిరియం బ్రణమిల్లి యొడ లెల్ల రోమాంచమొదవనేమేమోపలుకఁబోయి విహ్వలుఁడై పాదుక లంబడి కొంతవడికుఁ దెప్పిఱి గద్గదస్వనంబున నిట్లు మొఱ్ఱవెట్టె: 'స్వామీ! యీదీనుని నుపేక్షింపనేమిటికి? మీపాదసేవ విడిచి దూరస్థుఁడనై పడియుండఁజేసితే! ఆహా! ప్రమత్తుండనై మాయాజాలం బునం జిక్కి మిమ్ము మఱచి యెంతకాలము కడపితిని! భవదీయ దివ్య పాదాబ్జసంస్మరణంబె దుర్లభంబై పోయెఁగా. తుదకెదుటికి వచ్చియు మున్నర్చించిన మీ నిర్మల చరణంబులనే గుర్తింపఁ జాలనంతటి మూఢుఁడనై పోయితినే! రక్షకా! భక్తుల నేనాఁడు నుపేక్షింపని వాఁడవు. నన్ని యజ్ఞాన మహాసముద్రి నిక్షిప్తుంజేయ న్యాయమా? ఇందనుకనైన యనుభవము చాలుఁ జాలు. తండ్రీ! ఇఁక మీపాదాలు వీడను. నన్నుద్ధరింపుఁ డుద్ధరింపుఁ'డని మొక్కఁజొచ్చె.

ఇట్లు తొయ్యస్థలో వేఁడువానింగని గురుమూర్తి 'యఖిలాభీష్ట సంసిద్ధిర' స్తని దీవించె. ఆనృపతియుఁ దనయంకంబునం దేర్పడిన స్ఫోటకమువలని వ్యథఁ దొలఁగింపఁ గృపాదృష్టిప్రసారం బపేక్షిం చెను. స్వామి, 'యేది? చూపు'మనఁగా నొడయఁడు తన తొడ వంకఁ జూచుకొని స్ఫోటక చిహ్నంబే కానరామి నత్యాశ్చర్యంబు నంది యానంద పారవశ్యంబునసాఁగిలఁబడి శ్రీగురుమూర్తి నిట్లభ్య

మొనర్పుము. లేకున్న లోకనిందపాలౌదువుసుమీ. దేశాధీశుఁడవౌ నీవొక బాపనసన్నాసికి దాసుఁడవై మెలఁగుచున్నట్లెవరైనఁ జూచిన నవ్వుదురు. కొలమువారును దూషించి పరిహసింపరే?' యను స్వామి వచనములకు దాసీభూత మ్లేచ్ఛేశుం డిట్లు బదులువల్కెఁ: 'బాబూ! నేనింకెక్కడి యేలికను? మీపాదసేవకుఁడనౌ చాఁకలినిగానా? స్పర్శవేధి స్పర్శంబువల్ల లోహంబునకుఁ బ్రకాస్తి కలుగు భంగి మీకృపావీక్షణంబునఁ బవిత్రుండనైతిని. సర్వేశ్వరులరు మీరయి యుండఁగా నాయీశతయేడ? నేను దేవరవారి భృత్యుండనే కాని వేఱేమియుం గాను. నాయందలి దయచే నిప్పటికైనఁ బునర్దర్శన మొసంగితిరి. ఇదియే మహాప్రసాదము. మిమ్ముం జూచినమాత్రాన నామనోరథాలెల్ల నెఱవేఱెను. ఎవరో యేమో యనుకొందురని యిట్టి మహాత్ములు గురుమూర్తులరు మీపాదసేవఁ గావింప మానుదునే?' యనుచుం గొనిపోయి వారికిఁ దానవ్వాలడించివచ్చిన తన చతురంగబలమును మహైశ్వర్యంబు నగపఱచె. గురువు లానందించి యానృపునితో 'మనము చాలదూరము పోవలసియున్నది. నామాటవిని యిఁకనైన గుఱ్ఱముపై నెక్కు'మనిరి. ఱేఁడును దత్రిత్యులా గురుశిష్యుల ననుసరింపుఁడని యుచితవాహనారూఢులం గావించి తాను నొక్క హయంబుపై నెక్కి గురుదర్శనాత్త మహానందంబున స్వారిఁజేయ సాగె. కొలఁదిదూరము కడచినవెనుక స్వాముల వారా రౌతును డాయఁబిలిచి యిట్లనిరి: 'ఓయీ! మ్లేచ్ఛజన్మమునందియు నాయందమిత భక్తితో మెలఁగుచున్నవాఁడవు. సంప్రీతుఁడనైతిని. కాని సన్న్యాసినై నేను నీతో ననుగమించుటవల్ల నాకుఁ ద్రికాలానుష్ఠానము సక్రమముగా నెఱపికొన వలనుపడకుండెడు. కావున నన్ను ముందుగాఁబోనిమ్ము. మీరందఱు నెమ్మదిగా రానచ్చును. నన్నుఁ బాపనాశ తీర్థంబునఁ జూడఁగల'వని నుడివి నిమేషంబునం దిరోహితులయిరి. అంద ఱబ్బురపాటున నిటునటు చూచిరి. 'స్వాముల వారేమై' రనుకొనిరి.

రింపఁబడిన నిజపుర మార్గంబున ధర్మమయాందోళికారూఢ శ్రీగురుమూర్తి నూరేగించుచుఁ దాను పాదచారియై యడుగడుగున రత్నదీపంబులతో నీరాజనంబులిడుచు మహోత్సవంబున నూరేఁగఁజేసె. ఈతని నడవడి కిడుగడవడిన యవనులం బెక్కుఱు తమయొడయఁడు స్వధర్మంబువీడి యనాచారుండై తాము మోమైనఁ జూడనోడెడి బాఁసనవాండ్ర సేవగావింపఁగడంగనేయని యేవగింపఁజొచ్చిరి. విప్రులో 'యీభూపుఁడు పుణ్యాత్ముఁడు. కావుననే దేవబ్రాహ్మణ భక్తి విశ్వాసములతో మెలంగుచున్నవాఁడు. జ్ఞానియై బ్రహ్మద్వేషి కాని పుణ్యశ్లోకుండా నీతేనిపాలనంబున మనకు మేలయ్యెడు? నని పొంగుచుండిరి. ఇఁకఁ బౌరులెల్లరు స్వాముల కతిభక్తితో నారతు లర్పించుచుం బ్రణమిల్లుచుఁ దమయేలిక వెంట నడచుచు వింజామర వీచుచుంట కబ్బురపడి యిట్లనికొనఁ దొడంగిరి: 'పీ రెవ్వరో నరమాత్రులుగారు. దేవాధి దేవతలు గావలయు. కాదేని మ్లేచ్ఛ భూనాథుని చేతనేమి యొక బ్రాహ్మణుఁ డిట్లర్చనల నందుటేమి? ఏమైన నిది కలికాల విపరీత ధర్మ' మనుకొని నివ్వెఱపడఁ జొచ్చిరి. ఆ యపూర్వోత్సవంబుం జూడఁ గన్నుల పండువుగా నుండెను.

సీ. అడుగడుగునన్గ్రింద ♦ మడుగులఁ బఱచుచు,
రజకాళి దెసలను ♦ రహిఁబరువిడ
ఢక్కా మృదంగము ♦ ల్డమ్మారము లనేక,
వాద్యంబు లందందుఁ ♦ బరఁగుచుండఁ
బ్రాజ్య మాతంగతు ♦ రంగ శతాంగపా,
దాతములెన్నక ముం ♦ దఱలసాగ
వందారులావంది ♦ సందోహములు స్తోత్ర,
పాఠంబు లొకవంకఁ ♦ బలుకుచుండ

తే. సగరు ధూపంబు లింపుగ ♦ నెగడుచుండ
మల్లి కాసూన వృష్టులు ♦ వెల్లివిరియఁ
బ్రభుఁడు గుప్పిళ్ల రత్నాలు ♦ ప్రజల గుప్ప
నంతి పురిఁజేరె వైడూర్య ♦ మందు గురుఁడు॥

ఱేఁడును స్వామిని నిజ హార్మ్యాంగణంబున శిబికావరోహణంబు గావింపఁజేసి యెల్లర నటఁడించి దివ్య వస్త్రాచ్ఛన్న మార్గంబున లోనికిం గొంపోయి నవరత్నఖచిత సువర్ణ సింహాసనంబున నుపవిష్టుండుగా సాష్టాంగ దండప్రణామంబునొనరించి తానుపింఛామగము వీచుచు నిలిచె.

అట్టియెడ భూషితానేక మణిభూషణాలుం గనత్కనకాంబర ధారిణులున్న వేణీవిరాజిత శేఁటివిలోచన లాభాపాల మహిళా సమూహంబులు లీలావిలోల మందగమనంబులం జనుదెంచి యతివర పర గార విందంబుల నిర్మిళిందంబులయి యుప్పిరి. శ్రోత్రియుండంత నిజ పుత్త్రీ పుత్త్రాదులను రావించి గురువులకుం బ్రణమిల్లఁజేసి చేతులు కట్టుకొని తాను హీనజన్ముండనయ్యు గురుకృపఁ బడయఁగల్గుటం గృతార్థతఁ గంటిననియె. నరహరు లానపర్యలకుం బరమానందంబు నంది వారినెల్లర దీవించి, నరవరునుద్దేశించి తదభీప్సితంబు నిశ్చింతంబుగాఁ బల్కుమనిరి. ఆరాజు తాననుభవించిన భోగంబులకుం దనిసితిననియుం దానుగోరఁదగ్గది నిరంతర గురుపదసంసేవనంబ యనియు మనవి యొనరించెను. అదివిని ముదమొందిన యాసద్గురుండు 'రాజ్యభారంబుఁ దనయులందుంచి శ్రీశైలంబున కేగిన నటఁబునర్దర్శనం బయ్యెడు'ననియె. ఇఁక గురుమూర్తులయెడఁ బాటు సహింపలేని యాభూజాని జ్ఞానదానంబున నేని నిరంతర గురుస్మరణంబుఁ బ్రసాదింపుఁడని వేఁడ నాప్రోడ యట్లనుగ్రహించి దీవించి నిజశిష్య సమేతుండై గోదానదీస్నానంబుఁ గావింపఁబోయె. స్వామి యాహ్నికృతావగాహుండై తిరిగి భీమామరజా సంగమంబుం జేరెను.

అట్లుగుదెంచిన గురుమూర్తులంగని వికటాద్యులైన గంధర్వపురవర్తులెల్లరు నారార్తికంబులంగొని యెదురేగి కొండికాలంబు నిరీక్షణంబయిన గామపురవరం బిప్డు సంప్రాప్త ధన్యంబయ్యెనని పలువిధంబుల సంస్తుతించిరి. అయ్యెడ నరసింహ సరస్వతులా భక్తబృందంబుల కిట్లుపన్యసించిరి: 'శిష్యలారా! నేనిక్కడికి బోయితినని యెన్నఁడు ననుకొనకుఁడు. ఈపురము నాకత్యంతప్రియము.

నన్ను నిశ్చల భక్తితో నిటఁగొల్చువారి కెల్లెడఁ బ్రత్యక్షమగుచుం డుదు. ముందిఁకఁ గలి కలుషంబుల కియ్యెల తావలంబుగానున్న దాట నేను శ్రీగిరికేగనెంతు. అయినను భక్తహితార్థ మిచ్చో గుప్తముగా నుండకపోనుసుండీ. గుప్తతఁ గననేమందు రేని వినుఁడు. రానున్నవి కష్టదినాలు. ధర్మ మాదినమున కాదినము క్షీణమైపోవు చున్నది. క్రూరాత్ములు ప్రబలి దుష్కర్మము లనేకములుగావింప నున్నారు. పూర్వజన్మ సంస్కార వశమున యోగ్యతఁగన్న యొక మ్లేచ్ఛ నృపాలుఁడు నాయనుగ్రహమునకుఁ బాత్రుఁడైన వార్తవిని హీనులందఱు నిటఁ జేరవత్తురు. దానివల్లఁ గీడు సంభ వించును. కావున నాకిఁకఁ దిరోధానంబుఁగనుట కర్తవ్యం' బనఁగా విన్న తత్పౌరజనమ్ములు చింతాక్రాంత మనమ్ములతో నెటవారట బొమ్మలై నిలిచిరి. నరాకృతిం గానుపించుచుండిన యా సాక్షా త్త్రిమూర్తి యట్లు తిరోధానంబు నందియు నందే గుప్తరూపమ్మున సుస్థిరుండయ్యెసుమ్మా'యని తద్గురు ప్రియశిష్యుఁడా సిద్ధవరేణ్యుఁడు నామధారకున కెఱింగించెను.

ఇఁక సరస్వతుల బోధవినుఁడు: 'ఈగంధర్వ పురంబున నాముక్తిప్రదాత యిప్పటికింగలఁడు. అందుల కేనసాక్షిని. ఆభావి కేష్టార్థప్రదుం డటసుస్థిరుండని యాశిగానమ్మి భజింతురే నచిరంబున మీకోరిన దైతీరెడినిసుండీ. యుగాంతరంబుల నెన్నివేలయేండ్లు తపంబొనరించినం గానరాని యాత్రిమూర్తి యిప్పుడు కల్పవృక్షంబై యిచ్చో నిలుచుననుట నిస్సంశయము. ఆహా! అంతకంటె భుక్తి ముక్తికి నాదరు విం కేడ లభించెడిని? పాఠకులారా! నిశ్చలభక్తిం గొల్చి తరింపుఁడు. తరింపుఁడు.'

## భక్తికాండము — ౧౪దళము.

నామధారకుండు సిద్ధయోగీంద్రుని 'స్వామీ! మ్లేచ్ఛ రాజపూజితులైన శ్రీగురుస్వాముల తదనంతర వృత్తాంతంబు నా కెఱింగింపరే'యని ప్రార్థింప నక్కథకుండు వలుకు: 'ఛాత్రలోకైక గణ్యా! అగణ్యపుణ్య సంపాదకంబు నఖిలాఘ విధ్వంసకంబును

గననోను నుండీ. ఎట్టి చింతలు గలవారు నిచ్చోఁ జింతామణి న్గణ నాథు నారాధించుట విఘ్నశోకనాశంబు గానయ్యెడు. అష్టతీర్థ స్నానంబున సర్వసిద్ధులొదవి ముక్తిచేకుఱు. ముప్పొద్దులఁ బాదు కార్చనంబు సలిపి నీరాజనంబిడి నన్ను నిర్మల మనముతోఁ దలఁచిన మాత్రమున నేది కోరిన నది యయి తీరెడినుండీ,' యని బోధించి శ్రీ గురుస్వాములు నలుగురు ముఖ్య శిష్యులతో శైలయాత్ర సాగించిరి. తద్భక్తులు చేతులు గట్టుకొని వారిని జూపుమేర దూరం బునఁ గనఁగలిగి నంతవఱకుఁ జూచి చూచి తత్పాదపద్మంబులనే నెమ్మది న్నిలిపి వెనుదిరిగి మఠంబుం జేరవచ్చిరి.

ఆహా! యేమిచెప్పుదు? శ్రీ గురుమూర్తియందుఁ బ్రత్యక్ష మయ్యె. వారెల్లరు విస్మితులైరి. అంతం గొంతవడికిఁ దెప్పిఱి వారిలో వా రిట్లనుకొనిరి: 'శ్రీశైలమున కేగిన గురుస్వాము లింతలో నిక్కడఁ గానవచ్చుచున్నాఁడే! ఆహా! యీ మహానుభావులు సాక్షా త్త్రిమూర్తులు. మన గురులు కేవలనరు లనుకొనువారికి నరకము నసుఁబోరా? వీరి మహిమ మనంతము. వీ రవతారమూర్తు' లను కొని సాష్టాంగ ప్రణామంబులతోఁ బలుభంగుల నగ్గింపఁ జొచ్చిరి. ఆ గురుమూర్తు లిట్లు భక్తులకుఁ దారుచెప్పిన చొప్పున మఠంబున దర్శనం బొసంగి యంతటనుండి యెల్లెడ నట గుప్త రూపంబున న్నిలిచిరి.

ఇఁక మున్నిమహానీయులు వైద్యనాథక్షేత్రంబున గుప్తతఁ గనిసతలకి సెలవొందిన యతిప్రతతియు వైడూర్యనగరంబునఁ గొలఁది దినాలకిందట వీరిని బహూకరించిన యవనక్షితిపతియుఁ దదాజ్ఞాను సారముగా శ్రీగిరికిఁజేరి గుర్వాగమనార్థమట నిరీక్షించు చుండిరి. స్వామియు నటఁజేరి పాతాళగంగాస్నానంబుఁ గావించి యనుగత శిష్యుల నలువురఁ బుష్పాసనం బమర్ప నాజ్ఞాపించెను. వారు వెను వెంటనే యుత్ఫుల్లశతపత్త్రి సహస్రంబులం జేర్చి వానితోఁ గదళీ దళవేష్టిత సుఖాసనంబుగాఁ గూర్చి యమర్చి గుర్వాజ్ఞాను సారం బుగా నద్దానిని గంగాజలంబులం దుంచిరి. సరస్వతులు సమాగత

వారు దండకమండలుధారులై యతిరూపమున నున్నారు. వారి కాళ్లకు బంగారపుఁ బాఁకోళ్లున్నవి. చక్కని పూవులతోట్టిలోఁ గూర్చుండియున్నారు. తమపేరు నృసింహసరస్వతులనియుం దాము కదళీవనంబున కేగుచున్నారమనియు నొద్దున నున్నమిమ్ము గంధర్వ పురంబునకుఁ బొండని చెప్పుమనియును సెలవిచ్చినారు. వారు మీకుఁ బ్రసాదపుష్పంబుల నంపుదురఁట. భుక్తి ముక్తిప్రదంబౌ వారిబోధ మదినిల్పి భక్తితోఁ గొల్చుచుండవలె' నని తత్సందేశ ముగాఁ దెలిపి వారిత్రోవను బోయిరి.

ఆశిష్యులదివిని ప్రసాదపుష్పంబులకొఱకు నిరీక్షించుచుండిరి. ఇట్లు చూచుచుండఁగనే గురుప్రేరితమైన పుష్పచతుష్కమందెను. ఆముఖ్యశిష్యులు నలువురు వాని నచ్చెరుపాటున నందుకొని తల కొకటియుం దీసికొని' రని యక్కథకుండు వల్కినంత నాత్రోత 'యాముఖ్యులెవ్వ?' రని పృచ్ఛచేసె. అందులకు సిద్ధుఁడిట్లుచెప్పెను: 'శ్రీగురుస్వాముల శిష్యులెందఱోకలరు. అందు బాలసరస్వతి కృష్ణ సరస్వతి మాధవసరస్వతియు నుపేంద్రసరస్వతియుం బ్రాధాన్యముం గన్నవారు. ఇఁక శైలయాత్రా సమయమందు సాయందేవుండును నందినరహరి కవిద్వితయమును నేనును మాత్రమే యనుసరించి తత్ప్రసాద పుష్పంబుల నందఁగలిగినవారము. చూడుమిదే సాపు ష్పము. ఇది పదిలపఱచుకొనుచు మదిఁజెదరనీక గురుపదము లెడఁదనిలుపుట మొదవం బదిపదములు చేర్చి కూర్చినాఁడ. ఇంతయేకాని బుద్ధిమంతులనుఁగాక సద్గురు మహిమంబొరులకు విరి విగఁ బలుకం దరమౌనే?

కం. పురుషార్థద మిహపరసుఖ ।
కరము పవిత్రంబు శాంతి ♦ కరమరయమనో ।
హరమఘరోగహరము గురు ।
చరితంబెవరు విరచింపఁ ♦ జదివిన విన్నన్ ॥

అని సిద్ధుండు వలుక న్నిన్నామధారకుండు తనమనోరథంబు లీడేఱఁ బులకాంకితదేహుండు న్ముదితాంతరంగుండునయి తద్గురు

# శుద్ధపత్రము.

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు | పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 4 | 16 | గరిఁగిం | గరగిం | 183 | 18 | బాదు | బాఁదు |
| 6 | 26 | నభ్యాభం | సభ్యాఁపం | 157 | 4 | తమ | దమ |
| 14 | 22 | ఈగ | ఈఁగ | 188 | 3 | హారణం | ధారణం |
| 21 | 12 | సంబుబా | సంబుఁబా | 191 | 13 | హింతుండై | హితుండై |
| 81 | 15 | భగీరధ | భగీరథ | 194 | 24 | బాధు | బాఁధు |
| 89 | 10 | బాపన | బాఁపన | 205 | 12 | తరిగి | తఱిఁగి |
| 42 | 9 | సకయి | సకవి | 216 | 19 | రేని | రేవి |
| 59 | 14 | బాదు | బాఁదు | 219 | 4 | బాదు | బాఁదు |
| 63 | 11 | బాది | బాఁది | 282 | 7 | గృతిఘ్ను | గృతఘ్ను |
| 71 | 2 | రిల్లఁగ | తిల్లఁగ | 250 | 1 | బాదు | బాఁదు |
| 76 | 19 | బృధుకు | బృధుకు | 254 | 20 | నర | గఱ |
| 88 | 6 | మొనర్చి | మొనర్చ | 260 | 6 | క్షేత్రంబు | క్షేత్రంబు |
| 95 | 26 | తిర్యంచి | తిర్యచిం | 262 | 6 | గోరి | గోఁరి |
| 97 | 8 | విదిష్ఠ | విదిష్ఠ | ,, | 11 | జసించు | జపించు |
| 99 | 1 | సాధుత్రు | సాధువు | 264 | 25 | రోదాడి | రోఁదాడి |
| 104 | 3 | శ్రిమంబు | శ్రిమంబు | 266 | 5 | హ్రాషికే | హ్రాషీకే |
| 105 | 21 | కొక్కుఁటు | కొక్కుటు | 274 | 22 | లంఘనం | లంబనం |
| 109 | 15 | గాఁపుండి | గాపాడి | 278 | 8 | కిరి | కీరి |
| 118 | 7 | తర్కర | దర్క | 280 | 4 | నానిక | నమునకు |
| 115 | 15 | లందవి | లాందవి | 288 | 27 | దొల్లిఁటు | దొల్లిటు |
| 116 | 5 | గొమూర | గోమూర | 289 | 25 | మూర్తినా | మూర్తివా |
| ,, | 16 | యుద్యడివి | యుద్యడిది | 293 | 1 | యను | యన |
| ,, | 28 | తీదరింతు | తీఁదఱగొందు | 296 | 4 | గావి | గాని |
| 118 | 24 | సంభోధిం | సంబోధిం | 300 | 15 | వివావాం | వివాహం |
| 120 | 6 | బద్ధానిని | బయి | 304 | 9 | యావృత | ఆవృత |
| 121 | 1 | చేదు | చేఁదు | 311 | 26 | వంతకే | సంతసే |
| ,, | 25 | దలునకొ | దటునొ | 328 | 12 | బాదు | బాఁదు |
| ,, | 26 | బ్రిసాద | బ్రిసాద | 351 | 14 | చేయున్నా | చేయుచున్నా |
| 122 | 8 | చరంటు | చరంబు | ,, | 28 | సన్నిఁప | సన్నిభ |
| 128 | 26 | బ్రిసాదిం | బ్రిసాదిం | 358 | 14 | పొందరి | పొందలి |
| 131 | 25 | మార్చఁ | మార్చ | 375 | 4 | చెక్కులం | చెక్కుల |

———:o:———

